శా. "పూతంబైన మదీయపుణ్యయుగమో పుణ్యాంపు టిల్లాల నీ
పాతివ్రత్యముఁ విన మదిఁ భావింపఁగా నెట్టి దు
ర్నీతిప్రక్రియ వారికైనఁ గృపతో నీ విచ్చినంగల్గు నా
పాతివ్రత్యము నాకు మీఁద నయినం బ్రాపింప దీవింపవే!

(ఆ. ౪. ప. ౧౭౮.)

క. నాప్రుఁడు బరమపతివ్రత
వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ
బ్రోవుడు మముబోంట్ల నీవిభుండును నీవుఁ.

(ఆ. ౪. ప. ౧౭౯.)

ఉ. అట్టిటుఁ జంచలింపకు దృఢాత్మత నుండు మటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతిభవ్యవికాసము నుబ్బుఁ జూడ నిఁ
గట్టిగ నెన్న దేవతవుగాని నరాంగనవే మృగేక్షణా!

(ఆ. ౪. ప. ౧౮౦)

చ. అని తనుఁ బల్కునజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధవక్త్రముఁ
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెద రే యటంచు నా
తనిబలుకత్తిఁ బుచ్చుకొని నామణికంధరుచేతి కిచ్చి యో
గ్యనియమగంధమాల్యవతి యై కలభాషిణి నిర్విశంకతోఁ.

(ఆ. ౪. ప. ౧౮౧)

శక్తికి నభిముఖి యై కూర్చుండెను. స్వహస్తముతోఁ గత్తినిచ్చుటేల ? ప్రియమునకు మనస్సంకోచము వాయుటకొఱకు. సత్యమైనవలపునకు లక్షణ మిదియ తమకెన్నివచ్చిననేమి? ప్రియులు సుఖంబున్నఁజాలు. ఖడ్గప్రదానానంతరము అతని మనసు గట్టిపడునట్లుగా

క. "సమరంబున నెదిరించిన, సమదాహితవీరవరులఁ జక్కడఁచుట నై
జము మీకు నిట్టియెడలఁ, బ్రమయక చేసుఱవకునికి పటుశౌర్యమునఁ."

అని తెలిపి కలభాషిణీదేవి యతనిచేత నిరస్తజీవయాయె !!

ఈపాత్రముంగూర్చి యింత విపులముగ వ్రాసినందుకు క్షమాపణార్థమై కారణములఁ జూపవలయు సూరనార్యుని వాఙ్మయసృష్టినెల్ల నియ్యది నిస్సంశయముగ నగ్రగణ్యము. దీనికిందీటగు చరిత్రమింకెయ్యదియు లేదు శృంగారవర్ణనముం

జేయుటలోను ప్రబంధముల వెట్టు లేవియు వేయలేదు. నలకూబరునికై నాలు గేండ్లకన్న నెక్కువగఁ గాచియుండెఁగదా! ఇష్టముండినఁ జెలికత్తెలతో మొఱలిడుట, ఉద్యానవనములోఁ బడిపొరలుట, చంద్రాదిదూషణము, ఇట్టి వికారచేష్టలన్నియుఁ జేసినట్లు చెప్పియుండవచ్చును. కాని, కవి యీవిషయములఁ దలంపనైన లేదని తోఁచుచున్నది. భావనాశక్తిమై వ్రాయువారలకు మనసు పాత్రములయంద లీనముగనుండుఁగావున సహజరాగములుదప్ప నితరములు దట్టవు. మఱియు, నీశాస్త్రీయ ఘోషలకు మధురలాలసాచరిత్రములోఁ బ్రవేశమున్నది గాన నిట నవరసములని కవివానిని విడిచిపెట్టనేమో! కారణము లేయేటనైనఁ బోనిండు, మనకు లభించినదన్నదో మనసు వశముగాకపోవునంత రమణీయమైనకథ. కవికిఁ గృతజ్ఞతమై నమస్కారము, రసికులకు స్వాగతమును!

ఇంత మంచి సుందరమగు పాత్రమువర్ణనము శోకాంతముగాఁ జెప్పుట కిష్టములేమిచేతనో, మఱి, మనకవులకుంబట్టిన దౌర్భాగ్యమతంబు కతంబుననో మణికంధరఖండితమస్తకయగు నాలలనాశిరోమణి కాళికాదేవి కరుణాప్రసాదంబున "పునస్సహిత మస్తకయు, నిజపురీవర్తినియునై తనబంధుమిత్రాదుల నలరించుచు" సుమారు రెండుసంవత్సరములుండి పిమ్మటఁ గాలప్రాప్తమరణ యాయెనని కరుణరస ప్రధానమగు నీభాగముయొక్క సొంపును గవి వికలం బొనర్చి యుండుట భాషా దుర్దశగదా? రసములలో శోకమునొక్కటి. ఇదిమాత్రము నిషేధ్యమననేల? శోకప్రధానముగా వ్రాసినఁ గవిత్వము మొక్కపోవునా? మొత్తముమీఁద భారతమే శోకాంతమఁట! దానికి రాని తక్కువ పెఱవానికి వచ్చునా?

ఇట్టి యుద్గ్రంథమునఁ గల్పనాభంగము లుండుట చింతనీయము! కృష్ణుని భార్యలయొద్ద కలభాషిణి నారదులు గానవిద్య నేర్చికొనుటకై కడపినకాలము నాలుగేండ్లు. మణికంధరుఁ డంతగపురములోనికిఁ బోఁగూడదని యేమో, వాని కీప్రయాస మావంతయు లేకయ "పుండరీకాక్షునియనుగ్రహవిశేషంబున సకల రహస్యసంగతవిద్యాసంపన్నతచేత నారదకలభాషిణులయట్ల యత్యధికుండవు" భాగ్యము లభించినది! ఈయనుగ్రహవిశేషముం బ్రయోగించి వారికిని సద్యఃకాలవిద్యామహనీయత ఘటించి కలభాషిణివిరహకాలమును మట్టుచేసి యుండరాదా? కృష్ణకాంతలశిక్షయు ననావశ్యకమాయె దానితోఁ గల్పనయు న్యూనమాయె.

ఇట్లే మధురలాలసాచరిత్రము మొదలు తక్కినభాగములలోఁ గల్పనాలోపములు పెక్కులుగలవు.ఇందు కవి శృంగారమునకుదిగి పాడు ప్రబంధధోరణికిం జేరిన ముఱికి నంతయు సుగంధ మని దట్టముగఁ బట్టించుచున్నాఁడు.గతానుగతికముగా

ప్రాయ మన్నాఁడే గాని స్వబుద్ధిపొంతఁబోవునట్లు గానము. భావములు నవ్యములు గావు; రుచిరములు గావు పాటప్రాఁత; మాట రోఁత మధురలాలస చిన్ననాఁటినుండి కళాపూర్ణుపై మోహోద్రేకముఁ గొనియుండుట, ఆకస్మికముగా నిరువురకుఁ బరస్పర దర్శనము లభించుట, ఉద్యానవనగమనము, జలక్రీడాదులు, శైత్యోపచారములు, చంద్రాదిదూషణము, వివాహము, సాంగోపాంగరతివర్ణనము మొద లగున వన్నియు లక్షణానుసారముగాఁ బొందింపఁబడినవి. నిష్కారణముగా సూర్యచంద్రోదయవర్ణనములు, కళాపూర్ణుని దిగ్విజయము, యుద్ధము, దౌత్యము మొదలగు వానిని గూడ వర్ణించి కవిసకలలక్షణసంపన్నతా ప్రతిజ్ఞను జెల్లించుకొనుచున్నాఁడు. ఆప్రతిజ్ఞ దుష్ప్రకృతి యిట తేటతెల్లము సంభాషణమూలమున కథకు నభ్యుదయము గల్పించుట మొదలగుకవితాశక్తులన్నియు నీఘట్టములకు వచ్చుసరికి సూరన్నలో నుండక లేచిపోయినట్లున్నది. ప్రతిభ లేని పాదుకొంపలీభాగములు నిరర్థక పద్యపూరితములు! అలంకారాదిశాస్త్రములయందలి మూఢభక్తిపటుతమము !!

భావనాశక్తిచే ననర్ఘళముగ ప్రభవిల్లుభాగములయొక్క చక్కఁదనము పాండిత్యబలంబుమై నేర్పడినవానికి రావనుట యీభాగవిమర్శనముచే విదితంబు. సూరనార్యుఁడు రెంటియందును ప్రగల్భుఁడు రెంటినిం జూపింప నిశ్చయించిన వాఁడగుట నాంధ్రంబున నసదృశంబగు కావ్యంబు కళాపూర్ణోదయంబు సృజింపఁబడియె. ఇది నిర్దోషంబుగాకపోయినను అనన్యసాధారణగుణగణవిభాసితం బగుటఁ గావ్యోత్తమం బనఁ జెల్లునది. ఇందు నవరసము లున్నవి. అష్టాదశవర్ణనము లున్నవి. ఏకరసంబు గా కునికి మేల. అయినను సర్వరసములవర్ణనలఁ జేర్చి యొక కథ వ్రాయఁ జూచుట యసాధ్యము గాకపోయినను, సామాన్యసాధ్యంబుగాదు. భారత రామాయణము లట్టి విస్తారేతిహాసములం దప్ప నన్యంబుల సర్వసౌభాగ్యములకు నాస్పదం బుండదు. అపారపారావారంబుం బోనిమహాచరిత్రముం గల్పించినఁగాని, రససంచయంబు లెల్ల నందు యుక్తగతిని నిలువఁజాలవు. అట్లగుట నీ గ్రంథమున నసంగత ప్రశంసల వేయ వలసెను. అపరభాగము ప్రబంధములకుఁ జేరినది. పరిమితప్రాశస్త్యము. పూర్వభాగము (అనఁగా నాఱవయాశ్వాసమునందుఁ గొంతవఱకు) అమేయప్రభావము. దానింగూర్చి యెంత నుతించినను అత్యుక్తి గలుగదు అందలికల్పనలు, సందర్భములు మహేంద్రజాలములట్లు ఆశ్చర్యకరములు. శైలి ప్రావీణ్యమన్ననో వాచాతీతము! మౌనముగఁ గ్రోలి హృదయము పరవశముగా నానందింప వలయునే కాని, మాటలఁ దమి యాఱదు. పాత్రములవచనములు మధురసుధాధారలు!

అట్లగుట శ్రీ పింగళి సూరనార్యునియెడఁ గృతజ్ఞతయు భక్తియుఁ జూప నెంచినవారును, సహజముగఁ దమకుం గలరసతృష్ణను దృప్తినొందింపఁ దలంచు వారును నైన రసికు లెల్లరు నీకవికులోత్తంసునికృతులఁ బలుమాఱు పఠించి కృతార్థు లగుదురు గాక !

మైసూరు. }
16-6-1917. }

కట్టమంచి రామలింగా రెడ్డి.

# ఏతద్గ్రంథస్థనామావళి.



**పూర్వకథ.** *

1 కలభాషిణి (కథానాయిక.)
2 నారదుఁడు.
3 మణికంధరుఁడు (నారదశిష్యుఁడు)
4 రంభానలకూబరులు
5 కృష్ణుఁడు-మొ.
6 మణిస్తంభుఁడు
7 దేవలోకపుచిలుక.
8 ఇంద్రుఁడు.
9 మృగేంద్రవాహన
10 మాయారంభ.
11 మాయానలకూబరుఁడు
12 సుగాత్రి (సుముఖాసత్తి).
13 శాలీనుఁడు (మణిస్తంభుఁడు).
14 అలఘువ్రతుఁడు (మళయాళపు బ్రాహ్మణుఁడు).
15 మణికంధరహారము.

**ఉత్తరకథ.** *

1 కళాపూర్ణుఁడు (కథానాయకుఁడు).
2 మధురలాలస (నాయిక).
3 బ్రహ్మ.
4 సరస్వతి.
5 మదాశయుఁడు (నాయికతండ్రి).
6 రూపానుభూతి (నాయికతల్లి.)
7 అభినవకౌముది (గంధర్వస్త్రీ).
8 ప్రథమాగమాదులునలుగురు (మంత్రులు).
9 స్వభావుఁడు (సిద్ధుఁడు)
10 సత్వదాత్ముఁడు.
11 దత్తాత్రేయుఁడు.
12 యజ్ఞశర్మ.
13 దేవవిమానము.

* ఈగ్రంథమందలి మొదటినాలుగాశ్వాసములు పూర్వకథగను దక్కినవియుత్తరకథగను నూహించునది.



శ్రీరస్తు.

# కళాపూర్ణోదయము.

## పీఠిక.



లావణ్యవతీకుచద్వితయకాశ్మీరప్రభాచారువ
క్షోలంకారమణిప్రకాండము నవీనార్కుండు గా సన్మనో
నాళీకావిరతప్రభాత మగుచున్ భాసిల్లుతత్త్వంబు నం
ద్యాలశ్రీనరసింహాకృష్ణవిభు నిత్యశ్రీయుతుం జేయుతన్. 1

చ. ప్రమదవిలాసవర్తనవిభాసురగోపకిశోరమూర్తితోఁ
దమ కిలువేలు పై వెలయుతాండవకృష్ణపదాబ్జసేవ ను
త్తసుతనయాదిసంపదలు తామరతంపర లై ప్రవర్ధిలన్
రమణఁ దనర్చుఁ గావుత ధరన్ నరసింగయకృష్ణుఁ డెంతయున్. 2

మ వలకేల్ దాపలికిం గుచస్తబకసేవాలోలతం బోవ డాఁ
పలికేల్ సిగ్గున మాన్ప నల్క నది తత్పార్శ్వంపు లేఁజెక్క గో
మలపాదంబును ముట్టుచున్ వలచుబ్రహ్మాం బర్ధనారీశ్వరుం
డెలమిన్ నిత్యముఁ బ్రోచుఁ గృష్ణవసుధాధీశున్ నృసింహాత్మజున్. 3

చ. అనయము ప్రేమ సంధిలఁగ నాస్యచతుష్టయయౌగపద్యముం
బనఘునకాంతుఁ బోలె నిగమంబులపేరిట నాల్గురూపులం
దనరెడుభార్యమాట జవదాఁటక సృష్టి యొనర్చువారిజా
సనుఁడు నృసింహాకృష్ణవిభుఁ జాలఁ జిరాయువుఁ జేయుఁ గావుతన్ 4

చ ఒనరఁగ నూర్ధ్వలోకమునుండి ధరిత్రికి డిగ్గుగంగకున్
మనసిజవైరిమౌళియు హిమక్షితిభృత్కటకంబువోలె శో
భనరసభవ్యకావ్యమయభారతికిన్ వసతిస్థలంబు లై
తనరెడువామలూరుభవతాపసు సాత్యవతేయుఁ దెల్పెదన్. 5

చ. పలుకఁ దలంప దవ్వు లగుభారతరామకథార్థముల్ విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్రవా
క్సులలితశక్తి నందఱకు సుప్రథితంబులు చేసినట్టిధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱసత్కవిన్ 6

ఉ. మెచ్చి యొకింత గౌరవము మెచ్చక యుండి లఘుత్వలేశముం
దెచ్చుటకుం సమర్థులె కృతిక్రియకుం గుకవిత్వగర్వితుల్
తచ్చరితం బుపేక్షకుచితం బగుఁ గాక నగంగ నైనవా
క్రుచ్చి యజాగళస్తనసగోత్రుల వారల నెన్న నేటికిన్ 7

సీ. విశ్రాంతి విరతి గావింపక సారవత్సాహిత్యసౌమనస్యంబు లెఱిఁగి
సమయంబు దప్పక శ్రవణకఠోరంబు లైనశబ్దముల నత్యాకులాత్మఁ
జేయక సత్పరిచితసుకుమారవాక్సరళితాభిప్రాయుఁ గా నొనర్చి
పదబంధశిథిలతఁ బాటిల్లఁగానీక యేచందములయందు నేమరిలక

ఆ. పరఁగుకవియు దోహకరుఁడును యశము దుగ్ధమును బడయు నట్లు గానినాఁడు
కృతి దురాప మొదవు కీర్తియుఁ బాలు నీకుంట గాదు హాసయోగ్యుఁ జేయు.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబుఁ గావించి సుకవుల సేవించి కుకవులుపేక్షామాత్ర దండ్యు లగుట భావించి సకలలక్షణలక్షితం బైనమహాప్రబంధంబు కీర్తికారణం బనియు నితరం బపహాసకారణం బనియు నూహించి యెద్దియేనియు నొక్క సరసప్రబంధనిబంధనంబునకు జాతకౌతూహలుండ నై యుండునంత 9

సీ. తనకీర్తి సకలదిగ్దంతిదంతానంతకాంతిపంక్తికిఁ జెలికత్తె గాఁగఁ
దనప్రతాపంబు మార్తండమండలచండిమోపదేశమునకు నొజ్జ గాఁగఁ
దననీతిపస యుగంధరభట్టిచాణక్యఘనచాతురికి నిదర్శనము గాఁగఁ
దనవిలాసంబు కందర్పేంద్రనందనవార్తకు ఖండనవాది గాఁగ

తే. వెలయుమనుమార్గవర్తనావిరతవిహిత,ధరణిపరిపాలనాపరిస్ఫురితరాజ్య
వైభవుండు నృసింహభూవరసుతుండు,జిష్ణుతుల్యుండు నంద్యాలకృష్ణవిభుఁడు

వ. అనర్ఘ్యమణిమయాభరణకిమ్మీరితదిగంతరుండును, గంధసారకస్తూరికాద్యనులేపసౌరభసంవాసితపర్యంతభాగుండు నగుచుం జెలువు మీఱఁ గొలువుకూటంబున గురుశుక్రనీతిచాతురీవిఖ్యాతవంచనాచుంచుపంచాంగనయజయాతిశయభూషితశేముషీవిశేషవైయాత్యు లగునమాత్యులును, సదనూచానసంప్రదాయసిద్ధాధ్యయనశుద్ధిగరిమపరిపూర్ణశక్తివిభ్రాజమాననానావేదమంత్రతంత్ర సంతాయమానశాంతికర్మదూరవారితదైవికాత్యాహితులగుపురోహితులును, కాణాదకాపిలగౌతమీయజైమినీయవైయాసికపాతంజలతంత్ర రాద్ధాంత పూర్వపక్షవైపరీత్యకరణచణయుక్తికల్పనానల్పకల్పితప్రతివాదిబుద్ధివిధ్వంసు లగువిద్వాంసులును, బ్రాహ్మపాద్మవారాహవైష్ణవమాత్స్యమార్కండేయభాగవతబ్రహ్మకైవర్తకౌర్మగారుడస్కాందాదినిఖిలపురాణకథాకథనపాండిత్యపరితోషితాంత

ర్వాణికులగు పౌరాణికులును, ఆశుమధురచిత్రవిస్తారకవితావిజృంభణ స్తంభితబా ణభవభూతి కాళిదాసముఖ్యవిఖ్యాతిగౌరవు లగుకవులును, బహువిధపురాతన జ్యౌతిషసిద్ధాంతసంఘర్ష నిశితమతిచతురిమసమధిగతకళాకాష్ఠానిమేషాదిసూక్ష్మ సూక్ష్మతరసూక్ష్మతమకాలకలనాకౌశలప్రకాశకీర్తికు లగుమౌహూర్తికులును, ధన్వంతరిదస్రచరకప్రముఖనిఖిలాద్యవైద్యవైశారద్యదృష్టాంతభాజనాయుర్వేద వేదిశ్వవైభవాలంకారు లగునగదంకారులును, విశ్వావసుతుంబురునారదాంజనే యభరతమతంగకోహళదత్తిలప్రభృతిగాంధర్వకౌశలగౌరవస్మరణగాన మాధు రీధురీణతాప్రీణితబుధశ్రేణికు లగువైణికులును, రూపలావణ్యవిభ్రమవిలాస విభవవిస్మాపితవివిధజనస్వాంత లగువారకాంతలును, నిరంతరపరిణతబహువిధ ప్రహారణవ్రణకిణగణకారితవ్యఖండితకంకటాక్షవక్షోవిభాగఘోషుష్యమాణశౌ ర్యసాహసోద్భటు లగుభటులును, యథోచితప్రదేశవర్తు లగుచుం గొలువ వెత్రహస్తజనసమాఖ్యానసందర్శితసామంతకుమారులసేవలు కటాక్షహాసభాష ణాదుల నాదరించుచు గీతవాద్యతాళానువర్తినర్తకీనర్తనప్రవర్తనంబు లవధరిం చుచు ననేకవిధరాజ్యకార్యవినియుక్తు లైనయధికారిపురుషులవిన్నపంబు లాలిం చుచు వందిబృందపఠ్యమానబిరుదావలీప్రబంధమందరశబ్దార్థచమత్కారం బులు పరికించుచునొడ్డోలగం బై కూర్చుండి కార్యప్రసంగవశంబున 11

సీ. శోభితాపస్తంబసూత్రు గౌతమగోత్రు సుచరిత్రుఁ బింగళిసూరసుకవి పౌత్త్రు నన్నపరతిభావనదౌహిత్త్రు నమరధీనిధికి నబ్బమకుఁ బుత్త్రు ననుజన్ము లైనట్టియమరనయెఱ్ఱనార్యులు భక్తి సేవింప నలరువాని సత్కావ్యరచనావిశారదుం డగువాని సూరననామవిశ్రుతుని నన్నుఁ

ఆ. బ్రియము సంధిలంగఁ బిలిపించి బహువస్త్రభూషణాదిదానములఁ గరంబు సంతసం బొనర్చి యెంతయు గౌరవ, మెసఁగ మధురఫణితి నిట్టు లనియె. 12

శా. నీచే వాక్యమహాప్రబంధముఁ గడున్ నిర్నిద్రసారస్యలీ లాచిత్రం బగుదాని నోయనఘ వాలాయంబుఁ జేయించుకో మాచిత్తంబున వేడ్క యుండునది నీమాధుర్యధుర్యోరువా గ్వైచిత్రిన్ సఫలంబు సేయుము సుధీవర్గంబు లోహో యనన్. 13

మ. ఇటమున్ గారుడసంహితావికృతు లీ వింపొందఁగాఁ బెక్కన ర్ఘుట విస్తారము చెప్ప నేల యవి సంస్తుత్యోభయశ్లేషసం ఘటనన్ రాఘవపాండవీయకృతి శక్యంబే రచింపంగ నె చ్చట నెవ్వారికి నీక చెల్లె నది భాషాకావ్యముం జేయఁగన్ 14

క. అని యాదరణము మిగులం, దనర నియోగింప నేను నాకొలఁది గనుం గొన కీయకొంటిఁ దగ నా, యనఘుఁడు సంకల్పసిద్ధుఁ డనునమ్మికచేన్. 15

వ. ఇవ్విధంబునం బూని యమ్మహాప్రభువునగౌరవనియోగంబునకు ననుగుణంబుగ మదీయశక్త్యనుసారంబున విచారించి యపూర్వకథాసంవిధానవైచిత్రీమహనీ

యంబును శృంగారరసప్రాయంబును బుణ్యవస్తువర్ణనాకర్ణనీయంబును నగుకళాపూర్ణోదయం బనుమహాకావ్యంబు నిర్మింపం గడంగితి నట్టిమదీయకృతి కధీశ్వరుం డగుచుం బెం పొందునంద్యాలకృష్ణభూవిభునివంశావతారం బెట్టిదనిన 16

తే. సకలకువలయపాలనైశ్వర్యయుతుఁడు, చండధామకృతశ్రీఘనుండు నైన
రాజచంద్రుండు జగతిఁ గరంబు వెలయు,సంతతోదయసౌభాగ్యశాలి యగుచు

తే. అత్రిలోచనభవుఁ డయ్యు నతఁడు మీఁదె
నపరిమితతారకావలి కధిపుఁ డగుచుఁ
దాఁ ద్రిలోచనభవుఁ డయ్యు ధరఁ గుమారుఁ
డేకతారకజయ మొందు టేమియరుదు. 18

క. ఆచంద్రునివంశంబున, భూచంద్రుం డారెవీటిబుక్కనరేంద్రుం
డాచక్రవాళశైల, క్ష్మాచక్రస్ఫూర్తికీర్తిసాంద్రుఁడు పుట్టెన్. 19

క. ఆబుక్కనృపాలునిబా,హాబలముకొలంది తదసిహతరిపువీర
ప్రాబల్యనిరాకృతనల,కూబరునకుఁ దెలియుఁ దెలిసికొనఁ గలఁ డేనిన్ 20

చ. మతి నజుఁ డంచు రూపమున మన్మథుఁ డంచు నయోన్నతిన్ బృహ
స్పతి యనుచున్ వదాన్యతను భానుసుతుం డనుచున్ నుతించు నా
ర్యతతి "నిరంకుశాః కవయ" యం చది యొప్పుట గాని బుక్కభూ
పతికి సముండు లేఁడు తలఁపన్ భువనంబున నేగుణంబులన్. 21

క. పావనగుణ యగునబ్బల, దేవిని గులశీలగుణనిధిన్ మఱి బల్లా
దేవిని వివాహ మయ్యె మ,హావిభవుఁడు బుక్కనరవరాగ్రణి వేడ్కన్ 22

క. అందును బల్లాదేవికి, నందను లుదయించి రింద్రనందనసదృశుల్
చందనవిశదయశుల్ సం,క్రందనవైభవులు రామరాజప్రముఖుల్. 23

ఉ. భూమహనీయశీలుఁ డగుబుక్కయయగ్రవధూటి కబ్బలాం
బామణికిన్ జనించిరి సమస్తగుణాఢ్యుఁడు సింగరయ్యయున్
రామవిభుం డహోబళధరారమణుండును విక్రమాన్వయో
ద్దామత నొప్పునీతికి సుదగ్రజయాభ్యుదయంబులుం బలెన్. 24

ఉ. అందును సింగభూరమణుఁ డౌబళదేవిని బెండ్లియాడి సం
క్రందనతుల్యవైభవులఁ గాంచెఁ దనూజుల ముప్పురన్ బుధా
నందవిధాయి నిర్మలగుణప్రకరున్ నరసింగరాజు శ్రీ
నందనతుల్యు నారవిభు నవ్యపురూరవుఁ దిమ్మపార్థివున్. 25

ఉ. ప్రాలినకీర్తిఁ బెం పెసఁగి వారలలో నరసింహరాజు నం
ద్యాలపురాధిపత్యవిభవాతిశయంబు వహించి మించె ను
ద్వేలనిరూఢి నెల్లెడల విశ్రుత మై తనవంశ మెల్ల నం
ద్యాలపదప్రసిద్ధి దనరారుచు నెంతయుఁ దేజరిల్లఁగన్. 26

క. ఆనరసింగక్షితిపతి, మానవతీతిలక మైనమాదమదేవిన్
భూనుతసమస్తగుణాల,క్ష్మీనిధిఁ దగఁ బెండ్లియాఁడెఁ గీర్తి దలిర్పన్. 27

సీ. మందారమందాక్షసందాయిదానప్రసిద్ధుండు సింగరక్షితివరుండు
గర్వితారాతిదోర్గర్వనిర్వాపణోద్దీర్ణుండు నారధాత్రీవిభుండు
భూభువనప్రశంసాభిశోభితమహాప్రాభవాఢ్యుఁడు కుమారాంబళుండు
శరదిందుచంద్రికాపరిశుద్ధవిహాసనస్ఫురదనర్గళకీర్తి వరదరాజు
తే. ప్రచురవిక్రమరఘుపతి రఘుపతియును, దనయు లేవురు గల్గి రుదాత్తసకల
గుణగరిష్ఠులు నరసింగకుంభినీత, లాధినాథున కమ్మాదమాంబయందు. 28

క. నరసింగవిభునిసింగరి, నరవరుఁ డసమానుఁ డధికనయసారత ని
ర్భరశూరత నతిధీరత, నరు దగుదానక్రియావిహారత నిలలోన్. 29

క. నారాయణభక్తుఁడు సుజ, నారాధనపరుఁడు జలరుహాక్షీసుమనో
నారాచుఁడు నరసింగయ, నారావనిపాలకుండు నరవిభుఁ డాజిన్ 30

సీ స్వారాజభావంబు కారణంబుగ నేమొ శక్రుండు నెలవున జడియ కునికి
మిత్రపుత్రతఁ దాను మిత్రుండ నని యేమొ యముఁ డాత్మపురమునఁ దెమల
వారుణీసేవామదారూఢచే నేమొజలభర్త దనవీటఁ గలఁగ కునికి [కునికి
తల్లడం బేల యే ధనదుండ నని యేమొ ధనరాజు నిజపురిఁ దలఁగ కునికి
తే. తమకు మఱి దిక్కు లేమిని దలఁకి యేమొ
కడమనలువురు మూలల నడఁగి యునికి
వీరవరుఁ డైననంద్యాలనారవిభుని
యాజి ఘోరభేరీధ్వను లడరునపుడు 31

చ. పగ లనుశబ్దమాత్రము నభగకుసుమంబు నిజంబు నారభూ
జగదధిపప్రతాపగుణసంపదచే రవిఁ దత్సమానుఁ గాఁ
దగునె నుతింప నారవి ప్రతాపమహత్త్వముచేతఁ బేర్చుచున్
బగ లొకనాఁడు దప్పక యపారతఁ జొప్పడుఁ గాక మానునే 32

చ. వదలక యుత్కళేంద్రుని సవాయిబరీదు నడంచుదుర్జయున్
గుదుపనమల్క దల్లడిలఁ గొట్టి మహాద్భుతసంగరంబులో
నెదిరిచి కొండవీటికడ నెవ్వరు సాటి విచిత్రశౌర్యసం
పదపస నారసింహవిభుపట్టికి నారనృపాలమౌళికిన్. 33

సీ. శ్రీవిష్ణుపదభక్తిచే ధర్మసంపత్తి ధర్మసంపత్తిచేతను జయంబు
జయసిద్ధిచేత నుజ్జ్వలబాహుశౌర్యంబు శౌర్యగౌరవముచేఁ జతురనీతి
నీతిపెంపున మహనీయసామ్రాజ్యంబు సామ్రాజ్యమహిమచే శాంతిగుణము
శాంతిచే వేదాదిసకలసద్విద్యలు విద్యలచే బుద్ధివిలసనంబు

తే. దానఁ బాత్రవివేకంబు దాన నీగి, దానఁ బ్రవిమలకీర్తియు దానఁ గులము
ప్రేమ నత్యంతము నలంకరించుకొనయె, భళిర నంద్యాలనారభూపాలకుండు.

చ. ఘనతరదానచాతురిన కాదు శ్రుతిస్మృతిశాస్త్రనైపుణం
బునను బుధానురంజనుఁడు భూరిశుచిత్వమునంద కాదు శో
భనపుఁబ్రతాపసంపదను బావకుఁ డానరసింగభూపనం
దనుఁడు కుమారయోబవసుధాతలనాయకుఁ డివ్వసుంధరన్. 35

ఉ. సాత్త్వికతాపరాయణుఁడు సత్యవచస్కుఁడు దానశాలిదో
స్సత్త్వవిజృంభితుండు రణశౌర్యధురీణుఁ డకల్మషుండు ధీ
రత్వమునుమన్కిపట్టు చతురత్వనిధానము నీతిపద్ధతీ
తత్త్వవిశారదుండు వరదక్షితిపాలుఁ డలోలుఁ డయ్యెడన్. 36

క. కరుణాఘనవీక్షణమున, శరణాగతరక్షణమున సంగరశౌర్యా
భరణాహితశిక్షణమునఁ, దిరముగ రఘుపతియ రఘుపతిం దలపోయన్ 37

ఆ. అందు సింగరయ్య యనవద్యగుణగౌర,మాంబఁ బెండ్లియాడి యాత్మజులను
గనియె నారసింహజననాథు రఘుపతి, ఖ్యాతలేంద్రు నోబమనుజవిభుని. 38

క. ఆనారసింహవిభుఁ డస,మానగుణుఁడు రఘుపతిక్షమావరుఁడు యశ
శ్శ్రీనిధి యహోబళాఖ్యధ,రానాథుఁడు సకలగుణవిరాజితుఁ డయ్యెన్. 39

క. ఆముగ్వురలో నగ్రజుఁ, డై మించునృసింహునకుఁ దదంగన యగుశ్రీ
రామాంబకు నుదయించె మ,హామతి నావళిచినోబళాఖ్యుఁడు వెలయన్. 40

ఉ. దేవవిభుండు భోగమునఁ దీవ్రమయూఖుఁ డఖండచండతే
జోవిభవంబునం దపనసూనుఁ డనూనవితీర్ణి పెంపునన్
దైవతమేదినీధరము ధైర్యమహత్త్వమునం దలంకఁగా
నావళిచిన్నయోబమనుజాధిపముఖ్యుఁడు రాజమాత్రుఁడే 41

క. ఇది సింగరయ్యసంతతి, తదనుజునను జుఁ డగునోబధరణిపువంశా
భ్యుదయక్రమ మభివర్ణిం,చెద నిఁక భువనప్రసిద్ధి చెన్నెసఁగంగన్ 42

ఆ. ఆకుమారయోబభూకాంతుఁ డింపుతోఁ, బెండ్లియాడె గుణగభీరచరితఁ
దిరుమలాంబ నెందుఁ బరమపాతివ్రత్య, పావనతఁ దనర్చుభాగ్యనిధిని. 43

సీ. నానాగుణైకనిధానంబు నా నొప్పు నరసింగమేదినీనాథవర్యు
నిద్ధంపుఁగీర్తులఁ దద్దయు విలసిల్లునట్టి పెద్దయహోబళాధిపతిని
నాదిమనృపగతి మేదినీజనములఁ బ్రోది సేయుచు నొప్పునూదవిభుని
సన్నుతోన్నతవృత్తి నెన్నికఁ గన్నట్టి చిన్నయహోబళక్షితితలేంద్రు

తే. సారతరచారుచారిత్రు నారనృపుని, నాకుమారౌబళుండు తిమ్మాంబయందుఁ
గనియె నేవురుసుతుల సత్కాంతియుతుల, విష్ణుసేవాభిరతులఁ బ్రవీణమతుల

క. అందు నరసింగవిభుఁ డిం, పొందఁగఁ దాఁ బెండ్లియాడె నుభయకులశ్రీ
సౌందర్యగుణచరిత్రము, లం దిరవై తనకుఁ దగినలక్ష్మీదేవిన్ 45

స్రగ్ధర. ఆలక్ష్మీదేవియం దాయతమతి నరసింగావనీశుండు గాంచెం
ద్రైలోక్యస్తుత్యులన్ నందనుల నురుయశోభవ్యు నోబాహ్వయక్ష్మా
పాలోత్తంసుం గవిత్వప్రముఖబహుకళాపారగుం దిమ్మరాజున్
బాలాదిత్యోపమానప్రచురతరరుచిస్ఫారు నారక్షితీంద్రున్. 46

ఉ. వైభవజృంభణగుణాతవాసవుఁ డిందుముఖనవీనచే
తోభవమూర్తి కల్మషవిదూరుఁడు నిత్యరమావిహారలీ
లాభవనాయమానసువిలాసకటాక్షనిరీక్షుఁ డాకుమా
రోబళునారసింహసుతుఁ డోబళు నెన్నికె కెక్కు నెంతయున్ 47

శా. అత్రాసోజ్జ్వలశూరతాగుణకుమారోబళక్ష్మాపస
త్పుత్రశ్రీనరసింహతిమ్మవిభుకీర్తుల్ మీఱి యత్యంతవై
చిత్రిం దిక్తటులన్ నటింప నది దా శీలించుచున్నట్లు తత్
స్తోత్రాకారసరస్వతీపతి నటించున్ సూరిరాడ్జిహ్వలన్. 48

క. ఏసీమ నెదురులేక వి, భాసిలు నంద్యాలతిమ్మపార్థివుబలముల్
వాసి గలయతివిభాసి, ప్రాసాదులతోడ సత్ప్రబంధములగతిన్ 49

ఉ. భూలలనాలలామ కడుఁ బొల్పెసలారెడు వేడ్కతోడ నం
ద్యాలకుమారయోబనరనాథునృసింహునినారశౌరియు
త్తాలభుజాగ్ర మెక్కుటయుఁ దక్కక యెక్కెఁ దదీయకీర్తియున్
బాల సుమేరుశృంగము సపత్నికి మచ్చర మెచ్చ కుండునే 50

ఆ. ఆతనిపిన్నతండ్రి యగు పెద్దయోబభూ, నాయకుండు గాంచె నందనులను
సారసుగుణమశేషయశోరాశి మద్దంశ, యోబళేంద్రుఁ జిన్న యోబళునిని. 51

ఉ ధీరజనాభివర్ణ్యుఁడు తదీయకనిష్ఠపితృవ్యుఁ డుజ్జ్వలా
కారుఁడు పిన్నయోబళుఁడు గాంచెఁ దనూజుల ముగ్వురన్ మనో
హారిగుణోన్నతుం దిరుమలయ్యను రాజమనాముఁ గృష్ణభూ
మీరమణోత్తమున్ దిశల మించి నిజాన్వయకీర్తి వర్తనన్ 52

క. ఇల నంద్యాలకుమారా, బళువంశచరిత్ర మిది సుపావనవృత్తిం
బొలు పొందుతదనుజన్ముని, విలసితవంశక్రమంబు వివరింతు నికన్ 53

ఉ. సంగరపార్థుఁ డావరదశౌరి సుతత్రితయంబుఁ గాంచె నా
త్మాంగన యైనశ్రీతిరుమలాంబికయందు మహాగుణాఢ్యు శ్రీ
రంగజనాధిపున్ బుధవరప్రముఖున్ నరసింగమేదినీం
ద్రుం గవిపోషణాతిచతురుం గనకక్షితిపాలశేఖరున్. 54

తే. అందు శ్రీరంగరాజు సమస్తగుణని, కేతనుం డాశ్రితసుపర్ణకేతనుండు
తనకుఁ గులరూపగుణములఁ దగినయట్టి, తిరుమలాంబికఁ బెండ్లియై తేజరిల్లె.

సీ. శోభనజయలాభసౌభాగ్యభూభరణాభిశోభితుఁ డైనయాబ లేంద్రు
నిర్మలసత్కర్మధర్మనిర్మితబుధసమ్మోదుఁ డై యొప్పుతిమ్మవిభుని
సురదంతిశరదభ్రహరదంతిరిపునిభ స్ఫురదుదంచితకీర్తి వరదవిభుని
విష్ణుసేవాఢ్యుంభవిష్ణు నిత్యాచార నిష్ణాతహృదయుని గృష్ణనృపుని
తే. నందనులఁ గాంచె నలువుర నందనద్రు, మానువర్తనకీర్తనీయానవరత
దానముదితార్యతతుల ననూనమతుల, రమణఁ దిమ్మాంబయందు శ్రీరంగరాజు.

తే అట్టిశ్రీరంగవిభుద్వితీయానుజునకుఁ
గనకవసుధాధిపతికిని గలిగె సుతుఁడు
ధరణిఁ గనగిరియాబళేశ్వరుఁ డనంగ
నభినుతాహ్వయుఁ డగుచుఁ బెంపారె ఘనుఁడు. 57

వ. ఇది వరదరాజువంశక్రమంబు 58

తే. ఇట్టివంశాభివృద్ధికి హేతువులయి, తనరుసౌజన్యనిధు లన్నదమ్ము లెపుడు
తనదుసౌభ్రాత్రమునకుఁ జిత్తముల నలర, వెలసె నంద్యాలనారప్పృథ్వీవరుండు.

క. ఆనారక్షితిపాలుఁ డ, నూనశ్రీవిభవసముచితోద్వాహవిధిం
బూని వరియించె నిజరూ, పానుగుణం దిరుమలాంబ నధికప్రీతిన్. 60

తే పుణ్యకులశీలమహిమలప్రోక యనఁగ, నిష్కళంకపాతివ్రత్యనిధి యనంగ
వెలయు నంద్యాలనారభూవిభునిదేవి, పరమశుభగుణనికురుంబ తిరుమలాంబ

క. ఆతిరుమలాంబయందుఁ బ్ర, భూతయశుఁడు నారవిభుఁడు పుత్త్రులఁ గనియెం
బూతాత్ముల నరసింగ, ఖ్యాతలవిభు మాదనృపునిఁ గనకక్షితిపున్. 62

ఉ. ఉన్నతిఁ జేర్చి యందు వెలయున్ నరసింగవిభుండు శౌర్యసం
పన్నుఁ డటంచు విద్యఁ బ్రతిపన్నుఁ డటంచుఁ గవీంద్రకోటికిన్
సన్నిధి యంచు నిత్యహరిసన్నిధి యంచు విపన్నరక్షణా
సన్నుఁ డటంచు నెప్పుడుఁ బ్రసన్నుఁ డటంచు జనుల్ నుతింపఁగన్. 63

క నారయనరసింహుఁడు మది, నారయ నరసింహుఁడే యథార్థము కరజ
శ్రీరచితార్యస్థితి యై, భూరిప్రహ్లాదభరణమున శోభిలుటన్ 64

శా. స్ఫూర్తిప్రౌఢి నిరంతరం బగుచు నెచ్చోటం బ్రకాశింపఁగా
వర్తిల్లన్ భువనంబులందును సహావస్థానవత్కౌముదీ
మార్తండద్యుతివై భవంబులు ననిర్వార్యాదవై చిత్రితోఁ
గీర్తింపన్ వశమే నృసింహవిభుసత్కీర్తిప్రతాపోన్నతుల్. 65

ఉ. భానుసమానతేజుఁడు విభాసురరూపమనోజుఁ డుజ్జ్వలా
నూనయశోవిభాసి విభవోదయనిత్యవిలాసి విశ్వస
న్మానితవర్తనుండు కవిమండలనిర్మితకీర్తనుండు ల
క్ష్మీనవమాధవుండు నరసింహునినారయమాధవుం డిలన్. 66

క. వితరణమున రణమున నున్నతవినయంబున నయంబునం దన కిలలోఁ
బ్రతి లేక నారభూపతి, సుతుఁ డామాదప్రభుండు శోభిలు మిగులన్ 67

క. కనకమహీభృద్వరుఁ డల, కనకమహీభృద్వరుండు గట్టిగ శౌర్యం
బున విబుధాధారత్వం,బునఁ బరహితధర్మభావమునఁ దలపోయన్. 68

శా. స్థానం బెన్నఁడుఁ బాయ దుత్సవఘనస్వస్త్రీసుఖక్రీడ పై
పై నొందన్ భువి నర్థిలోకము దివిం బ్రత్యర్థిలోకంబు న
న్యూనుం డాకనకయ్య యుద్యతకృపాణుం డైనమాత్రంబునన్
దానక్షాత్రము లింత యంత యనుచుం దర్కింపఁగా శక్యమే. 69

సీ. సంతానసురధేనుచింతామణిశ్రీకి లజ్జఁ దా నొనరించునొజ్జ యగుచు
నలకాధిపతిసూనునలకాములకు దర్పరహితత్వ మొనరించు మహితలీల
నరభీష్మకోదండగురుభీష్మసమరంబు దక్కువ యనిపించు నిక్కువముగఁ
గుంభీనసక్రోడకుంభీనగిపులకు విశ్రమంబు నొనర్చు నశ్రమమున

తే. సంతతౌదార్యసౌందర్యశౌర్యధరణి, భరణనైపుణగుణములప్రౌఢి మెఱసి
వరుస నరసింగమేదినీశ్వరునినార, నరవరేణ్యునికనకభూనాయకుండు. 70

క. ఆముప్వరందు నగ్రజుఁ, డై మించిననారసింహుఁ డతులితవిభవ
శ్రీ మెఱయఁ బెండ్లియాడెం, బ్రేమం బెదకొండమాంబఁ బినకొండాంబన్. 71

చ. నిరుపమవిక్రమంబును వినీతియు నీతియుఁ బోలెఁ దత్త్వవి
త్పరిచయముల్ విరక్తియును భక్తియుఁ బోలె సుయోగవర్తనా
దరవిభవంబు శాంతియును దాంతియుఁ బోలెఁ గరం బలంకరిం
చిరి తమనిత్యసేవ నరసింగయ నిద్దఱుకొండమాంబలున్ 72

ఆ. అందుఁ బెద్దకొండమాంబయం దానర, సింగభూపవరుఁడు శిష్టమతులఁ
గాంతియుతులసుతులఁ గనియె మూర్తిత్రమా,రమణుఁ దిమ్మవిభుని రమణమీఱ.

ఉ. ఆనరసింగభూపతి ప్రియం బెసఁగం జినకొండమాంబయం
దానమితాఖిలాహితసమాజుఁ దనూజునిఁ గాంచె బంధుసం
తానసుతావనీజు సముదంచితభోగబిడౌజు సూరిమై
త్రీనవభోజు భానునిభ తేజునిఁ గృష్ణమరాజు నున్నతిన్. 74

వ. అందు 75

సీ. శేషుదర్పము చివ్వి శీతాంశు రుచి నవ్వి పాలమున్నీటిపైఁ గాలు ద్రవ్వి
యాదిత్యుపసయాఁచి హాలహాలంబునులోఁచిహుతవహుగర్వముఱ్ఱూఁతలూఁచి

కల్పశాఖిని గెల్చి కర్ణకీర్తి మరల్చి ఖచరువార్త దరల్చి ఘను నదల్చి
కందర్పు మఱపించి యిందుని నిందించి, నలకూబరు హసించి నలుని మించి
తే తనరుకీర్తిప్రతాపవదాన్యతాసు, రూపవిలసనములచేత రూఢి కెక్కె-
ధరణి నంద్యాలనరసింగనరవరేణ్యు, పట్టి యైనట్టిమూర్తిభూపాలకుండు 76
క. తిమ్మక్షితిపతి శోభిలు, నిమ్మహిలో మిగుల వాసి కెక్కెడు గాంభీ
ర్యమ్మున ధైర్యమ్మున శౌర్యమ్మునఁ బ్రఖ్యాతుఁ డై జనావళి పొగడన్. 77
సీ. శ్రీపుత్త్రతులనానురూపంబు రూపంబు, నిర్మలాంగిరసవినీతి నీతి
మహనీయతానుపమానంబు మానంబు భూతిమద్రిపుదావహేతి హేతి
ధాత్రీసురశ్రీనిదానంబు దానంబు తులితమారుతిభీమబలము బలము
గోవిందచింతాస్వభావంబు భావంబు కోవిదబంధుసంకులము కులము
తే. తరమె వర్ణింప వసుభృత్తటకుటీర, కటురటజ్ఝల్లికాచ్ఛటాఘటితబిరుద
కాహళారవశంకాప్రకంపితప్ర, తీపనృపజాలు నంద్యాలతిమ్మవిభుని 78
ఉ చెన్నెసఁగెన్ నృసింహనృపశేఖరుతిమ్మనృపాలమౌళి య
భ్యున్నతకీర్తి ముజ్జగము నూనఁగ మానవకన్యలట్ల తా
రెన్నఁడుఁ బోనిపున్నమసమృద్ధులఁ గాంచితి మంచు నుబ్బుచున్
వెన్నెలకుప్ప లాడుదురు వేలుపుఁగన్నెలు నాగకన్యలున్ 7'
ఉ. శ్రీయుతుఁ డైనయట్టినరసింహునితిమ్మనికీర్తివైభవ
శ్రీ, యనుమాక్తికావళికిఁ జెల్వధికంబుగ దిక్కులన్ నిజ
స్ఫాయదకీర్తినీలపటసంవరణం బొనరించు మున్ను గా
నాయనశత్త్రువర్గము ప్రియం బిఁక నెవ్వఁడు సేయ కుండెడున్ 80
మ క్షితి నంద్యాలనృసింహుతిమ్మవిభుసత్కీర్తిప్రతాపంబు లు
న్నతిఁ బర్వన్ నవఫేనవిద్రుమము లై నానాబ్ధులన్ సింహసం
తతిధాతుప్రకరంబు లై వలయగోత్రంబులన్ బ్రవచ్చామరో
ర్జితసిందూరము లై దిశాగజములం జెన్నొందఁ గై సేయుచున్ 81
మ. అతిధన్యుం డగునారసింహవిభుతిమ్మాధీశుహస్తాబ్జసం
గతిచే వింతగ దానవారి సముదగ్రప్రోక్షచే విప్రసం
తతియందున్ నెఱపున్ ధృవస్థితినిదానత్వంబు ప్రహ్లాదపో
షితయుం గాక యశేషభోగపరతం జెన్నొందుసౌభాగ్యమున్. 82
ఆ. ఇట్టితిమ్మమేదినీశ్వరుం డనుఁగుఁదమ్ముఁడు సభక్తివినయమోదగరిమఁ
దను భజింప నలరుచినకొండమాంబగా, రాబుఁబట్టి కృష్ణభూపవరుఁడు. 83
సీ. ఆఖండలాహంక్రియాఖండనోదంచి తాఖండవిభవోదయాంచితుండు
వారణారిత్రపాకారణాజిస్థలావారణాంచద్భుజాపౌరుషుండు
మందేహరిపుదీప్తిసందేహఘటనాత్య మందేహతేజస్సమన్వితుండు
బంధురాజీపయస్సింధుభాజీభవ, ద్బంధురాజీజయభ్రాజితుండు

తే. వెలయు నిఖలదిగంతపృథ్వీతలాధి, పతిశిరఃకంపకంపితశ్రుతివలత్కు
మణిమతల్లీఘృణీప్రతిమల్లఫుల్ల, కీర్తివిభవుండు నంద్యాలకృష్ణవిభుఁడు. 84

మ. అనఘాత్ముల్ నరసింహకృష్ణవసుధాధ్యక్షుల్ విరాజద్గుణై
కనిధుల్ వర్ణనసేయఁ గాఁ దరమె దిక్చక్రంబునం దెల్ల శో
భనతత్కీర్తినదీమతల్లి ప్రవహింపం బూన మున్మున్నుగా
ఘనమై యుబ్బఁ గవీంద్రుల్ చెలమలం గావ్యామృతం బెంతయున్. 85

చ. అవిరళనిత్యభోగవిభవాతిశయోల్లసితుండు నారపా
ర్థివునరసింహకృష్ణజగతీపతి నిత్యసువర్ణవర్షముల్
కవినికరంబుపైఁ గురియఁగాఁ బ్రవహించును హృద్యగద్యప
ద్యవివిధకావ్యరూపత ననంతసువర్ణమహాప్రవాహముల్. 86

ఉ. దానమునందుఁ గృష్ణవసుధావరుఁ డప్రతిముండు యుక్తముల్
దీని గణించినన్ సురమణీతతి గొల్చుచు నున్కి సప్తసం
తానసమృద్ధి చేకుఱుట తద్వినయాదిగుణంబు లన్నియుం
బూనిక మీఱఁగా ననయముల్ సురభిత్వము దాల్చి యుండుటన్. 87

మ. తమి నంద్యాలనృసింహకృష్ణునిమహాదానక్రియాకౌశలం
బు మహత్త్వంబున నర్థిబృందము ధనంబుం జెందఁ బ్రత్యర్థిబృం
దము చెందున్ నిధనంబు నింతయు మదిం దర్కింప యుక్తంబు త
థ్యము వర్ణాధికు లెందుఁ గోరుదురు వర్ణాధిక్యవద్యోగ్యమున్. 88

మ. ఒకప్రద్యుమ్నునిఁ గాంచెఁ దొల్లి యదువంశోద్భూతిఁ బెంపొందుచున్
సకలక్ష్మాసురులం గరం బిపుడు శ్రీనంద్యాలకృష్ణక్షితిం
ద్రకరాబ్జాన్వయసంభవంబుకతనం బ్రద్యుమ్నులం జేయుచుం
బ్రకటం బయ్యెడు దానవారి యవతారం బొంది ధాత్రీస్థలిన్. 89

చ. కలన నృసింహకృష్ణుఁ డతికౌశలతన్ ఝుళిపించుఖడ్గ మ
గ్గలికఁ దటిల్లతల్ వెడలఁ గ్రాయు నరాతినరాధిపుల్ మనన్
వలసిన వీనిఁ గైకొనుఁడు వక్త్రములం దని పండుపూరిపు
ల్లలు వెద చల్లెనో యనుతలంపులు చూపఱకుం జనింపఁగన్. 90

క. బల్లిదుఁడు కృష్ణభూపతి, పెల్లుగ ఝుళిపించువాలు పెనుడాకకు భీ
తిల్లినపగవాఁ డడవిని, భిల్లవిలాసినులచూపుబెళుకుల కలుకున్ 91

చ. పొలుపుగ నారసింహనృపపుంగవుకృష్ణుఁ డనంతవైభవో
జ్జ్వలుఁడు ప్రతాపకుంకుమపుఁజర్చలఁ బొండుయశోగప్రసూనపూ
జల నలరించు విశ్వమును జక్రి విరాడ్తను వౌ టెఱింగి యా
బలి యిది వో మహాద్భుతపుభక్తి మనంబున నెన్ని చూడఁగన్. 92

చ. సుమధురమూర్తిఁ గృష్ణవిభుఁ జూడనియింతు లెటన్న నంద్రు గా
ని మదినొకింతఁ జేర్చి యతనిం గనుఁగొన్నతుదన్ సుధాంశురూ

పము ప్రియ మన్న వారు మఱి భావజు మేలను వారు గల్గు ట
బ్రమిదియ సాక్షి యానృపుని రాజమనోజులరూపువాసికిన్. 93

మ. అవనీకాంత కరంబు రంజిలెడు నంద్యాలాధిపుం గృష్ణపా
ర్థివునిం జేరి సదా యనంతవిభవాధిక్యంబుసొంపుల్ వరా
హావసత్కేళిలజృంభణంబు కులగోత్రౌన్నత్యముల్ మానసో
త్సవమైనట్టియనేకపావనగుణోదారత్వముం గల్గుటన్ 94

సీ. శ్రీవిష్ణుభజనైకశీలుం డలోలుండు వైదికమతరక్షణాదరుండు
నెఱబంటుతనమున మెఱయుజోదులయందు గజహయారోహదీక్షాగురుండు
కీర్తిప్రియుండు సంగీతసాహిత్యాది సకలకళావిచక్షణుఁడు రసికుఁ
డీవిపట్టునఁగొంచె మెఱుఁగఁడు తగవరి కలనైన నెఱుఁగఁడు కల్లలాడ

తే. ధీరుఁడు గభీరుఁ డుచితవిహారుఁ డార్య, వర్తనుఁడు శరణాగతవత్సలుండు
శేషునకునైన వర్ణన సేయ వశమె, యనఘు నంద్యాలకృష్ణధరాధిపతిని. 95

షష్ఠ్యంతములు.

క. ఈదృశగుణరమ్యున క,న్యాదృశధరణివరదురభినయసామ్యునకున్
వైదికపథరతునకు న, లాదికనృపనయతిరస్క్రియాదక్షునకున్. 96

క. ఆధునికరామభద్రున, కాధిక్యచణాహవక్రియారుద్రునకున్
మాధవపదపద్మసమా, రాధనవిధిసాధితావిరతభద్రునకున్. 97

క. జయలక్ష్మీపరిణయసహ్యా,దయకీర్తినదీసమర్పితస్ఫుటతేజో
మయమహారిద్రాక్షతసం, చయమధురితదిక్పురంధ్రిజననిటలునకున్. 98

క. దానోదకధారామహి, మానారతశీతలీకృతాంగణభూభా
గానుష్ఠితయాచకసం,తానాకించన్యజన్యతాపక్షతికిన్. 99

క. ఇభకర్ణతాళవృంత, ప్రభవానిలసుఖితపరనృపప్రహితసువ
స్తుభరవహజనసమాకీ,ర్ణభవనగోపురబహిర్ధరాభాగునకున్ 100

క. శ్రీనంద్యాలనృసింహ, క్ష్మానాథతనూజునకు సమంచితవిభవ
శ్రీనవ్యబిడౌజునకును, దానకళాతులితదైవతక్ష్మాజునకున్. 101

క. ఆత్రేయమానిగోత్రప,విత్రునకు విరోధిమదలవిత్రునకు దిశా
జైత్రునకు లోచనోత్సవ,గాత్రునకును గొండమాంబికాపుత్త్రునకున్. 102

క. విశ్రుతతిరుమలతాతా, ర్యశ్రేష్ఠాన్వయసుదర్శనాచార్యతనూ
జశ్రీనివాసగురుచర,ణాశ్రయణసమార్జితాఖిలాభ్యుదయునకున్. 103

క. జిష్ణుయశోధిక్షేపణ, ధృష్ణుమహాశౌర్యపద్ధతీఖేలునకున్
వైష్ణవమతశీలునకున్, గృష్ణమహీపాలునకును గృతిలోలునకున్. 104

వ. అభ్యుదయపరంపరాభివృద్ధియు నాయురారోగ్యసమృద్ధియు నగునట్లుగా నాయొనర్పం బూనినకళాపూర్ణోదయం బనుమహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 105

శ్రీరస్తు

# ప్రథమాశ్వాసము.

---

## కథారంభము.

క. శ్రీలకు నాకరమై విద్యాలతలకు నాలవాలమై హరికి సదా
కేళీభవనంబై మహిఁ జాలఁ ద్వారవతి యొప్పు సౌభాగ్యములన్. 1

ఉ. తోయధియంకభాగమునఁ దోరపుఁ బెంపులతోడఁ దత్పుర
శ్రీ యతఁ డూర్మిహస్తములచేఁ దను నిట్టటు ముట్టి లాలనల్
సేయఁగ నొప్పు నంగగుణలీలల నెంతయుఁ బెద్దయయ్యె నే
ప్రాయము లైనఁ దండ్రియెడఁ బట్టరు వేఱొకరీతిగా జనుల్. 2

చ. సురుచిరవస్తుసంపదల సొంపునఁ బెంపు వహింపుచున్న య
వ్వరపురి యాత్మసామ్యపువివాదముఁ దీర్చుకొనంగఁ బిల్చు ని
ర్జరనగరిన్ సువర్ణమయసౌధకరప్రసరంబుచేత నం
బరము గ్రహించి భూరితరపౌరజనారవగౌరవంబుచేన్. 3

చ. అహిమకరప్రచారసుదురాసదమై నిబిడాంధకారస
న్నహనముపోల్పఁ దెల్పుచుఁ దనర్చు సముద్రమహోదకంబుచే
బహిరభివేష్టితంబగుచు భాసిలుఁ దత్పురికోట మిక్కిలిన్
మహిమను జక్రవాళగిరిమాడ్కిని జూడ్కికి వేడ్క సేయుచున్. 4

చ. నలుగడలందుఁ గంబములనం దగి రైవతకాదిపర్వతం
బులు పయికప్పుటాచలువ పోలికి నింగియు నందుఁ జిత్రభం
గులు పచరించుసౌధమణికూటమరీచులు నొప్పు నొప్పు మి
క్కిలి పురలక్ష్మి కొల్వుచవికెం గొలువున్నగతిన్ శుభస్థితిన్. 5

చ. కొలఁదికి నెక్కుడై వరుణుకోటలు మేడలు గోపురంబులుం
గొలువఁగ వచ్చు నప్పురముకోటలు మేడలు గోపురంబులున్
జలనిధితుంగభంగచయసంగతతత్ప్రతిబింబసంతతి
చ్ఛలమున నంత మ్రొక్కు ధరఁ జాగిలి యాడను వారు చిన్నపోన్. 6

ఉ. శైవలనీలముం గమలశాలియు నై నయగడ్తనీరు ప
ద్మావళి ప్రాంతతోడికరకంచుగ నొప్పుచుఁ గోట శాటిలా

గై వఱలంగ హార్మ్యకనకాంశునికాయము పేరఁ దత్పుర
శ్రీ విలసిల్లు నభ్రచరసింధువు మౌళికి మల్లెదండగన్. 7

చ విలసితవీచికాయతరవిప్రతిబింబమిషంబునన్ మహా
జలనిధి లక్ష్మిపార్శ్వశయచక్రిపయిం జెయి చాచి యొప్పు సం
ధ్యలఁ బురలక్ష్మి ధర్మవిధు లన్నియు నొజ్జలపుచ్ఛకాయ గా
వలయు విడం డతండు రసవత్పరిఖామిష బాహుబంధమున్.

చ. అగణితలీల నప్పురమునందు విరాజిలుచుండు నెంతయున్
మృగమదలేపపంకముల మేలిమికోటలు పువ్వుఁదోఁటలున్
నిగనిగ మన్విటంకములు నీలపుమేడలు పైఁడిగోడలుం
బగడపుటంచుపాంకములఁ బచ్చలతిన్నెలు వింతవన్నెలున్ 9

లయవిభాతి—

అలికులమునీలముల చెలువమువహింపనవదళములుహరిన్మణులపోలుపునఁదలిర్పం, దలిరుగమికెంపులుఁగబలుదెఱఁగుక్రొవ్విరులవిలసనముముత్తియపుగుళికలకుఁదక్కుం గలమఁటులకుంబసిఁడితళుకులకునీడగుచు వెలయఁగఁ బరాగములు లలితపవితానం, బులుగగృహముఖ్యముల చెలువు ప్రతిబింబములుబలెఁ బురమునద్దెసలఁబోలుచును వనంబుల్. 10

చ. అనుపమితస్వవాద్యనివహంబులతో సరిమ్రోయుటల్ సహిం
పనియది యై పురం బెదురుపోఁజులు దీర్చునొ మచ్చరంబునన్
వనధి కనంగ నయ్యుపవనంబులు పొల్చు మిళిందబృందముల్
ఘనమకరాకృతిం దనర గాడ్పులఁ జింద మరందబిందువుల్. 11

చ. కొలఁదికి మించు కెంజిగురుగుత్తుల మొగ్గలపుష్పగుచ్ఛకం
బులఁ బువుఁదేనెఁ బుప్పొడులఁ బూపలఁ బిందెలఁ గాయలన్ ఫలం
బుల నెపుడున్ సమగ్రపరిపూర్తివహించుచుఁ దద్వనవ్రజం
బెలమి రహించు నందనసమృద్ధికిఁ గోటిగుణాధికంబుగన్. 12

శా. చాతుర్యాధిగతాఖిలశ్రుతిచయుల్ షడ్దర్శనీపారగుల్
శ్రౌతస్మార్తవిధిప్రసిద్ధపదవీసంచారలీలాధ్వగుల్
చేతో నామవిలోచనాచలితలక్ష్మీనాథసంజ్ఞాదిమ
జ్యోతిర్నిత్యనిరీక్షు లప్పురములో నున్నట్టియుర్వీసురుల్. 13

శా. నానాయుద్ధవిహారశూరులు గుణానందజ్జయశ్రీనఖాం
కానూనభ్రమదాయుధవ్రణకిణోదంచచ్ఛరీరుల్ సదా
దానప్రౌఢియశోవిశేషజితమందారుల్ గభీరుల్ మహా
మానాధారులు రాకుమారు లతిభూమన్ మించు రవ్వీటిలోన్ 14

చ. తమతమపెద్దవారు మును దాఁచినద్రవ్యము లున్నయట్లయుం
డ మితము లేక యొప్పెడుధనంబులు తారు గడించి యుర్వి ని
త్యము నమితంబుగా నవనిధానము లున్పుచు నప్పురంబులో
నను రెడుకోమటుల్ నగుదు రల్లకుబేరునిధీశ్వరత్వమున్ 15

క. ద్విజులను శాస్త్రనియుక్తిని, భజియించుచు నిండ్ల సకలభాగ్యవిభవ మ
క్కజమై తనర సుఖింతురు, సుజనులు తత్పురములోనిశూద్రులు నెమ్మిన్ 16

క. ఎప్పట్టున ఘనసారపుఁ, గుప్పలుగుగజాశ్వసుభటకోటులచేతం
గప్పురముక్రోవి యనఁ దగి, యుప్పురము కరంబు వెలయు నవనీస్థలిపై. 17

బంధుకరము—

అరుదుగఁ బిడికిటనడఁగెడునడుముల్ హస్తిసమానపుయానముల్ గా
గురుజఘనములును గుచములభరముం గొప్పులగొప్పతనంబులు మే
గరగరికలు సిరి గలనగుమొగముల్ కల్కిమెఱుంగుఁగనుంగవలున్
దొరయఁగ వెలపడఁతులు విటధనముల దోఁతురు చొప్పడ నప్పురిలోన్ 18

చ. అమరఁగ వింత నిం పొసఁగు నందు విటాలికి వేశవాటిహా
ర్మ్యములు విమానమానహరహారిశిరోగృహభాగభోగభా
గమరభుజంగసంగహృదయంగమరంగదనంగసంగర
క్రమరమణీమణీమణితకల్పన నేర్చినపారువాలచేన్. 19

ఉ. మాటలు వేయు నేటికి రమావరుఁ డందుఁ బదాలువేలపై
నూటయెనమండ్రుభార్యలు దనుం బరిపూర్ణరతోత్సవంబునన్
గాటముగాఁ దనర్చుకుతుకంబులఁ గొల్వఁ గడున్ సుఖించు నే
నాట వెలుంగు నివ్విలసనంబు లతం డలతెల్లదీవిలోన్ 20

ఉ. అందును వారు వీ రనక యందఱు ధర్మధురీణు లైనవా
రందఱు శుద్ధభాగవతు లందఱు వేదనిరూఢి నున్నవా
రందఱు సాత్త్వికప్రవరు లందఱుఁ దత్త్వ మెఱింగినట్టివా
రందఱు సత్కృపానిరతు లందఱుఁ బావను లెన్నిచూడఁగన్ 21

### కలభాషిణీవర్ణనము.

క. ఇట్టట్టన నేటికిఁ ద, త్పట్టణమున నున్నయట్టిప్రజ లేజాతిం
బుట్టినవారలు వంద్యులు, గట్టిగఁ దద్వినుతి నెల్లకలుషము వాయున్. 22

క. అం దొకనటముఖ్యునిప్రియ, నందని శైశవమునంద నానాగుణరే
ఖం దనరారుచుఁ గ్రమమున, నందంబుగ యౌవనోదయముఁ బ్రాపించెన్. 23

క. కలభాషిణి యనుపేరా, వెలఁది మును వహించు సహజవిలసత్కలభా
షలకుఁ దగఁ జాల దపు డది, కలికితనముఁ జతురతయును గలపలుకులకున్.

క. బాలికకేళికతాలస, తాలసదచిరావతరణతరుణిమతరుణీ
లోలాలసాలసవిలస, నాలోకనములు విటాళి నట్టిటు చేసెన్. 25

ఉ. కూఁకటివేణితోఁ గురులు గూడకమున్న కుచప్రరోహముల్
పోఁకలతోఁడిసామ్యమును బొందకమున్న నితంబసీమకుఁ
బ్రేకఁదనం బొకింత ప్రభవింపకమున్న ప్రసూనబాణుఁ డ
ట్టాఁకలఁ బెట్టెఁ దా నరవ నామెత బాలికకై విటావళిన్ 26

చ. తనదుమెఱుంగుఁజెక్కిళులు దాఁకఁగనీక మొగంబు నాఁపుచుం
జనుబొగడల్ నఖాకలనఁ జక్కిలిగింతలు వోవ లోఁగుచుఁ
మనసిజు మించుభీతియును నానయుఁ బూనుచు నీమృగాక్షి యిం
పొనరుచు నున్నఁడొక్కొ యని యువ్విళులూరుదు రత్తఱిఁ విటుల్. 27

క తొలుప్రాయపుమగకొదమల, తలఁపులతమకములు మిగులఁ దను నెదురుకొనం
జలజాక్షిజవ్వనము గడు, వెలసెఁ బ్రతిక్షణము వింతవింతగ నంతన్ 23

తే. మొదల బలురేఖ గలదఁట యదియుఁ గాక
వయసు క్రొత్తఁట వెలయాలివంగడమఁట
వనితచక్కఁదనంబును వన్నెలాఁడి
తనముఁ గల్కితనంబును దరమె పొగడ. 29

సీ. మెఱుఁగుటద్దపుమించుమించుబాగులనింపు నింపుచక్కనిముద్దునెమ్మొగంబు
నవచంద్రికల నవ్వు నవ్వువీవులఁ జూపు చూపులచొక్కంపుసోయగంబు
నారూఢిఁ బలుమారు మారువిండ్లకు నేర్పు నేర్పుకన్బొమదోయినెఱతనంబు
గటికిచీఁకటిఁ గప్పుకప్పుఁ బూనినకొప్పు కొప్పుతోరంపుజక్కువబెడంగు

తే. గుబ్బపాలిండ్లు లేఁగౌను గొప్పపిఱుఁదు
బాహులతికలు మృదుపదపల్లవములు
బంగరుశలాకపస భంగపఱచుమేను
గలిగి చెలు వొందుచుండు నాచెలువ మిగుల. 30

చ. బెళుకులఁ జిమ్ముచుం గలికిబిత్తఱిచూపు సరత్నకుండలాం
చలకషణోజ్జ్వలత్వముపసల్ నెఱపన్ ఝళిపించుచుఁ భుజం
గులహృదయస్థలుల్ వాడిచి కొంచక తోడన పోటుగండ్లఁ దూ
టెలలన యారయొక్కొకతతిం బువుఁబోండ్లు కటారికత్తియల్. 31

ఉ. కీర్తనపాత్రచిత్రమృదుగీతకళాకలనప్రవీణతఁ
నర్తననైపుణీవిలసనంబులపెంపుల సత్యపూర్వని

ర్వర్తితపంచబాణసమరక్రియలన్ హరిణాక్షీ యప్సరః
కీర్తిబలెన్ హరింపఁ దొడఁగెన్ విటసంచయచిత్తవిత్తముల్ 32

ఉ. ఆరమణీశిఖామణి మహావిభవంబున నొక్కనాఁడు సిం
గారము లెంతయున్ మెఱయఁగాఁ జెలికత్తెలతోడఁ జేటికా
వారముతోడ వింతచెలువం బనయంబు దలిర్పఁగా వసం
తోరువిలాసభాసురపురోపవనంబున కేగి యచ్చటన్. 33

సీ. క్రొన్ననల్ వలరాచమన్ననల్ గరగర మల్లికల్ గొనియున్న మల్లికలును
సంతానముల కళిసంతానములయాటపాటలములు చూపుపాటలములు
తీవి చేకొన్న పూఁదావిచేఁ బథికాంతరంగముల్ నొంచునారంగములును
మారుమేలైనబంగారు మేడలఁ బోల్పు భంగి యై మించుసంపంగిగములు
తే. మంజులములై కనంబడువంజులములు,కుందములును వాసంతికాబృందములును
గేసరములును నవనాగకేసరములు, కాంతలార కంటిరె కడువింత లగుచు. 34

క. పూఁబోఁడి యొఱసికొని చనఁ, గాఁ బయ్యెద యొడిసిపట్టెఁ గనుఁగొంటె చెలీ
లేఁబొన్నను బళిరా యిది,గోపురుషాహ్వయము నిలుపుకొనుసమయంబున్. 35

క. ఆలికుచంబులు నాగ,య్యాలికుచంబులును వాదు లాడెడురొద గా
బోలు నన దనరె నూపుర,కోలాహలచకితకీరఘోషము వింటే 36

క. లేఁగరువలిచే ముంగలి, పూఁగొమ్మలు పాయఁబడుచు భుజగతి నెఱపం
గాఁ గురువక మిదె తివిరెడుఁ, గౌఁగిటికిన్ నీకుఁ దగునె కైకొనమి చెలీ. 37

చ. పయఁటచెఱంగు శాఖ యనుపాణిఁ దెరల్చుచు నోలతాంగి తాఁ
బ్రియమున భృంగకైతవనిరీక్షణముల్ కుచకుట్మలంబులం
గయికొన నొప్పుపల్లవశిఖామణి మామిడి రిత్తఁ బోవునే
భయ మిఁక నేల యే మిచటఁ బత్రముఁ బుష్పము వేడ్క నందితో. 38

వ. అని యీప్రకారంబుల మఱియు నొండొరులతో ననేకవిధసరససల్లాపంబులం
బిసాళింపుచు నింపు దళుకొత్తఁ గ్రొత్త విరిగుత్తులచేత నేత్రపర్వం బగుచున్న
యాపువ్వుఁదోఁటఁ దఱియం జొచ్చిన 39

సీ. అర వీడుకొప్పులవిరులవాసనకుఁ దోరపుటూర్పుఁదావులు ప్రాపు గాఁగ
నడలమందతఁ బెంచుబడలికలకుఁ బిఱుందులవ్రేఁగు చనువ్రేఁగు తోడుపడఁగఁ
జెమటచిత్తడిఁ గ్రొత్తచెలువు గాంచినవళుల్ మొలనూళ్ల కాంతికిబలిమినొసఁగఁ
బయ్యెద లాడింపఁ బ్రభవించుకంకణనాద మందెలమ్రోఁత ప్రోది సేయ
తే. మిగుల రొదగాఁ గికాకిక నగుచు రతుల
యాయములు సోఁక నెద్దియే నాడుకొనుచు
సందడించుచుఁ బుష్పాపచయము సలిపి
యంతఁ గడఁగిరి డోలావిహారములకు. 40

వ. అప్పు డాకాశమార్గంబునం గృష్ణసేవాలాలసుం డగుచు నేగుదెంచునారద మహామునీంద్రుని మణికంధరుం డనుగంధర్వకుమారుండు గానవిద్యావిశేషాభిలాషంబునం గొలిచి వచ్చుచు నుండి యమ్మగువలప్రగల్భతాగరిమకు వెఱఁ గందుచు శతానందనందనున కి ట్లనియె 41

మ. తమిఁ బూఁదీఁగెలతూఁగుటుయ్యేలలఁ బంతా లాడుచుం దూఁగునా
కొమరుంబ్రాయపుగబ్బిగుబ్బెతలయంఘ్రుల్ చక్కఁగాఁ జాఁగి మిం
టిమొగం బై చనుదెంచుతీవిఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర నా
కమ్మృగీనేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్ దాఁచులా గొప్పెడున్. 42

వ అనుటయు నారదుండు. 43

మ బళిరా సత్కవి వౌదు నిక్కము తగఁగా భావించి నీ వన్నయా
యెలప్రాయంబుమిటారికత్తెలబెడం గే నెందునుం గాన వా
రలడోలావలనోచ్చలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁ దన్నం జనునట్లు మించె ననినం ద ప్పేమి యొప్పె యగున్ 44

క అని పలుకునపుడు నికటంబున నలరూఁబరుఁడు దాను మొగులుమఱుఁగునఁగా
ఘన మగుదివ్యవిమానంబునఁ జనుచుఁగా రంభ విశదముగ నది వినియెన్ 45

ఆ విని యొకింత కనలి మన సొకలా గైన, నతని నారదుఁ డనియాత్మ నెఱిఁగి
భావవికృతి యెఱుకపడనీక యడఁచి యమ్మగువతనదుప్రియుని మొగముఁ జూచి.

క. ఆలించితె యీపలుకుల, పోలికఁ దెలియంగఁ గలహభోజనముని గాఁ
బోలు మన మితనిఁ గని యుచితాలాపము లాడిచనుట యభిమత మనియెన్.

ఉ నారదుఁడుం దదీయవచనంబు వినంబడుదిక్కుఁ జూచె నె
వ్వారలొ మాట లాడుచును వచ్చుట తోఁచె నటంచు నచ్చటన్
వారివిమానరత్నమును వారిధరంబుమఱుంగు వాసె బా
లారుణభానుబింబ ముదయాద్రిమఱుంగును బాయుచాడ్పునన్ 48

క. ఆరంభయును గుబేరకుమారుఁడు నవ్వేళఁ దమవిమానోత్తమముఁగా
నారదమౌనీంద్రుపదాంభోరుహములక్రిందిచాయఁ బో నిచ్చి తగన్. 49

ఆ పారిజాతకుసుమసౌరభంబులు వెద,చల్లుతమశిరంబు లల్ల నల్ల
నద్దుచును దదీయ మగుపాదయుగళి వాసించి రంతఁ గొంతసేపు నిలిచి 50

క. ఆవరమౌనియు నొండొరు, పై వదలనిప్రేమ కలిగి భాసిలుఁ డనుచుఁగా
దీవించె రంభ యపుడా, దైవతమునివర్యుఁ జూచి దరహాసముతోన్. 51

క. ఓమునివర మీదీవన, చే మాపైఁ బ్రేమ కొంత చెడక నిలుచునో
యేమో కాని యిఁకఁగా నర,భామలపోఁడుములకితఁడు భ్రమయక యున్నే.

వ. అని తనమనంబునం గలయీరసంబు సైరింపం జాలక యొక్కసక్కియంబుగా నాడుమాటలకు సందియంబు నొందుచు నిది యేమి యనుట వివరింపు మని

మునివరుండు నిలిచి యడుగుటయు దేవరకుం బ్రస్తుతగమననిరోధంబు గాకుండ
విచ్చేయుఁడు విమానంబుమీఁదికి రా నవధరింపుఁ డన్నియు వివరించుచు
నరుగుదెంచెద మహానుభావులం గొంతమేర యైనం గొలిచి వచ్చుట భాగ్యంబు
గాదె యనుచు శిష్యసమేతంబుగా నతనిం దమవిమానంబునందు నునిచి
కొని తదలంకారచామరంబులు రెండును విచ్చి పుచ్చుకొని తనప్రియుండును
దాను నిరుగెలంకుల నిలిచి యల్లనల్లన వీచుచు నప్పుడంతి మానివర్యా యప్పు
డుమీఱ లాడోలికావిహారిణులప్రసంగంబున శిష్యుతోడ నేమని పలికితి రది
యానతీవలయు ననుటయుఁ జిఱునగవుతో నతండు. 53

మ. "బళిరా సత్కవి వౌదు నిక్కము తగఁ భావించి నీవన్న యా
యొలప్రాయంపుమిటారికత్తెలబెడం గేనెందునుం గాన వా
రలడోలాచలనోచ్ఛలచ్చరణముల్ త్రైవిష్టపస్త్రీలయా
దలఁ దన్నం జనునట్లు మించె ననినం దప్పేమి యొప్పే యగున్" 54

క. అని పలికితి నిం దేమై, నను గాని తెఱంగు గలిగినం జెప్పుమా యో
వనజాక్షీ యింక దాఁపం, బని యేమి మనంబులోనిభర మని పలికెన్. 55

వ అని పలికిన నవ్విలాసిని యతనిం జూచి. 56

క. మీరలు పెద్దలు త్రైలో, క్యారాధ్యుల రేమి యన్న నంటిరి గా కె
వ్వారలు మాన్చెద రిట నే, మారసి యాడితిరొ యనుచు నడిగితి ననఘా 57

ఉ ఊహ యొనర్పరో యతిశయోక్తులవర్ణనలందు నిట్టియ
వ్యాహతి చెల్లు నంచునో యి టాడితి రింతియ కాక యేవరా
రోహలు మమ్ముఁ బోలమికి రూఢిగ నిమ్మెయి నున్న యీజగ
న్మోహనమూర్తి యర్థపతి ముద్దుకుమారుఁడె సాక్షి నావుడున్ 58

ఉ. అల్లన నవ్వుచున్ ముని సురాంగనఁ జూచి యొ టాడుకొన్ననుం
జెల్లుఁ గదమ్మ నీకుఁ గడుఁ జెల్వుఁడు నిర్భర మైనప్రేమ రా
జిల్లఁగ నిట్లు వర్తిలుటఁ జేసి మృగేక్షణ యైన నిట్టు రా
వెల్లదినంబులున్ సవతి యేగతిఁ గల్గునొ మీఁదు గంటివే. 59

క. నీకుఁ బోలువనిత నీకును, వనజముఖి యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గల్గి కలచునో యిట్టినిగాఢపుముదముసొంపులీవులు చను నే 60

క. అనుటయు నవ్వల కనినన్, మునివర మీమాట యిట్లమోఘం బగునో
వినలే నిట్టివి మానుఁడు, నను మన్నన చేసి యనుచు నాతుక మ్రొక్కెన్ 61

వ అంత నమ్మహామునీంద్రునియాజ్ఞానుసారంబునం దద్విమానంబు కలభాషిణివిహ
రించుచున్నయొలదోఁటలోనికిం దిగియె నట్టియెడ రంభానలకూబరులు వినయ
పూర్వకంబుగా నతనిచేత ననిపించుకొని యప్పు డెదుటఁ గాన్పించువాసుదేవుని
ప్రాసాదరాజంబునకుం జెయ్యెత్తి మ్రొక్కి తమవిమానంబుతోడ నిజేచ్ఛం

జనిరి కలభాషిణియు నట మున్ను తన కనతిదూరంబున వినంబడు వారలసల్లా
పంబు లాలకించి యుండి తదనంతరంబ భగద్ధగితదిగంతరం బగుచుం జేర నేతెంచు
విమానంబు నవలోకించియు నాశ్చర్యంబు నొందు చుండి యప్పు డ ట్లడుగు
నలమాబరునిరూపలావణ్యాదిసౌభాగ్యంబునకు మిక్కిలి మెచ్చుచుఁ దదా
లోకనంబునం దనియక కొంతమేర తద్విమానంబు క్రిందటిచాయం బోదరిండ్ల
యీరమిమఱుంగున వారిసల్లాపంబు లాలకించుచుం జని యంత నది మిక్కిలి
దూరంబుగా నేగుటయుఁ దిరిగి వచ్చుచుఁ దనమనంబున 62

ఆ. ఇంత రూపవంతు నెంతయుఁ దనకుఁ గై,వసము చేసికొని యవార్యగర్వ
మతి చెలంగ భాగ్యవతి యీలతాంగి యె,వ్వతెయొకో మనంగవలదె యిట్లు.

చ. మునుపు నిజేశు నర్థపతి ముద్దుకుమారుఁ డ టంచు నానితం
బిని పలుకంగ వింటిని గుబేరతనూజునకుం గరంబు మో
హిని యగుకాంత రంభ యని యాడుకొనంగ వినంబడుం ̄ మనం
బున నిపు డెన్న నామెఱుఁగుఁబోఁడియ కావలయుఁ̄ నిజంబుగన్. 64

క ఇప్పు డిది నిశ్చయంబుగ,నప్పరమమునీంద్రుఁ జేరి యడుగఁగవలయుం
దప్పుఁ డతఁ డమరమౌనియ, యప్పటి కప్పటికి వచ్చు యదుపతికడకున్ 65

క. అనిచింతించుచు నాయం,గన దా నొక్కతియ యేగి కడుఁ జేరువ నా
యనుపమతేజుని నారద,ముని గాంచ నెఱింగి వినయమునఁ బ్రణమిల్లెన్. 66

వ. ప్రణమిల్లి లేచి విరచితాంజలి యై నమస్కరించి నిలువంబడి యంజలి
బద్ధురా లై. 67

క. మౌనీంద్రచంద్ర యిపుడు వి,మానముతో నేఁగినట్టిమహితాత్ములు రం
భానలకూబరులే యన, నానారదుఁ డట్ల యగుదు రని యాయకతోన్. 68

క. నీ వెట్లుఱిఁగితి చెపుమా, నావుడు మీ రాడుకొన వినంబడుమాటల్
భావింప నట్లయౌ నా,భావమునకుఁ దోఁచె ననుచు భామిని పలికెన్. 69

చ. పలికిన మింట నాడుకొనుపల్కులు వింటివొ యన్న వింటి నో
యలఘుతపోనిధాన తనయత్యధికం బగురూపసంపదం
జెలువుఁడు కైవసం బనుచుఁ జెల్లుబడిం బచరించి పల్కె నా
కలికి తదుక్తిగోర్వమి ప్రకాశిత మయ్యెను మీవచస్థితిన్. 70

క. అనుటయు మునినాయకుఁ డో, వనితా యెట్లోర్వ వచ్చు వలవనిగర్వం
బునఁ గన్ను గాన కాడెడి, యనుచితవాక్యంబు లేరి కైనం దలఁపన్. 71

క. తరుణీ యేరికిఁ జెల్లునె, యరయఁగ నే మింతవార మనుకొన నిదిగో
పిరువీఁకుగ నున్నది తాఁ,గర మద్భుత మైనసవతికయ్యము చేతన్. 72

క సవతి యన నింక నొక లేఁ̄, భువిలోపల వెఱ వెదకఁ బోవలయునె యో
ధవళాక్షి నీవ కాన్నే,రవె దైవనియుక్తిఁ గొంత ప్రాప్తి గలిగినన్. 73

క. నావుడు నంతటఁ దిరూప, శ్రీవైభవసతికిఁ గాక సిద్ధించునె యా
దైవనియుక్తియు మాబోం, ట్లవిధమునఁ బొల్లఁ బడిన నిద్ధవివేకా. 74

తే. అనుడు నామాట కేమి యోయంబుజాక్షి
రంభ మొదలైనయేయచ్చరలకు నైనఁ
దక్కువే నీదురూపసౌందర్యమహిమ
లెక్కఁడే కాక మిగుల నూహించి చూడ 75

ఆ. అది యటుండ నిమ్ము ముదిత నిన్నును జూచి
నట్లు దోఁచుచున్నయది యొకింత
నళిననాభుకొలువునకు వత్తువో యన
వత్తు మిమ్ముఁ జూతు వరమునీంద్ర 76

సీ. అని యింతి పల్కిన ముని పల్కె నవునవు నెలఁత నిన్నెఱుఁగుదుఁ దలఁచుకొంటి
మాశిష్యుఁ డైనయామణికంధరాహ్వయుఁ డిటఁ గొన్నినాళ్లక్రిందటను గ్రొత్త
గాఁగ హరిం బొడఁ గానంగఁ దా వచ్చి దండకరూపసంస్తవరచన
యొనరింప నేకసంతన గ్రహించి పఠించినట్టినేర్పరివి గదమ్మ నీవు

తే. పేరు కలభాషిణివి గద బిరుదుచదుర
వగుదు బళిబళి యిపుడు నీ కది ముఖస్థ
మగుచు నున్నదియే శక్య మగునె చదువ
ననుడు శక్యంబు గా కేమి యనుచుఁ బలికి. 77

'వ. అమ్మదిరాక్షి మధురగంభీరస్వనంబున ని ట్లని చదివె. 78

దండకము శ్రీకామినీకామితాకార సాకారకారుణ్యధారానవాంభోరశింకాకరా
శోణరేఖామయూఖాళికిమ్మీరితాలోకనాలోక లోకైకసంస్తుత్యనిత్యప్రభావా
విభావైభవాధిక్యధిక్కారితానంతమార్తాండకోటీరయాటీకమానామలాస్తంభ
శుంభద్వ్యశోకపూరకర్పూరసౌరభ్యమైత్రీపవిత్రీకృతామ్నాయవాయుప్రచారా
నిశాపాదితాపారసంసారసంతాపనిర్వాపణా పాపనిర్వాపణోపాయనామప్రశం
సా సుభావా భవాభావలోభాకులీభూతచేతస్సుధీవ్రాతనిర్ణీతసంప్రాప్తసద్భక్తి
మార్గైకవిశ్రామభూమీభవత్తత్త్వరూపా సురూపావళీ దుర్నిరూపస్వరూపా
గురూపాసనాసాదితానారతానన్యసాంకర్యకైంకర్యమాధుర్యధుర్యప్రసన్నాప్ర
సన్నావళీమానసోదస్తభోగాపవర్గాభిలాషాహ్వాక్షీ కేశ యీశానవాణీశముఖ్యుల్
సువిఖ్యాతమైనట్టినీదివ్యచారిత్రచారుప్రచారంబు పారంబు ముట్టన్ నుతింపం
గలే రంచు నెంచంగ వించుం బ్రపంచస్వభావంబు భావంబునన్ మాన కిట్టేము
నీముందటన్ జాటువాచాటతల్ చూపుచున్నార మిన్నేరముల్ మన్నసల్ చేసి
సైరింపు మోవాసుదేవా సదానంద గోవింద సేవింపుమావింద వై డెంద

మానంద మొందింప నెందుఁ బ్రిచారంబు లేమిఁ బ్రవచోగోచరాగోచరత్వంబు లూహింపలే మైతి మోదేవ మీపాదసేవాదరంబుఁ మదిం గోరుచుఁ వేదవాదుల్ శమాదుల్ కడుంజాల నార్జించిభోగేచ్ఛ వర్జించి నానాతపశ్చర్యతాత్పర్యపర్యాకులత్వంబునం గైకొనఁ మాకు నేయత్నముల్ లేక యోకృష్ణ యీకైవడిఁ మీకృపాలోకసంసిద్ధి సిద్ధించుటల్ బుద్ధిఁ దర్కింప నత్యంతచిత్రంబు గాదే జగన్నాథ యీరీతిఁ జెన్నార ముక్నేబుషుల్ మిమ్ముఁ గన్నారఁ గన్నారు మాకన్ను లెన్నంగ నేపుణ్యముల్ చేసెనో యీవిశేషంబుఁ గాంచెఁ విరించోదయస్థాననాభీసరోజా సరోజాతజాశాండముల్ తండతండంబులై యుండ నొండొండు నీరోమకూపంబు లేపారఁగాఁ దాల్చుటల్ చెప్పఁగా నీవు గోవర్ధనం బెత్తి తంచుఁ వరాహావతారంబునఁ ధారుణీచక్రముం దాల్చి తంచుఁ మహాకూర్మభావంబునఁ మందరగ్రావముఁ మోచి తంచుఁ జగంబుల్ సమస్తంబుఁ త్రివిక్రమప్రక్రియావేళఁ బాదత్రయిం జాలఁ బూరించి తంచుఁ నుతింపంగ యుక్తంబె భక్తప్రజాధీన దీనిఁ వివేకించి లోకంబులోఁ గొంద ఱారోత్తముల్ సర్వవేదంబులుఁ సర్వవాదంబులుఁ సర్వయాగంబులుఁ సర్వయోగంబులుఁ సర్వమౌనంబులుఁ సర్వదానంబులుం జూడ నీదాసదాసానుదాసాంఘ్రిసంసేవలోఁ గోటికోట్యంశముం బోలఁగాఁ జాల వంచుం దదాచారముం బూని వర్తింతు రత్యున్నతిఁ సర్వసంకల్పనిత్యోదయా యేము నీ నామమాత్రంబు నూనాలుకం జేర్చుటల్ దక్క నొక్కింతయుఁ దక్కుత్రోవల్ భవన్మాయ దాఁటంగ లే మవ్యయా భవ్యయోగీంద్రసాంద్రాదరాకాంక్షితైకాంతసంసేవనా భావనాతీత కల్యాణనానాగుణశ్రీసముద్భాసితాంగామముం గేవలం బైనకారుణ్యదృష్టిం గటాక్షించి రక్షించు లక్ష్మీమనోవల్లభా దేవదేవా నమస్తే నమస్తే నమస్తే నమః 79

మ. అని యీవైఖరి నంతయుం జదివి దైత్యారాతి యాదండకం
బునకుఁ మెచ్చుచు నిచ్చినట్టిది గదా భూరిద్యుతిఁ నీదుశి
ష్యునికంఠంబున నొప్పునావిమలరత్నోదారహారంబు స
న్మునిలోకోత్తమ యంచుఁ బల్కి మఱియుం బూఁబోఁడి దా నిట్లనున్. 80

సీ. పొసఁగ ముత్తెపుసరు ల్పోహళించినలీలఁ దమలోన దొరయుశబ్దములు గూర్చి
యర్థంబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు లెఱిఁగి నిర్దోషత నెసఁగఁజేసి
రసభావములకు సర్వాంబుగ వైదర్భి మొదలైనరీతు లిమ్ముగ నమర్చి
రీతుల కుచితంబులై తనరారెడు ప్రాణంబు లింపుగాఁ బాదుకొల్పి

తే. యమర నుపమాదులును యమకాదులు నగు, నట్టియర్థశబ్దాలంక్రియలుఘటించి
కవితఁ జెప్పంగ నేర్చుసత్కవివరునకు, వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె.

లయవిభాతి చలువ గలవెన్నెలలవెలువునకు సౌరభము' గలిగినను సౌరభముఁ
జలువయుఁ దలిర్పం,|బొలు పెసఁగుకప్పురపుఁబలుకులకుఁ గోమలత నెలకొనిన
సౌరభముఁ జలువపసయుం గో,మలతయును గలిగి జనములు మిగులఁ బెం
పెసఁగు మలయపవనంపుఁగొదములకు మధురత్వం, బలవడిన నీడు మఱి కల
దనఁగ వచ్చుఁ గడు వెలయఁ గలయీసుకవిపలుకులకు నెంచన్ 82

క ఊరక యటు మిముబోఁటులు, చేరువఁ బతియింపఁ గనిన సిద్ధింపవె యే
కోరిక లైన నజస్రముఁ, గోరుదు మీవీణ మోసికొని కొల్చుటకున్ 83

సీ. మునినాథ యిటమున్ను వనజవళౌతుని యంతగపురంబున కరుగు వేళ
మణికంధరునిఁ దదంగణమున నిల్పి మీ వీణియ మీరలే పాణిఁ బూని
పోవఁగాఁ జూతు నప్పుడు దాని నేఁ బుచ్చుకొని కొల్చి వత్తునో యని తలంతు
దేవరచిత్తంబు దెలియమి నట్లు సేయఁగ నేమి దోఁచునే యనుచు వెఱతుఁ

తే. గరుణ నంతమాత్రపుటూడిగంబునాకు,ముదల. బెట్టుఁడటంచు కేల్మొగిచిమిగుల
వినయ మొప్పఁగ నాయింతి వేఁడుకొనియె, నతఁడునట్ల కానిమ్మనియనుమతించె.

వ. అనుమతించుటయు నమ్మహాత్మునియనుగ్రహం బీపాటి గలిగె దీనం జేసి నా వాం
ఛితంబును సఫలం బగు నని సంతసిల్లి రంభానలకూబరులవలనఁ గడపట వినం
బడినవ్యాకం బొకటి దలంచుకొని యది తెలియుటకుఁ గృతాంజలి యై వినయ
భరంబునఁ గొంకుచున్న దాన మణికంధరుండు రహస్యశంక నెడగలుగఁ జనఁగ
నమ్మహాముని కి ట్లనియె 85

సీ. మహితాత్మ మీర లిమ్మహి నుండ సంకోచపడి యేమొ మిక్కిలి పొడవుచనఁగ
నీక విమానంబు నిలచేర్పునన కొంత మేరఁ బోనిచ్చి నమ్మిథున మిప్పు
డేను వృథాభ్రాంతి నింతనంతను దాని వెంబడిఁ జని పల్కు వింటి నొకటి
వినుఁ డది యర్థశతనయుఁ డోయబల యి న్నారదుమాటలు నడుమ వేఱ

తే పొడమె నేమయ్యె నలకళాపూర్ణుసుద్ది, కడమ చెప్పుమున్న రంభ యప్పుడ తెలుపనె
నీకు మఱి చెప్ప రాకుంట నీకథయును, నీకు నాతోడు సుమ్మిబ్బనీకు వనియె.

తే. ఏనెఱుఁగ వేడ్కపడుచున్న దాన నోత,పోధనోత్తను యాకళాపూర్ణుఁ డనఁగ
నెవ్వఁ డాతనిసుద్ది మున్నేమి చెప్పె, నెద్ది చెప్పరాదనియె నాయిగుసుఁబోఁడి.

వ. ఇది యానతీవలయుననిన నతండుఁ వెఱఁ గంది యిది యుంతయు నపూ
ర్వంబు దీనిఁ దెలిసెదం గాక యని కొంతదవ్వు నిశ్చలుం డగుచు విశ్వప్రపంచం
బునంగల భూతభవిష్యద్వర్తమానవర్తనంబు లన్నియు విమర్శించి తత్ప్రకా
రంబుఁ గాంచి కలభాషిణిం జూచి యారంభ ప్రియునకుఁ జెప్ప రా దనినకథ
యత్యపూర్వంబు నాకునుం జెప్పఁ దగ దని పలికిన 88

తే. అనఘ చెప్ప రానికథాంశ మట్ల యుండ, నిమ్ము నలకూబరునకు నయ్యింతియేమి
కారణమ్మున నీప్రసంగము వచించె, దెలుపుఁ డన దాని కి ట్లని తెలిపె మౌని.

సీ. ఈరంభయును వీఁడు నేవేళయును రతిక్రీడాపరాయణుల్ కేవలముఁను
వీరి నొండొరుహాసవీక్షణోక్తులు దక్కినట్టిచేష్టితములు నెట్టివైన
మన్మథోద్దీపనమహిమఁ జొక్కించునొక్కొకప్రేమచొప్పిది యుర్విఁ గలదు
కావున మము నేఁడు కనుఁగొనుటకు మున్ను రంభ నవీనమార్తండుదండ
తే. శుభ్రఘనరేఖ వర్తిల్లఁ జూచి నగుచు, బ్రహ్మతో నున్న శారదారమణిఁ బోల్చె
ధనదసుతుఁడు నమ్మాటకుఁ దరుణిమోవి, దంతశిఖ నొత్తె నత్తఱిఁ దనరుతమిని.
క. ఒత్తుటయు నెందుఁ గలుగని, క్రొత్తతెఱంగునఁ జెలంగుకోమలకలవా
గ్వృత్తి యపు డొకటి బహువి, చ్ఛిత్తిక మై దానికంతసీమం బొడమెన్. 94
ఉ. ఏయెడ నెన్నఁడుం గననియింపులు గుల్కెడుతద్గళస్వనం
బాయత మైనకౌతుకము నద్భుతముణ్ మొలపింప నేది యే
దీ యిది చాలఁ గ్రొత్త భళి యింకొకమా ఱికనొక్కమాఱటం
చాయలినీలవేణి నలకాధిపసూనుఁడు వేఁడె వేఁడినన్ 92
క. నాచేత నింకఁగా దిది, యోచెలువుఁడ యనఁగఁ గాక యున్నణ్ విడ నే
నోచెలువ యనఁగ వచనా, గోచరసల్లాపరసము గొం తపు డొదవెన్ 93
వ. అంత నక్కాంత కాంతునికి సంతసంబుగాఁ గొంతగొంత తత్ప్రార్థనంబు సఫలం
బు చేసె నతం డంత నింతకు మున్నిది యెన్నండును విన్న యది గాదిప్పు డె
ప్పగిది నొదవెఁ జెప్పు మని గ్రుచ్చి గ్రుచ్చి యడుగ నిది నేఁడు నేర్చినది కాదు
తడవులనుండియ నే నెఱుంగుదనియ యొక్క కారణంబున నిది యెఱుకపఱుపక
నెఱయ మఱచియు నేఁడు బాలభానుపాండుమేఘసంసర్గవిశేషవీక్షణంబునం
దలంచిన మానసంబులోనన పూనియుండి యిప్పటినీదుండగంబువలనఁ గలిగి
వెలవిరియ నిచ్చితి నని పలికిన నతం డి ట్లనియె 94
తే. ఏమికారణమున దాఁచి తిన్నినాళ్లు
తరుణి యెఱిఁగింపు మనుఁడు నేతత్ప్రసంగ
మునఁ గళాపూర్ణుకథలు వచ్చునొ యనియెడు
తలఁపుచే దాఁచితి న టంచు వెలఁది పలికె 95
సీ. పలికియోపౌరుషాభరణ తత్కథలు వచ్చిన నేమి యంటేని వినుము దెలియ
నాకథ లెఁకఁ జెప్పినట్టివారును విననట్టివారును ధాత్రియందుఁ బుత్ర
పౌత్రప్రపౌత్రాదిబహుసంతతియుఁ దనర్పుచుఁ జిరకాలంబు ప్రచురసంప
దభివృద్ధిశోభితశుభసౌఖ్యములు గాంతురనుమాట యున్నది యాదియంద
తే. యేను నీ కది చెప్పిన దీనికొఱకు, నవనిఁ బుట్టగఁ వలయునో యని వెఱచెదఁ
బ్రాణవల్లభ యని తావకాంగసంగ, సౌఖ్యమునఁ జేర్పునాకు నిష్టంబులగునె.
తే. అదియు వింటివి గద యని యనియెదేని, యేను విననట్టిపిమ్మట నిట్టిమాట
పలికె నొక్కయమోఘవాగ్విలసనుండు, కావున వచింప విన నీక గాదు నాకు.

వ. అని చెప్పె నని చెప్పి నారదుండు. 98

తే. అతివ విను రంభకును గలయట్టిభయము
నాకుఁ గల్గుటఁ దత్కథ నీకుఁ జెప్పఁ
గూడ ద ట్లయ్యు మిక్కిలి కువలయమున
వెలయఁ గల దది వెలయుత్రోవలును గలుగు. 99

వ. అది యట్లుండె రంభానలకూబరు లవ్విధంబున సల్లాపం బొనరించినయనంతరంబ తద్విమానంబు మత్సమీపంబున కేతేర మీఁదోలికాప్రసంగంబులు వడియె నని కలభాషిణికిం జెప్పె నప్పుడు తద్వనలక్ష్మివిలోకనకౌతుకంబున కేడగాఁ జని యున్నమణికంధరుం బిలిచి యంబుజాక్షునికొలువు వేళఁ దప్పకుండం బోవలయు రమ్మనుచు నచ్చటఁ గదలి చనియెఁ గలభాషిణియు నంతఁ దనుఁ జేర వచ్చినచెచ్చె లులుం దానును నిజగృహంబున కేఁగి వేగంబ కొలువుసింగారంబు సంఘటించు కొని కృష్ణునగరి కరిగె. 100

శా. శ్రీనంద్యాలపురాంక వాగ్విభవలక్ష్మీనాథపర్యంక సు
జ్ఞానశ్రీమిథిలేంద్రసూనృతవచస్సంథావారిశ్చంద్ర వి
ద్యానైపుణ్యసముద్భటార్భటికవిద్వద్వాదవాచాలితా
స్థానీమందిర యిందిరారమణపత్పంకేరుహేందిందిరా. 101

క. అంభోనిధిసాధారణ, గాంభీర్య యరాత్యసుప్రకంపనచయకు
జ్జంభరితరవారిమహా, కుంభీనసపర్య సమరగురుభుజశౌర్యా 102

మాలిని
శేషసుభాషణ శీలవిభూషణ సేవకపోషణ చిత్తరిపూ
న్మేషనివర్తన నిర్మలకీర్తన నిత్యసవర్తన నీతికళా
పోషవిచక్షణ పుణ్యవిధిక్షణ భూసురరక్షణ భూరిమద
ద్వేషణశాసన ధీజలజాసన దీప్తివిభాసన ధీరమతీ 103

గద్య ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్యతనూ భవసౌజన్యగేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బనుమహా కావ్యంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

శ్రీ ర స్తు

# క ళా పూ ర్ణో ద య ము

---

## ద్వి తీ యా శ్వా స ము



ఖండాగ్రిహిమాచల
మేఖలికావిలసదపరిమితహయరింఖా
లేఖితజయలాంఛన నృప
శేఖర నంద్యాలనారసింహునికృష్ణా 1

వ అవధరింపు మవ్విధంబునం గలభాషిణితోడ సంభాషించి యరుగుచు నారదుండు తనమనంబున. 2

చ హృదయము వ్రేఁగొకింత శమియించెను జెల్వపుఁగ్రొవ్వు పెంపునం
బొదలెడురంభకుం సవతిపోరు గణించుట కంకురార్పణం
బిది యిటు గొంత చేసితి నపేక్షిత మంతయు నైనయట్ల యీ
సుదతియ చాలు దానికి నసూయయు నున్నది మాట లారయన్. 3

క ఎంచఁగ నాగమనమునకు, నించుక చు ట్టైన నయ్యె నిది యోగ్యమ సా
ధించుట కెవ్వారిని బో,రించనితఱి మొక్కటియుఁ దరింపఁగ వశమే 4

వ. అని తలపోయుచు శిష్యుండునుం దానును బురప్రవేశమార్గంబున నడుచు చుండె నప్పుడు 5

సీ దవుదవ్వులనె నేఁడు ధరణికి దిగివచ్చుచున్న వాఁ డిదియేమి యొకొ్కో యనియుఁ
గయ్యంబు లిడ నెందు గతిగల్గునో యని వెదకుచు నేతెంచువిధమొ యనియుఁ
బవనేరితములైనపాదపాంసువులనిందఱఁ గృతార్థులఁ జేయుకొఱకొ యనియుఁ
నీమార్గమహిపుణ్య మెట్టిదియో ఫలంబునకు రాకిది రిత్త చనునె యనియుఁ

తే. దను నెఱుఁగువార లతిదూరమునన లేచి
రెండుచేతులు మొగిచి వర్తిల్లుచుండ
నికటమునఁ గన్నవారలు నేలఁ జాఁగి
యాదరమునఁ బ్రణామంబు లాచరింప, 6

చ. అలఘువినీతిసంభ్రమసమాకులతన్ వెసఁ బల్లకీలు నం
దలములు వారువంబులును దంతులు నాదిగఁ గల్గువాహనం
బులు డిగి వచ్చి మ్రొక్కుదొరమూఁకల నెల్లనుఁ ద్రోవ చాల సం
కులముగ నందుఁ గొంద ఱొకకొంత బరాబరిఁ జేసి కొల్చి రాన్ 7

మత్తకోకిల. కొందఱుం గడకంటిచూపులఁ గొందఱున్ నెఱచూడ్కులం
గొందఱుం జిఱునవ్వుడాలునఁ గొందఱుం దగుదీవనం
గొందఱుం జెయి చాఁచి లేమ్మని కొందఱుం గయిదండ గొం
చుం దపోధనుఁ డాదరించెను సొంపుగాఁ బ్రణతాత్ములన్ 8

వ. అవ్విధంబున సకలజనసేవన లాదరించుచు శిష్యుండునుం దాను నమ్మునివరుండు
పరస్పరవిఘట్టనవాచాలవీచీహస్తసమార్జితచర్చరిమచర్చికాచర్చాంకురంబుల
వలనను, సంకులకలహంసచక్రవాకపుష్కరాహ్వయప్రముఖజలపక్షిసందోహ
కోలాహలంబువలనను, అవిరళపరిఢౌకమానడిండీరఖండమండలీపాండిమచ్ఛల
విలసితప్రహసితంబులవలనను, నికటంబునం బొదలుజలధివిలసనంబులం జెలరేఁగి
గేలిసేయుసోయగంబునం బరఁగుపరిఖావలయంబులును, బరిఖావలయసలిలనిధి
సముత్తాలకల్లోలశీకరావకీర్యమాణంబు లగుచుం దమయందు నుభయతమాకృ
ష్యమాణభోగీంద్రభోగవేష్టనప్రకారానుకారపారీణంబు లై రాణించుచుం
దిరుగు మెఱుఁగుఁదీఁగలు ప్రకాశింప వైశాఖపర్వతనితంబడంబరవిడంబనచతు
రంబు లై చూడ నొప్పువైదూర్యప్రాకారంబులును, బ్రాకారవలయవిపులకపిశీర్ష
సముదయసముత్కీర్యమాణమాణిక్యనివహ వివిధకాంతిసంతానసౌమనసమాలి
కాస్తోమాభిరామపర్యంతభాగంబగుచుం బౌరవిభవలక్ష్మికింబట్టినయాతపత్రంబు
రీతి నుద్ద్యోతించుగగనమండలంబునకుం బాండురత్వసంపాదనంబున సొంపొనర్చు
సమున్నతశిఖరసంసక్తనిర్ణిక్తమౌక్తికభక్తివిశేషంబుతోడం బసిండికామచెలువు
నలవరించు వాసుదేవప్రాసాదరాజంబును, వాసుదేవప్రాసాదరాజకైతవద్యోత
మానశాతకుంభకుంభినీధరంబునకుఁ బ్రత్యంతపర్వతభంగి నంగీకరించి యలం
కారంబుగావించువసుదేవసంకర్షణసాత్యకిప్రద్యుమ్నాది యాదవసంఘసౌధ
యూథంబులును, సౌధయూథభూధరవ్రాతజాతమహాతరంగిణీబృందం దేహాంబు
ప్రభవింపం జేయునుభయపార్శ్వభాగహీరమయగృహభిత్తిసంతతతంతన్యమాన
మరీచినిచయపూర్ణ రాజమార్గంబులును, రాజమార్గసజ్జితశైవాలినీశైవలభావ
భాసురంబు లై పొలుపారు గారుత్మతబహిర్వితర్దికానికాయంబును, బహిర్వి
తర్దికానికాయవిరచితకురంగనాభిగోముఖోపరితరంగితరంగవల్లీమతల్లికామనో
జ్ఞమౌక్తికమండలీపాండిత్యంబు లత్యంతకాంతంబు లగుచు నుత్తుంగహర్మ్య

శిఖరకేతుసంఘసంఘర్షణశకలితపతితాంతరిక్షఖండలక్ష్యమాణనక్షత్రసముత్ప్రే క్షాసంధుక్షణవిచక్షణంబు లై వీక్షణపర్వంబు నిర్వహింపం బెంపు మీఱుచుం దదవలంబనలంబమానవివిధాంబుదకదంబకంబుడంబుఁ జూపుకలువడంబులును, గలువడంబులం దవిలినమిళిందంబులచందంబు నందపఱచుచంద్రశాలాఖేలనాలోలనాళీకలోచనాలోచనంబులమరీచివీచికల పెల్లు చిల్లునం జిమ్మనగ్రోవులఁ జిమ్ముగంధసారకస్తూరికానీరధారాప్రసారంబుల తెఱం గెఱింగింప బంగారు రంగుపసలఁ బసుపువసంతంబు లాడుభావంబున తీవి నెఱపుభర్మహర్మ్యశ్రీల ఖేలాసంభ్రమోచ్ఛ్వసితవిశరారుకేశబంధంబులో యనంగ బంధురంబు లగు మంథరగంధవహనివహవిహరణవిసృమరకాలాగురుధూపధూమంబులును, ధూపధూమశ్యామికామిషంబున నిజస్వామికొలువునకు నిబ్బరంపుఁ జే రుబ్బునం బ్రబ్బికొనుచుఁ జేరినశృంగారరససముద్రంబునకు నిర్నిద్రవిద్రుమకుడుంగసంఘసంగత్యసౌభాగ్యంబు ననుగ్రహించుచుఁ బ్రత్యగ్రజాగ్రదగ్రస్థలస్థాపితకురువిందకలశకందళచ్ఛవిచ్ఛటాజటాలితంబు లగుగోపురంబులును, గోపురద్వారతోరణ వ్యాజవిభ్రాజమానమంగళసూత్రసువ్యక్తనిర్వర్తితపరిగ్రహగృహావైభవశ్రీసముపభోగనిస్తంద్రు లగుసకలజనులును నత్యంతచిత్రతరమహత్త్వంబునం బ్రవర్తిల్లునుత్తమోత్తమకీర్తులం బొగడొందు తద్ద్వారకానగరంబు దరియం జొచ్చి రంత 9

సీ. మహనీయకురువిందమాణిక్యకాంతులచేతఁ బల్లవితమ్మై చెలువు మీఱి
మరకతమణిసముత్కరమరీచిచ్ఛటాపత్రసంతతిచేత బాగు మీఱి
నకలంకనవ్యమౌక్తికచాకచక్యప్రసూనసంపదచేత సొంపు మీఱఁ
నింద్రనీలజ్యోతిరిందిందిరశ్రేణివిలసనంబులచేతఁ బొలుపు మీఱఁ
తే. దనసమున్నతిచే నభస్తరువుఁ బ్రోచి
విమలశిఖరాగ్రకనకకుంభములచేత
సఫలితంబుగఁ జేయుచుఁ జాల వెలయు
నంబుజాక్షునికొలువుకూటంబు గాంచె. 10

క. కాంచి మణికంధరునితోఁ, గాంచనగర్భజుఁడు పలికెఁ గలకాలము వీ
క్షించిన నిది నిచ్చలు నొక, యంచితరుచి నెఱపుచున్నయది కనుఁగొంటే. 11

శా. ఆవైకుంఠముఁ జూచినట్లు కడు నింపై యీసభామంటప
శ్రీ విస్ఫూర్తికతంబునన్ మిగుల నాచిత్తంబు నానందము
ద్రావై చిత్రిఁ గరంచుచున్నయది యేతద్ద్వారకాపట్టణం
బీవిశ్వంబునఁ గల్గుమే లిదియ పో యెందున్ వివేకించినన్. 12

వ. అని పల్కుచుఁ జేరం బోవునంత 13

క. ఆఋషియాగమనం బపు, డారసి చని చెప్పి రంబుజాక్షునకు బహి
ద్ద్వారిణు లగుపరిచారిక, లారీతిని జెప్ప నతని యానతికల్మిన్. 14

సీ. బంగారుగొలుసులు పవడంపుఁదర మెనకోళ్లును వింతబాగులబొగడలు
రత్నంపుఁజిలుకలు రాయంచప్రతిమలు పసిఁడిపువ్వులవ్రాతపనులసొబగు
వివిధంబు లగుచిత్రవిరచనలును దసిలీనూలుపట్టియల్లిక బెడంగు
పలుతెఱంగులపట్టుతలగడబిల్లలు మవ్వంపుఁగుంకుమపువ్వుపఱపు

తే గలిగి మెఱుఁగులు దిక్కులఁ గడలుకొనఁగ
మించుదంతపుటుయ్యెలమంచమునను
బొలుపుమీఱుచుఁ దనయంతిపురముసతుల
యూడిగంబులు గైకొంచు నున్న శౌరి. 15

ఉ అప్పలుకుల్ చెవిం బడినయంతన దిగ్గున లేచి యెట్టటూ
యప్పరమేష్ఠినందనుఁడె యానె హజారపుఁద్రోవ వచ్చెనే
యెప్పుడు నంతరిక్షగతి నిచ్చటకే చనుదెంచు నివ్విధం
బిప్పుడు చాలఁ జిత్ర మిది యేమొకొ యంచు ససంభ్రమంబునన్ 16

సీ. తూగుటుయ్యెలఁ దూఁగుచోఁ గొంత చెదరిన యరవిరివన్నెబా గట్లయుండ
నడపంబుతో య్యాలి మడచి యిచ్చినతెలనాకుఁజీలిక చేతియంద యుండ
నట్టెటు తొడిగిన యంఘ్రులరత్నంపుసమ్మాళిగలు సారె జాఱు చుండ
రాణివాసపుఁజామరగ్రాహిణులు కూడ నరుగుదెంచి తమంత మరలు చుండఁ

తే. దనకుఁ గైదండ యొసఁగిన తరుణికేలు
వదల నెఱుఁగమి నది తోన వచ్చుచుండఁ
గనిన వా రెల్ల నొదుగుచుఁ గలఁగుచుండ
మురరిపుఁడు వాకిటహజారమునకు వచ్చె 17

తే. ఇట్లుదుర్కొని ప్రణమిల్లి యింపు పెంపు
దనరఁ గైదండ యొసఁగి తోడ్కొనుచు నేఁగి
యతనియాజ్ఞ వెంబడిని శుద్ధాంతనికట
భాసి యగునొక్కమణిసభాభవనమునను. 18

మ. జగదీశుండు తపోధనాగ్రణికిఁ బూజావ్రతల్ నాఁడ క్రొ
త్తగ నేతెంచినవానికిం బలె మహాతాత్పర్యసంయుక్తుఁడై
తగఁ జేసెం గడుఁ గ్రొత్తక్రొత్తగుచు నత్యంతాదరం బెక్క ధ
ర్మగరిష్ఠాత్ములబుద్ధి పూజ్యు లగువారల్ పల్మఱుం వచ్చినన్ 19

ఉ. అప్పుడు తత్సభాగృహసమాగమనార్థులు కొల్వునేత్కకై
యెప్పటియట్ల యందఱు బహిస్థితు లై యెుఱిఁగించి పంపఁ దా

నప్పరమర్షి వీడ్కొలుపునంతకు రమ్మనఁ గొంకి యచ్యుతుం
డప్పలుకుల్ గణింపక తదంచితగోష్ఠిన యుండె నింపుతోన్ 20

ఉ. మౌనివరేణ్యుఁ డిట్లనియె మా కొకపెద్దతనం బొనర్చి రా
జ్యానుగుణప్రవర్తనల కక్కట యిమ్మెయిఁ గొంకి తేని న
న్నోనళినాక్ష పొమ్మనుట యుక్తము నీ కిపు డట్లు గాక మీ
వానిగఁ జూచితేని కొలువం బిలుపింపుము వారి నావుడున్. 21

మ. చెలులం జుట్టల దండనాథుల విపశ్చిద్వర్యులన్ సత్కవీం
ద్రుల మంత్రీశుల వారముఖ్యుల ముకుందుం డెంతయుం బ్రీతితోఁ
బిలుపించెం బొడగాంచి రవ్విభవశోభిన్ వారలన్ వేత్రహ
స్తులు దమ్మందఱ నప్డు పేరెలుఁగుతోఁ దోడ్తో నెఱింగించుచున్. 22

తే. కమలనాభుండు నపుడు శీఘ్రంబ తనదు
కొలువు వీడ్కొంచు మౌనిఁ దోడ్కొనుచు నేఁగ
నంతిపురమున కాతండు నాత్మశిష్య
వెలుపలన నిల్పి తాఁ దనవీణెఁ గొనియె. 23

ఆ అప్పు డతనిచేతియావీణెఁ దాఁ బుచ్చుకొనియె సంభ్రమమునఁ గూడ నేఁగి
కరము వినయ మొప్పఁ గలభాషిణిముకుందుఁ,డపుడు దానిఁజూచి యల్లనగుచు

క. ఏమీ శిష్యత్వంబున, నీమునివరు సేవ సేయ నిచ్చ వొడమెనో
యోమగువ యనిన విని యది, యేమియు లే దని వినీతి నిటు నటు నొదిగెన్.

ఉ. ఒదుగుటయున్ యదుప్రవరుఁ డో హరిణాక్షి తలంక నేల నీ
కిది కడు లెస్సబుద్ధి కృపనిట్టిమహామహు లాత్మసేవకున్
హృదయమునందు నియ్యకొను టెవ్వరి కున్నది వేయు నేటికిం
బ్రదికితి సేవసేయుము శుభప్రదు నిమ్ముని నిట్ల యెప్పుడున్. 26

ఉ నీమతి పెంపు పాడుకొను నేరుపులున్ మృదుమంజులస్వర
శ్రీమధురత్వముం గనుచుఁ జిత్తములోపల నేను నెంతు ని
క్కోమలి గొంత నారదునకుం బరిచర్య యొనర్చునేని వి
ద్యామహిమం గడున్ వెలయు నంచు నినుం గనుఁగొన్న వేళలన్. 27

మ. అనుచున్ జాంబవతీగృహంబునకుఁ దా నమ్మౌనిలోకాధినా
థునివెంటం జని శిష్యురాలి నొకతెం దోడ్తెచ్చితిం దీనిఁ గై
కొని శిక్షింపు మటంచు నల్ల నగుచున్ గోవిందుఁ డాయింతిఁ బి
ల్చి నయం బొప్పఁగ బల్కె నమ్మగువయుం జిత్తంబు రంజిల్లఁగన్. 28

క. నాకు మును మీరు చెప్పెడి, యాకలభాషిణియె యిది యటంచును వినయో
ద్రేకమునఁ బలికి మునికి వి,వేకిత నుచితోపచారవిధు లొనరించెన్. 29

సీ. అంతట గోవిందుఁ డాయింతిఁ జూచి యోవనజాక్షి యిచటి కిమ్మునివరేణ్యుఁ
డేతేర ద్వారకాని యెన్నియో నాళ్లయ్యె నీ వేమి దిద్దితి వెలుఁగఁ జెప్పుమ
గానచాతురిఁ దాను గడుఁ బ్రౌఢయయ్యెఁ దుంబురుమీఁదిమత్సరంబునను జేసి
మనవిద్య సాధింతు ననిపూనినాఁ డిది యెందు నెవ్వరును మున్నెఱుఁగ కునికి
తే. గావున విశేషములు నీకుఁ గలవి వరుసఁ, దెలిపి నీనేర్చిన ట్లెల్ల దిద్దు మనుచు
నొప్పగించితి నిమ్మహాయోగివర్యు, ననుడు జాంబవతీసతి వినయ మొప్ప 30
క. ఎప్పుడును మీవచస్స్థితిఁ, దప్పకయే నడుపుచున్నదాన నిపుడు నా
తప్పొప్పులు మీ రరయుట, యొప్పుఁగ విన నవధరింపుఁ డోకకొం తనుచున్.31
క. కుందనపుఁగమ్మిఁ దిగిచిన, యందంబున జవరతనము నలగుందేనెల్
చిందినగతి మాధుర్యము, పొందుపడన్ వీణె ముట్టి పోలఁతుక పాడెన్ 32
సీ. ప్రౌఢితో సరిగమపధనిస్వరంబుల ప్రతినియతశ్రుతిక్రమము లెఱిఁగి
రాగభేదములవర్గములఁ దొలంగించి లయతాళశుద్ధి నెంతయుఁ దలిర్ప
గ్రామవిశేషమూర్ఛన లేర్పడఁగ మంద్ర మధ్యమతారసామగ్రి దనరఁ
ధాతుమాతువులు గీతప్రబంధములందు నసమానలీలమై నతిశయిల్లఁ
తే. దొర మగుప్రేమరసమునఁ దోఁచితోఁచి
వీనులకు నింపుఁ జలువయు విస్తరిల్ల
నాకరణిఁ దనకాంత యనేకగతుల
నాత్మగుణగానములు సేయ నచ్యుతుండు. 33
ఆ. ముదిత మేలు మేలు కొదవ లే దెందు నీ
యనఘచరితు దిద్దు మనుచుఁ జనియె
జాంబవతియు నొక్కసంవత్సరముదాఁకఁ
బాట నేర్పె మునికిఁ బాటవమున. 34
ఉ. అంతఁ గ్రమంబునం బ్రియునియాజ్ఞను సత్యయు భోజకన్యయున్
సంతస మొప్ప నప్పరమసంయమి నొక్కొకయేఁడు దిద్ది ర
త్యంతమనోజ్ఞగానపటిమాతిశయోన్నతుఁ గాఁగ నవ్విభుం
డంతటఁ దాను దిద్దె నొకయబ్దము పూర్ణము గాఁగ నాతనిన్ 35
వ. అప్పుడు మణికంధరుండు కలభాషిణికిఁ బోలె నంతఃపురకాంతలవలనిశిక్ష యే
మియు లేకుండియుఁ బుండరీకాక్షునియనుగ్రహవిశేషంబున సకలరహస్యసంగీత
విద్యాసంపన్నతచేత నారదకలభాషిణులయట్ల యత్యధికుం డయ్యె 36
క. అమ్మువురకు గానము హరి, యిమ్మెయి నఖిలంబు నేర్ప యిఁక మీసంగీ
తమ్మునకు నీడు లేదు జగమ్ముల నని పలికి మోదగరిమం దేల్చెన్ 37
ఆ అంతిపురము లోని కరిగినప్పుడు తదీయాంగనలును దత్ప్రసంగ మైన
మానితోడ నీడు గానవిద్యకు సరి, లే దటంచుఁ బలికి రాదరమున 38

క. మణికంధరుఁడును గలభాషిణియుఁ గొలిచి రాఁగ నాఋషిప్రవరశిఖా
మణి యొక్కనాఁడు యదుభూషణు వీడ్కొని వేడ్క నవనిసంచారమునన్.
ఆ. చనుచు నుండి తనదుసంగీతచాతురీగరిమపసకు మున్ను సరసిజాక్షు
చెలువ లాత్మ మెచ్చి సలిపినయట్టి ప్రశంసచందములప్రసంగ మైన. 40

వ. వారితో ని ట్లనియె నవ్విధంబున నవ్వరవర్ణినులు ముప్పురుం బెక్కుమాఱులు మదీయసంగీతచాతుర్యంబురీతు లతినూతనంబు లనియు నీతెఱంగు లెవ్వరికి దొరక వనియుఁ బలుకుట గల దది నిజహృదయంబునఁ గలవిధంబో నాదుమదికి ముదం బొనరించుకొఱకునో యెఱుంగ రాదు చదురు లెదిరిమదికి నెట్టిపగిది నైన సమ్మదం బొదవించుట పరమధర్మం బని తలంతురు గావున నట్టికథలు గట్టిగ నమ్మరాదు తమచెలులతోడ నేతత్ప్రసంగంబున నేమి పలికి రది నిజంబు తదవబోధంబు గలుగునందాఁక డెందంబు సందియంబు నొందుట తప్పదనుటయు నప్పరమతపోధనునకుం గలభాషిణి యి ట్లనియె. 41

క. మీవెంట రాకపోకలు, గావింపఁగ నగరిలోనఁ గలజనములు న
న్నోవాచంయమ యెఱుఁగుదు, రా వనితలకడకు నాకు నరుగఁగ వచ్చున్. 42
తే. ఇట్లరిగి వారుసఖులతో నిష్టగోష్ఠి, నాడుకొనుమాటలను వినఁ గూడు నైన
నేను మీదాన నగుట మీగానకథలు, వడిన నవ్వేళఁ గొదవలు దడవరేమొ
సీ. నాకపేక్షిత మైననాతిరూపు ధరింప సామర్థ్య మబ్బిన నామగువల
సఖులరూపముఁ దాల్చి సముచితం బగువేళఁజని వారిహృదయంబు గనఁగవచ్చు
నన నిది నెపముగాను నిధీశసుతుని దా రంభ యై కూడుట రమణికోర్కి
యదియ మదీయకార్యానుకూలము కదా యని యాత్మ నెఱి యాయతివఁజూచి
తే. యువిద నీ కిట్టి సామర్థ్య మొదవుటకును, వర మొసంగితి నేను నీవలసినట్టి
యంగనలరూపుఁ దాల్చి యాయబ్జనాభువనితలతలంపుఁ దెలిసిరమ్మనుచుఁ బనిచె

సీ. పనిచిన నాచెల్వ వనజదళాక్షునిసతులపాలికిని దత్సఖులరూపు
ధరియించి వార లొద్దను లేనివేళలఁ జని ప్రసంగము దెచ్చి సంయమీంద్రు
సంగీతచాతుర్యభంగు లనన్యసాధారణం బగుట తద్వాక్యసరణి
చేత నెంతయు సునిశ్చితముగాఁ దెలిసి యమ్మునికది యెఱింగించి ముదితుఁ జేసె
తే. సంయమియు నాయకం జూచి జాంబవతియు
సత్యభామయు భోజాత్మజయును హరియు
గురువులుగఁ గానకళ లెల్ల గరిడిమున్పఁ
దనముతో నేర్చితివి గద యనుచుఁ బలికి. 45
తే. కొమ్మ మున్ను నీ వాత్మలోఁ గోరినట్టి, కాంతు రంభామనోహరాకారుఁడగుచు
మెఱయువానిని గూడి రమింపఁగలవు, నమ్ము పొ మ్మింక నీభవనమున కనియె.

వ. అని యవ్వనిత ననిపి మణికంధరుండుం దాను సముచితభాషణంబులు గొంత
తడవు నడపి నారదుండు నిజేచ్ఛం జనియె మణికంధరుండును దదాదేశంబునఁ
దీర్ఘయాత్ర కేఁగె నటమున్ను కలభాషిణియు నట్లు నారదుచేత ననిపించుకొని
నిజగృహంబునకుం జని గానాభ్యాసం బుడుగుటం జేసి నగరిరాకపోకలతగు
లంబు చాలమిఁ గ్రమంబున దనచిత్తంబు నలకూబరచింతాయత్తం బగుచుం
డం దత్సమీపగమనంబున కుపాయంబు గానక బహుకాలంబు గడపి కాల
యాపనంబు దుష్కరం బగుటయు నొక్కనాఁడు దా నొక్కతియ వీణెఁగొని
గృహారామంబున కరిగి యుండునంత. 47

చ. లలితపుభూతిపూఁతయును లాతపుఁగోలయుఁ గక్షపాలయున్
మలకొనుచిన్న కెంజడలు మందులపొత్తము నాగబెత్తమున్
లలిఁ గనుపట్టుకిన్నెరయు లాహిరిమోదము సింగినాదముం
జెలువలరంగ నొప్పునొకసిద్ధుఁడు సింగపువారువంబుతోన్. 48

తే. అభ్రపదవి నేతెంచి యయ్యబల యున్న
తోఁటలోనికి డిగియె నద్భుతము గాఁగ
నదియుఁ దన్మహిమకు వెఱఁ గందుమనము
నల్ల మూల్కొల్పి యర్ఘ్యపాద్యాదు లొసఁగె. 49

తే. అతఁడు నో కలభాషిణి యాత్మగురుని, గృష్ణుఁ గొలువఁగ నేగుదే గీతవిద్య
పూర్ణముగ నేర్చితే రాకపోక లిపుడు, మానినాఁడు గదా దివ్యమానివరుఁడు

క. దానం జేసియ నీకును, మానస మితరప్రచింత మాని తిరముగా
నానలకూబరునంద య,ధీనం బై నిలిచి యున్నదియె తరలాక్షీ. 51

చ. కడపటినాఁడు నిన్ను నిటు కాంచనగర్భతనూజుఁ డంపుచోఁ
గడమయభీష్టసిద్ధియును గాఁ దగుదీవన యిచ్చె గావునం
బడతి యమోఘ మాయనఘుపల్కు చలింపఁగనీకు తాల్మి నీ
బడలుటఁ జూడ నోపుదురె ప్రాణసఖుల్ క్షణమాత్ర మేనియున్. 52

సీ. తడవులనుండియుఁ దపము సేయఁగఁ బూని మణికంధరుఁడు పాట మాని యునికి
నుపవాసఖేదంబు నపనయింపఁగ లేక వ్రేఁగుచున్నవి నాదువీను లిపుడు
వీణె వాయింపు మోవెలఁది నేఁ డైనఁ దుష్టిగ విని పారణ సేయుఁ గాని
యీభువనముల మీయిరువుర గానంబ కాని యన్యము లింపు గావు నాకు

తే. నని పలుక మాటమాటకు నద్భుతంబు, చాలఁ బ్రబలంగ వినివిని యాలతాంగి
కరసరోజముల్ ముకుళించి కరము వినయ, మతిశయిల్లఁగ నిట్లను నతనితోడ

క. ఓయనఘ దేవుఁడవో యో,గాయతకపిలాదిసిద్ధులందు నొకఁడవో
నీయనుభావం బద్భుత, మై యున్నది నామ మెద్ది యానతి యీవే. 54

క. అని పలుక మణిస్తంభుం, డనుసిద్ధుఁడ నేను జలరుహానన నీ వెం

చినవారలలో నెవ్వాఁడను గా నని యతఁడు వల్కుటయు వినయమునన్.

ఉ. ఓమహిమాత్మ మీవచన మొక్కొకచో పరికించి చూచినన్
నామదిలోన నెంతయు ఘనం బగుచున్నది యద్భుతంబు మీ
రేమహిమన్ యథార్థముగ నిట్టిది సర్వముఁ గంటి రిట్టిమీ
కేమహిఁ గానరానియది యేమియు లేదు గణించి చూడఁగన్. 56

తే. నాకుఁ దారార్కాణ యయినయంతయును దిరుగ
నడుగఁ జెప్పంగ వలవ దో యనఘచరిత
యిప్పుడు మణికంధరుని మీరు తపము సేయ
[1]జెప్పితిర యది మొదలుగాఁ జెప్పవలయు 57

వ. అనుటయు నతం డాయింతిం జూచి యోకాంత నాకు దూరదృష్టిదూరశ్రవణంబులు గలవు దానం జేసి యే నున్నచోటున యుండి సమస్తంబునుం గంటి నిందు నీయొఱంగినయర్థం బెల్ల సరి దాఁకును గదా! యింక నీ వనిపించుకొని పోయినవెనుకటినారదమణికంధరసంభాషణప్రకారంబు తపఃపర్యంతం బైన మణికంధరవర్తనంబును వివరించెద వినుము ని యిట్లని చెప్పం దొడంగె నట్లు నారదుండు గానశిక్షాపరిపూర్తి యైనవెనుక నిన్ను నీగృహంబున కనిపి యంత మణికంధరుం జూచి. 58

క. నీసంగీతవిశేషాభ్యాసము సఫలముగ విష్ణుఁ బరమేశ్వరు న
త్యాసక్తితోడఁ బాడుచు, వేసరక భజింపు మెల్లవేళలయందున్ 59

క. ఆదేవున కెంతయుఁ బ్రియ, మై దురితవినాశహేతు వగు నిది యని యే
నాదరమున నామోహా, పాదిన్ వీణియ ధరించి పాడుదు నెపుడున్. 60

సీ. బృహతీసమాఖ్యతోఁ బెంపుమీ తెడువీణె వహియించియెపుడు విశ్వావసుండు
జగతిఁ గళావతీసంజ్ఞ నొప్పెడివీణె తోడ నేప్రొద్దును దుంబురుండు
మహతీసమాహ్వయమహనీయ మీవీణె మానక నిత్యంబుఁ బూని యేను
గచ్ఛపి యనుపేరఁ గరము శోభిలువీణె సవరించి జగదంబ శారదయును

తే. బాయ కెంతయుఁ బాటించుభంగు లరయ
విద్యలం దెల్ల సంగీతవిద్య మిగుల
నుత్తమము గాదె యిది పురుషోత్తమునకు
నర్పితం బగునేని నే మని నుతింతు. 61

ఉ. నీదుకృతార్థతామహిమ నెమ్మది నెన్నఁగ నంత యింత నా
రాదు తపంబులం గనఁగరానిజగత్పతి కృష్ణుఁ డెట్టిభా
గ్యోదయశాలికిన్ దొరకు నుల్లమునం బరికించి చూడు మా
శ్రీదయితుండు నీకుఁ గృప చేసె గురుం డయి గానసత్కళల్. 62

క. కావున నీవిద్య సదా, యావర్తింపుము కుమార యది సకలాభీ

1 జెప్పితిరి మొదలొక్కని యది చెప్పవలయు.

ష్టావాప్తికిఁ గారణ మిం, పావహిలం జేయు నప్పు డటు మనమునకున్ 63

శా. ఏనుం వేగమ యేఁగి నాపడినపా ట్లీడేర నాకంబులోఁ
గానీ కాంచనగర్భుకొల్వునడుమం గానీ పురద్విట్సభం
గానీ తొల్లిటివిష్ణుదేవుకడనే కానీ మదీయోల్లస
ద్గానప్రౌఢిని వాదు పూని గెలుతుం గర్వోన్నతుం దుంబురున్. 64

వ. అనిన నాపలుకు లాకర్ణించి మణికంధరుం డమ్మునీంద్రునకు ముకుళితకరకమలుం డగుచు నిట్లనియె మీకు గానవిద్యచేతఁదుంబురుని గెల్చుసంభ్రమంబిప్పటిమాటలవలన నెఱుంగంబడియె నతనియందిట్టిబద్ధమత్సరం బేల పుట్టెఁ దజ్జయంబున కేమిపాట్లం బడితిరి నాకు నింతయు నెఱింగింపవలయు ననుటయు నతం డిట్లనియె.

శా. వైకుంఠంబున నొక్కనాఁ డతులితైశ్వర్యుండు విష్ణుండు నా
ళీకప్రోద్భవముఖ్యదేవగణముల్ సేవింప యోగీశ్వరా
నీకంబుల్ నిగమాంతసూక్తులను వర్ణింపంగ నొడ్డోలగం
బై కూర్చుండె మహాసభం సదవనవ్యాపారపారీణుఁడై 66

శా. కౌండిన్యాత్రిమరీచిదక్షకపిలాగస్త్యాక్షపాదాంగిర
శ్శాండిల్యక్రతుకణ్వకుత్సభృగువిశ్వామిత్రమైత్రేయమా
ర్కండేయాసురివామదేవకపిదుర్వాసోబకవ్యాఘ్రపా
న్మాండవ్యాదిమహామునుల్ చనిరి ప్రేమ ల్మీఱఁ దత్సేవకున్ 67

వ. ఇవ్విధంబున దేవమునిసంఘంబులు వచ్చి సేవింప విష్వక్సేనుండు వేత్రహస్తుండగుచు నందఱి నెడ గలుగ జడియుచు బరాబరి యొనరింప దివ్యవారాంగనానాట్యంబు లవలోకించుచు నద్దేవదేవుండు పేరోలగమ్మున నున్నసమయంబున.

ఉ. వారిదపంక్తిలో వెడలి వచ్చుమెఱుంగులపిండు నా సఖీ
వారముతో రమారమణి వచ్చెను హెగ్గడికత్తె లెందఱేఁ
గోరి భజింప నాకొలువుకూటముముందఱివంక నొప్పుసిం
గారపుఁదోఁటనుండి యధికం బగువైభవ మింపు మీఱఁగన్ 69

ఉ. నెచ్చెలిపిండుఁ దానును వనీస్థలిదండ నొకింత గానఁగా
వచ్చెనొ రాదొ యాకమలవాసిని యంతనె యేమి చెప్పుదుం
హెచ్చినసంభ్రమంబున ననేకులు బద్ధలవార లెక్కుడం
వచ్చిరయొ మోఁది రాకొలువువారు గకాపికలై చనం వడిన్ 70

క. అప్పుడు మముబోంట్లకతల్, చెప్పఁగ నేమిటికిఁ దారసిలి వేత్రధరుం
రొప్పఁగ జనియెం నిలువక, యప్పర మేష్ఠియును నచటఁ గతిదూరమునన్. 71

క. ఆతఱిని వేత్రహస్తు లొ, హా తుంబురుఁడా యటంచు నుచ్చైస్స్వర ము
ద్ద్యోతింపఁ బిల్చి క్రమ్మఱ, నాతనిఁ దోడ్కొనుచుఁ బోయి రతివేగమునన్. 72

వ. అట్లు దోడ్కొని పోవుచుండ. 73

చ. కని తమలోనఁ దా రితనిఁ గ్రమ్మఱఁగాఁ బిలుపించె నేమొకో
యనియెడువారు గానవిధులందుఁ బ్రసంగము లేమి గల్గెనో
యనియెడువారు తచ్చతురు లన్యులు లేరె యితండ కాని యిం
దనియెడువారు నై మనములందును సందియ మొంది రందఱున్ 74

ఉ. అప్పుడు నేను నామనమునం దితనిం బిలుపించు టెట్టొకో
యిప్పు డటంచు నిల్చి యరయింప వినంబడియెఁ నిజంబుగా
సప్పురుషోత్తముండు దనయంగనతో వినుచున్నవాఁడు సొం
పొప్పఁ దదీయగాన మని యొద్దఁ జరించెడివారు చెప్పఁగన్ 75

క. మమ్మెల్లఁ దోలి యొక్కని, నిమ్మెయిఁ బిలుపించి హరియు నిందిరయుఁ గడుఁ
సమ్మదమునఁ దుంబురుగా, నమ్మును వినుచునికి విని మనం బెఱియఁగన్. 76

సీ. అనిపెనా యే మిచ్చె ననుచును సంభ్రమంబున సందడించుచు మూఁగువారు
సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు వినుట యడుగ నేల యనెడువారు
కడు ననుగ్రహము నెక్కడ లేనియీయాగిపసయ తెల్పెదు నంచుఁ బలుకువారు
నీ వొక్కఁడవొ మఱి యేవార లైన నయ్యెడ నుండిరో యని యడుగువారు

ఆ. నగుచు సురలు మునులు నరుదంద మేపూఁత, డంబుతోడ వచ్చెఁ దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు, పదకమును సునేత్రపటముఁ దాల్చి. 77

క. ధగధగ యనుపదకంబున, నిగనిగ యనుక్రొమ్మెఱుంగునేత్రపటమునన్
భుగభుగ యనుమేపూఁత, న్భగభగ యనిపించె నతఁడు నాహృదయంబున్. 78

సీ. తనుఁ గ్రమ్మఱంగఁ బిల్చినవేళయందు నాతో విచారింపక పోవు టెట్లు
పోయెఁ బో ననుఁ బిల్వఁ జేయక తా నొక నెఱజాణ యై విద్య నెఱపు టెట్లు
నెఱపెఁ బో ప్రభువు మన్నించినాఁ డని మీఁదు పరికింప కీసొమ్ము పట్టు టెట్లు
పట్టెఁబో దొంగఁ దేల్గుట్టినట్టివి డాఁచి కొంచుఁ బోవక మెఱయించు టెట్టు

తే. లేఁడు తగవరి యెందును మూడి చొచ్చి
వాఁత వెళ్లెడువాఁడె యెవ్వాఁడు నంచుఁ
బాపి తుంబురుఁడా యంచుఁ బండ్లు గొఱుకు
కొంచు లోలోన నుడికితిఁ గొంతతడవు. 79

క. నాకంటెఁ దాను ఘనుఁడే, యాకోలఁదియు బయలు సేయునంతకు నేయే
పోకలఁ బోయినఁ బో ని, వ్వాకరణిం జుణిగి పోవనిత్తునె వీనిన్. 80

వ. అని యాగ్రహించునతనితోడ నెందేనియు వాదు వెట్టుకొని భంగపఱచి యతు
లితం బైనమదీయసంగీతచాతుర్యంబువార్తలు క్రమంబున నిజ్జగన్నాయకునకు
వినంబడునట్టియుపాయంబు వెట్టెదం గాక యని యూహించి తదనంతరంబ. 81

చ. తలఁగక యిప్పు డిట్లు సముదగ్రతఁ జేర్చినయీర్ష్య బుద్ధిలో
పలన యడంచి మైత్రి గనుపట్టఁగ నింతనఁ గొంత రాకపో

కలు ఘటియించి యే నతనిగానములో గుణదోషవర్తనల్
దెలియుట నీతి యాతెలివి లేకగునే బయ మంచు నెంచితిన్. 82

ఆ. ఎంచి యతనియింటికేఁగితి నొక్కనాఁ, డతఁడు నపుడ పాట కాయితముగ
వీణె మేళగించి వెలుపలిమోసల, నునిచి లోని కరిగి యున్నవాఁడు. 83

ఉ. ఏనును దుంబురుం డెచటి కేఁగె గృహంబున నున్నవాఁడె యం
చానికటంబునన్ మెలఁగునట్టిజనంబులఁ బల్కి వీణె యి
చ్చోనిడి లోని కేఁగె నను సుద్ది వినంబడ నీవిఁకంచి యీ
వ్వానిదొ యంచు నుండి తమి వానిదె చూతమటంచు నల్లనన్. 84

తే. పుచ్చుకొని పలికించి యపూర్వమైన,శ్రుతుల పెంపునిర్ఘోషత నతుల మగుచుఁ
గడు వెఱఁ గొనర్ప దాని నక్కడన పెట్టి;మిగులలజ్జించి వచ్చితిమగుడియపుడు.

వ. ఆసమయంబున నంతర్గతంబున. 86

మ. కడుఁ బ్రావీణ్యధురీణుఁ డీతఁ డయినన్ గాంధర్వసంపూర్తి నె
ల్లెడఁ బ్రఖ్యాతి వహించునాకు నకటా యీతుంబురుం డంతయె
క్కుడుగాఁగానము నేఁటిదాఁక నని సంక్షోభించుచున్ దాడిద
న్నెడువానిం దలఁ దన్నువాఁడు గలఁ డన్వేషింప నం చెంచితిన్. 87

చ. అటమును చెల్మి పెంపు దనరారఁగ నేనును దాను నప్పట
ప్పటికిని గూడి పాడుదుము పద్మభవాదులయొద్ద నప్పు డె
చ్చటఁ దన కింతగానకళసంపదకల్మి యెఱుంగనీఁడ ము
చ్చటపడి యిట్లు విష్ణుఁడు ప్రసన్నతఁ దాఁ బిలిపించునంతకున్. 88

క. తమవిద్య నెవ్వ రేమా,త్రముఁ గనఁ జాలుదురు వారిదండను దన్మా
త్రమ ప్రకటింతురు బుధు లు,త్తములమహిమ నీరుకోలఁది తామరసుమ్మీ. 89

క. ఇటు గాక వినుజనంబుల, పటిమకు నెక్కుడుగ విద్య పచరించుట య
క్కట విఫలము గాదే యొ,చ్చటఁ జెవిటికిఁ బట్టునట్టిసంకునుబోలెన్. 90

వ. అది యట్లుండె నేను నది మొదలు గాఁగ నెక్కడెక్కడ నక్కజపుగానవిద్య గలవారు గలరు వారి నరసి యరసి తద్విద్య సాధించుచు నెందునుం దుంబురునకు నీడు గాఁ జాలమి యెడనెడం బరికించుచుం బెద్దకాలంబు ప్రవర్తిల్లి యీమనోరథంబు సర్వజ్ఞుండైనపుండరీకాక్షునియనుగ్రహంబునన కాని ఫలియింప నేర దని నిశ్చయించి తద్దేవునిం గూర్చి చిరకాలంబు తపం బొనర్చితి నంత. 91

సీ. అంజనాచలగర్వభంజనాచలలీల నీలవర్ణపుమేనిడాలు దనరఁ
బుండరీకముల నుద్దండరీతుల గెల్చి చెన్నొందునిడువాలుఁగన్ను లమర
మకరకుండలరుచిప్రకరకుంఠితము లై దినకరప్రభలు వెన్వెనుక కొదుఁగ
నురమురత్నమునందుఁ గరము రంజిలునీడ తోడునీడగ లక్ష్మి క్రీడ లాడ

తే. శంఖచక్రాదిపరికరసహితుఁ డగుచు
మఘవముఖదేవతాసేవ్యమానుఁ డగుచు
బతగరాజాధిరోహణోద్భాసి యగుచుఁ
గృప దలిర్పంగఁ గాన్పించెఁ గేశవుండు. 92

ఆ. కానిపించి యేమి గానవలయును వరం, బడుగు మనిన నేను నాత్మశక్తి
కొలఁది నతులు నుతులు సలిపి తుంబురు గాన, కలనవలన గెలువవలయునంటి.

చ. అనుటయు నన్నుఁ జూచి కృప నచ్యుతుఁ డిట్లను నేను ద్వాపరం
బున వసుదేవనామునకుఁ బుత్త్రుఁడ నై యుదయింతు శిష్టపా
లనమును దుష్టశిక్షను నిలాస్థలిఁ బ్రోవఁగ నప్డు ద్వారకా
ఖ్యనగరియందు నీ కభిమతార్థ మొనర్చెద రమ్ము నాఁటికిన్. 94

క. అనియంతర్ధానము నొం, దినఁ జిరకాలంబు నేఁ బ్రతీక్షించుచు నం
తను వాసుదేవుకడ ని,ట్లనుపమసంగీతకౌశలాఢ్యుఁడ నైతిన్. 95

క. ఏ నిన్ని పాట్లఁ బడి యీ, గానమహిమఁ గంటి నీవుఁ గలభాషిణియున్
మేను చెమర్పక యుండం, బూనితి రిది యప్రయాసమున హరికరుణన్. 96

క. అనుడు మిముఁ గొలుచుపుణ్యం,బున కిది యరుదయ్య ఘనతపోధన తన్నుం
దినవారు తనంత లనన్, వినరే లోకోక్తి మీరు విశ్వంభరలోన్. 97

మ. అది యట్లుండె నొకప్డు తుంబురుని దా నారీతిఁ బిల్పించి యిం
పు దలిర్పన్ హరిపాట వింటిమిగులం బూజ్యంబుగాఁ జెప్పి తే
కొదయున్ లేక సదా నివాసముగ వైకుంఠంబులో నుండి యా
సదయున్ విష్ణునిఁ గొల్వఁ గల్గెడుమహాసౌభాగ్య మెట్లబ్బునో 98

క. అనుటయు నమ్మాటకు నె, మ్మన మలరఁగ నతనిఁ జూచి మణికంధర య
త్యనఘుఁడవు మేలు మేలీ, యనుపమసద్బుద్ధి యేరి కైనను గలదే. 99

క. వినరేయెవ్వరు పాపం, బనఁ బుణ్యం బన నిషేధ మన విధి యనఁ గీ
డన మే లనఁ బరలోకం, బనఁ దలఁపఁగ లేరు గాక యాత్మహితంబున్. 100

చ. అలయక వేదశాస్త్రసతతాభ్యసనవ్యసనప్రసంగతిం
దెలివి యొకింతఁ గాంచినగతిన్ నుతి కెక్కియు "వెట్టి దీరె రో
కలి దలఁ జుట్టు" మన్నక్రియఁ గా నొకకొందఱు దల్తు రప్పటిం
గలుషపథప్రవర్తనమె కర్మపువాసన నన్యుఁ గొల్వఁగన్. 101

సీ. వినుము గంధర్వనందన భూతములయందుఁ బ్రాణులుత్తమములు ప్రాణులందు
బుద్ధిజీవులు మేలు బుద్ధిజీవులయందు మనుజులు శ్రేష్ఠులు మనుజులందు
బ్రాహ్మణు లధికులు బ్రాహ్మణులందు విద్వాంసులు ఘనులు విద్వాంసులందు
విదితార్థకృతిలోలహృదయులు ముఖ్యులు విదితార్థకృతిలోలహృదయులందుఁ

తే. గర్త లెంతయుఁ బూజ్యులు కర్తలందు
బ్రహ్మవిదు లెక్కుడామీఁదఁ బరమ మొకటి
గలుగ దనుచును మున్న తాఁ బలికె మనువు
ధర్మశాస్త్రప్రసంగవర్తనలవేళ. 102

ఉ. నీవిధ మారయం బరిగణించినయప్పటితారతమ్యపుం
ద్రోవ కరంబు దూరముగఁ ద్రొక్కినవాఁడవు నిక్కువంబు ల
క్ష్మీవరనిత్యసన్నిధివిశేషమహత్త్వ మెఱింగినంతనే
యావిభవంబు గాంచుటకు నాస యొనర్చితి గాన నిమ్మెయిన్. 103

క. కావున నీవడిగినయ, ద్దేవునియనవరతసన్నిధిమహత్త్వవిశే
షావాప్తికిఁ బెద్దలచే, నేవినినయుపాయ మిప్పు డెఱిఁగింతుఁ దగన్ 104

క. అధికారి కానివానికి, నధికపదవిఁ దెలుపఁ బ్రాప్త మయ్యెడుపాపం
బధికారి యైనవానికి, నధికపదవిఁ దెలుపకున్న నగు నిక్కముగన్ 105

వ. అని యిట్లని చెప్పె 106

సీ. తనశక్తికొలఁది సత్కర్మముల్ ఫలవాంఛ మాని కృష్ణార్పణమతి సలుపుట
ప్రతిషిద్ధకర్మంబు పరిహరించుట విష్ణుభక్తిపైఁ గ్రమమునఁ బాదుకొనుట
తద్భక్తిగలపుణ్యాత్ములసంసర్గంబు దుర్జను లున్నట్టిత్రోవఁ జనమి
విష్ణుసన్నిధికళావిఖ్యాతవివిధదివ్యక్షేత్రతీర్థయాత్రాచరణము

తే. బ్రహ్మచర్యంబుఁదపమువైరాగ్యగుణము, వలయువైకుంఠమునుగోరువారికెల్ల
వీనిలోఁ బలఁగొన్ని గావింపఁగనిన, వృథఁ జనవు చేర్పుఁ గ్రమమున విష్ణుపదము.

వ. అని చెప్పి నీవు నిజశక్తికొలఁది నిందుఁ బ్రవర్తిల్లుము కృష్ణానుగ్రహంబునం గలిగినయీయనన్యసాధారణసంగీతచాతుర్యంబు వృథ సేయక శ్రీపురుషోత్తమ శ్రీరంగాదిదివ్యక్షేత్రములందు ముకుందసన్నిధిం దద్దివ్యగుణనామసంకీర్తనగానంబు గావింపు మది సకలశ్రేయోనిదానం బని పలికె తత్ప్రసంగవచనంబున

ఉ. అక్కజ మైనభక్తిదనరార నతం డనయంబుఁ గృష్ణునిం
దక్కక యాత్మఁ జూచి ప్రమదంబునఁ బొంగుచుఁ జెంగలించుచుం
జొక్కుచు మ్రొక్కుచుం బొగడుచుం బలికించుచుఁ గన్ను మోడ్చుచుం
మిక్కిలి చోద్య మందుచును మెచ్చుచుఁ బాడుచు నాట్యమాడుచున్ 109

క. కేవలము నతిప్రేమరసావేశవశంవదాత్ముఁ డై తద్గుణముల్
భావించుచు నొకరీతిం, ద్రోవఁ గనుచు నేఁగె నారదుండు నిజేచ్ఛన్ 110

వ మణికంధరుండును దచ్చరితంబులకు నతివిస్మయప్రమోదహృదయుం డగుచు నితం డింతధన్యతామహిమంబున నొప్పు నే యని కొనియాడుచుం దనదృష్టిమార్గంబు గడచునందాఁక వీక్షించి యొట్టకేలకు నాలోకనంబులం ద్రిప్పుకొనియె నివ్విధంబున గురుం డరిగిన నతండు తదుక్తప్రకారంబునఁ బుణ్యకర్మం

బులు గడపుచుఁ గ్రమంబున విష్ణుభక్తిహృదయంబునం బొదలఁ దీర్థయా
గావించె నందు.

మ. యమునం జూచెను వీచికాచయమునం బ్రాంచద్ఘనశ్యామతో
యమునన్ సారసకైరవోచ్చయమునన్ సారావభృంగినికా
యమునం జక్రమరాళసంచయమునన్ వ్యాఘోషితాఘువ్యపా
యమునన్ సంతతపుణ్యనిశ్చయమునన్ హర్షప్రకర్షంబుగన్.

శా. నిధ్యానోత్సవకారణంబు లగుచు న్మించెం గర్రం బౌనదీ
మధ్యే తీరవనద్విజప్రకరసమ్యగ్వర్తితారణ్యక
స్వాధ్యాయాధ్యయనస్వరాభినయలీలాందోళనభ్రూలతా
బుధ్యాపాదనసైపుణీవిలసితాంభోవీచిచాంచల్యముల్.

చ. ఇరుగడలందు మించినయహీశ్వరశయ్య తెఱంగుఁ దాల్చి క్రొ
న్నురువులపంక్తి రాజిలఁగ నూతనపీతపటంబుకైవడిం
దరళసరోజరేణుసముదాయముసొం పెసఁగంగఁ జూడ్కి కా
తరణితనూజ యొప్పె శయితం బగువిష్ణునిమూర్తి యో యనన్.

క. ఆవైణికుండు తత్తీర్థావళిఁ దగువిధు లొనర్చి యాయాచోట్లన్
శ్రీవరుగుణములు వీణా, ప్రావీణ్యము పొలుపు మీఱఁ బాడుచు నంతన్ ।

వ. మధుర సేవించి యంతట హరిద్వారంబును సాలగ్రామపర్వతంబును బదరికా
మంబును నైమిశారణ్యంబును గురుక్షేత్రంబును బ్రయాగయుఁ గాశిఁ
నయోధ్యయు గంగాసాగరసంగమంబును స్నానదానాదివిధు లనూనంబు
నడపుచు దర్శించి యంత నుదధితీరంబున నీలాచలసన్నిధికి నేతెంచి.

క ఇది సాక్షాద్వైకుంఠం, బిది నానామునితపస్సమృద్ధివిపాకం
బిది పరమం బిది శరణం, బిది పుట్టినయిల్లు సిరుల కెల్లఁ దలంపన్.

తే. అని నుతించి యింద్రద్యుమ్న మనుసరసిని,రోహిణీకుండమున సమారూఢభ
దీర్థమాడుచు నాతఁ డాత్మీయగాన,నైపుణి వెలార్చుచును జగన్నాథుఁ గొల్

సీ. ఇత్తెఱంగునఁ బురుషోత్తమశ్రీజగన్నాథునిసంసేవనమునఁ దనరి
శ్రీకూర్మవిభునియంఘ్రిసరోరుహంబులు గనుఁదమ్ములకు విందుగా నొనర్చి
సింహాచలాధీశసేవావిశేషలీలలను జన్మంబు నలంకరించి
శ్రీమదహోబలస్వామిపాదనఖోదు జాలసంఘము ఫాలశశికి నొసఁగి

తే. వేంకటేశ్వరచరణారవిందగంధ, నందదిందిందిరశ్రేణిసైల్యమునను
నిజశిఖాకాంతికిని బుష్టి నిర్వహింపఁ, జనియె నాదరమేదురస్వాంతుఁ డగు

మ. కమనీయోజ్జ్వలశీలశాలి యగునాగంధర్వుఁ డంతన్ ఘన
ప్రమదప్రేమవిశేషసంభృతపరీరంభక్రియాసంభ్రమ

భ్రమకారాభిముఖప్రసారలహరీబాహాసమూహాసమా
నమనోజ్ఞం బగుస్వామిపుష్కరిణికిన్ వచ్చెం గడున్ వేడుకన్. 120.

తే అంత హరిసంతతాశ్రితస్వాంత మైన,స్వామిపుష్కరిణియును నాశౌరిభక్తు
తనువు నన్యోన్యపావనత్వము భజించె, మిగుల మజ్జనసమయసమ్మేళనమున 121

వ. అంత నిత్యనియమములు సమస్తమును నొనర్చి యాచెంతఁ జెలువు మీఱుచున్న
క్షితివరాహమూర్తి శ్రీకాంతుఁ గొలిచి భక్తివినయకౌతుకప్రమోదసంక్రాంతి
శబలతావిశేషకలితచిత్తవృత్తి యై 122

సీ మణిమయప్రాకారమంటపగోపురోదీర్ణకాంతులచేతఁ దేజమునకుఁ
జారునదీహస్తచామరవీజనవ్యాపారములచేత వాయువునకు
నారాధనార్థయాతాయాతజనవిభూషణరజోవృష్టిచే ధారుణికిని
హృద్యచతుర్విధవాద్యస్వనోదయోగప్రవర్తనముచే గగనమునకు
తే నిజనవాగరుధూపజనీరవాహ,జననసంబంధమహిమచే సలిలమునకుఁ
బావనత్వంబు గలుగంగఁ బరఁగువేంక,టేశునగరు దాఁ జేరి యింపెసక మెసఁగ

క. మునుపు తనివార దేవత,లను దగ సేవించి నిర్మలప్రేమభరం
బున మేను గగుర్పొడువఁగ, ననఘుఁ డతఁడు లోని కరిగి యగ్రమునందున్.
[యును

సీ. మృదుపదాంబుజములు మెఱుఁగుటందెలు పైఁడిదుప్పటియును మొలముప్పిడి
మణిమేఖలయు బొడ్డుమానికంబును వైజయంతియు నురమున నలరుసిరియు
వరదహస్తము కటి వర్తిలు కేలు శంఖము చక్రమును దాల్చుకరయుగంబు
తారహారంబులు చారుకంఠంబు నిద్దపుఁజెక్కులును నవ్వు దళుకుపసలు
తే మకరకుండలములును దామరలఁ దెగడు,కన్నులుమనోజ్ఞనాసయుఁ గలికిబొమలు
ముత్తియపునామమును రత్నముకుటవరము,నెసఁగఁగనుపట్టు శ్రీవేంకటేశుఁ జూచె

శా ప్రత్యంగంబును మిక్కిలిం దడవుగా భావించి భావించి యా
దైత్యారాతితనూవిలాసము సమస్తంబున్ విలోకించెఁ దా
నత్యంతంబును వేడ్కఁ బొంగుచు నితాంతాశ్చర్యముం బొందుచుం
గృత్యం బేమియుఁ గొంతప్రొద్దెఱుఁగ కక్షీణప్రమోదంబుతోన్. 126

వ. పదంపడి నిజానుభవం బిట్లని యుగ్గడింపం దొడంగి. 127

సీ. పదపద్మములఁ జిక్కి పాయదు నాదృష్టి కనకాంబరమున కేకరణిఁ దెత్తుఁ
గనకాంబరమునఁ గీల్కొనినఁ జలింప దే నుదరబంధమున నెట్లొనరఁ గూర్తు
నుదరబంధమున నింపొంది భేదిల్లదు శ్రీవత్సమున కెట్లు చేరఁ దిగుతు
శ్రీవత్సమునఁ దారసిలిన రానేరదు కేలుఁదామరల కేక్రియ మరల్తుఁ
తే. గేలుఁదామరలను గలశ్రీల మోవి, మకరకుండలముల గండమండలముల

నాసఁ గనుఁగవబొమల గుంతలములందు,నెందుఁ బర్విన విడఁజాల దేమి చెప్ప.

వ. అని పరమానందంబున నితరప్రపంచంబు సర్వంబును మఱచి కొంతతడవు నిరీ
క్షించి తదనంతరంబ దండప్రణామంబు లనేకంబులు గావించి విపంచీసమంచిత
మృదుమధురనినదంబును గంఠస్వరంబును నేకం బగుచు లోకుల నస్తోకసమ్మదా
శ్చర్యసంభృతస్తంభభావులఁ గావింప నద్దేవునిదివ్యమంగళగుణగానంబు లొన
రించి నిర్విఘ్నంబున మూఁ డహోరాత్రములు సేవించి వేంకటనగంబు డిగ్గి చని
చని ముందట 129

సీ. ఏపట్టణము ముక్తిహేతుసప్తపురాంతరభిగణనాతివిఖ్యాతశాలి
ఏపట్టణము ఖేలదేకామ్రవిభుశిరస్సింధుమత్సరిసరశ్శ్రీవిభాసి
ఏపట్టణము సముదీర్ణకామాక్షీతపఃపరిపాకసంపద్విధాయి
ఏపట్టణము సరిద్రూపవాగ్దేవతాసంశ్రయాంచితసమస్తద్విజాలి
తే. బ్రహ్మయజ్ఞవపాహోమపరిమళసహ, జాతసాక్షాత్పరబ్రహ్మసన్నిధాన
భాగ్యసౌభాగ్యయోగ్య మేపట్టణంబు, పుణ్యతర మైనయా కాంచిపురముఁ గనియె

తే. కని మనంబున మోదంబు గడలుకొనఁగ
నందు నేకామ్రనాథుఁ గామాక్షిఁ దక్కుఁ
గలుగువేల్పుల నర్చించి కరిగిరీంద్ర
మునకుఁ జని యుక్తగతి నెక్కి పోవ నెదుట 131

సీ. తనశంఖరుచికి నాతనిమందస్మితోదయంబు ప్రత్యుత్థాన మాచరింపఁ
దనచక్రమునకు నాతనిదివ్యతేజంబు గురుభావమున నెదుర్కోలు సేయఁ
దనకృపాలక్ష్మి కాతనిభక్తినెనరు పెంపెసఁగఁ గౌఁగిటఁ జేర్చి యొత్తుకొనఁగ
దనకౌస్తుభమున కాతనిశుద్ధచిత్తవికాశము మైత్రి నెఱపుచు సరస మాడ
తే. వరదరాజదేవుఁడు భక్తవత్సలుండు
మిగులఁ గనుపట్టె నతఁడు నజ్జగదధీశుఁ
గని పులకితాంగుఁ డగుచును వినుతిఁ జేసి
పాడుచు భజించె నెంతయు భక్తిమీఱ. 132

శా. ఆకాంచీనగరంబు వెల్వడి సముద్యత్పూగపున్నాగరం
భాకంకేళిరసాలసాలసుమనఃపాళీజధూళీమధూ
ళీకేళీవరగంధవాహపృథుకాళీచంక్రమాలంకృత
క్ష్మాకప్రాంగణచోళమండలమహాగ్రామంబు వీక్షించుచున్. 133

చ. చెఱకును రాజనంబు వరిచేలును దట్టపుఁబోఁకమ్రాఁకులుం
దఱచగుపూవుఁదోఁటలును దమ్మికొలంకులు నేటికాల్వలుం
బఱపగునారికేళవనపంక్తులు మామిడితోఁపులుం గడుం
మెఱయుచు నాత్మకుం ముదము మెచ్చును నచ్చెరువుం ఘటింపఁగన్ 134

శా. ఆవీణాధరుఁ డేఁగి కన్గొనియెఁ బుణ్యఖ్యాతదర్పోల్లస
ద్దైవద్వీపవతీసమత్సరవివాదప్రౌఢిమానర్గళ
వ్యావల్గత్కరభావభృల్లహరికావర్తావృతవ్యోమమున్
గావేరీతటినీలలామము నఘౌఘతూళనోద్దామమున్. 135

ఆ. కని తదీయ మైనయనితరసదృశపావనతరప్రభావఘనత దనకుఁ
గరము మెచ్చొనర్పఁ బరమనిరూఢి నాదరముతోడిభక్తిగరిమఁ దనరి 136

క. పావనగుణానుభావము, భావన గావింప నెట్టిపరమనదులు నీ
కావేరికి సదృశంబులు, గావేరికి నైనఁ బొగడఁగా వెర వగునే. 137

లయగ్రాహి. ఈనదిప్రవాహయుగళీనిభవిభాసితభుజానియతరంగసదనూనపరిరంభం
బీనది భజన్నిఖిలమానవమనఃకలుషతానిరసనాతిపటుతానుతజలౌఘం
బీనది నమస్తతటినీనికరదుష్కరతరానుపమచిద్విభవదానమహనీయం
బీనది పవిత్రతర మీనది శుభైకనిధి యీనది విముక్తికి నిదానము గణింపన్.

ఉత్సాహ. అమితరంగధామలక్ష్మి నరయఁ బృషతమణినికా
యములఁ బూజ సేయఁ దాల్చినట్టినేత్రభుజసహ
స్రములు గాని జలరుహములు జలరుహములు గావు భం
గములు భంగములును గావు గణన సేయ నీనదిన్. 139

మానిని. బంగరుచేలయుఁ బద్మనిభాక్షులు బాహుచతుష్కము భవ్యవిభో
త్సంగితశంఖసుదర్శనశార్ఙ్గగదాముఖచిహ్నము తత్త్వము నీ
లాంగము నీనది యార సృజించు నిజాశ్రితదేహికి నంతికస
ద్రంగశయానుఁ దిరంబుగఁ జూచి కరం బిదివో చతురత్వ మనన్. 140

వ. అని ప్రశంసించుచున్న యచటిజనులవాగ్జన్మసాఫల్యంబునకు నుల్లసిల్లుచు నర
విందకుముదకల్హారతల్లజసముల్లసిత గంధసంబంధబంధురగంధవహకిశోరవారం
బులు దూరంబునన యెదుర్కొని చక్రచక్రాంగబకక్రౌంచసారసారావంబులు
సారస్యవికస్వరస్వాగతభాషణంబులవేషంబు నుపచరింప నుత్కంపమానకల్లోల
జాలంబులు సమాలింగనలీలాలోలబాహుకాండపాండిత్యంబు లత్యంతంబు
ప్రకటింపఁ దటస్థలస్థాపితస్థూలడిండీరఖండమండలవిలాసంబులు రజతాసనసమ
ర్పణప్రకారంబు నేర్పరింప నింపు మీఱుచు నిష్టబంధుసందోహంబులలాగున
నాగంతుజనసంతతులు సంతసంబున నుపశ్లోకింపఁ బెంపు మీఱుచున్న యాకావేరి
యందు నుచితవిధులు దీర్చి యందు మిక్కుటం బగు పెక్కువ నుక్కుమిగులు
జక్కవలచక్కఁదనంబును వెక్కిరించు నిరుత్తరీయవర్తులోత్తుంగ రంగత్కుచ
యుగంబుల సరససరసంబు లాడం జేరిన తెలుంగునం గానుపింపఁ జంకల నిడిన
కనత్కనకకలశంబులతోడఁ బొలుపారుచు నీరాటరేవున శీవి నెఱపుద్రావిడ

యువతీవితతులయతులచతురిమపరిమళితలలితవచనరచనలగుచులు గొనవలసి
తెలిసియుఁ దెరు వడుగు తెరువరులం గుఱుడుకొని పురంబు ప్రవేశించి వేదాధ్య
యనశబ్దంబులతోడియుద్ధులై యుద్దిఁ బెంచుషడ్దర్శనవ్యాఖ్యానఘోషంబుల
చేతఁ బూతాతిథిశ్రోత్రంబు లగుబ్రాహ్మణగృహవాటికలు దాఁటికోటానకోటులై
కోటకొమ్మలయందు నవ్యుత్పన్ననిర్వాణంబు లగుమాణిక్యదీపంబులుమార్తాండ
మండలమునకు మాఱుమండుచు ఖండితబహిరంతరతమస్సముచ్చయంబు లగు
హెచ్చు నచ్చెరువున విలోకించుచు శ్రీరంగరాజభజనయాతాయాతవర్తన
నర్తకీమణివిభూషణఘోషణపోషణంబుల నినుమడించి యేపారుపారావతార
వాపారపారంపర్యంబుల బర్యాకులాంకణాంబు లగువిశంకటవిటంకంబుల నలం
కృతంబు లగుగోపురంబులు విలోకించుచుఁ బ్రాకారంబులు సొత్తెంచి యథో
చితక్రమంబున వైనతేయాదుల సేవించుచు రంగసంజ్ఞితం బైనదివ్యధామంబు
డగ్గఱ నేఁగి యందు 141

సీ. ఒసపరిపస మించు పసిఁడిదుప్పటివాని శుభమైనయురముకౌస్తుభమువానిఁ
దెలిదమ్మిరేకులఁ దెగడుకన్నులవానిఁ గమ్మకస్తురితిలకంబువానిఁ
దొలుపల్కుగిల్కుఁబావలఁ జరించెడువానిఁ జలువతావులసెజ్జ నలరువాని
నింద్రనీలపుడాలు నేలువర్ణమువాని సిరిమరుల్గొలుపుమై చెలువువాని
తే. మకరకుండలదీప్తిడంబరమువాని
డంబు నెఱపెడుమణికిరీటంబువాని
రంగనాయకుఁ గాంచి సాష్టాంగనతులు
సలిపి తన్మూర్తి యంతయుఁ గలయఁ జూచి. 142

చ. తమి యమరంగ నొక్కొకటిఁ దక్కఁగ నేలెడు నౌర మద్విలో
కముల మణీకిరీటమును గస్తురినామము నవ్వుమోము హా
రములును వైజయంతియు నురఃస్థలరత్నము శంఖచక్రము
ఖ్యములును బొడ్డుఁదామరయుఁ గంకణకాంచిపదాంగదాదులున్ 143

సీ. దివ్యసంయమిమనస్థితిఁ బొల్చుమత్కులదైవంబుపదములఁ దలఁపుఁ జేర్తు
నఖిలలోకస్రష్ట యగుబ్రహ్మఁ గన్నమత్ప్రాణబంధువునాభి నాత్మఁ జేర్తు
దైతేయకంఠనిర్దళనంబు లైననాస్వామిహస్తముల భావంబుఁ జేర్తు
లక్ష్మిచన్గవకు నలంకార మైననాతండ్రివక్షమునఁ జిత్తంబుఁ జేర్తు
తే. నుల్లమునకును జూడ్కికి వెల్లిగొలుపు
నావరదుమోమునందు మనంబుఁ జేర్తు
ననుచు గీతరూపములుగా నాశుకవిత
నుతుల రచియించి పాడుచు నతఁడు గొలిచె. 144

వ. అంత నా గంధర్వుం డచ్చటు వాసి యొక్కించుక తూర్పుగాఁ జని చని. 145

చ. అలరుచుఁ గాంచె ముందట సహస్రమతినిర్మథనప్రవీణముల్
విలసితసౌధవజ్రరుచినిర్జరనిర్ఝరిణీప్రవాహసం
వలనమిళత్ప్రమత్తఝషవారమతిప్రదచంద్రశాలికా
లలితవతీవిలోలదృగలంక్రియమాణముఁ గుంభకోణమున్. 146

వ. అందుఁ గందళదమందసందీప్తవాహసంతమాళితదిగంతరాళసంతమసజంబాలంబు లగుగోపురప్రాకారంబుల దీపించుమాణిక్యమయమందిరంబునందు. 147

సీ నునుగాడ్పుదూది నించినయట్టచల్లనిపానుప్పై లీలఁ బవ్వళించి
పటువులై హొంబట్టుబటువులోయనవొప్పరమచన్ను దోయిఁబాదములుచేర్చి
చెలువు దీపింపంగ శిరముక్రిందట నొక్క కేలు దలాడగాఁ గీలుకొలిపి
బంగారువలువున రంగారుకటిమీఁదఁ జక్కఁగా నొక్కహస్తంబు చాఁచి
తే యన్యకరయుగ్మమునఁ బాంచజన్యమును సు
దర్శనంబును దాల్చి సుదర్శనమున
నచటిజనములచూడ్కి ధన్యముగఁ జేయు
శార్ఙ్గపాణిని గొల్చె నుత్సవ మెలర్ప 148

వ మఱియు నందుఁ గుంభేశ్వరుని సేవించి దర్భశయనంబున కరిగి యందు రామభద్రు నిర్నిద్రభక్తితాత్పర్యంబుల సేవించుచు వీణావాదనానువాదమేదురగానకౌశలంబుతోడ నిట్లని సుత్తించె. 149

తురగవల్గనరగడ ——
దశరథావనీశవిమలతరతపఃఫలావతార
నిశితశరలఘుప్రయోగనిహతతాటకావిహార
కపటపటుసుబాహుదళనఘటితగాధిసూనుయాగ
అపరిమేయగౌతమాంగనాఘదమనపదపరాగ
కోమలేక్షుదళనసదృశఘోరశంభుచాపభంగ
భూమిజావివాహవిభవపూర్ణసమ్మదాంతరంగ
పరశురామగర్వపవనపానపీనబాహునాగ
గురువచోనుపాలనాతికుతుకవిధుతరాజ్యభోగ
పాదభజనవితరణాతిఫలితగుహాసమస్తపుణ్య
పాదుకాప్రదానవిహితభరతసౌహృదానుగుణ్య
ఘనవిరాధమదవినాశకలితబహువిపన్నిరాస
వినుతపదనివేశపూతవివిధమానికులనివాస
తతనిశాచరీవిరూపతాకృతప్రియావినోద
అతులబలఖరాదిదనుజహననజనితవిబుధమోద
హరిణరూపధారిదారుణాసురాసుహరణబాణ

పరమఘోరబాహాబలకబంధమర్దనప్రవీణ
అమలశబరికాఫలోపహారరుచిఘనాభిముఖ్య
సమదవాలిదర్పదమనసఫలితార్కతనయసఖ్య
శరణవరణపరపరానుజప్రదీపితప్రసాద
అరుణితాక్షికోణవిరచితాంబురాశిగర్వసాద
పర్వతౌఘరచితసేతుబంధసుతరసింధుకాండ
గర్వపంక్తికంఠకంఠఖండనప్రచండకాండ
సకలదివిజనుతచరిత్ర జానకీమనోజ్ఞగాత్ర
సకరుణాతరంగనేత్ర సాధుభవలతాలవిత్ర
యతిజపార్హపుణ్యనామ యతివితీర్ణభక్తకామ
సతతసితయశోభిరామ సర్వలోకపూర్ణధామ
అహితవిదళనాతిరౌద్ర యార్తపాలనావినిద్ర
మహితనిఖిలగుణసముద్ర మమ్ముఁ బ్రోవు రామభద్ర. 150

క. పరమం బగునీనామము, కర మామ్నాయములు తారకబ్రహ్మముగా
నిరతిగ వినుతింపఁగ నా, తరమే నిను నభినుతింప దశరథరామా 151

వ. అని వర్ణించి యచటఁ గదలి సేతుబంధంబునకుం జని యందు రామేశ్వరు
బహుభక్తివిశేషంబుల నారాధించి యనంతశయనంబున కరిగి యందుఁ బద్మనా
భునిం గొలుచుచు నతనిసన్నిధిం గొన్నినాళ్లు దనదుగాంధర్వవిద్య హృద్యంబు
గా నెఱపె నేను గానప్రియత్వంబునం జేసి చెవి యొగ్గి తత్తత్ప్రదేశంబుల
నతండు పాడెడుపాటలు వినుచు దృష్టియుం బాఱ విడిచి యిది యంతయుం
గనుంగొంటి నివ్విధంబున ననంతపద్మనాభునిసన్నిధినుండి యతం డంత 152

క. ఆపడమటిదిశ దళకళి,కాపుష్పఫలాదిగరిమకతన సమీప
శ్రీపకలాపమణీపట,లీపటిమస్పర్థ వర్థిలెడువనవాటిన్ 153

క. హరిఁ గూర్చి తప మొనర్పఁగ, దొరకొనియెను దానఁ జేసి తోయజముఖ యా
సరసునిగానకళామా,ధురి యేమియు ననుభవింప దొరకదు నాకున్. 154

క. అని యాదిక్కునకు విలో,కనములు నిగుడించి యదె నిగాఢపుఁబద్మా
సనమునఁ గూర్చున్నాఁడో,వనిత యిపుడు దృఢసమాధివర్తన మీఱన్. 155

చ. అనుటయు నాలతాంగి కడు నద్భుత మింతయు నోమహాత్మ మీ
కనుఁగవ కిప్పు డెమ్మెయిఁ బ్రకాశితఁ దత్సకలప్రవర్తనల్
గనఁబడుచున్న వే యనినఁ గంజముఖీ యనుమాన మున్నసి
ప్డనుపుము దవ్వుగాఁ జెలుల నచ్చటితత్క్రియ లెల్లఁ జెప్పెదన్ 256

సీ. అనుడు మహాత్మ మి న్నంత నే నొఱయంగ నర్హ నే మీపల్కులందుఁ గలదె
యనుమాన మనుటయు నైననిం దేమి దప్పిదియు వినోదమో యింతి యనుచు

బలిమి నాయకచేతఁ జెలుల నిద్దఱిఁ గడు దవ్వుగా నంపించి తత్క్రియలును
దద్వాక్యములు చెప్పి తార్కాణ చేసి యోయజ్ఞాక్షి యిది యెట్టు లట్టు లతని
తే. తీర్థయాత్రయుఁ దపమును దేటపఱుప, నొదవినపుడుగదా మదికొదవ వీడు
దూరతాతారతమ్యవిచార ముండు, నేమొ లేవోకో తెరు విడియేకుపటుప.

చ. అన విని యట్టివేళ నికటావనిజంబున నున్న చిల్కయో
యనఘచరిత్ర! నీపలుకునం దొకచోట నసత్యశంక గ
ల్గునె మును చెప్పినట్టికతలుం దలపోయ యథార్థముల్ మనం
బున సరిదాఁకె నా కనినఁ బుల్గుఁ గనుంగొని యద్భుతంబుతోన్. 158

క. కలభాషిణి యిట్లను నీ, తలఁపున కెట్లు సరిదాఁకెఁ దథ్యము చెపు మో
చిలుక! మును పెచట నుండుదు, తలపోయఁగ నీవు చతురతరమతివి గడున్.

సీ. అనుడు నాపక్షి యిట్లనియె నోపూఁబోఁడి నానివాసంబు నందనవనంబు
వనజాక్షుఁ డిచటికి మును పారిజాతంబు దెచ్చుచోఁ దత్పక్షు లిచ్చ గలిగి
మరలి పాఱుచు నుండ మద్భాగ్య యవ్వేళఁ బ్రసవార్తయై యున్కిఁ బఱవలేక
యొక్తైన నయ్యో నే నిచటన యుండెద నని యొక్కతొఱ్ఱలో నడఁగి యుండె
తే. వెనుకఁ దోడ్కొనిపోవ నాకనువుపడదు, పిల్ల ఱేఁకలు వచ్చి వర్ధిల్లుదాఁక
నంత బలుమాఱువచ్చి రమ్మనుచుమిగుల, నెత్తులిడియెడునన్ను నాయింతిచూచి

క. ఈభవ్యోద్యానంబుల, సౌభాగ్యముగతిని మానసమునకుఁ గడు నిం
పై భాసిల్లుదు నందన, వైభవమం దెట్లు ప్రేమ వదలవొ నీకున్ 161

తే. అనుడు నీ వనినట్ల యౌ నైన మనకుఁ, గలుగుబంధువు లెల్ల నక్కడనె యునికి
నచటు నెఱయంగ బాయ లే నని యొనర్తు, రాకపోక లివ్వీటికి నాకమునకు

వ. అట్టియే నిప్పు డుప్పరవీది నేఁగుచుండి మణికంధరుం డనుచు మీఱలాడుకొను
మాట చెవిం బడిన నతనిసుద్ధి యిక్కడఁ గలుగుటకు నిమిత్తం బేమి గలిగెనో
తెలిసెద నని నిలిచితి నీసిద్ధుండు నీకుం జెప్పినతీర్థయాత్రాతపశ్చర్యలవృత్తాం
తంబు నిక్కువంబుగాఁ దెలిసినప్రకారంబు వివరించెద వినుము. 163

సీ. శచియును దాను వాసవుఁ డలనందనవనములోనికి నేఁడు వచ్చియుండ
నొకచారుఁ డేతెంచి యోదేవ! నే నున్నవనములోనికిఁ దీర్థవాసి యొక్కఁ
డిటఁ గొన్నినాళ్లక్రిందటవచ్చియచ్చోటఁ దపము సేయఁగఁ బూనెఁ దానికేలఁది
యొఱుఁగునంతకు నేను నిన్నినాళ్లాలసించితి నని నానాఁటి కతుల మైనఁ
తే. జెప్ప వచ్చితి నతఁడు కాశీగయాప్రయాగపురుషోత్తమాహోబలాదు లైన
పుణ్యభూములుబహుతీర్థములును జూచి, నాఁడటవచించె మొదల నేవేఁడుకొనఁగ

ఉ. ఉగ్రతపఃప్రభావవిభవోద్ధతి నుద్భవ మందె నోసుప
ర్వాగ్రణి యిప్పు డాతపసి యాదల నిత్యజలావగాహని

స్థాగ్రహణాభిపాటలజటాపటలస్ఫుటలాలనాభృశ
వ్యగ్రసమగ్రదీప్తినివహప్రవహద్దహనాంకురచ్ఛటల్. 165

క. ఇది మాసాష్టకమున సి, ద్ధిద మిచ్చుఁ గెవ్వ రేఁగుదెంచి తపమునకా
బోదలినఁ జెప్పుము నా కని, త్రిదశేశ్వర నన్ను నంపితిరి తద్వనికిన్. 166

క. అని చెప్పినఁ గలదు కలదు, నిను నట్ల వచించి యుందు నిలిపితి నని యా
యనిమిషవిభుండు చారుని, ననుపుచుఁ బిలుపించె రంభ నచటికి వేగన్ 167

క. పిలుపించి యవ్వధూటికి, నలఘుతరం బైనయట్టి యాతపసితపో
బల మెల్ల దాను జారుని, వలనకా విని నట్ల చెప్పె వాసవుఁ డంతన్ 168

ఉ. ఓలలితాంగి యీతపసి యుగ్రత నింత నితాంతదుర్గమా
భీలతపోధురంధరతఁ జేర్చుట నాసురరాజ్యలక్ష్మిఁ దా
నేలఁగఁ గోరి కావలయు నిప్పుడు దీనికిఁ బ్రత్యుపాయముం
జాలఁగ నెంచి చేయఁ దగు సంశమ మంతయు మాకునట్లుగన్. 169

క. చింత యొనర్పక యిది యొక్కింత యుపేక్షించి యున్న నెట్లగునో గో
రంతాలస్యంబునఁ గొం, డంతప్రయోజనము దప్పు ననఁగా వినమే 170

క. విను మిట్టిపనుల కెంతయు, ననుకూలం బగుసహాయ మచ్చరలిపు డీ
పని కరయ వారిలోనకా, ఘనతరముగ నీకు నేర్పు గల దని తోఁచెన్ 171

సీ. కడునల్లికలుకొనుకలికిబిత్తరపుఁజూపుల క్రొమ్మెఱుంగులు వలలు గాఁగఁ
నెఱియంగఁ బర్వెడు నిద్దంపులేనవ్వు దెలినిగ్గుఁదరఁగలు తెరలు గాఁగఁ
గొమరొందునవవిలాసములకన్బొమ లులి వాడుచోపుడుఁగోల లగుచుఁ దనరఁ
దేనె లుట్టెడుమాటతేటలపసలు వాకట్టుమంత్రంబులకరణి నమర

ఆ. నీవు గడఁగి యమ్మునీంద్రశార్దూలుతపోమహత్త్వదర్పమును హరించి
కీరవాణి యతనిఁ గ్రీడామృగంబుగాఁ, జేయవలయుఁ గుసుమసాయకునకు

వ. అనిన విని యారంభ జంభవైరిం జూచి యమ్మునీంద్రుం డనఁగ నెవ్వాఁ డని
దేవరచిత్తంబున నున్నదియో యతండు నారదశిష్యుం డైన మణికంధరుం డని
మాకు వినంబడియె నతని నిటమున్ను పరికింపుచుండుదుమన్మథాదులవిలాసంబు
లెవ్వియు నెన్నండును సరకుగొని చూచినవాఁడు గాఁడు నేఁడు విశేషించి తప
శ్చర్యాతాత్పర్యంబునం బ్రవర్తిల్లుచున్నవాఁడు గావున నవశ్యంబు దేవకార్యం
బు నిర్వహింతు నని లే ననుటయు నతం డవ్వాలుఁగంటిం జూచి నీకుఁ దొంటి
కంటెన వయోరూపలావణ్యవిలాసంబు లెక్కుడుగ వరం బొసంగితి సందియంబు
వలదు పొమ్ము కార్యసిద్ధి యయ్యెడు నీచాతుర్యంబు నెఱపుము 173

క. అనుపలుకుల నలరించుచు, ననుప మహోత్సాహ మాత్మ ననుపమలీలం
దనర మణీభూషణములు, దనరమణీయాంగకాంతిఁ దద్దయు మెఱయన్. 174

క. నెచ్చెలులు దాను ధరణికి, నచ్చెలువ కృతప్రయాణ యయ్యె నపుడ యా

యచ్ఛరపదువు బెడంగు వి,యచ్ఛరపదవికి మెఱుంగులై కనుపట్టెన్. 175

వ. అని చెప్పి దీనం జేసి యోకొమ్మ యిమ్మహాత్మునివాక్యపద్ధతి యంతయు సత్యంబ యగుట యేర్పడియె నని పలికి యి ట్లనియె. 176

శా. ఏనానందన మంతటం వెడలి యిం దేతెంచితిం మున్నుగా
నోనారీమణి యిప్పు డేఁగెడువిధం బూహించినం ద త్తప
స్థానం బింతకుఁ జేరఁ బోవుదురు తద్రంభాదులుం నావుడుం
దా నాచిల్కవచోవిలాసమున కత్యంతంబు రంజిల్లుచున్. 177

సీ. అఖిలంబునందు నత్యంతంబు వెలసి వ ర్తిల్లెడుశుకసంజ్ఞఁ దేజరిలుచు
నత్యుదాగమాఢ్యవ్యాసనందన భూయోర్జి తానందమునఁ దనరుచు
ఘనపక్షవిలసనంబున హరిత త్త్వంబు దెల్లంబుగాఁ జేసి యుల్లసిలుచు
నరయ నైసర్గికం బైనవిష్ణుపదై కగతికత్వమునఁ జాల నతిశయిలుచు
తే. నున్నయోచిల్క నీమధురో క్తిమహిమ
వీనుల కమృతరసములు వెల్లిగొలుపు
చునికి యుచితంబు మిగుల నీయోగవిభవ
మింత యం తని పొగడ నే నెంతదాన. 178

క. కావున నినుఁ బెడఁబాయఁగ, నోవిహగవరేణ్య కొలఁప దుల్లం బైనం
బోవలయుఁ గదా నీకును, నీవనితం జూడ ననుచు నెలఁతుక యనిపెన్. 179

ఉ. వాసుకిపూర్వజన్మకిటివర్యదిశాగజకచ్ఛపేంద్ర ఖే
లాసుఖస క్తత త్తదబలావ్యాదయాంతరసంతతాదరా
శాసితనిత్యభూభరణశ క్తిలసద్భుజదండకీ ర్తిసం
వాసితపద్మజాండపరివర్ధితభూసురకాంతిభాసురా. 180

క. కృష్ణత్మానాయక శ్రీ,కృష్ణధ్యానామృతాబ్ధిఖేలనలీలా
తృష్ణజ్ఞాననయావహ, ధృష్ణద్బాహాబలావధీరితభీమా. 181

మంగళమహాశ్రీవృత్తము —
శీలితశుభాచరణ శిష్టజనతాశరణ చి త్తవిజయాభరణ యుద్ధా
భీలభుజవిస్ఫురిత భీరుదయనత్వరిత ప్రేమపద సచ్చరితభావా
లోలకరుణాసహిత లోకభరణాదహిత లోభకలనారహిత విద్యా
ఖేలనసముచ్ఛ్వసిత కేవలసుఖోల్లసితకేశవనుతప్రసితధీరా. 182

గద్య. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్యతనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బనుమహాకావ్యంబునందు ద్వితీయాశ్వాసము.

---

శ్రీ ర స్తు.

# క ళా పూ ర్ణో ద య ము

## తృ తీ యా శ్వా స ము.



నిత్యవిహారస్థల
తానుతలీలాకటాక్ష ధర్మవిధానా
నూనాపేక్షవిలాస
శ్రీనవ్యమనోజ నారసింహతనూజా. 1

క. అంతట సిద్ధుం డాసీ,మంతిని నీక్షించి యేను మదిరేక్షణ యీ
చెంతకు వచ్చుట చెవులకు, వింతచెలువు గులుకుపాట వినుటకె సుమ్మీ. 2

క. కావున విపంచిఁ గైకొని, నీ వించుక గానపటిమ నెఱపఁగ వలయున్
నావుడు నట్టుల కా కని, యావిద్యం బ్రౌఢు వుచ్చె నతనికి మిగులన్. 3

వ. ఇవ్విధంబునఁ గలభాషిణి తనగానవిద్యాకౌశలంబున నతని నుబుసుపుచ్చె నంతక
మున్న రంభాదులును మణికంధరునితపోవనంబు డగ్గఱం జని యవనికిఁ డిగ్గి
రప్పుడు. 4

చ. వనదచయంబుతో నలిగి వచ్చుచునున్న మెఱుంగుఁదీఁగెలో
యనఁగఁ దనూలతల్ మెఱయ నవ్విరహాంబున కోర్వలేక వెం
టన చనుదెంచునంబుదగణం బన వేణిభరంబు లింపుగా
ననయము భూజనంబులకు నచ్చెలువల్ గనుపట్టి రంతటన్. 5

చ. కరపదపల్లవద్యుతు లకాలపుసంజ ఘటింపఁ దన్నఖ
స్ఫురణలు తారకానికరముం దలఁపింపఁగ వారిమోముఁదా
మరలబెడం గనేకవిధుమండలవిభ్రమకారులై మహీ
చరులకు నెల్ల నద్భుతము సౌఖ్యము నెంతయుఁ జేసె నయ్యెడన్. 6

క. ఇలమీఁదికి డిగి వేలుపుఁబోలఁతులు మణికంధరునితపోవనమున కిం
పలరఁ జనిరి తమచూడ్కులు, తొలుతగ నీలోత్పలములతోరణ కట్టన్. 7

చ. ప్రసవపరాగముల్ పసుపుఁబయ్యెదచాడ్పున నుద్గమింప ను
ల్లసదళిపుంజముల్ కచకలాపములీలఁ జలించుచుండఁ బ
క్షిసముదయంబు భూషణవిశేషములుం బలె మ్రోయ వారి కిం
పొసఁగ వనాంతలక్ష్మి ప్రియ మొప్ప నెదుర్కొన లేచెనో యనన్. 8

చ. అళులుఁ గచంబులున్ లతలు నంగములుం బువుగుత్తులుం గుచం
బులును జిగుళ్లుఁ బాణులును బుష్పవిలాసము మందహాసముం
గలసి తడంబడన్ విబుధకామిను లావనలక్ష్ము లిందుశో
భలు మిగులం బ్రవర్తిలిరి పాలును నీరునుబోలె నేకమై. 9

సీ. ఆవులు నాకఁ గన్నఅమోడ్చుపులులును బులులచన్ గుడువంగఁ బోవు లేళ్లు
లేళ్లచెర్లాట రంజిల్లెడుహరులును హరులు గోళ్లను గోఁక నలరుకరులు
కరులకటాళివైఖరి నాడుపాములు పాముల లాలించుబభ్రుతతులు
బభ్రుతతులప్రక్కఁ బాయనియెలుకలు నెలుకలఁ బెంచుపిల్లులును గలిగి
తే. యపుడు వెలుఁ గొనరించె నాయంగనలకుఁ, గీరభాషితపోషితశాఖలతపస్వి
పటలతారకబ్రహ్మవిభావనంబు, భావితశుభావనంబు తపోవనంబు. 10

సీ. ప్రత్యక్షమైనట్టిపావనత్వంబు నాఁ బుంజీభవించినపుణ్య మనఁగ
సాక్షాత్కరించినశాంతరసంబు నాఁ గరుడు గట్టినతపోగరిమ యనఁగఁ
గరువునఁ బోసినపరమసత్త్వంబు నా రాశియై యున్నవైరాగ్య మనఁగఁ
గరచరణాదులు గలయోగవిద్య నా బూదె గట్టినతత్త్వబోధ మనఁగ
తే. బరఁగునమ్మౌనిఁ గనిరి తచ్చరణనఖర, చంద్రచంద్రికాముకుళితచారుహస్త
నలినసంఘభృంగాయమాణభ్రమరక,నికర లగుచు నావేలుపునెలఁత లంత 11

క. కని యాతనియసమసమా,ధినిశ్చలత నుగ్రమైనదృష్టి కెదురుగాఁ
జనఁ గొంకుచు భయవశమున, వెనువెనుకకుఁ జని రొకింత వేలుపుఁజెలువల్.

ఉ. అప్పుడు రంభ చాల భయ మందుచు నిమ్మునియుగ్రరూపముం
దప్పక చూడ మేను గరు దాల్చుచున్నది యింద్రుకార్య మే
చొప్పున నౌనొకో యరసి చూడఁగ నేరక యియ్యకొంటి నే
నిప్పని కంచు బుద్ధిఁ బొరయించె దృగంచలచంచలత్వమున్. 13

క. తదనంతరంబ మగుడం, ద్రిదశాధిపకార్యమునకు ధృతి పాదుకొనన్
మది నిలిపి చెలులు దానున్, ముదిత మెలఁగెఁ దత్సమీపమున వనకేళిన్. 14

ఉ. లోఁగక వార లవ్వనములో విహరించి రొకళ్లొకళ్లకై
యేఁగుచుఁ గమ్మపూఁబొదరు లీగుచుఁ దేనియసోనవానలం

దోఁగుచుఁ దూఁగుటుయ్యెలలఁ దూఁగుచు నొక్కతె కోయుగుత్తికిన్
మూఁగుచుఁ గంతువీణె లన మ్రోఁగుచు నొండొరుచేతు లాఁగుచున్. 15

సీ. చిగురాకుఁబోఁడి యీచిగు రాకుపోఁడిమి మఱి లేదె యచటికి మఱలెదేమె
కయ్యంబు వలదు నీకయ్యంబుజాక్షితోఁ గేలికి మఱియుఁ గంకేలి గలదు
లీలాగుళుచ్ఛంబు లీలాగునఁ దలిర్పఁ గలహంసగమనరో కలహమేల
కుందరాజికి నింకఁ గుంద రాజీవాక్షి యేటికిఁ జాలు నీయేఁటి కెల్ల

తే. ననుపలుకు లెంతయును హాళాహళిఁ జెలంగ
రహి వసంతహిందోళాదిరాగకలిత
గానములు మీఱ భూషణక్వణన మమర
నమరకాంతలు విహరించు నవసరమున. 16

ఉ. అంచితలీల రంభ మునియగ్రమునన్ విహరించె నెంతయున్
మించునొయారముల్ గులుకునెన్నడయున్ విడఁ బాఱుకొప్పు నొ
క్కించుక జాఱుపయ్యెదయు నిట్టటుఁ దూలెడుహారముల్ మిటా
రించుకుచంబులున్ జలదరించువలగ్నముఁ బొల్పుమీఱఁగన్. 17

ఉ. దైవనియుక్తిఁ జేసి విరతం బగుచున్నమనస్సమాధితోఁ
బావనమూర్తి యాతపసి భామలయారొదవించు నక్షిప
క్ష్మావళు లంత విచ్చుచుఁ దదంగనఁ గన్గొని దానిరూపు చే
తోవికృతిన్ ఘటింప ధృతితోఁ గను మోడ్చి హరిం దలంచుచున్. 18

ఉ. కొమ్మ బెడంగుసొంపుఁ గనుఁ గొన్నకనుంగవ దత్తరింపఁగా
నమ్ముని యాఁప నోప కపు డల్లన తెప్పలు విచ్చుఁ గ్రమ్మఱన్
గ్రమ్మఱఁ గృష్ణ కృష్ణ యని గ్రక్కున మోడ్చు మగుడ్చుఁ గ్రమ్మఱన్
గ్రమ్మఱ మూయు మన్మథవికారము ధైర్యముఁ గ్రుమ్ములాడఁగన్. 19

ఉ. అంతట భావికార్యఘటనానుగుణంబుగ నీశ్వరేచ్ఛచేఁ
గంతుఁడు మిక్కిలిం బ్రబలి కాంతపయిం బరఁగంగఁ జేసె న
త్యంతము మౌనిమానసము తద్ఘనధైర్యకఠోరశృంఖలా
సంతతి యెంతయుం గుసుమశస్త్రకలం దెగఁ గోసివైచుచున్. 20

తే. దర్పకోగ్రప్రతాపసంతప్తమైన, తాపసునిచిత్త మప్పు డాతలిరుఁబోఁడి
చెలువ మనియెడునమృతంపుఁగొలనిలోన,నోలలాడుచుఁ దిరిగిరాఁజాలదయ్యె.

వ. ఇత్తెఱంగున బద్ధానురాగుం డగుచు మణికంధరుం డాగంధగజయానయాకార
రేఖావిలాసంబు లెంతయుఁ బరికించి. 22

తే. రంభయే యిది కాదో లేఁబ్రాయపుఁజెలు
వంబు నుజ్జ్వలరూపలావణ్యములను

నగు మొగముసొంపు నింత యెన్నఁడును గాన
దీని కీవింతమహిమ సంధిలుట యెట్లు 23

వ. అని యాపల్లవాధరసల్లాపపరిరంభణాదులకు నువ్విళ్లూరుచుఁ దదీయలీలావిహా
రంబు లత్యాదరంబున విలోకించుచుఁ దనమనంబున 24

సీ. చెలువమోమెత్తనాసికఁజూచియోవింతగతులఁబువ్వులు చంపకము సృజించె
వెలఁదికౌఁగిట నది వికసించెఁ దోలుమేనఁ గురవకద్రుమ మెంత పరమమునియొ
గల్లన నందియల్ గదలంగ నది దన్నెఁ గాంత యక్కజ మశోకంబ యగును
నాతి కెంగేల నంటఁగఁ బులకించు చున్నది చూత మెంతపుణ్యంపుఁదరువొ

తే. యెంతజాణయొ ప్రేంకణ మింతిపాట
కలరె నూర్పుఁదావులకు వావిలియుఁబోలె
మగువనగుచూపులఁ దనర్చుమ్రాఁకులార
పురుషతిలకవిఖ్యాతి మీ కరుదు గాదు. 25

క. మగువముఖాసవవాసనఁ, దగ నలరఁగ నేర్చురసికతకు సుకవీంద్రుల్
పొగడం బొగడం బొగడం, బొగడంబుల కలుతరులు పొగులవె లజ్జన్. 26

క. ఈనెలఁతతోడిసంగతిఁ, గాననియపవర్గపదము గలుగుటకంతెౕ
దీనివిహారంబుల నిం, పూనెడువనతరువు లగుట యుత్తమ మరయన్. 27

మ. మునిధర్మంబుల కెల్ల ద వ్వనిజనంబుల్ నవ్వినౕ నవ్వనీ
ఘన మైనట్టితపోధనంబు నెఱయం గాఁ బోయినం బోవనీ
మునుముట్టంగఁ బ్రబోధవాసనలపెంపు ల్మాసినౕ మాయనీ
వనితారత్నముఁ గూడ కెట్లును దమిౕ వారింపలే నియ్యెడన్. 28

క. అని సాహసమున నాతం, డనుమానము లెల్ల విడిచి యచటు గదలి యా
వనజాక్షి వనవిహారం, బొనరించుసమీపమునకు నొయ్యన చనియెన్. 29

తే. చని చకోరాక్షియివ్వనంబునకు నెచట, నుండి వచ్చితి నెచ్చెలిపిండుతోడ
రాకకు నిమిత్త మెయ్యది నాకుఁ జెవుల,పండువుగ వినుపింపు నీపలుకు లనియె.

తే. అనుడు నది దనరాక క్రీడార్థ మనిన, వినుచు నదియెల్లఁ గల్ల యోవెలఁది నాత
పఃఫలంబవు నీ వని పల్కి మౌని, ముదిత మునిమునినగవుతో మోము వంప.

ఉ. చంచలనేత్ర యిట్లు వనసంగతి కొప్పుటఁ గాంచి మౌని దాఁ ద
గొంచకఁ బట్టెఁ బైచెఱఁగుఁ గొమ్మయు మీ రెటువంటిపెద్దవా
రెంచ రొకింతయుం గెలనియింతుల నంచుఁ బెనంగె నాత్మచే
లాంచలముం దదీయ మగుహస్త మురోజము లూఁది పట్టుచున్. 32

ఉ. అయ్యెడ నింత నంతఁ గుసుమాపచయం బొనరించుపువ్వుఁబోం
డ్లొయ్యన దవ్వుగా నరిగి రొండొరుమోములు చూచి యద్దిరా

యయ్యెకు మన్మథాభ్యుదయ మంచుఁ గరంగనివాఁడు గల్గునే
యెయ్యెడ రంభ దాను మెఱయించు బెడంగుల కంచు నవ్వుచున్. 33

చ. బలిమిఁ దపోధనాగ్రణియుఁ బైకొనుకోర్కులఁ దత్తరిల్లుచున్
జెలువను గౌఁగిలించుకొని చెక్కును జెక్కును సంఘటిల్లఁ దో
ట్రిలుచుఁ బదంబు లొక్కటొకటిన్ బెనఁగన్ మెలు పొప్పఁ దార్చె లేఁ
దలిరులజొంపముల్ గలుగుదట్టపుఁబూఁబొదరింటిలోనికిన్. 34

వ. ఇట్లు దార్చి. 35

తే. క్రొవ్వి కలహించుతుమ్మెదకొదమకదుపు, రాయిడిని గడుదళముగా రాలినట్టి
ప్రసవదళములు పఱవనిపఱపు లగుచు, నెసఁగ నిం పొందునాపొదరింటిలోన.

సీ. బెరు కెఱుంగనిగాఢపరిరంభమున నల్లి బిల్లిగొంచుఁ బెనంగు పెనఁకువలను
బెరిఁగెడిపేరాస పేర్మి ననర్గళలీలఁ బర్వెడుకుచాస్ఫాలనముల
నడ్డమాఁకలు లేక యబ్బినయ ట్లెల్ల నమరించునఖరరేఖాంకములను
గొదగొన్నతమిఁ గొంకుగొసరు లే కొనరించు వివిధదంతక్షతవిభ్రమముల

తే. మన్మథావేశవిలసనమహిమ నెఱపు
తపసిఁ గని సాదు రేఁగినఁ దల పొలాన
నిలువ దనుమాట నిజ మయ్యె నేఁ డటంచు
మగువ నవ్వుచుఁ జేతకు మాఱు సేసె. 37

వ. ఆసమయంబున నటమున్న ద్వారకానగరంబునం గలకలభాషిణిగానంబు విను
చున్నసిద్ధుండు తత్ప్రశంసాప్రసంగంబున మణికంధరునిమాటఁ దడవుటయుఁ
దలఁచుకొని యాచంచలాక్షి సిద్ధుని నభివీక్షించి. 38

తే అమరపతిపంపునను వచ్చినట్టిరంభ, కతన నే మయ్యెనో మణికంధరునిత
పం బిపుడు మీర లటు దృష్టి పఱపి చూడుఁ, డనిననొక్కకొంతతడవతఁడట్లచేసె.

క. నగుచు నిఁక నేమితప మో, మగువ సలుపుచున్నవాఁడు మణికంధరుఁ డా
మృగలోచనతో నదె యొక, చిగురుంబొదరింటిలోనఁ జిత్తజలీలల్. 40

వ. అనిన విని కలభాషిణియమ్మణిస్తంభునిబోధమహిమకు వెఱఁగందుచు ననేకప్రకా
రంబులఁ బ్రశంసించి యోమహాత్మ యొకటిరెండుపూఁటలు మాయింట నిలిచి
యేము సేయుపరిచర్యఁ గైకొనవలయు ననిన నతండు గానలోభంబున వచ్చి
టింతియ కాని మఱి వీరువారునుం బలెఁ బట్టణంబుల నెట్టుకొని యిట్టి
నట్టు మహిమ లుపచరించువారము గాము గుహ్యప్రకారంబున నిలుప నోపు దేని
నీయుపచారంబులు గైకొనియెద ననుటయు నట్ల సేయుదు నని తనగృహారా
మంబునందు నిలిపి యతిరహస్యంబుగా నాసిద్ధునకు నిష్టంబు లైనయన్నపానా
దుల మోదం బొనర్చుచు నచ్చట నెవ్వరిం జొనీక తాన పరిచర్య సేయుచు
రెండుమూఁడుదినంబులు హృదయంబు రంజిల్లఁజేసి యంత నంతరంగంబున నల

కూబరసంగమాభిలాషం బతిశయిల్ల నతని ప్రియవనిత యైనరంభ తెలంగ గలుగుటకుఁ గ్రమంబునఁ బ్రసంగంబు దిగిచి సిద్ధునితో ని ట్లనియె. 41

తే. అనఘ మణికంధరుం డట్లు తనదుతపము
విష్ణు మొందించుకొనుటకు వెలఁ పొడ మెడుఁ
దిరుగఁ దప మొనరింపంగ దొరకొనియెనొ
యిపుడు రంభతో నున్నాఁడొ యెఱుఁగవలయు. 42

క. అనుటయు నతఁ డమ్మునిదెశఁ, దనదృష్టి నిగుడ్చి నగుచుఁ దరుణి యిఁకఁ దపం
బనుమాట గలదె యిదె యా, ఘనుఁ డున్నాఁ డిపుడు రంభ కౌఁగిట ననియెన్.

ఆ. అనిన వార లింక నచ్చోటు వాసి పో,యెదరొ యుండు వారొ యెఱుఁగవలయు
మఱియుఁ జూచి చెప్పఁడు మాటికిఁ దదభివీ,క్షణము వెలయ నేఁడు శంక విడిచి.

ఆ. అనుఁడు లేవు నాకు నాశంక లెవ్వియు, నెన్నిమార్లు చూడు మన్నఁ జూతుఁ
బడఁతి కలదె జాతిప్రతిమకుఁ జక్కిలి,గింత నాదుధృతికి గెంటు లేదు. 45

సీ. అని పల్కి మణికంధరునిదిక్కునందు దృష్టి నిగుడ్చి యొక్కింత చెవియు నొగ్గి
యొకకేల మాట లాడక యుండఁ గలభాషిణికి సంజ్ఞ సేయుచు నిశ్చలత్వ
మున నొకించుకసేపు విని యూర వారకామినులమే లిట్టిదె యనుచు నగిన
నదియేమి యెఱిఁగింపుమని యాలతాంగి తన్ననయంబు నడుగ నిట్లనియె నతఁడు

తే. నీకు నే మని చెప్పుదు నీరజాక్షి
యడఁచుకొనియెద ననిన న వ్వాడఁప రాదు
పరమసంయమిఁ దా నట్లు బత్తము చెఱచి
మిగులఁ దుది రంభ చేసినతగవు వినుము. 46

క. కళ లంటి కఱఁచి తనచె,య్యులఁ జొక్కెడుతపసిమది చివుక్కురు మనఁగా
నలకూబర విడు విడు రా, యలసితి నని పల్కె మున్మథాతివివశతన్. 47

మ. అని చెప్పఁగా విని సిద్ధుఁ జూచి నగ నేలా యింతభ వ్యాత్మ యా
వనజాతేక్షణ యేమి సేయును మహావాల్లభ్యసౌభాగ్యవ
ర్తన నర్థేశకుమారుఁ డంతరహిగాఁ ద న్నేలుకోఁబోలు నా
యనఁ దా ని త్తఱి నట్టివల్లభకు దవ్వై యెందు నున్నాఁ డొకో. 48

వ. ఆతనిఁ బరికించి చూడవలయు ననుటయు సిద్ధుండు నవ్వుచు నీ కిదియే కదా ప్రధానప్రయోజనంబు నని పల్కి యిటునటు పరికించి చూచి యతఁ డున్న చోటు గని కలభాషిణికి ని ట్లనియె. 49

ఉ. తా వెనువెంటఁ బాయక సదా చరియించినఁ దద్వినోదమో
దావృతిఁ జిక్కి రంభ తగినట్టితపోహతి సల్పలేదు కో
పావహ మింద్రుబుద్ధి కది య ట్లగుటం బ్రియఁ గూడి యట్టికా
ర్యావసరంబులందుఁ జనఁ డాతఁడు మానఁడు పెన్వరాలిచేన్. 50

క. కావున మణికంధరునిత,పోవనముసమీపభాగమున నొకవనిఁ జూ
తావళిలో నున్నాఁడదె, పూవులను జిగుళ్ల నొప్పుభూజముక్రిందన్. 51

క. తరుణీ యిపు డాతని పైఁ, బరాకుచే నీవు గానపాటవగుణముం
గరము మెఱయింపవే నే, నరిగెద మఱి లేదె యితర మగుపని యిచటన్. 52

తే. అంపితే పోయి వచ్చెద ననుటయుఁ గల,భాషిణి మహాత్మ నిన్ను నాపాలిభాగ్య
దేవతగ నమ్మి యుంటి నాజీవితంబు,నేమిగాఁ జేసి పోయెద వెఱుఁగ జెపుమ 53

చ. అనుటయు నన్ను నిప్పు డనునట్టిది యెయ్యది నాకుఁ జెప్పుమా
వనిత క్రమక్రమంబునను వచ్చినయట్టుల వచ్చెఁ గాక నా
విని భళి లెస్సమాట యిది వేఱొకనాఁ డిఁక మీరు వచ్చియే
ననుఁ గృపఁ గాచుటల్ వినుఁడు నామదిలోపలిచంద మేర్పడన్. 54

క. ఈవేళన యాతనికడ, కేవిధమున నైనఁ జేర్చు టింతియతక్కం
డ్రోవ మఱి లేదు నన్నుం, గావన్ క్షణభంగురములు కాంతలతాల్ముల్ 55

క. తదుపాయము దిద్దుటకున్, మది నెన్నఁ బ్రభావఘనులు మఱి లేరు మహా
భ్యుదయానుభావగుణసం,పదఁ బొదలినమీర తక్కఁ బావనచరితా! 56

చ. అన విని సిద్ధుఁ డిట్లనియె నంబుజలోచన నిన్ను నేఁడ యా
యనకడఁ జేర్చునంతటియుపాయము నేర్చిన నేను దాఁతునే
యనుకొనరాదు గాక నినుఁ బ్రాణవిభుం దగఁ గూర్చి ప్రోచి యా
వెనుకటినీదుపాట విను వేడుక నెట్లగుచున్న వాఁడనో. 57

తే. చింత సేయుము నీవ యనంతశయన
పద్మనాభసమీపభూభాగవర్తి
యైనకోఁబేరి యొక్కెడ యతనిద్వార
కాజనులు నేఁడ చేర్చు టెక్కడ లతాంగి. 58

క. మించుగ మాగురువులు శి,క్షించినయాయొక్కరింతసింగమునకు నూ
హించ నొక నాల్గుగడియల, సంచారము వలయు నతనిసన్నిధిఁ జేరన్. 59

వ. దీని కెంతవలసిననేమి యిది దడవం బని లేదు నిన్ను దీనిపై నునిచికొనిపోయెద నంటినేని యోపూఁబోఁడి తోడిసిద్ధు లిది వేఱొక్కలాగుగా నెంతు రెవ్వరియం తస్సారం బెవ్వ రెఱుంగుదు రదియునుం గాక మీబోంట్లసంస్పర్శమాత్రంబు నస్మదాదులకు సమ్మతింప నుచితంబు గాదు మఱి వేఱొండుసామర్థ్యంబు లేదు నాకుఁ గలదూరదృష్టిదూరశ్రవణశక్తి యుం దేమియు నుపకరింప దింక నీవు చెప్పినప్రకారంబు గావించెదఁ జెప్పు మనుటయు నాసిద్ధునకుఁ గలభాషిణి యిట్లనియె. 60

సీ. ఓసిద్ధపురుష మీ రేసరణిని గొని చన్న నే మగుఁ దక్కుశంక గలదె
నీమహత్త్వము గాననిజడాత్ము లేమన్న నేమి కన్నమహాత్ము లించుకయును

వేతొక్కగతిగ భావింపర మముబోంట్ల సంస్పర్శమాత్రంబు సమ్మతింప
నుచితంబుగా దంటి రుచితంబె మఱి నాదుప్రాణహానికి నోర్చు టరసి చూడఁ
తే బలుపలుకు లేల యింక నా చెలులు గిలులు
నేఁగు దెంచి విఘ్న మొనర్తు రిత మెఱుఁగక
గావునం గొనిపొమ్ము శీఘ్రంబ నీదు
వెనుక నిడుకొని నన్ను మద్విభునికడకు 61
సీ అన నియ్యకొని సిద్ధుఁ డరుదైనపులితోలు పల్లంబుతోడ నిబ్బరపుబిగిని
బొట్టప ట్టైడ గాఁగఁ గట్టినపెనుబాఁప దట్టంబుతోడ వాదపుఁబసిండి
యంకవన్నెలతోడ సంకుపేరులతోడ వశ్యౌషధపుఁదీఁగె వాగెతోడ
నేకపార్శ్వమున భల్లూకచర్మపుటొఱ ఘటియించినట్టిబల్లత్తితోడ
తే వఱలునేనికదిండివార్వమ్ము దొలుతఁ
గాఁగ దా నెక్కి నన్నుఁ దాఁకకయ దీని
కటివిభాగంబు నెక్కి రాఁగలవె యబల
వెనుక మరగొమ్ము నూఁతగాఁ గొనుచు ననియె. 62
క. అన విని యీపాటిగ మీ, యనుగ్రహము గల్గి యుండ నక్కట యిఁక నే
జనుదేక యేమి యని తన, కనుపుగ హరి నతఁడు నిలుప నంగన యెక్కెన్ 63
తే. ఎక్కి సిద్ధేశ యెవ్వరు నెఱుఁగకుండ, నెట్లు గొనిపోయెదో యన నేల శంక
యెందు నెద్దులు బండియు నేకమైనఁ, గొండమీఁదికిఁ బోవుపో కొమ్మ యనుచు
క నింగికి థే యని కదలిం,చెం గడువడి గలుగుతనదుసింగముఁ బలుమా
ఱుం గలభాషిణి దేఱి క,నుంగొని పదిలమ్ము సు మ్మనుచు శీఘ్రగతిన్. 65
ఆ. మగులుగోడమీఁద మ్రాఁకులు చిగురుజొం
పములు వానిమీఁదఁ బ్రచురదోహ
దములధూపములును దనకు మాటుగ గూఢ
గతిని గాంతఁ గొనుచు నతఁడు సనియె. 66
చ చని చని యొక్కచో నతఁడు చాలుగ నక్కజ మందుచుం గనుం
గొనఁ దమమేఘరంజిఁ బొడి గొన్న ఘనావళిలోన నుండి దా
రున నెదురైరి వైభవనిరూఢిఁ జెలంగెడు కొందఱంగనల్
ఘనతరచాతురీమధురగానకళాకలనాకలాప లై. 67
క తమపాటఁ జినుకుచినుకుల, దుమదుమ నాఁ దడిసినట్టిదువ్వలువలతో
ఘుమఘుమ యనుపరిమళబృం,దముతో నప్పు డొకయిం పొనర్చిరి వారల్ 68
వ. అట్లింపొనర్చుచు నెదురైన నతండు వారిని సంభాషణక్రమంబున రంభాసఖు
లగుట యెఱింగి యిది యేమి యనుంగునెచ్చెలి నచ్చట విడచి వచ్చితి రచ్చెలువ
మణికంధరు మీఁది యనుగ్రహంబు వదలక యింకనుం గొన్నినాళ్లు తద్వనం
బున నిలుచునో యనుటయును నగుచు వా రిట్లనిరి. 69

క. ఎక్కడిమణికంధరుఁ డతఁ, డెక్కడఁ బోయెనో యెఱుంగ మిప్పుడు ముదముతో
నక్కొమ్మ పొదలుచున్నది, తక్కక నలకూబరుండుఁ దానును రతులన్. 70

చ. ప్రియునిసమాగమోత్సవము పెంపున నిం పలరారునామృగా
క్షి యిపుడు త[illegible] రతివిశేషముసొంపులఁ జిక్కి యున్కి యా
రయుచుఁ దదిష్టముం విడిచి రమ్మనఁ జాలక యాకె నుంచి యే
మ యరుగుచున్న వార మని మానిను లచ్చటు వాసి పోవుచున్. 71

క. వేళాకోళపుఁదీఁగలుఁ, జెలికలుఁ గళాసములును బీఱజడలు దాఁ
దాలుచు టట్లొకొ మింటను, లీలాహరిఁ దోల నింత నేర్పరి యయ్యెన్. 72

క ఎక్కడ దొరకెనొకో యీ, చొక్కపుగుబ్బెత బెడంగుజోగికి నహహా
యిక్కలికిఁ గుత్తగొనుఁ బో, తక్కక దివి నిమిష మున్న దైవతవిటులన్ 73

క. నలకూబరుండు రంభం, గలయుట విని చిన్నఁబోక కలభాషిణిరీ
తులు దిరిగి చూచి దీనిం, గలఁచెర యివ్వార్త తాపకరమై యనుచున్. 74

ఉ సిద్ధుఁడు నవ్వి యోచెలువ చింతిలఁగా వల దిప్పు డెంతయున్
బుద్ధి దిరంబు గాఁగ ధృతిఁ బూను మొకించుకసేపులోన నే
శుద్ధము గాఁగ నీమనము శోకము సర్వముఁ బుచ్చి వైచెదన్
సిద్ధము నాదుప ల్కనియెఁ జెల్వయు మోము వికాస మందఁగన్ 75

క. ఏరీతి నింతమిక్కిలి, చేరికగా నాడి తనియె సిద్ధుఁడు చూడం
గా గాదె కుడువఁ బోవుచుఁ, గూరలచవు లడుగ నేల కోమలి యనియెన్. 76

క కంఠీరవ మట్టియెడం, గంఠం బెగ నెత్తి చూచి కదలక నిలిచెం
గుంఠితగతి యై యెందు న, కుంఠితగతి యనఁగఁ దొల్లి గుణము నెఱపియున్.

వ అప్పుడు. 78

సీ హుంకారగములతోడ నుచ్చాటనపుబదనికతీఁగతఱటునన్ వ్రేసివ్రేసి
కడుదాక మీఱుంగ మడమలు దాటించుచును ముందటికి లివ చూపి చూపి
మొగము పార్శ్వములకు మగుడింపకుండ వాకట్టుమూలికవాగెఁ బట్టిపట్టి
వడి నూర్ధ్వగతిని లేవకయుండఁ దననాగ బెత్తాన మూర్ధంబు మొత్తిమొత్తి
తే. సిద్ధుఁ డధికప్రయత్నసన్నద్ధుఁ డగుచు, నెంతచేసిన నాసింహ మెదుటి కడుగు
వెట్టదయ్యెను గర్జావిభీషణముగఁ, దోఁకఁ ద్రిప్పుచుఁ గడువెన్కఁ ద్రొక్కుగాని.

ఉ అప్పుడు చాల సంక్షుభిత యై పడ జాతి యిదే మిదే మయా
యిప్పుడు దీనిచంద మనియెం గలభాషిణి మేఁ జెమర్పఁగాఁ
గొప్పు విడంగఁ బాఱఁ జనుగుబ్బలఁ బయ్యెద వాయ సుస్థితిం
దప్పి పిఱుందఁ బల్లటిలఁ దామరగొ మ్మిరుగేలఁ బట్టుచున్. 80

క. తరుణీ వెఱవకు కల్లపు,మరగొ మ్మేమఱకు నాకు మర్యాదావి

స్మరణం బైనది మాటల, పరాకుచే ననుచుఁ దనదుపారీంద్రంబున్. 81

వ. కొన్నియడుగులు దిరుగఁ బట్టి ధరణికి డిగఁ దోలుకొని వచ్చి యచ్చటనచ్చెలువ తోడ నవరోహణంబు సేసి కేసరిని మేఁతకు విడిచి యోపడఁతి యోకలభాషిణి యీముందఱినికటంబునందమృగేంద్రవాహన యనుశక్తి గలదు తన్మందిరంబు ముందఱ నున్నమృగేంద్రంబునకుఁ గ్రిందుమీఁదం జుట్టుపట్టున నెట్టిబెట్టిదంపు సింగంబులుం జన వెఱచు నిది మిఱచి యే నెంత తోలిన మనవాహనం బచటి [1]కట్టెదురు నడదు మన మమ్మహాశక్తికి నభివందనంబు చేసి పోయినం గార్యసిద్ధి యగు రమ్మనుచు నల్లనఁ దనభల్లూకచర్మకోశంబుతోడిఖడ్గంబు పుచ్చికొని సింగపుఁబల్లనముపొక యక్కడన యొక్కమఱుంగున డాఁచి యాచపలలోచనను మృగేంద్రవాహనగుడికిం దోడ్కొని చని తద్బాహ్యమంటపంబున నునిచి యద్దేవిపూజకుఁ బువ్వులు దెచ్చెద నని పూఁదోఁటకరిగె నప్పు డత్తెఱంగు గనుంగొని 82

సీ. పసిమి పో నెండినకసవుబట్టయుఁబోలె నరవెండ్రుకలఁ బర్వుశిరమువలన
నులి గొన్న చెలఁదిపుర్వ్వులనూలివళ్లు నా నమరెడుముడుతకన్బొమలవలనఁ
గడుఁ జిట్టినట్టిబంగరుపూఁత పొక్కిళ్ల వడువుఁ జూపెడుమేనివళులవలనఁ
దునిసి వ్రేలెడుమ్రాకుతునుకల వలపించు బాహువక్షోజలంబనమువలన
తే. ఘూకరవములచాడ్పున ఘోరవృత్తిఁ, దనరుఘునకాసకుహుకుహుధ్వనులవలన
భావజుఁడు వెల్లిపోయినపాడుమేడ, నగిదిఁ గాన్పించుముదుసలిపడఁతియొకతె.

క. కలభాషిణిఁ జేరఁగ వచ్చి లతాంగి యొచటనుండి చేరితి వకటా
కలుషపుబొవురుపిల్లిని, జిలుకయుబలె నిద్దురాత్మ సిద్ధుం డనుచున్. 84

ఉ. ఎంతయు వింతచెల్వమున నివ్వన మెల్ల నలంకరించుచుం
గాంతత నొప్పుమేనిహస గన్నులపండువు సేయునిన్ను న
ల్లంతన చూచి దైవ మకటా దొరకించెనె యిట్టనిర్దయ
స్వాంతునిచేతి కీభువనసారము నంచుఁ గడుం గలంగితిన్ 85

క. ఆకలుషాత్ముఁడు క్రమ్మఱ, రాకమునుపె తొలఁగి పోవ రాదా యొట కే
నోకూన యీమనోజ్ఞత, రాకృతి యేఁ జూడఁ జాల నసిపాల్ గాఁగన్ 86

తే. అమ్మ విను మింక నొకయించుకంతతడవు, నీతెరవుఁ జూడ నీపేరు నీతెఱంగు
నడిగి పరికింపమదియున్నదైన వాఁడు, రాకమునునీవుతొలఁగుటనాకుఁబ్రియము

శా. నీకెం తే నితఁ డాప్తుఁడో జనకుఁడో నెయ్యంపుఁదోఁబుట్టువో
నీకార్యార్థమె పూని తా నెచటికేనిం గొంచుఁ బోచున్నవాఁ
డో కాఁగా దిటువంటిప ల్కనక తోడ్తో నింతబెట్టాడ నే
నో కాంతామణి వెఱ్ఱిగా నితనిచెయ్వుల్ మున్ను వీక్షింపుదున్. 88

వ. అని పల్కుపల్కు లన్నియు విని కలభాషిణి తనమనంబున 89

1 కట్టెదురు నడుచు.

క. ఈయవ్వవాక్యములు దలఁ, పోయఁగ నాయుల్లమునకుఁ బొందుపడినయ
ట్లై యున్నవి యాసిద్ధుఁడు, మాయావియె యొక్కమాట మది నూహింపన్.
తే. ఇంత నొక్కింతసేపున కెల్ల వగపుఁ, బుచ్చివైచెద నని పల్కె నిచ్చటికిని
జేరునప్పుడది యీయిమ్మ చెప్పినట్లు, శక్తి కిడియెదు ననుట నిస్సంశయంబు 91

సీ. ప్రజల కందఱకు నాపదలు వాపెడునట్టి చక్రిపట్టణములో జనన మంది
వారకామిని నయ్యు గౌరవంబున సఖ్యజను లిటు చేర రమ్మనఁగ బ్రదికి
త్రైలోక్యగురుఁడు నారదమౌని ప్రియశిష్యనిర్విశేషముగ మన్నింప నలరి
జగదీశురాణివాసపుసతుల్ శిక్ష గావింపంగ సంగీతవిద్య నేర్చి
తే. తుద కొకానొకకపటసిద్ధుం డొనర్చు, శక్తిపూజకుఁ బశు వైతిఁ జర్చ సేయ
నెంతవారికిఁ దప్పింప నెట్లు వచ్చు, బ్రహ్మ దా మున్ను వ్రాసినవ్రాఁతఫలము.
క. అనిమదినడలుచుఁ బ్రియసఖు,లను మొఱఁగుటఁదలఁచికడుఁ గలంగుచుఁ దెగునే
యనుభావ్య మెంత యంతయు,ననుభవమునఁగాక యనుచు ననయముఁ గుందెన్.

వ. తదనంతరంబ డెందంబు డిందుపఱచుకొని ధైర్యబలంబునఁ గంఠగద్గదిక వారిం
చుచు నావృద్ధభామినితో నిట్లనియె. 94

శా. అమ్మా నీపలు కెల్ల నెంతయు నిజం బై యిప్డు గాన్పించె నే
నిమ్మాయావిప్రకార మిట్లగుట యూహింపంగ లే కొక్కయ
ర్థమ్ముకై వీనికృపం గడింతు నని యత్యంతాశ ప్రేరేపఁ గా
నిమ్మాడ్కిం దెగి వచ్చితిం దెరువు లేదీపాటు దప్పింపఁగాన్. 95

క. ఎక్కడికిఁ బాఱిపోయెదఁ, జిక్కుపడక యేను వీనిశీఘ్రగతికి నో
యక్క యిక దూరదృష్టియు, నెక్కుడు వీనికిని గాంచు నెచ్చట నున్నన్. 96

సీ. అన విని యాకై యోవనిత నీవు నెఱుంగుదే వీనియాదూరదృష్టి యనిన
దానన కాదె యీతఁడు నన్ను భ్రమియించి యీరీతిఁ దాఁ దెచ్చెనిచటికనుచుఁ
బలికి యాతఁడు దన్నుఁ బ్రథమంబునందుగ్రహారామమునఁ గాంచుటాది గాఁగ
నది తుద గాఁగ సమస్తంబు వినిపించి తత్ప్రసంగంబునఁ దనదుపేరు
తే. కులము విద్యయు నప్పటికోరికయును
జెప్పి యాకోర్కి సాధించుచింత దక్క
చింత యెఱుఁగక యేఁగుదెంచితిఁ గోరకకుఁ
బోవఁ బిడిగల్లు వడియె నోపాలఁతి యనియె. 97

చ. అన విని యట్ల యౌ నిది యథార్థము నీ కటు లాస చూపి తో
డ్కొని చనుదెంచెఁ దాఁ దనదుకోర్కి యొనర్చుట కీవినింద్యవ
ర్తనుఁడు మనుష్యయత్నమునఁ దక్కఁగ నేరఁడు దూరదృష్టి సా
ధన మయినట్టిపిమ్మట నితం డొనరించువిచార మారయన్. 98

తే. ఇంతపాట్లను బడి కన్న యీవిచిత్ర
మహిమకుం దగ రాజ్యసంపదలు గనిన
నెంత యిం పగునే యని యేను వినఁగఁ
బలుమఱును వీఁడు ముచ్చటపడుచు నుండు 99

క. ఆకోరికకై కలదో కో, లోకోత్తరగానయుతయు లోకోత్తరర
మ్యాకృతియు నొకతె వార, స్త్రీకులమున ననుచు దూరదృష్టికి వెదకున్. 100

క. తానును గిన్నర యొకతె మహానందత మీఁటుచుండు ననిశంబును ద
ద్గానరసజ్ఞత నిలఁ గల, గానము దూరశ్రవణముకతమున ననియెన్. 101

సీ. తొల్లి యిచ్చటన యాదూరదృష్టియును దూరశ్రవణము నిద్ధురాత్మకుండు
సాధించి నాఁడె తత్సాధన కెందఱెందఱకుత్తుకలు గోసి చెఱిచె నొక్క-
యది కొంత యెఱుఁగు దేనంగన యెఱుఁగింపు విని యెదఁ గాలయాపనముకొఱకు
మీఁదటఁ గాఁగల మేలుగీ ల్లెరికిఁ దప్పింప రామి యెంతయు ధ్రువంబు

ఆ. ఇంక వాఁడు వచ్చి యేమేమి సేయునో, చచ్చు టట్లొ యనువిచారమునను
బెగడు చుండ నేల జగదంబ యాశక్తి, సేయ వలసినట్లు సేయుఁ గాక 102

క. అన విని యాయమ మెచ్చుచు, ఘనధైర్యవివేకమహిమ గలయుత్తమభా
మిని కాదు మేలు మేలీ, వనినట్లె వచింతు నీకు నని యి ట్లనియెన్. 103

క. ఓరమణి దూరదృష్టియు, దూరశ్రవణంబుఁ బడయు త్రోవ లితరముల్
ఘోరముల యైనఁ బరహింసారూపంబు లవి గావు సాహసపువిధుల్. 104

క. ఆరెండు నితఁడు నడపెం, గోరిక నలగోరుగల్లు గొని నిజనయనో
ద్ధార మొనర్చియు వీనుల, ఘోరపునారసముఁ బరపుకొనియుఁ గా వరుసన్. 105

వ. అనుచుఁ దన్మందిరాగ్రభాగంబున మృగేంద్రవాహనంబునందు నేకాక్షరపంక్తి
చిహ్నితశిలాస్తంభంబున వ్రేలఁ గట్టిన యాశస్త్రయుగ్మంబును మఱియు నచ్చట
గంధపుష్పాద్యర్చితంబు లై యున్న యొక్క-సురియయు గండకత్తెరయు డగ్గఱం
దోడ్కొని పోయి చూపి యి ట్లనియె. 106

క ఈకోరిక కిది దెరు విది, యీకోరిక కనుచు వ్రాసి యిడినా రదె యా
ఆకంబంబునఁ జదువుము, నీ కాలిపి తెలియునేని నీరజవదనా 107

సీ. అనుడు నమ్మాట దా విని కలభాషిణి యందు నున్నర్థ మి ట్లనుచుఁ జదివె
నిచట రెండేండ్లు జితేంద్రియత్వంబున భువనేశ్వరీమంత్రమును జపింప
నెల్లకోర్కు-లు నిచ్చు నిద్దేవి మఱి యట్లు గాక సద్యస్సిద్ధి గావలసిన
దూరవీక్షార్థి యాగోరుగంట హృతాక్షుఁ డయ్యు దూరశ్రవణార్థి చెవిని
తే ఘోర మైనట్టియాబలునారసంబు, పరపుకొనియు సారస్వతప్రౌఢిమార్థి
యాసురియచేత నాలుకఁ గోసికొనియు, నిమ్మహాశక్తి మెప్పించి యిష్టమొందు.

క. ఈమెఱుఁగుగండగత్తెర,చే మిడిదల యిచ్చుసాహసికుఁడు శిరం బ
ట్టే మగుడఁగ నదుకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగినవానిన్.
క. పదిలముగ నిర్విఘ్నా,భ్యుదయమహారాజ్యలక్ష్మి సౌందర్య వశతన్
సదమలరూపసుగానా,స్పద వారవధూటి నిచట బలిగా నిడినన్. 110
తే. అని చదివి దానఁ దలఁపులో నాత్మనిధన
శంక నిస్సంశయం బయి చాలఁ బ్రబలఁ
గలఁగి చలియించుతద్ధైర్యగౌరవంబు
నంతన మగుడ్చి[1] కడమ యి ట్లనుచుఁ జదివె 111
ఉ. ఈవిధులందు నెందును నొకింత సమర్థత లేనివృద్ధు లి
ద్దేవతయొద్ద నిర్భయత దేహము నెమ్మెయిఁ బాసిరేని లస
ద్యావవరూపసిద్ధి యగు నప్పుడ యంగవిమోక్షవేళ ని
చ్ఛావృత మెద్ది వారి కది సంఘటిలుం దిరమై తదాదిగన్ 112
క అని చదివిన నందుఁ దుదన్, వినఁబడినవిధానమునకు వృద్ధాంగన యిం
పున నవ్వుచు నిది విని సు, ష్మనిశము నే నిచట నునికి యంబుజనయనా 113
తే అబ్జముఖి (సుముఖాసత్తి యండ్రు) నన్నుఁ
గరము కాశ్మీరభూమిఁ బ్రఖ్యాత మైన
శారదాపీఠమున సరస్వతిని గొల్చు
నట్టిపూజారిబ్రాహ్మణుపట్టి నేను 114
వ. అనునంతట సిద్ధుండు దేవీపూజకుఁ దగినగంధమాల్యాదులు సంపాదించికొని వచ్చి యమ్ముదుసలిపడంతిం జూచి యోయవ్వ కుశలంబున నున్నదానవే నిర్మనుష్యం బైన యీశక్తిస్థానంబునఁ జిరకాలంబునం బట్టి యెట్లు వేగించుచున్నదాన వని పలికి కలభాషిణిం బిలిచి యోచెలువ మనకు నవ్వలఁ జనవలయుఁ గద మిక్కిలి ప్రొద్దు పోవుచున్నయది శక్తిం బూజించి పోవుద మాయమ్మచేత ననిపించుకొని రమ్మనుటయు నది భయాకులమానస యగుచు వృద్ధాంగనం జూచి
క. ఏ నొంటిఁ బోవ వెఱతున్, లోనికి నోయమ్మ నీవునున్ రాఁగదె నా
తో నన నెవ్వరు నేటికి, నే నుండఁగ ననుచు సిద్ధుఁ డింతిం బలికెన్ 116
సీ. పలికి యప్పటిదానిభయచేష్ట భావించి యిమ్ముదిజంతచే నిడి యొకింత
యే మైన నాతలం పెఱిఁగెఁ గాఁబోలు విఘ్నం బేమి యగునొ విలంబ మైన
నని సిద్ధుఁ డాత్మలో ననయంబు వేగిరింపుచు నోసి చెల్లి యిమ్ముసలివగ్గు
నీకుఁ దోడై వచ్చునో కలదో మఱి యే మైన ననుచు నాయిగురుఁబోఁడి
తే. కొప్పుఁబట్టితివంబోవ నప్పడంతి, ప్రాణభయమునఁ గలఁగి యోయవ్వ నీకు
బిడ్డనే కావవే నాకు నడ్డపడవె,యనుచు నావృద్ధనారిమాటునకు నొదిఁగె. 117

1 ఘుగిడ్చి.

క. ఆవృద్ధనారియును గరు,ణావిలమతి యగుచు నాథ యార్త మృగాక్షిన్
దా వెనుక నిముడుకొనుచుం, గావుము కావు మని వానికరములఁ బట్టెన్

సీ. పట్టిన నతఁడు లోపలికి రాకుండ విఘ్నము నేసె దింతియ కద యటంచుఁ
దద్దేవి కిచటు ముందఱఁ గాదె యంచు నప్పుడఁతిచేతులు నుల్చి పాఱఁ ద్రోచి
బలిమిఁ దార్కొని కలభాషిణి వేనలి యొకకేలఁ బట్టి వే ఱొక్క కేల
నొఱఁ గత్తి వెఱికి నీ కొప్పన మిదె యంచు సత్తికిఁ గత్తిచే యెత్తి మ్రొక్కి

ఆ. వ్రేయుఁ బూన దీని వ్రేసిన నిద్దేవి, యాన సుమ్ము నీకు ననుచు డాసి
యానెలంత మెడకు నడ్డంబుగా మెడ, యొగ్గె వృద్ధసతి యనూనకృపను 119

వ. ఇవ్విధంబునం గలభాషిణికంఠంబునకుఁ దనకంఠంబు నడ్డంబుఁ జేర్చి వ్రేటు కను వీక దాని నిరుఁగేలం బొదుగఁ బట్టుకొని పరమకరుణాపరవశత్వంబునఁ దొలంగకయావృద్ధభామిని యోయిసిద్ధుండ నీకుం గార్యసిద్ధి గాదుసుమీ యద్దేవి మీఁది యాన నతిక్రమించిన ననుచు నోమహాశక్తి నన్ను సత్యవచనం గావింపుమీయనుచు నుండ నతం డఖండరోషంబున మున్ను దాని మెడ ఖండితంబు నేసి విచిత్రవేగంబునఁ గలభాషిణికొప్పుఁబట్టి ఖడ్గంబు ఝళిపించి వ్రేయ నెత్తుటయు నెత్తినచెయి తత్క్షణంబ యందుకొని మృగేంద్రవాహననిజశపథసముల్లంఘనోత్సాహసాహసదోషదూషితుండగునతని నతిదూరంబునం బడవైచెసుముఖాసత్తియు నట్లు సంప్రాప్తంబైనయసివిఘాతంబునం దనజరద్దేహంబు వడినట్టి క్షణంబునందు 120

సీ. నిండుచందురు నవ్వునెమ్మోముసిరితోడ నిగులుగ్రమ్మెడువేణిభరముతోడ
నాకర్ణలోలంబు లగునేత్రములతోడఁ దళుకొత్తుచెక్కుటద్దములతోడ
మిగుల మిటారించుబిగిచనుంగవతోడ లలితంపుబాహువల్లరులతోడ
నతికృశత్వమున జవ్వాడుమధ్యముతోడ నభినవంబైననూఁగారుతోడ

తే. వలువమీఁదికిఁ దొలకుసువర్ణపులిన
గురునితంబప్రభాపరంపరలతోడ
మహితసర్వాంగలావణ్యమహిమతోడ
నమరుప్రాయంపురూపు చిత్రముగఁ దాల్చి 121

తే. తాల్చి యావికచోత్పలదళనిభాక్షి
కనుఁగొనియె నభ్రమున శక్తికరవినున్న
గాత్రు సిద్ధుని నొకకేలఁ గత్తియొక్క
కేలఁ గలభాషిణిని విడకే చనంగ. 122

క. ఆకరణిఁ జూచినది యై, యాకలభాషిణియవస్థ కాత్మఁ గలఁగుచున్
వ్యాకులత నొందెఁ దనదుచి,రాకాంక్షితసిద్ధి పెంపు నరయనిమదితోన్. 123

సీ. అంతఁ గ్రమంబున నాసరోజాక్షి సంసారస్వభావవిచారమహిమ
వలనఁ దద్దుఃఖంబు వారించికొని దానఁ దాను భోగ్యార్థచింతనము వదలి
దేవిసత్కృపఁ బ్రసాదించినయట్టిజవ్వనపుసత్త్వము వృథా చనక యుండ
యోగవిద్యాభ్యాసనోపయోగంబునఁ గడపెదఁ గా కంచు విడువ కెపుడు
తే. యమనియమవర్తనములతో నాసనాదు, లభ్యసింపఁగఁ దొడఁగె నత్యాదరమునఁ
దాను మును విన్నభంగుల దాఁపు గాఁగ, నచటి శక్తిని గురువుగా నాత్మ నునిచి

వ. అంతటం గలభాషిణి యచ్చటి కేఁగుదెంచి యాచంచలాక్షి నీక్షించి నీ వెందునుండి
వచ్చి తెట్టిదాన వని యడుగుటయు నప్పడంతి యేను మును నీకు నడ్డపడి
సిద్ధునిచేత ఖండిత యైనసుముఖాసత్తి యనువృద్ధవనితం జుమ్ము క్రమ్మఱ నిమ్మ
హాశక్తికారుణ్యశక్తివలన నిట్టియెలప్రాయంపుసొంపు వడసి యున్నదాన నని
తత్ప్రకారం బెఱుంగించి యాకలభాషిణి యట్లు సిద్ధునితోడ నిమ్మహాశక్తిచేత
దూరవిక్షిప్త వై యెచటం బడి తేమియు నొవ్వక యిట్లు దిరిగి వచ్చుటయద్భుతం
బగుచున్నది యనుటయుం గలభాషిణి యోయమ్మ ధర్మగుణంబున నిమ్మహాదే
విని మెప్పించి యిప్పగిది నీవు దిరుగం బ్రాయంబు గనుట యద్భుతంబుగాక యిం
తటిమహాపుణ్యనిధి వైననీకారుణ్యంబు గలుగ నే దిరిగి వచ్చుట యేమియద్భు
తంబు నావిధం బంతయు విన్నవించెద నని పలుకుచుండ. 125

క. బంధురవీణాసహిత,స్కంధముతో రత్నమాలికాఘటితజటా
బంధముతో నంతట మణి,కంధరుఁ డచ్చటికి వచ్చె గంభీరగతిన్ 126

క. వచ్చినఁ గని యతిమోదము, నచ్చెరువుఁ దలిర్ప మ్రొక్కె నతని కతఁడు దా
నచ్చెలువఁ జూచి మోదము, నచ్చెరువుఁ దలిర్ప వికసితాననుఁ డగుచున్. 127

క. ఓహోహో మాబంధు,వ్యూహం బంతయును వచ్చియున్న ట్లయ్యెన్
నాహృదయమునకుఁ బరమ, స్నేహనిధిన్ నిన్నుఁ గనుట నేఁడు లతాంగీ 128

మత్తకోకిల. మచ్చెకంటి మముం దలంతువె మానసంబున నిందు నీ
వచ్చు టెట్లు కడున్ విచిత్రము ద్వారకాపురి వాయ నీ
కిచ్చ వుట్టుట యెన్నఁడున్ మఱి యిట్టు లేఁగి యెఱుంగ వీ
వచ్చెలుల్ మణిగేహముల్ సిరులట్ల యున్నవియే కదా 129

సీ. ఉత్తమశ్లోకుఁ బయోజాక్షు సేవింప నేఁగితే యావెన్క నెన్నఁ డైన
నాజగత్పతి తొంటియలవజ్రమణిసభ కేతెంచికొలువు సేయించుకొనునె
తనసేవగాఁ బురందరుఁడు గట్టించుకెంపులహజారము కడముట్టె నొక్క
మనవీణియ లడంచుకొని భ్రమయించు నీలపుటరుంగులకుఁ బోనిపుడు గలదె
తే. యంతకంతకు వర్ధిల్లువారిమాళ్ళ, బలగమున కిది చాల దనతలఁపుతోడఁ
దిరుగఁ గట్టించె మనపైఁడిగరడిసాల, యట్ల యున్నదియే వికచాబ్జవదన 130

మ. చిగురుంబోఁడి యెఱుంగుదే యదుపతి స్త్రీ లెవ్వారే నిందు లే
రు గదా యంచును శంకఁ గ్రమ్మఱితిఁ జారుద్యూతగేహంబు క్రొ
త్తగ నీ వొక్కటిఁ జూపఁ దోడ్కొని చనం దచ్చోక చొవంచ యి
త్తిగ బోరా దుగ యంచుఁ జిల్కరొద లుద్దీపింపఁ దా దవ్వులన్. 131

చ. కుటిలకచా యెఱుంగుదువె గొబ్బున నేఁ జని కొల్వుకూట మొ
క్కటి కడ నుక్కి యారయక కట్టెదుటం బటికంపుగోడఁ బ్ర
స్ఫుటముగ దానియందు హరిఁ జూచుచు మ్రొక్కఁగ వెన్కనుండి య
ట్టిటు మొగ మంచు నవ్వె సభ యెల్లను దన్మణిభిత్తి యున్నదే. 132

క అని యడిగిన నన్నియు శో,భనవర్తనఁ దొంటియట్ల భాసిల్లెడు నో
యనఘ సురరాజుసేవయు, ననుపమముగఁ బూర్ణ మయ్యె నని యది వలికెన్.

వ. అని పలికిన నతండు 134

సీ. సంగీతవిద్యాప్రసంగంబునం దైన మముఁ దలంతువొ లేదొ మనసునందు
దనుజారి కే నొనర్చినదండకంబు నీ వెందైన మఱి వెలయించితో కొ
యిప్పుడు నారదుం డప్పటప్పటికి వచ్చునో రాఁడొ వసుదేవసూనుఁ గొలువ
నాలోకవిభుసతుల్ మే లేర్చి యిచ్చిన వీణె యే మయ్యెఁ దే విచ్చుటికిని
తే. నేమి యేమియొ నాఁడు నీహృదయమునను
గోర్కి యొక్కటి గలుగుట కొమ్మ వింటి
నది ప్రవృద్ధంబుగాఁ బెంచి యాత్మలోన
విడిచిపెట్టితొ వీణపై వేడ్క లెల్ల. 135

చ. అనుటయు లజ్జ నజ్జలరుహానన యించుక యోర గాఁగ వం
చినమొగ మొప్ప నే మనుచుఁ జెప్పెద దానవచేసి కాదె యో
యనఘచరిత్ర నాకుఁ గలయట్టిబలంగము లెల్ల బాసి యీ
ఘనగహనప్రదేశములఁ గష్టపుఁబాటులఁ గుందితిం గడున్. 136

వ. అని పలికి తనగానవిద్యాభ్యాసపరిసమాప్తి యైనపిమ్మటఁ దనయున్నచోటికి మణిస్తంభుండు వచ్చినప్రకారం బెఱింగించి యతండు దూరదృష్టిదూరశ్రవణశక్తిబలంబునఁ దనకుం జెప్పినయర్థము సకలంబును జెప్పి తన్ను నతండు మృగేంద్రవాహనాభవనంబునకుం దెచ్చినతెఱంగును బలిపశూకరణోద్యమప్రకారంబును సుముఖాసక్తి తన్ను రక్షించుటయు వివరించి యాపుణ్యసాధ్వి యీయమ యని యాయక్కం జూపి తత్కులస్థానవర్తనంబులు దెలిపి యోగంధరోత్తమ యింక నాకు నీచందంబు వినవలయు నవ్విధంబున రంభచేత నీతపంబు విఘ్నంబు నొందుట యామణిస్తంభునిచేత నేను విన్నప్రకారంబు వింటివి కదా యటమీఁదటిభవదీయవర్తనం బెఱింగింపు మనునంతట మణిస్తంభుండు వచ్చుటయు నిప్పుడే జెప్పినసిద్ధుం డితం డని చూపిన నితండా యని దరహాసితవికసితా

నసుం డగుచు మణికంధరుం డతనిం దగు తెఱుంగున సంభావించి నతండును.

క. ఇచ్చోఁ దదాగమనమునకు, నచ్చెరువు జనింప నిది మహాశ్చర్యము మీ
రెచ్చోటనుండి యిచటికి, విచ్చేసితి రని వినీతవృత్తిం బలికెన్. 138

సీ. పలికి యంతటఁ గలభాషిణిఁ జూచి యో యింతి నీ వెదకితి నెల్లచోట్ల
నెందుఁ గానక చోద్య మందుచు నప్పు డక్కడ నుంటి విప్పు డిక్కడికి వచ్చి
తని పల్కుచును సుముఖాసక్తిఁ జూచి యెచ్చటనుండి వచ్చి తిచ్చటికి నీవు
వే రెద్ది యని తత్ప్రకారంబు దానిచేతన విని వెఱఁ గంది వినుతి చేసె

తే. నాసతి యతనిఁ గనుఁగొని యరుదుపడుచు
ని ట్లనియె నోయిసిద్ధుండ యెచటఁ బడితి
రీవుఁ గలభాషిణియును నిద్దవిచేత
నట్లు సరభసవితీర్ణు లగుచుఁ బోయి. 139

వ మీర లేమియు నొవ్వక తిరిగి వచ్చుటయు నచ్చెరు వై యున్న యది నాకు
నింతయు వినిపింపవలయు ననిన విని మణిస్తంభుం డోయంబుజముఖి నీకు నట్ల
వినిపించెద విను మదియ కాదు మఱియు నెన్ని యేని విచిత్రంబులు గని వచ్చి
నాఁడ నది యొక్కరితోడం జెప్పెడునందాఁక హృదయంబు వేగిరపడుచున్న
ది గావున నన్నిటం బూజ్యురాల వైననీకు వినిపించెద నని యి ట్లనియె 140

ఉ. ఆవిధి నీపయిం దెగి మదాతిశయంబునఁ గన్నుగానమిఁ
దేవతమీఁదియానయు గణింపక యీకలభాషిణీ శిరో
జావళిఁ బట్టి త్రుంచుటకు నాయుధ మెత్తితి నెత్తినట్టికేల్
దేవి వహించి వైవఁ జనితిం గడు దవ్వుగ నివ్వధూటితోన్. 141

మ అనుదుఁ నీ విది చెప్పఁగా వలవ దే నాముష్ణ యీరూపుఁ గై
కొని వీక్షించితి నిన్ను నీచిగురుటాకుంబోఁడిమూర్ధంబు వ
ట్టినకేల్ పట్టినయట్ల యుండ దృఢముష్టిం బూని బల్గత్తి యె
త్తినకే లెత్తినయట్ల యుండ దివి నుద్వేగంబునం బోవుచోన్. 142

క. వినిపింపు నాకు నట మీఁ, దన నతఁ డి ట్లనుచుఁ జెప్పె నట్లురువడి వ్రం
చనమున వైచినగతి నభ,మునఁ జని మణికంధరునితపోవనభూమిన్. 143

క. ఇత్తరుణియు నేనును నొక, మెత్తనిక్రొత్తలిరుఁబొన్నుమీఁదఁ బడితి మో
మత్తేభగమన యశ్లే, సత్తియుఁ గృపసేయఁ బోలుఁ జావక యుండన్. 144

క. మునుపటిభయమున వ్రాప్పడి, యునికి నపుడు చేతికత్తియును దనదుశిరం
బును విడువఁగ నెఱుఁగనిసనుఁ, గనుఁగొని నెమ్మేను మిగుల గడగడవడఁకన్.

సీ. అమృతంబు దొలఁకున ట్లమరంగ వెల్వెలఁ బాఱుముఖేందుబింబంబుతోడ
శ్రాలకర్ణద్వయీకూలంకషంబు లై తల్లడం బందునేత్రములతోడఁ

గడుఁ జెమర్చినయట్టికలికిలేఁజెక్కుల నంటుడువిగళత్కచాళితోడఁ
వలిగుబ్బపాలిండ్ల నిలువ కిట్టట్టు సంక్షోభించుపయ్యెదకొంగుతోడ
తే. వెఱపు నొకరొజ్జ యై వింతవిలసనములు
గఱపఁ జూపట్టుసౌందర్యగరిమతోడ
సరభసాకర్షణాక్షోభచకిత యైన
మదనుజయలక్ష్మిలీల ని మ్మగువ దనర. 146
క కనుఁగొంటిం గనుఁగొనునం, తన మన్మథవశుఁడ నగుచుఁ దగఁ బరిరంభం
బును గావించితి నేఁ జేసినపాపముఁ జెప్పవలయు శీతాంశుముఖీ. 147
మ. అది స్వైరింపక బాల పేరెలుఁగుతో నాక్రోశముం జేసి న
న్నిదె యీపాతకిఁ బల్మిఁ బట్టెడుఁ గృపన్ వీక్షింపరే కావరే
సదయత్వంబున నొప్పు సత్పురుషు లిచ్చో నెవ్వరున్ లేరె యా
పద వారింప శరణ్యులార యని యాపద్భ్రాంతి యత్యంతమున్ 148
వ. అప్పుడు. 149
క నెఱయఁగ నసహ్య మగున, మ్మొఱ వీనులఁ బడిన మిన్ను ముట్టునెలుఁగుతో
వెఱవకు వెఱవకు మే నిదె, పఱతెంచితి సత్వరముగ భామిని యనుచున్. 150
క వెఱవక యెవ్వఁడురా వెత,పఱపెడు నిట్లితివ నెందుఁ బాఱెదఁ గూడం
దఱిమెదఁ దలవరములతోఁ, బెఱికెద ననుచున్ నితాంతభీషణగతితోన్. 151
చ. ఒకపొదరిల్లు వెల్వడి రయోద్ధతుఁ డై నలకూబరుండు రాఁ
బ్రకటముగాఁ గనుంగొని యభంగురభీతిఁ గలంగి దీని నే
వికలమనోధృతిన్ విడిచి వేగమ దవ్వుగఁ బాఱిపోయితిం
బ్రకుపితుఁ డై యతండు ననుఁ బాయక వెన్కొని పట్టె నుగ్రతన్. 152
వ. అట్లు కూఁతముట్టి పట్టుకొని 153
శా ఓరీ యెవ్వఁడ వీవు ఘోతరముతో నున్మాది వై యిప్పు డే
నారిం బట్టితి బెట్టుగా మొఱ యిడన్ నాదండ నీదుండగం
బా రా ర మ్మటు దానిఁ జూపుదువు ప్రాయశ్చిత్త మామీఁద నీ
కేరితిం దగు నట్లొనర్తు నని తా నెంతే నమర్షంబునన్ 154
వ. కొంతమేర నన్నుం గ్రమ్మఱఁ దెచ్చునంత 155
సీ. తిరముగా ముడవమి విరియఁ బాఱెడుకొప్పుతోడ్తోడనొకకేలఁ దుఱిమికొనుచు
వల్లెవాటుగఁ గొంతవలువ చన్గవ నిల్పి వెఱచేత నీవి గల్పించుకొనుచు
నుదుటిపై నొక్కింత చెదరినముంగురుల్ పాపటకును బొందుపఱచుకొనుచు
సారెకు జారెడుశ్రవణకల్హారంబు లందంద మూఁపున నానుకొనుచుఁ
తే. జెమట నంటినపానుపుఁ జివురుఁదునుక
లెడనెడ నఖక్షతాశంకఁ దడవుకొనుచు

రంభ యేతెంచె మిగుల సంరంభ మమరఁ
దోలుతఁ బ్రియుఁ డేఁగుదెంచిన త్రోవఁబట్టి. 156

శా. ఈలీలం జనుదెంచి యక్కటకటా యే మంచు నీ వూఱుదుం
గేలం గైదువు గీదు వేమియును లే కే యిమ్మెయిన్ వత్తురే
చాలన్ దూరము గాఁగ నే నిదె పరిశ్రాంతిం గడున్ నొచ్చితిం
జాలుం జాలుఁ గరంబు మెచ్చఁ దగు నీచందంబు ప్రాణేశ్వరా. 157

వ. అని తనదుప్రియుం బలికి నన్నుం గనుంగొంచు నతనితోడ 158

క. వీఁడా యట్లన్యాయపుఁ, బోఁడుములకుఁ బూనినట్టిపుణ్యుఁడు పూవి
ల్కాఁ డోవల్లభ యెంతటి, వాఁ డైన నగున్ విశంకవర్తనుఁ డెందున్. 159

క. ఆయింతి యెందుఁ బోయెనొ, కో యనుటయు దానిఁ జూపుకొలఁకునె కాదే
యీయయ్యఁ బట్టి తెచ్చుట, యోయంగన యిప్పు డనుటయును గృప వొడమన్.

వ. ఆయింతిం జూపక యితం డింక నీముందట నెందుఁ బోయెడుఁ జెయి వదలు మ
నుచుఁ బ్రార్థించి. 161

తే. విభునిచే విడిపించె నవ్వేలఁది నన్ను
నేను వారలఁ దోడ్కొని యీనెలంత
యున్నచో టారయుచు మును పున్నతలిరుఁ
బొన్పుఁ జూపితిఁ గాన నిప్పడఁతి నచట 162

క. తానును మనతో ల్తటియీ, పానుపుఁ జేర్చుకొనఁ బోలుఁ బడఁతుక ననుచున్
బోనీ సిద్ధుఁడు గాన న్యనూనం బగుసిద్ధశయ్య కుచితుఁడ యనుచున్. 163

క అట్టియెడ నచ్చటన్ నా, పట్టముఁ గని ప్రుట్టుకొనియెఁ బౌలస్త్యసుతుం
డిట్టివియుఁ దనకుఁ గొన్నియె, గట్టిగ నీజోగి బంటు గదె యని నగుచున్. 164

తే. బంటు గాకున్న నిది యిందుఁ బాఱవైచి
వెళ్లునే యని నవ్వె నవ్విబుధకాంత
యంత నన్నియు నయ్యె నయ్యతివ నెచట
నడఁచి తని నన్ను దట్టించి యడిగె నతఁడు. 165

సీ. కినుకతో ని ట్లింతయును బెదరింపుచుఁ బిఱువీఁకు సేయఁ దత్ప్రియవధూటి
వీనితో నిది యేమి విడిచిపెట్టుము వీఁడు తను నట్లు డించి వెళ్లిన నెడఁ గని
యాయింతి డాఁగి యెం దరిగెనో యెచటఁ జూపెడు నంచు నను విడిపించి దాని
మన మింక వెదకుద మని తాను నాతండు నేఁ దోల్తఁ బాఱిపోయిన తెరువునఁ

తే జనియెఁ గడుదవ్వుగాఁ గుచస్తబక మొకటి
వరునిభుజముతో నొఱయ నవ్వలిత దంస
భాగమునఁ దనకోమలపాణిఁ జేర్చి
ఘనుపదంబును రోమాంచితాంగి యగుచు 166

ఉ. ఏనును వారివెంబడిన యేఁగితిఁ బాయక యింత నంత నెం
దేని మనోభవక్రియల నింపున నేమఱి పెట్టి పోవునో
యానలకూబరుండు మదుదగ్రకృపాణము నంచు దాని న
న్యూనగురుప్రసాదమహిమోన్నతిఁ గాంచుటఁ బాయఁ జాలమిన్. 167

చ. అదియును గాక యావిపిన మంతయు నెంతయు సావధానతన్
బదిలము గాఁగ నప్పుడుఁ(తిఁ బాయక యప్పుడు దూరదృష్టిచే
వెదకి కనంగ లేక కడు విస్మయ మందుచు నేమి మాయయో
యిది విని వీరి కైన నొకయీగడ వెళ్లునొ యంచు నేఁగితిన్ 168

క. అంతట నాయిరువురు న,త్యంతము నంగాంగస క్తి నాత్మలు గఱఁగన్
గంతుక్రీడలు గైకొని, రెంతయు నెడ గలుగ నేఁగి యేను నిలిచితిన్ 169

శా. ఆలీలన్ రతికేళిఁ దేలి తుదయం దాయిద్దఱుం గేలిభి
న్నాలంకారము లొక్కరొక్కరికి నిం పొనట్లుగా దిద్దుచున్
లోలత్వంబున నుండ నచ్చటికి నాలోలత్వదశ్రేణిచో
ప్పాలోకింపుచు రంభ వేతొకతె డాయన్ వచ్చెఁ జిత్రంబుగన్. 170

ఆ వచ్చి రిచ్చవడియె నచ్చెరు వందుచు, నచ్చకోరనయన వచ్చు టరసి
యద్భుతంబు నొంది యక్షేశసుతుఁడు న,వ్విధముఁ జూచి యేను వెఱఁగుపడితి.

ఉ. అంతట యక్షరాజసుతుఁ డాకరణిం జను దెంచి యున్నయా
కాంతప్రకారముం దనదుకాంతప్రకారముఁ గొంత ప్రొద్దు వి
శ్రాంతి మహావధానమునఁ గ్రమ్మఱి క్రమ్మఱి చూచె నెందు నొ
క్కింతవిభేద మేర్పడమి కెంతయు నద్భుత మావహిల్లఁగన్ 172

క ఈమాడ్కిఁ జూడ నను న, క్కామినిఁ గడుఁ దిరిగి తిరిగి కనుఁగొనియెదు నీ
వేమి యిది నాకుఁ జెప్పుమా, నీమది యని యతని నతని నెలఁతుక పలికెన్ 173

వ. ఇట్లు పలికిన నతండు 174

తే. నీదుప్రతిబింబ మదియొ దానిప్రతిబింబ
మీవొ యే మని చెప్పుదు నిగురుఁబోఁడి
యేర్పఱుప రాక యున్నవా రీవు నదియు
దీని కరు దంది చూచెదఁ దిరిగి తిరిగి 175

క. తుద నేమి చెప్ప నాదం,డఁ దొలంగిన దాని నినుఁ దడంబడ కుండన్
మదిలోన నేర్పఱించుట, సుదుర్లభ మ టన్న నతని సుదతి గలఁగుచున్. 176

సీ. అట్లనఁ బ్రాణనాయక నినుఁ గౌఁగిటఁ బాయ నే వెఱతు నీ మాయలాఁడి
యీరూపుతోమన కెడ సేయ నేతెంచి నదియొ తొల్లియు నొక్క యసురజంత
జనకనందనకు రాముననకును నెడ సేయఁ గడఁగి వచ్చుట వినఁబడుచు నుండుఁ
గావున దీని నిక్కడఁ జిట్టుపట్టున నుండంగ నిచ్చిన నొప్ప కుండు

తే. పట్టి మొగమూట లాలించి గట్టిగాఁగ
నదర వైచుచుఁ జను మంచు నార నీవు
గదలెదు సు మంచు సంభ్రమం బొదవ నపుడు
కాంతుకంఠంబు నొకకేలఁ గౌఁగిలించె.

క. క్రొత్తగ వచ్చినరంభయు, నత్తెఱఁ గంతయును గని కరాంగుళి నాసన్
హత్తించి తలఁ గదల్చుచు, నుత్తలపా టేర్పడంగ నుస్సురు మనియెన్.

ఉ. అక్కమలాక్షిఁ జూచి యలకాధిపనందనుఁ డోపడంతి నీ
వెక్కడనుండి వచ్చితివి! యేటికి నుస్సురు మంటి నీకు నీ
యక్కజ మేల వచ్చెను మదంగనరూపముఁ దాల్చి తేగతిన్
రక్కసివో పిశాచివో కరం బిది చిత్ర మెఱుంగఁ జెప్పుమా ?

క. అన నయ్యంగన నాకే,మన నో రున్న యది మీర లనినంతయుఁ జె
ల్లున మీ కౌఁగాములు దె,ల్ప నుపాయం బొకటి గానఁ బడునందాఁకన్

ఉ. రక్కసి వన్నఁ గా ననఁగ రాదు పిశాచియు నౌదు నాదురూ
పెక్కడఁ దాల్ప నేరిచియొ యిమ్మెయి నెంతయు హత్తుకొన్నయీ
చక్కనిముద్దరాలు తనసత్యము లోక మెఱుంగ నింకఁ దా
రక్కసియో పిశాచియొ తిరంబుగ నేర్పడి పోవునంతకున్.

క. విను మాయేర్పాటు దనం, తన యగుచున్న యది యెట్లుఁ దప్పదు సత్య
బనఁగా దైవం బనఁగా, జనులకు లేకున్న నెట్లు జగములు నడుచున్.

క. దైవం బనఁగా నాకిఁక, నోవల్లభ వేఱ యొక్కఁ డున్నాఁడే యా
దైవమవు నీవ చేయం, గావలసిన నీవ చేయఁగల వేర్పాటున్.

సీ. అల్లప్పు డొకచోటఁ జల్లనిసురపొన్న నీడ మెచ్చుచును నాతోడఁ గూడి
యందుఁ బల్లవశయ్యఁ గందర్పకేళి నింపొందుచోఁ బడమటియందు నొక
వనితయాక్రందనధ్వని వినఁబడుటయు నీవు డిగ్గన లేచి పోవుచుండ
నేను నీతోడన యేతెంచుచో నొక యిట్టి డాపలివంక నేఁగుటయును

తే. జూచి నిలిచితి నేను నిల్చుటఁ గనుఁగొని
యొచట నెట్లిది హత్తెనో యెఱుకపడద
వేగిరించక నీవ భావించుకొనుము
కల్లనిజములు క్రమముగాఁ గానవచ్చు.

చ. అనుడుఁ గుబేరసూను మొగ మారసి తత్ప్రియ యొక్క కేల నా
తనిమెడఁ గౌఁగిలించియు ముదంచితహాసముతోడ నిట్లనున్
మనచరితంబుఁ జెప్పెను సమస్తము వేల్పులపాని చెప్పిన
ట్ల నిజము గాఁగ నివ్వరవిలాసిని యొచ్చటనుండి చూచెనో.

తే. అచట నప్పు డట్లు నినుఁ గూడి యలరినదియు
నట్లు నీ వేఁగుచో వచ్చినదియుఁ దాన
యగుచుఁ దోప సందడికి యెట్లాడ నేర్చె
మగువ గాదుర యిది పెనుదగర గాని. 186

ఉ. ఇప్పగిదిన్ మదాకృతి వహించి నినున్ ననుఁ బాయఁ జేయ నే
చొప్పున నైనఁ దాఁ గలయఁ జూచు దురాశలమాయలాఁడి వా
తప్పక యింతఁ దత్తదుచితంపుఁగుయుక్తులమాట లెన్నియే
నొప్పఁగ నాడుకో నెఱుఁగ కుండునె నిట్టివి చెప్పనేటికిన్ 187

క. విను వల్లభ కన్నుండం, గను బాపం దివియ నేర్పు గలమునిము చ్చీ
వనిత తగ దిచట నుండన్, వెనుకను దిద్దుకొన వచ్చునే యొక త్రైనన్. 188

వ అని యచ్చట దన్ను నిలువనీక పోఁదోలుటకు నిజవల్లభుని సత్వరంబుగా బోధించు నాచంచలాక్షీపలుకులకు నలుక బలియ మనంబు సైరింప లేక యాకంబుకంఠి దాని నధి క్షేపించుచు నిట్లనియె 189

క. త్రుళ్ళఁగ నేటికి నిలునిలు, మిల్లలికినఁ బండు వగునె యింతటిలోనే
వల్లభునకుఁ గడు నచ్చిన, యిల్లాలవె యేను లాఁతి నే పోఁదోలన్ 190

క. మగఁ డాపట్టంబునఁ దలఁ, దెగఁ గొట్టినఁ గొట్టుఁ గాక తెకతేరఁగ నీ
కెగవిడిచి పోయెదనె ప్రావగ నాకాణాచియెనవలపులపంటన్ 191

క. ఈరీతిని మద్వల్లభుఁ, గోరిక మెడఁ గౌఁగిలించుకొని నీ వుండన్
సైరించుట కొఱ గా దిది, రార మ్మిఁక నోర్వఁజుమ్ము రావే యనుచున్. 192

క. పెడదెరువు లిచటఁ జెల్లవు, పుడమి నహహా దొంగ లానఁ బొడిచినఁ గోకల్
విడుతురె గడింతునే యొక్కఁడి గతిమూలినపిశాచికవా నీమాటల్. 193

వ. అనుటయు నాయింతి సైరింపక. 194

మానినీవృత్తము —

అంత మదింపకువే యని పల్కిన నంత మదింపకువే యనుచున్
గంతు లడంచెద లెమ్మని పల్కిన గంతు లడంచెద లెమ్మనుచున్
రంతుల నేమిఫలం బని పల్కిన రంతుల నేమిఫలం బనుచున్
బంతము చూడఁగదే యని పల్కిన బంతము చూడఁగదే యనుచున్ 195

సీ. ఒట్టు సుమీ యన్న నొట్టుసుమీ యంచు నేనేమి యనిన నేమేమి యనుచుఁ
గానీగదే యన్నఁ గానీ గదేయంచు నిం కేల యనిన నిం కేల యనుచు
నోసి పోవే యన్న నోసి పోవే యంచు నౌ నంటి వనిన నౌ నంటి వనుచు
మఱవకు మిది యన్న మఱవకు మిది యంచు నీ వెంత యనిన నీవెంత యనుచు

తే. నొకతె మగనికి నాసించు టొప్ప దనిన
నొకతె మగనికి నాసించు టొప్పదనుచుఁ

బట్టి యాడె నారంభతోఁ బ్రథమరంభ
ప్రియుఁడు నిలు మన్న నిలువక పెద్దరొదగ 196

చ. జగడపుఁగూటిస్సత్తరువు స్మారెకుఁ గోరుచు వీరి వారినిఁ
దగిలెదుతందనాలజడదారి పొరింబోరిఁ గుంచె వీచుచుఁ
మిగులఁగ వీణె మీటుచును నేఁడు పడంతులయొద్దనుం గదుఁ
నెగడెదువిందు గల్గె నని నెమ్మది మెచ్చుచు వచ్చెఁ జెచ్చెరన్. 197

క వచ్చినఁ గుబేరసూనుఁడు, నచ్చెలువలు నెదురుగాఁగ నరిగి యతనికిఁ
నిచ్చల మగుతాత్పర్యం, బచ్చుపడఁగ మ్రొక్కి రతఁడు నల్లన నగుచున్. 198

క నలకూబర నీ కిందే, చెలువ ప్రియవధూటి నాకుఁ జెపుమా దానిఁ
దెలియక దీవింపఁగ రా, దలరుఁ డోకరొకళ్ల ప్రేమ ననుచుఁ మిమ్మున్ 199

మ తనకంటెం బ్రియ నీకు లేదు తనసౌందర్యంబె సౌందర్య మం
చును గర్వింపుచు నున్న రంభమదముం జూడంగ లే కిట్టు దా
నిని నీవే సృజియించితో యిదియ తా నీతోడఁ గ్రీడింపఁగాఁ
దనమే నొక్కటిచాల దంచుఁ గడఁకన్ ద్వైరూప్యముం దాల్చెనో. 200

తే. ఎట్లయైన నీప్రేమ యీయిరువురందు
సమ మగునో కాదో చెప్పుమా చాలఁదడవు
వీరిఁ బోరించి తప్పేడ్క విరియఁ జిమ్మ
లేక కనుఁగొంచు నుంటి నే నాకసమున 201

క. అనుటయు నే నెక్కడ వీరిని బోరించితి నయో విరించితనయ నా
కును వీరలసమరూపత,యును బోరును వెఱఁ గొనర్పుచున్నది మిగులన్ 202

వ. అని పలికి మున్ను దా నందు నొక్కరంభఁ గూడి క్రీడించు చుండియప్పుడనతి
దూరంబున వనితాకృతం బైనయాక్రందనంబు వినంబడినఁ గారుణ్యాసంభ్రమం
బున నద్దిక్కునకై చనుటయు నంతం దనదృష్టిపథంబునం బలాయమానుం డగు
నన్నుం దరిమి పట్టుకొని యొకకొంతదవ్వు దిరుగఁ గొంపోవుటయు నచ్చటికిఁ
దనకాంత గూడ వచ్చుటయుఁ దత్ప్రార్థనంబున నన్ను విడిచి యిచ్ఛావిహారం
బుల నదియుం దానుఁ గొంతప్రొద్దుపుచ్చుటయు నంత రెండవరంభ వచ్చుటయు
దానివచనప్రకారంబును గలహాభంగులుం జెప్పి యానలకూబరుం డాయిద్ద
ఱు రంభలయందు. 203

సీ. తానటమున్ను క్రొత్తగఁ దీర్చినట్టికస్తూరి కాతిలకంబుసొంపుతోడఁ
గన్నె గేదఁగిరేకు లన్నువగాఁ గొనల్ గాన్పింప నిడినకీల్గంటుతోడ
బంగారుపస మించుపసనిపుప్పొడిరేఖఁజూపట్టుపాఁటసొబగుతోడ
సరివాటు గాఁగ గేసరములు గ్రుచ్చిన కురువిందవిరిగుబ్బసరముతోడ

తే నొప్పు మీఱుచు నున్నట్టియొకతెఁ జూపి
యీ సరోజాయతాక్షియు నేను నున్న
చోటి కింతకుము న్నావధూటి వచ్చె
ననుచు రెండవయింతి నమ్మునికిఁ జూపె 204

ఉ చూపిన నాలతాంగి యజసూనున కంజలి చేసి యోమహా
తాపస యల్లనాఁడు మము ద్వారకచేర్పిన నాడినట్టి మీ
యాపలు కింత చేసె నన నన్యయు నట్ల యనన్ మునీశ్వరుం
డాపువుఁబోండ్ల నిద్దఱ యథార్థము పల్కితి రంచు నవ్వుచున్. 205

క. ఆమాటలు సరిదాఁకెఁ గదా మా కీవీక్షణోత్సవాతిశయంబున్
బ్రేమమునఁ జూడఁ గల్గెను, వామేక్షణలార పోయి వచ్చెద ననుచున్. 206

క అనుటయు నలకూబరుఁ డో, మునివర యిద్దఱ యథార్థముగఁ బల్కితి రం
చును బల్కితి రెట్లొకో యిది, వినవలయుం దేటపఱచి విచ్చేయుఁ డనన్.207

సీ నాఁడు దా నాత్మ సౌందర్యవైభవపతి వాల్లభ్యమహిమగర్వమున నాడు
కొనువాక్యములు నేను వినలేక నుమతియే గతిఁ గల్గునో మీఁదు గంటివె యని
నట్టిమాటఁ దలంచి యాపలు కింతసేసె నటంచుఁ దార్కాణ సేసె నొకతె
యొకతె రంభారూపయుక్తిచేఁ బ్రియుఁగూడఁగాంక్షించి యొకకార్యఘటనవేళ
తే. నాదియందును నాచేత నది వరముగఁ
దనకు నిచ్చితి ననిపించుకొనుట యిపుడు
హృదయమున నిల్పి యాపలు కింత సేసె
ననుచుఁ దార్కాణ సేసె రెండును నిజంబు 208

క. నా విని యిపు డీభావం, బీవనితకు నీవనితకు నిది యనుచు బయల్
గావించి తథ్యమిథ్యా,భావంబులు మీఱ లేరుపఱుపఁగ వలయున్. 209

క నావుడును దథ్యమిథ్యా,భావంబుల కేమి నీకు భావింపఁగ స్వా
భావికమే యీయాకృతి,భావము నిజ మెద్ది యీప్రపంచమునందున్ 210

క నీకట్టురువడ నొక్కతెఁ, జూపి యొకతె గర్వ మడఁపుచున్ వలయుగతిన్
బ్రాపింప వచ్చు భోగము, నీపుణ్యం బినుమడించి నేఁడు ఫలించెన్. 211

ఉత్సాహ అనుడు నోమహాత్మ పెద్దలైనవారిఁ దడవుగా
నునిచి యిట్టు నట్టు పలుక నొప్పు కేమి వచ్చునో
చనుఁడు నిలుప వెఱతు ననినఁ జనియె నాతఁ డట్ల యా
ననుచు నుచితలీల నుండు మనుచు నల్ల నవ్వుచున్. 212

సీ. అర్థేశనందనుఁ డంతట నెప్పటి తనపువ్వుఁబోఁడికై దండఁ గొనుచు
నిది యెంత లేదు నెమ్మది నిట్టివిఘ్నముల్ గుఱిచేసి మనకేలి మఱువ నేల

రక్షించు రెండవరంభఁ గనుంగొని నీ వెంతనేర్పులు నెఱపితేని
మాయలే యని తోఁచు మాకుఁ గావున నీదుసత్య మెఱింగింపఁ జాలినట్టి
తే. సాక్షిఁ దెమ్ము పొమ్మని తిరస్కారసరణిఁ
దోఁపఁ బలికెఁ దాత్కాలిక దుర్నివార
మారకేళీకుతూహలమహిమచేత
నెచటి కేనియు నపుడు దా రేఁగఁ దలఁచి. 213
ఉ. ఆసుదతిం గనుంగొని తదంగన యప్పుడు హెచ్చినట్టి వే
రీసున నీసడించుచు నొకించుక నీకును సిగ్గు లేదొకో
దోసము గాదె యిద్దఱు వధూవరు లేకత మున్నచోటికిం
డాసిన నిట్టియాసలఁ గడంగిన నేమని చెప్ప నావుడున్ 214
వ. ఆరంభ యమ్మాటలకు నలిగి రోషకషాయితవీక్షణంబుల నాపక్ష్మలాక్షి నీక్షించి.
శా. ఓసీ నీకొఱగామియే యిది నిజం బూహింప కిట్లింగజ
వ్యాసక్తుం డగునాథుచేష్టితము గా కైనం గుబేరుండు లేఁ
డో సుత్రాముఁడు లేఁడొ పద్మజుఁడు లేఁడో ధర్మపుంబ్రాపు లే
దో సత్యంబును నిల్ప నింతన కడుం ద్రుళ్లంగ నీ కేటికిన్. 216
క. అనిన విని నాయకాదర, ఘనగర్వము నిరసనంబు గడుఁ జిత్తములోఁ
దనరఁగ నవ్వులు కించుక, యును గైకొన కవ్వధూటి యుద్ధతిఁ బలికెన్. 217
క. అఱపు లుడిగి పోపో నీ, యఱచేతం బండ్లు వచ్చినప్పుడు మమ్ముం
గఱచెదవు గాని తగునెడ, మొఱయిడు మది యొట్టి దైవములు వినియెడినో. 218
వ అనుటయు. 219
క. కానిమ్ము వేగిరింపకు, నీనుదుటనె ప్రొద్దు వొడిచెనే యేదైవం
బైనను విన నిప్పుడె యిదె, నానిజ మేర్పఱచి నీకొనర్చెద శిక్షల్ 220
వ. అని పలికి యచ్చోటు వాసి కొన్నియడుగు లరిగి యంతటఁ దనకోపంబును మిం
చి దీపించు ప్రియవియోగదర్పితానల్పకందర్ప హేతిఘాతజాతచేతస్తాపంబునకోప
క యాపడఁతి కడుం గృశించి గళితకంకణ యగుచు నిలిచి యొక్కయుపా
యంబు చింతించి తిరిగి వచ్చి యిట్లనియె 221
క. నీవిచ్చో మెఱయత వై, కావరమున వలసినట్లు గయ్యాళింపం
గా వెఱచి పెద్దమొఱ గా, దే వీరిని వారిఁ దగిలి యేల వచింతున్. 222
క. నీవును రా రమ్మిప్పుడు, దేవసభం దేఱి యేఁగుదెంత మనుచుఁ దా
నావనజాక్షిని డగ్గఱి, తీవరమునఁ గొంగుఁ బట్టి తిగిచెం గినుకన్. 223
చ. తిగిచినఁ జూచి తే నిను మదిం గణియింపక యెంత సేఁతకుం
దెగియె భయంబుదక్కి పెనుద్రిమ్మరిరక్కసి గాక భూమిలో

మగుపయి యాగయాలి ప్రథమంబున నోర్చినతప్పు సూవె యీ
పగిది ఫలించె నంచుఁ బ్రియుఁ బల్కెఁ గరం బది సంభ్రమింపుచున్. 224

క. పలికిన మనకేమీ విబుధులసభలోపలన తనదుదుండగ మెల్లం
దెలిపి తగుశిక్ష సేయుద, మలిగి యిపుడు పదర నేల యని యతఁ డాడెన్. 225

తే. అంతఁ బ్రతిరంభ చూచి నీయాత్మలోన
నింత యుండిన నీసత్వ మెఱుఁగవలయుఁ
దిరుగఁబడినను విడువఁ జూ దేవసభకుఁ
బద మనుచు దానిఁ గూడి పోఁ గదలుటయును. 226

వ. కొంత చింతించి యి ట్లనియె 227

సీ. అప్సరఃస్త్రీలలో నగ్రగణ్యత్వంబు జగదుపశ్లోకితంబుగ వహించి
యూర్వశీమేనకాద్యుత్తమస్త్రీలు రావమ్మ పోవమ్మ నా నతిశయిల్లి
యెన్నండు నెచ్చోట నెవ్వారిచే వ్రేలఁ జూపించుకొనక ప్రస్తుతికి నెక్కి
నలకూబరుండు ధన్యతరుండ నా గరువతనంబుచే నీకు వన్నెఁ దెచ్చి
తే యొప్పునే యింకఁ గడపట నిప్పిశాచి, నాకు సరిచేసికొని దేవలోకసభకు
నీవు సూ నీవు సు మ్మని యేవిధమునఁ, గలహ మాడెద నిది నీవె తలఁచిచూడు.

క కోపము పాపమునకుఁ బో, త్రీపెనుఁదగవునకుఁ దగఁగ నేతిట్లాటల్
ప్రాపించునో పడంతుల, కోపురుషశ్రేష్ఠ యువియు నొక్కబ్రదుకులే 229

వ. అదియునుం గాక 230

క. రంభకు నహహా యొకప్రతి,రంభ గలిగి తిగిచి తెచ్చె రచ్చల కనినం
స్తంభింపనీరు హాస్యా,రంభణ మీపోరు నిర్జరవిటుల్ నగుచున్ 231

క నానడకలకును యోగ్యము, కానిది యిపు డిచట నైనఁ గలహమ బ్రదు కె
ట్లైన నగుఁ గాని ఘనుఁక నీ,యాన ధరణి విడిచి దివికి నడు గటు వెట్టన్. 232

క. ఈకలహ మపుడు వినఁబడు, నాకంబున సురలయానపము లేగతి నా
లోకింతుఁ దెగినఁ దెగనీ, నాకు మరుఁడు నిన్ను నిలు మనఁగ రాకునికిన్. 233

వ అనుడు రెండవకొమ్మయమ్మాట లాకర్ణించి యోకాంతుండ యీకాంతనేర్పుచూ
చితే వేల్పులకడకు నేతెంచినఁ దనమాయ బట్టబయలం బడు ననియెడుతలం
పున రాఁగూడక సురలయానపంబు లేగతి నాలోకింతు నని నాకగమనంబు పరి
హరించె నిందును ధరణివిడిచి దివికి నడు గటువెట్ట నని తోడిఁబడన నీమీఁది
యానపెట్టుకొనుట ఖేచరత్వంబుకలిమియు సందియంబ యింతతడవు ప్రియ
కాంత యనుచు నెట్లు నమ్మి తని పల్కిన నది వివేకమార్గంబ యగు నని నలకూ
బరుండు తద్వాక్యంబులకు నిరుత్తర యైయున్న తనదండ చెలువనుండనీక యోసి
మాయలాడివిగదె యని మెడపట్టి పాయం ద్రోయుటయు నదియు సందుగా నా

యిందుముఖి నందందదట్టించి యిట్టివెడ నేఁతలచేత నాథుని కెడ నేసి చేతోజాత హేతిభూతంబులపాలుపఱచి తని పలికి యాతరళాక్షిని హేతిభూతనిమిత్తంబు చేతన కాయవియోగంబు నొందు మని శపించె నలకూబరుండును దత్కా-లం బెట్టిదియో కాని యాగ్రామములు వివేకింపలేక యిది యిట్టిశాపంబునకుఁ దగు నని పలికి యోసి నీవె రెద్ది యెట్టిదాన వని యడిగె నప్పుడు తత్ప్రతిరంభ సైరింపక. 234

శా. ఇందాఁకన్ నినుఁ జేరనీక నను నక్లింతే మనోజవ్యథన్
గుందం జేయుట చాల కే మడిగె దీగొంటన్ వృథా యంచు నా
కందర్పత్వరఁ గాన లే వనుచు నాకంజాక్షిఁ బోద్రొబ్బెఁ దా
నెందున్ నిల్వఁగనీక పేరలుకతో నెంతేఁ గడున్ దవ్వగన్. 235

వ. అని చెప్పి యాసిద్ధుఁ డాసుముఖాసక్తి కి ట్లనియె 236

తే. అట్లు పోద్రొబ్బుటయు నతఁ డాత్మ నిచ్చ
గించుకొని యుండెఁ గాని తా నెంచఁ డయ్యె
రంభ యాగ్రాము లాప్రతిరంభ మీఁది
ప్రేమఁ గాముకుల్ నూతనప్రియులు గారె. 237

క. అనుటయు నీ వం దేయింతిని సత్యపురంభ యనుచుఁ దెలిసితి వాలా
గున భంగ మొంది యూరక, చను టరయఁగ నదియ కపటసతి గావలయున్.

క. త న్నట్లు పలికి ద్రొబ్బఁగ, మిన్నక చన నంత నోరు మెదపక యది యా
ము న్నాడినమాటలబిఱు, సెన్నఁగ నిది గనియె యతఁ డుపేక్ష యొనర్చెన్.

క. అది యట్టిద కాని మ్మా,తుద చెప్పుము సిద్ధపురుష తొల్లి యెచటఁ గ
న్నది విన్నదిగా దద్భుత, మిది వినవలయు నన నాతఁ డిట్లని పలికెన్. 240

సీ. ఇఁకమీఁద నింక నొక్కటి యద్భుతము విను మోహవాజానన యాపడంతి
నారీతి నెంతయు దూరంబుగాఁగఁ బోద్రొబ్బి యేతెంచి యాతోయజాక్షి
ప్రియుఁ జూచి మగవారిప్రేమ లిట్టివిగదా యెట్టు నమ్మఁగ వచ్చు నిచ్చలోనఁ
బ్రాణేశ యటు దండ వాసినమాత్ర నీ ద్రిమ్మరి నెచ్చోటఁ దెచ్చుకొంటి

తే. నిన్ను నే మన నున్నది నిరభిమాన
గుణత నినుఁ జేరు నన్ననుకొనుట గాక
నాకునా యిన్ని పాట్లంచు నాకులమతి
నడలెఁ గన్నుల బొటబొట నశ్రు లొలుక. 241

చ. అడలిన నాదరంబునఁ దదశ్రుజలంబులు కేల నొయ్యనం
దుడుచుచు నాయెడం గలదె దోస మొకింతయు నెంచి చూడ నో
పడఁతుక దాని నీవ యనుభ్రాంతిఁ గరం బిటు లాదరించి యే
ర్పడినఁ బరిత్యజించితిని బట్టఁగరా దిది తప్పుగా మదిన్. 242

మ. అని యింతిన్ నలకూబరుం డురముతో హత్తించుచున్ దుఃఖ మూ
ర్ఛి నికుంజంబునకున్ రతిక్రియకు నై చేర్పంగ వేఱొక్కఁడం
తన వచ్చెన్ నలకూబరుం డచటికిన్ నారూపముం దాల్చి వం
చన నెవ్వాఁడుర చేరినాఁ డట దురాశన్ రంభ నంచున్ వెసన్ 243

తే. ఇట్లు వచ్చినఁ గనుఁగొని యేను మిగుల
నుల్లమున వెఱఁ గందితి నొకటివెనుక
నొకటి రాఁ జొచ్చె మాయ లీయుర్విమహిమ
తెలియఁగు గాదు గదా యని ధృతి చలింప. 244

సీ. అట్లుఁగుఁదెంచుచో నతని గన్గొని రంభ బెదరు నాశ్చర్యంబు మది జనింప
విభున కిట్లనియె వల్లభ యిది యొక్కమాయాప్రపంచము చూడు మద్భుతంబు
నీదురూపముఁ దాల్చి భేద మొక్కించుకయును లేక కాన్పించుచున్నవాఁడు
తనదురూపము నీవు ధరియించినాఁడ వంచున్న వాఁ డిది గెల్వయుక్తి చెపుమ

గీ. యపుడు నారూపుతో నది యన్ని వెతలఁ
బెట్టె నది గడచితి మన బెట్టిదముగ
నిపుడు నీరూపుతోడ వీఁ డేఁగుదెంచెఁ
దిరుగఁ డొకమాత్రమున వచ్చుబిఱుసుఁ జూడు 245

క. మనయభిమతఖేలనములు, మనమున నైరింప కెన్నిమాయ లకట యే
దనుజుఁ డొకో మాత్సర్యం, బొనరఁగఁ జలపట్టి పన్నుచున్నాఁడు గడున్ 246

వ. అని పల్కుచుండె 247

శా. అంతం జేరఁగ నేఁగుదెంచి యతఁ డోయబ్జాక్షి యే మంచు వి
భ్రాంతిం బల్కెదు కల్లయున్ నిజము వీఁడా వొందఁగా నిప్డు నీ
కాంతున్ నన్నుఁ బరిగ్రహింపుము మదాకారంబు వీఁ డెవ్వఁడో
యెంతే నొప్పుగఁ దాల్చె వంచితవు నీ వేతన్మహామాయ చేన్. 248

మ. మది నామాటలు నమ్మవేనియు నికన్ మమ్మిద్దఱిన్ ధైర్యసం
పదఁ బెం పారఁగ దవ్వులన్ నిలిచి యోపద్మాక్షి వీక్షింపు మే
నిదె ఖండించెద వీని మామకమహాహేతిప్రకాండంబుచేఁ
దుద శోధించెదు గాని నీకుఁ గలయుక్తుల్ మీఱ నాసత్యమున్ 249

చ. అన విని చాలఁ దల్లడిలి యాయక నాయకుకంఠమున్ రయం
బునఁ దనకౌఁగిటం బొదివె భూరికృపన్ ననుఁ గావ రే ప్రియున్
మనుపరె వేల్పులార యొకమాయపురక్కసుఁ డాక్రమించి తాఁ
దునుముచు నున్న వాఁ డలుకతోన నిరాయుధు నంచు నేడ్చుచున్ 250

చ. అది గని వాఁడు నవ్వి యిది యూర వివేకము గట్టి గాఁగ న
న్నె దనుజుఁ జేసితే ముగుద నీవు దలంకకు నే నిరాయుధున్

మదముఱి పాఱువానిని బ్రమత్తుని జంపెడువాఁడఁ గాను నా
కెదిరిచి నిల్చునో యనుచు నీతనిఁ ద్రుంచెద నంటి నిత్తఱిన్. 251

వ. ఎదిరించి నిల్వనోపునేని తనకైదు వెచ్చట నున్నది తెచ్చుకొమ్మను మొఱొమ్మ నెన్నునంబున నితండ నిక్కపునలకూబరుం డనియు యుద్ధంబున జయాపజయంబు లెంచినట్టు రావు తోడింబడ నితని కొక్కటియయ్యేనేని యేనేమి యగుదాన ననియు విచారించితేని నితనితథ్యమిథ్యాభావంబు లేర్పడునందాఁక నేనును యుద్ధంబునకు వేగిరింపక సహించెద నింకను మాయిరువురవాక్యప్రకారంబులు వినియు నీవెఱింగినపూర్వరహస్యంబు లడిగియు మఱియు నుచిత మగుతెఱంగులవలన మాకపటాకపటవర్తనంబులు దెలిసికొనుము నాకుం బ్రియవనిత వైననీవు నాయెదుటన యిట్లు పరుని గంఠాలింగనం బొనర్చియుండ నిచ్చలోన మచ్చరంబు పెచ్చుపెరుఁగక యుండఁడు పెచ్చుపెరిఁగెడుమచ్చరంబు సత్యాసత్యవివేచనపర్యంతంబు నిలువ కెట్లొనర్చునో యెఱుంగరాదు గావున నాత్మహితంబుగోరితేని యతని విడిచి యెడ గలుగ నిలిచి నాపలుకులు వినుమనిపలికిన.

క. ఆచెలువ తనదుప్రియునిం, గాచుకొనఁగ నప్పు డదియొ గతిగా మది నా
లోచించి చూచి మఱి తద్వాచాగతి నతని కెడగఁ దాఁ జని నిలిచెన్. 253

క. అతఁడు నోతొయ్యలి యిపు, డీతని యూకత్తి గిత్తి యేను గణింపన్
భీతిలకు మన్న మానవు, భీతప్రకృతి వని యొప్పెఁ బ్రియ యటు చనఁగన్.

శా. ఆరీతిం గడ కేఁగి తా నిలిచి ప్రేమాంచత్కటాక్షంబులన్
ఘోరాసూయనిరీక్షలన్ వరుసఁ గాంతున్ దత్సమాకారు న
న్నారీరత్నము చూచుచుండె నెచటన్ వ్యర్థంబు లత్యుజ్జ్వలా
కారశ్రీసమతల్ జనించు ననురాగంబుల్ మమత్వంబుచేన్ 255

సీ. రెండవనలకూబరుం డంత రంభఁ గన్గొని చెల్వ భావించుకొనుము నీవ
యమరేంద్రుఁ డంప నిం దరుగుదెంచితి గద మణికంధరునితపోమహిమఁ జెఱుప
నతని నేచెట్లఁ గట్టితి వీతఁ డెచ్చోట లంకించుకొనియె నలంఘ్యమైన
విరహతాపంబునఁ బొరలుచు నీరాక కెదురుచూచుచు నున్నయే నటుండ

తే. నకట సురకార్యవిఘ్నమో యనుభయమున
వెంట రాలేనిపాప మివ్వేతలు దెచ్చెఁ
దేరకాఁ డిట్లు నిన్ను భ్రాంతిని బొరల్ప
బాస సేయంగవలసె నే భర్త ననుచు. 256

మత్తకోకిల. వెంట వచ్చిన నీవు నాపయి వేడ్కఁ జిక్కి తపఃక్రియల్
గెంటఁ జేయ నెఱుంగ కుండినఁ గీడు వాసవుచేత నే
వెంట రాకటు నిల్చినన్ ననవింటివానికిఁ గోప మీ
రెంటఁ జింతలు గొంతప్రొద్దొనరించినన్ బిఱువీఁకుగాన్. 257

మత్తకోకిల. అంతఁ గంతునిపంత మెంతయు నంతకంత కనంత వి
భ్రాంతిఁ బర్వఁగ నోర్వ కెట్టటు కాని యింద్రునియల్క నై
రింతు నంచును సాహసం బొనరించి యే నిటు వచ్చితిం
గొంత వెండియు నింద్రు నెంచుచుఁ గొంచితిక్ నిను డగ్గఱన్. 258

చ. తపసితపక్రియల్ చెఱిచి దైవతకార్యము నిగ్రహించి నీ
వెపుడెపు డేఁగుదెంతు నిను నెప్పుడు కౌఁగిటఁ జేర్తు నంచు నే
నపరిమితాశ నోజలరుహాసన యివ్వనిచేరువం బ్రియా
నపడుచు నిల్చికొంటిఁ బికసంచయపంచమవంచితాసువుల్. 259

క. ఇక్కడ నిను వీఁ డెవ్వఁడొ, యిక్కరణిక్ మోసపుచ్చి యేలుకొనంగా
నక్కట వలవనిశంకల, నక్కడనే పాడుకాఁపులాగతి నుంటిన్ 260

ఉ. ఇంతకుమున్ను నారదమునీశ్వరుఁ డచ్చటి కేఁగుదెంచి నీ
వెంతయు మన్మథార్తిఁ బడి యేమిటి కిచ్చట నున్న వాఁడ వో
భ్రాంతుఁడ నీదురూపమున రంభ నొకం డవలం గరంబు వి
భ్రాంతిని ముంపుచుక్ వివిధభంగుల నేలుచు నున్న వాఁ డనన్ 261

క. విని వచ్చితి నేసమయం,బున నేగతి సందుకొనియెఁ బొలఁతుక యితఁ డీ
తని తెఱఁగుఁ జెప్పుమన నే,నని చెప్పెద నను చుఁ జూచె నది ప్రియు మొగమున్.

తే చూచుటయు నేమిచూచెదు శోభనాంగి, నిన్నుఁ జెందినపాల్లెల్ల నన్నుఁ జెంద
కుండు నేనాఁటియలనారదదోష్ట్రియరయ, నాఁడు నీతోడ నమ్మునినాయకుండు.

క. నినుఁ బోలువనిత నీకును, వనజముఖి యితనిఁ బోలువాఁ డితనికి నెం
దును గలిగి కలంచునో యి, ట్టినిగాఢపుసొంపుమదము తీవ్రులు చనునే 264

క. అని పలికెఁ గాదె యది వృథ, చనునే యైనను లతాంగి శంకింపకు నీ
మనమున నీగతి నిప్పుడు, తునిమెద నాఖడ్గమునను దుర్గమలీలన్ 265

వ. ఆఖడ్గం బపు డల్లయచటకేళినికుంజంబునం బెట్టినవాఁడ నిదె తెచ్చుకొనియెద నని పోవం జూచినఁ దత్ప్రతిభటుండు నీకింతబీరంబు గలిగినం బోరు దూరంబు చేసి యిటు నటుం జన నేల నిరాయుధు నంటేని నేను నాయుధం బిదె విడిచితి నని విడిచి యడ్డంబుగా నడిచిన బెడిదంపుటీరసంబును వీరరసంబు ఘోరంబు లగుచు నుల్లసిల్ల మల్లయుద్ధం బాయిద్దఱకుం దద్దయుం బ్రవర్తిల్లె నప్పు డొం డొరులయుద్దండదోర్దండచండాస్ఫాలనాక్షీ లఘోషవిజృంభణంబులుకుంభినీధర గహ్వరసముద్ధతప్రతిధ్వానంబులచేత నినుమడించి ప్రళయజలధరవర్గనిర్గళితంబు లగుబలుపిడుగుల మ్రోఁత ననుకరింప నిశ్శంకనిరంకుశాహంకారహుంకార గంభీరారావంబులయార్భటులు నిర్భరసముద్భటంబు లై దిగ్భిత్తులఁ బిక్కటి ల్లుచు ప్రక్కలింప నొక్కొక్కరిమిక్కుటపువిక్రమంబుల పెక్కువ లెక్కగొనని యక్కజపుఁబేరుక్కున మిక్కిలి పేర్చునిచ్చలపుటగ్గలికలఁ దగ్గుమొగ్గు లేక డగ్గఱి

యాగ్రహంబు నెఱప నొడ్డారింపుచు గడ్డురకనీక యడ్డంబుగా నొడ్డుకొనియొడు నెదిరిపిడికిలి పాయం దట్టి బెట్టిదంపుటురువడిం దోడింబడఁగఁ దీసి కీలాగరిష్ఠ నిష్ఠురముష్టిఘాతప్రయోగనైపుణంబుల దీపించుచుఁ గోపంబున నేపుచూపెడు నాటోపంబుల నాఁపరానియనూనంపుబిఱుసునుం బరుసఁదనంబునుఁ హెచ్చఁ జెచ్చెరఁ జొచ్చి పట్టికొని హెచ్చరికం గచ్చె వదలక పెరిఁగెడియచ్చలంబును బలంబును బ్రబలంబుఁ జేయుగళంబుల ముంజేతు లిడి పెడమర నొక్కిఱెక్క విఱిచి పడవైచియుఁ బడవైచిన విడువక తోడన పసనిం బడం దిగుచుచుఁ దిగిచిన బిగి వదలక పయింబడి కదలమెదలనీక పొదివి పట్టుచుఁ బట్టిన నిట్టట్టు పెనంగి పట్టువదలించి కరంబులు నురంబుల నడిమికి ముడించి యొడముకొని బడి బడిం బొడుచుచుం బొడిచినఁ బొడవనీక కడిందికడిమి నడంగం బట్టి పగతు చేతులు తొడలనిఱికి పరాక్రమించుచుఁ బరాక్రమించినను విక్రమంబు దక్కక వెనుకటిదట్టికట్టు పిడికిటఁ దొడివి యెత్తి తెరపిగొని పఱపి మోఁకాళ్లు వక్ష స్థలంబున నానివెల్లకిలఁద్రెళ్లబిళ్లమీఁటుగాఁ జిమ్ముచుఁ జిమ్మి ముమ్మరపువేగంబు తోడన లేచి పైఁబడఁ గడంగిన నెడయీక పదంబులు చాఁచి యొదు రొడ్డుచు నఱిముఱి నొక్కింత తఱిఁ గని యద్భుతరయంబున దిగ్గన లేచి మెడ యొడిసి పట్టి గ్రుడ్లు వెలి కుఱక నొక్కుచు నొక్కినఁ జిక్కువడక యొకకేలఁ గోకకట్టు నొక్కకేలఁ దొడయుఁ బట్టికూలవైచి మఱియు మల్లచఱచి క్రమ్మఱ లెమ్ము రమ్మని గర్జిల్లుచు గర్జిల్లిన నూర్జితరయంబున మగుడఁ దలపడిపౌరుషంబు సేయుచు వెండియుం బాయుచు డాయుచు ననేకప్రకారంబులఁ బోరుచుండ. 266

ఆ. అట్టియెడను బచ్చపట్టుదట్టీచేత, నొప్పుతనదుప్రియుని నుజ్జ్వలంపు
ఠీవి నెఱపుచంద్రకావిదట్టీచేతఁ,బరుని గుఱు తెఱింగె సురవధూటి 267

క. ఇక్కరణి నించుకంతయు, నెక్కువతక్కువలు లేక యిరువురు సరిగా
నుక్కునఁ బోరాడి శ్రమం, బెక్కుడుగాఁ జేసి నిలిచి రెడగా నంతన్. 268

ఉ. రంభయు వారిరూపు ననిఁ బ్రౌఢియుఁ దుల్యతఁ బోల్చి సంశయా
రంభ మొనర్ప నెవ్వరిఁ దిరంబుగ నమ్మ కహో నిలుండు సం
రంభము మాని యే నడుగుప్రాక్తనవర్తన మొక్కటిఁ రహ
స్సంభవమైనదాని వరుసన్ వచియింపుఁడు మీర లిత్తఱిన్. 269

క. దానన్ సత్యాసత్యత, నే నామతికొలఁది నిశ్చయించుకొనఁగ నె
వ్వానికి నెయ్యది యుచితం, బానియతి యతండు పోవు టర్హం బనియెన్. 270

వ. అని యావనిత యాడుమాటకు వార లియ్యకొన నిద్దఱుం బాయం బాయఁ బిలిచి యొకఁడు వినకుండ నొకనితోడ మనకుఁ దొల్లి కళాపూర్ణుం డనువాని ప్రసంగం బెచ్చటఁగలిగెఁ దత్ప్రకారం బేమి నీవు వింటి వని యడుగుటయు నందు ద్వితీయుండు దానికి సమ్మతంబుగా నుత్తరం బిచ్చెఁ బ్రథముండు వెలవెలం

లుచు నూరకుండె నయ్యుతివయు నతనిం జూచి కటకటా యిందాఁక నేను నిన్ను
నిక్కపుఁబ్రియుం డనుచు నమ్మి యుండితి నీవు కపటరూపధరుండ వేయని యద్భు
తంబును జుగుప్సయు భీతియు నాకారంబును దీపింప నతని విడిచి యితరునిం బరి
గ్రహించె నతం డమ్మాయ విలోకించి యతని నల్పావశిష్టాయువుగా శపియించె
నప్పుడు రంభ యక్కపటవర్తనుం జూచి నీవెవ్వండ వెవ్విధంబున నిట్టిరూపంబు
ధరియించి నన్ను వంచించి తని యడుగుటయు సత్యనలకూబరుండు 271

సీ. ఇందాఁక నినుఁ జేరనీక నన్నిట్లలయించుట చాలక యింక నిలిపి
వాని నే మడిగె దెవ్వఁడు గాక నీకేమి యిది కాకదంతపరీక్ష సుమ్ము
నామన్మథార్తి యెన్నఁగ వలదే చాలు రా రమ్మటంచు నారంభ నప్పుడ
తోడ్కొని చనియెను వేడ్కతో మోముఁదామర వికసింపఁగా సురపథమున

తే. నంత నితరుండు చింతతో నంత నింత
గొంతవడి నిల్చి దీనతఁ గొమరుఁ దఱుఁగఁ
జనియె మణికంధరునిసర్గశాలదిశకు
నల్లనల్లన మిక్కిలి యలసగతిని. 272

వ. అట్టియెడ మున్నతండు తనకేళికానికుంజంబునం బెట్టిననాపట్టంబుఁ బుచ్చు
కొని తత్సంతోషంబున నుబ్బుచు నిచటికి వచ్చితి నివి యిచ్చినప్పుడు మద్గురుండు
నాతోడ దీని నెవ్వరి నేయం బూనితి వవశ్యంబును వారిని వధియింపక
మానదని యానతిచ్చినవాఁ డేను నిమ్మహాయుధంబు కలభాషిణికంఠంబు వ్రేయ
నట్లు పూన్చితిం గావున నప్పటికిఁ దప్పి చనియు మీఁదట నవశ్యం బగు నని పలు
కుచు నంతం గలభాషిణిం జూచి కడమ పలుకక గ్రుక్కుటయు నాకలభాషిణి
యతని నీక్షించి సంకోచం బెల భవితవ్యతావశంబునఁ గా నున్న యర్థంబు గాక
మాన దనుటయు నమ్మాటకు మెచ్చుచు నతండు. 273

క నీవు వివేకధురీణవు, గావున నిమ్మాట యంటి గాక యవశ్యం
భావి యగుదుఃఖమును జను,నే వాక్రువ్వంగ నిజము నిష్ఠుర మెందున్ 274

తే. ఇంక నీవృత్త మెఱిఁగింపు మేను బలిమిఁ
బట్టి మొఱఁ బెట్టునిను డించి పాఱిపోయి
క్రమ్మఱఁగ వచ్చి మఱి నిన్నుఁ గాన నెచట
నుండి తడి మొనల్కొని చెప్పు మువిద యనిన. 275

శా. మేఘాంభోనిధికామధేనుసురభూమీజాతచింతామణి
శ్లాఘాలంఘనజాంఘికత్వపముదంచద్దానలీలాసఘం
టాఘోషానిశఘోష్యమాణరిపూన్నశ్రీకటాక్షోదయ
ద్రాఘీయోధనసంపదూర్జితయనంతప్రాభవస్ఫూర్జితా 276

క. కంజముఖీలోచన జీవంజీవాజీవమృదునవస్మితశోభా
మంజులముఖచంద్ర సదా, రంజితవిద్వత్కవీంద్ర ప్రణుతోపేంద్రా. 277

స్వాగతము.—
నిర్వికారమధరణీభరణాంకా, గర్వితారిజయకర్మవిశంకా
సర్వదిక్ప్రవిశంకటకీర్తీ, శర్వరీరమణసన్నిభమూర్తీ 278

గద్యము. ఇది నిఖలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య తనూభవసౌజన్యధేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందుఁ దృతీయాశ్వాసము



శ్రీ ర స్తు.

# క ళా పూ ర్ణో ద య ము

## చ తు ర్థా శ్వా స ము



సౌభాగ్యవిభూతివి
లాసాలంకార నిత్యలలితాకారా
భాసురయశఃప్రసూనసు
వాసితసకలాశ కృష్ణవసుధాధీశా. 1

సీ. ఆవధూమణి నవ్వి నావర్తనము నీవ చెప్పితి వింక నేఁ జెప్పవలెనె
గురుసత్త్వుఁ డగునలకూబరుచేఁ బట్టువడి నీవు నను జూపఁ గడఁగి యట్లు
వచ్చుచో నెదురుగా వచ్చినరంభ నేఁ జొమ్ము నిన్ విడిపించి యిమ్మెయిఁ జని
యభిమతం బైనయ ట్లంగజలీలావిహారంబు సలిపితి నంతలోన
తే. నరుగుదెంచినయదియ సుమ్మాద్యరంభ, యారమణిఁ బ్రాణవిభుఁ డండఁ జేరనీక
యవ్విధంబునఁ బోరాడి యంతమునను, దద్గతిని శాపమొందినదాన నేను. 2

చ. అన విని వార లందఱును నత్యధికం బగువిస్మయంబునన్
మునుఁగుచు నెట్టిటూ చెపుమ ముద్దియ యేగతి నట్లు రంభరూ
పును ధరియింప నేర్చితివి పొందుగ నెమ్మెయి నందుకొంటి వా
యనఘుని నట్లు గూడఁగఁ జిరాభిమతం బిది నీకు నావుడున్. 3

సీ. ఆకాంత సిద్ధు నాలోకించి నిన్ను నవ్విధమునఁ దర మెదువేళఁ దనదు
ప్రాణేశువెంటన యారంభ గదలి తా నేతెంచి నంతట నిట్టి యొకటి
యెదురుగా వచ్చుట కెంతయు శంకించి యటముందు పోవక యచట నిల్చె
నప్పుడే నీక్షించి యదియ వచ్చినయట్లుగాఁ దదాకృతి గట్టి గాఁగఁ దాల్చి
తే. వచ్చితి నతండు నినుఁ బట్టి తెచ్చుచోటి
కాచెలువ దాక మసలుట యతని కెఱుక

పడక యునికి నాకృతి వేషభాషణాదు
లాగతిని యున్కి నాచేత లమరె నట్లు. 4

తే. ఆచెలువరూప మెట్లట్ల యగుచు నుండఁ
దాల్చునేరుపు మున్నొకతఱిని నాకు
నారదుం డిచ్చె నదియు వినంగఁ బడియెఁ
గద యతండ చెప్ప నీకు మాకలహవేళ 5

క అమ్మెయిఁ జెప్పియు నతఁ డపు, డమ్మాయారంభ యిది యటంచు నునుఁ బ్రకా
శమ్ముగఁ జేయక కారుణ్యమ్మున మన్నించె మన్మథాకృతిఁ గనుచున్ 6

వ అది యెల్లఁ జెప్ప నేమి కడపట నిట్టిశాపంబునకుఁ గారణం బైనయారూపు రోసి యది యంతయు నుజ్జగించి యవశ్యభోగ్యం బైనతచ్ఛాపఫలం బిద్దేవిసన్నిధి ననుభవించినఁ బరోపకారం బగు నని వచ్చితి నని చెప్పి కలభాషిణి యమ్మణి
స్తంభున కిట్లనియె 7

తే నీదుగురుఁ డన్నయట్ల నీనిశితఖడ్గ, మవితథోద్యను మగుట సువ్యక్త మయ్యెఁ
దిరుగ నిన్నును నన్నును దెచ్చె దైవ, మిచ్చటికి ధన్య నైతి నీ యిష్ట మొందు.

చ అది యటు లుండె నాపదుప్రయాసము లూరక పోక యుండ న
ట్లొదవెఁ బ్రియుణ్ భజింప నని యుండఁగఁ జెప్పితి వీవు దానికిన్
గొద గలుగంగ సత్యనలకూబరుఁ డొక్కఁడు వెఱ వచ్చి యా
తుద నతనిన్ శపించె నని తొల్తటియాకపటాత్ముఁ డెవ్వఁడో 9

క. అన విని యేమియు మిక్కిలి, యనఁబోయెదు సుమ్ము తరుణియ ట్లపురూపం
బున నున్న వాఁడ నేఁ జూ, మ్మని మణికంధరుఁడు పల్కె నల్లన నగుచున్. 10

వ. ఇట్లు పలికినం గలభాషిణి యాశ్చర్యంబు నొందుచు 11

క. విని నీ వపు డె ట్లారూ, పును దాల్చితి చెప్పు మని తపోహతి గావిం
చిననేర్పునంద రంభయు, ధనదసుతుఁడు గూడె ననిరి తత్సఖు లెదురై. 12

సీ అని రంభ నట్లు గూడినవాఁడ నేనె యేప్పడ విను మట్లు తపంబు చెఱిచి
మును నన్ను నది గూడి తన రెడుతనమానసము నలకూబ రాసక్త మగుట
ప్రకటంబు గాఁగ గోత్రస్ఖలితత్వంబుచే నెఱిఁగించిన నేను రోసి
దాని వీక్షించి యెందేనిఁ బోయెద నని వీడ్కొని చనుచు నవ్వేలఁది రతులఁ

తే. దనియమిఁ దదాత్మ రంజన దనరఁ గలయ
వలయు నని యంత మత్తపోవ్యయముచేఁ ద
దీయవిభురూపుఁ దాల్చి వే తిరిగి వచ్చి
పొసఁగఁ బల్కి రమించితిఁ బూర్ణరతుల. 13

వ అత్తెఱంగున నద్దివ్యాంగనతో రమించు చునికిం జేసి తత్ప్రకారంబున నొదవిన నీతోడి క్రీడ లనుభవించి యమ్మాయారూపంబునకు నద్యగఫలంబుగా నట్టిశాపం

బుఁదెచ్చుకొని యంతటఁ బుద్ధిమంతుండ నై యప్పటిపర్ణశాలకుం జని యెల్ల
మాయలం జాలించి నావీణెయు రత్నమాలికయుఁ బుచ్చుకొని యచ్చటి
మహిమలు తొల్లి యెఱింగినవాఁడ నై యిందేమివిశేషంబులు దొరకునో
యని వచ్చితి నని చెప్పి నగుచు ని ట్లనియె. 14

చ. నెలఁతుక రంభపొందు విడ నేరక యెంతఘనప్రయత్నతన్
నెలకొని యే రమింప నది నీ వయి తే మని చెప్ప నీవు న
త్యలఘుతరప్రయత్నపరతన్ నలకూబరుఁ గోరి కూడి రం
జిలఁగ నన్నండ యే నయితిఁ జిక్కితి వెట్లును నాదుకోర్కికిన్. 15

చ జలజదళాక్షి యేను మునిశాపభయంబున నెందు నేరికిం
దెలివిపడంగనీక నది ధీరతఁ ద్రిప్పుదుఁ గాని నీపయిన్
గలదు సుమీ తలంపు మనగానకళాభ్యసనంబువేళలన్
ఫల మిటు లొందె దానికిని భాగ్యవిశేషవశంబునం దుదన్. 16

చ అనుఁడుఁ గృతార్థనై తిఁ గుటిలాత్మకుఁ డెవ్వఁడు నన్ను నట్లు వం
చనమునఁ గూడునో యనువిచారము వాసెను నీదుపొందు నా
కు నభిమతంబె నీకుఁ దగ నన్నతలంపున నీతలంపు నేఁ
గనమిని ద్రిప్పుదున్ హృదయకాంత నినుం గనుఁగొన్నవేళలన్ 17

శా నీసౌందర్యవిలాసభాసురతనూనిర్మిద్రసౌభాగ్యమున్
నీసంగీతవిశేషకౌశలము నీనిర్దోషనానాగుణో
ల్లాసంబున్ నను నప్పు డెంతపరమామోదంబు నొందించునో
యాసుద్దుల్ హృదయైకసాక్షికము లే మన్నన్ వృథా యుత్తటిన్. 18

ఉ ఆవిధి నుండునంతట నొకప్పుడు నిన్నును జూచుచో మణి
గ్రీవునిపేరు దోఁచె మదికిన్ మణికంధర యేకదేశసా
మ్యావగుణంబుచే నతని నాతనియన్నను మద్దిచెట్లుగా
దైవతమౌని శప్తవిధంబు మనంబునఁ బాఱె నంతటన్. 19

ఉ. దానన గుండె ఘుబ్బుమన దా నెరియన్ విడిచెం ద్వదంగసం
గానుభవేచ్ఛ యిట్లిడినయట్టిది యాదిగ నాదుచిత్తమో
మానితశీల యంతట సమంచితతావకరూపరేఖ చొ
ప్పే నొకకొంత గల్గఁ గని యిచ్చఁ గుబేరతనూజుఁ గోరితిన్. 20

క. శాపభయంబున నెఱయఁగ, నీపై కోరిక మరల్చి నిధిపతిసుతునే
పాపపువేళను జూచితి, నో పయి సొబ గేను మఱి కనుంగొనఁ గుఱిగాన్ 21

క. ఆయక్షతనయుఁ డని ని,న్నే యేఁ బొందితిఁ *దుదన్ వనిన్ మనభాగ్య
శ్రీ యేమని చెప్పుదుఁ బడఁ,బోయినఁ బూఁబాన్పునఁ బడుపోలిక యయ్యెన్

* 'దుదన్ వినిర్మలభాగ్య.'

ఉ. శ్రీయుత మైనదివ్యమణి చేతికి నబ్బఁగఁ బారవైచి త
చ్ఛాయ యొకింత యున్కిఁ గని చాలఁ గృశించితి గాజుపూసకై
నాయవివేక మే మనుకొనం దుదఁ దన్మణి యబ్బె నన్న న
త్యాయతతత్సమాగమసుఖాప్తికి నోఁచమి నెంచి కుందెదన్. 23

ఆ. ఇట్టిమాట లిప్పు డే నాడుకొనుటయు, ననుచితంబు వారవనితపలుకు
లిచ్చకంబు లనక యెవ్వరు నమ్మెద, రదియుఁ గాక దృష్ట మన్యవాంఛ. 24

వ అని లజ్జాశోకంబు లడర నవనతముఖి యైనకలభాషిణిం జూచి మణికంధరుం డిట్లనియె నోయుత్తమవిలాసిని నిన్ను నితరవారవనితలయట్లసత్యవాదినిగాఁదలంపనంత వింతవాఁడనే నీపలికినట్ల నీకు మున్ను నాయందుఁ గోరిక గలుగుటకు గుఱుతొకటి యున్నది యది యెద్ది యంటేని నారదుండు కడపట నిన్ను నింటికి ననుప్రచు నేను విన నీతోడ 25

తే. కొమ్మ నీవాత్మలో మును గోరినట్టి,కాంతు రంభామనోహరాకారుఁ డగుచు
మెఱయువానిని గూడి రమించఁగలవు, నమ్ము పొమ్మిక నీభవనమున కనియె. 26

క. నలకూబరుఁ గూడెద వని, పలుకక యి ట్లనినసత్యభాషణుపలుకుల్
ఫలసిద్ధి నరయఁగఁ దో,య్యాలి నను మును నీవు గోరు టన్నృతం బగునే. 27

క. ఆకోరిక శాపభయో,ద్రేకవిశేషమున నెఱయఁ దెగు టరుదును గా
దో కామిని లోకమున వి,వేకింపఁగ గలవ యట్టివియు నొకొ్కకచోన్. 28

వ. రంభాసాన్నిధ్యశోభితాభినవవిలాసభాసురుం డైననలకూబరునిరూపున హత్తినట్టిచిత్తంబునకుఁ బదన్యం బెట్టిది యైనను మఱి యింపుగామియుఁ జిత్రంబు గాదు పురుషులందు నొకొ్కక్కవేళ గుణంబున నిట్టివి గలవు తత్ప్రకాశకం బైనది యొక్కకథ గల దది పాపనాశకం బై యొప్పుచుండుఁ గావునఁ దాత్పర్యంబున నాకర్ణింపుము తన్మూలంబు మొదలుకొని చెప్పెద నని యి ట్లనియె

సీ. కాంత యేఁ దొల్లి యనంతదేవవ్రతోద్యాపనకొఱకు ననంతపద్మ
నాభునిసన్నిధానమునకు వచ్చితి వచ్చి యచ్చటఁ గరం బచ్చుపడఁగఁ
గవితచే నద్దేవు వివిధభంగుల నుతిసేయుసత్కవుల నీక్షించి యిట్టి
సౌభాగ్య మేగతి సంభవించునొ యనువాంఛతో నచ్చటివారివలన

తే. నీమృగేంద్రవాహనసుద్ధు లెల్ల వినుచు, నచటి కిద్దేవి యనతిదూరాంతరస్థ
యగుటయు నెఱింగి యేతెంచి తగ శిలాక్షు,రోక్తసాహసవిధి నిష్ట మొందితిరిగి.

వ. అరిగి యద్దేవునియగ్రమంటపమున 31

ఉ. అంతము గాఁగఁ గౌతమకణాదమతంబులు భేదవాదిసి
ద్ధాంతము జైమినీయ మురగాధిపశాస్త్రముఁ గాపిలంబు న
త్యంతము నాకలించి యవి యాత్మల మెచ్చనిపాంచరాత్రరా
ద్ధాంతవిధాసమర్థనసమర్థకృతార్థమతిప్రదీప్తులన్. 32

సీ. శ్రీమహితాష్టాక్షరీమంత్రజపపరాయణుల నారాయణధ్యానపరుల
దేవతాంతరచింతనావిదూరులఁ గామరోషాదిరహితుల రూఢమతులఁ
జిదచిదీశ్వరతత్త్వవిదులఁ ద్రైలోక్యపావనచరిత్రుల బుధవంద్యపదుల
నకలంకశీలుర నఖిలశ్రుతిస్మృతిశాస్త్రపురాణవిజ్ఞానఘనులఁ
తే దమకుఁ జక్రికి నిత్యసిద్ధంబులైన, శేషశేషిత్వములు చింత చేసికొనుచు
నతనిదాస్యంబుగతిగాఁగ నరయుపరమ,వైష్ణవులఁ గంటి సభయై ప్రవర్తిలంగ.

క. కని యే దండనమస్కృతు, లనేకము లొనర్చి వార లడుగఁగ నావే
రును గంధర్వత్వంబును, వినిపించి హరిస్తవేచ్ఛవిధముఁ దెలిపితిన్. 34

ఆ. తెలిపి యోసుబోధవిలసితులార మీ, రాయనంతశయనునట్ల నాకు
నాకవిత్వసేవఁ గైకొనుఁ డని తగు, వర్ణనకుఁ గడంగ వారు చూచి. 35

సీ ప్రకృతిపూరుషులందు బహిరంతములను నెప్పుడుఁ జలింపక పరిపూర్ణుఁ డగుచుఁ
దనకు నాదియును మధ్యంబు నంతము సమానుఁడు నధికుండు నెందునుగలుగక
సర్వజ్ఞుఁడై సర్వశక్తియై సర్వనియంత యై సర్వాత్ముఁడై వెలయుచు
సర్వంబుఁ దనకు శేషముగ సర్వమునకు శేషి దా నగుచు లక్ష్మియును దాను
తే. రుచియు రవియుఁ జంద్రికయుఁ జంద్రుండువోలె
నయుతసిద్ధత్వ మొప్పంగ నాదిమిథున
మనఁగ సకలవేదాంతవేద్యతఁ దనర్చు
పరమపదనాథుఁ బొగడు నీప్రౌఢికొలఁది. 36

క. అని య ట్టిటు నాచేఁ ద,ద్వినుతులు సేయించి మెచ్చి విశ్వహితార్థం
బును జెప్పించిరి త్రిజగ,జ్జననీపరమపదనాథసంవాదకథల్. 37

క చెప్పించి యీకవితచే, నిప్పుడు గాకున్న నీకు నిఁక నొకమేనఁ
దప్పక యొదవు తిరంబుగ, నప్పరమునిపరమభక్తి యని రధికదయన్. 38

వ. ఏనును దాదృశంబైనమదీయకవిత్వధార శారదాపీఠంబునందలియందఱివినుతి
కెక్కునందాఁక మిక్కిలి మెచ్చుకొనరా దని యచ్చోటికి నంత నరిగితి ననిపలికి
యింకఁ బ్రకృతకథ వచ్చుచున్నది యాకర్ణింపు మట్లు శారదాపీఠంబునకు నేఁ
జను నప్పుడు తత్సన్నిధియందు 39

సీ. ఋగ్వేదఘోషసమృద్ధిపెం పొకచోట నొకచోట యాజుషాభ్యుదయమహిమ
సామగానధ్యానచాతుర్య మొకచోట నొకచోట నాథర్వణోక్తిగరిమ
గృహ్యసూత్రనిపాఠఖేలనం బొకచోట నొకచోట శబ్దతంత్రోపచయము
జ్యోతిషసిద్ధాంతసంఘర్ష మొకచోట నొకచోట ధర్మశాస్త్రకలనంబు
తే. లుభయమీమాంసలప్రసంగ మొక్కచోట
నొక్కచోటను బటుతర్కయుక్తికథలు

యోగసద్గోష్ఠి యొకచోట నొక్కచోటఁ
గావ్యకలకల మొప్పారఁ గనుచు నంత. 40

సీ. పదవర్ణసౌష్ఠవప్రకటనం బెంతయు నింపు మీఱంగ రువ్విచ్చి యిచ్చి
తగ నుదాత్తాదిభేదములు గెంటక పర్వఁ గనుబొమ్మచేష్టలఁ గఱపి కఱపి
యొకనెడలఁ గవళ్ళఁ దడఁబడ కుండంగ గుఱుతులు మఱిఁ బాదుకొలిపి కొలిపి
నిజశిక్షులో బుద్ధి నిలక విస్వరములు పలికిన బుగ్గలు నులిమి నులిమి
ఆ. యొక్కమండపమున నుజ్జ్వలబ్రహ్మవర్చసముతోడ బ్రహ్మచారులకను
బరమనియమవృత్తిపరత వేదముఁ జెప్పు, చున్నయట్టియొక్కయొజ్జఁ గంటి 41

క. కని దగ్గఱఁ బోయిన నా, యన రా రప్పనుచు నెవ్వ రయ్యా మీరల్
ఘనతేజంబున నొప్పెద, రనుచుఁ జో టిచ్చి మత్కులాఖ్యలు వినియెన్. 42

క. విని పూజ్యులు వచ్చినయప్పుడు ననధ్యాయ మని యప్పుడు వటుప్రకరం
బును జదువు మాన్చి నాతో, ననుగుణవిహితోపచారుఁ డై వర్తిలఁగన్ 43

సీ. మెఱుఁగారుముంజియు మేనికోమలికంబుఁ గడుదిట్టగుణముగు ల్కెడు మొగంబు
పసుపుగోచులయొప్పు బ్రహ్మతేజంబును జారుకృష్ణాజినధారణంబు
తళుకుజన్నిదము మేధావిబొట్టును జిన్ని పట్టెవర్ధనమును జిట్టతెడుపు
మొలవంకయుంగరంబులసొంపు దండపుఁగోలయు సన్నపువ్రేలుసిగయు
ఆ. నొప్పు బ్రహ్మచారి యొకఁడేగుదెంచెఁ బు, స్తకము గొంచు మిగుల సంభ్రమమున
నొజ్జయతనిఁ జూచి యోరి యేమిర కడు, నాలసించి తనియె ననిన నతఁడు 44

వ. ఏ నాలసించుటకు నిమిత్తంబు చాలఁ గలదు మీ కేమియు వినఁబడదు గావల
యు వినిపించెద వినుం డని పలికి యి ట్లనియె నట్లు మీరు ననిచిన నేఁ జను
నప్పుడు శాలీనుండు తమపువ్వుఁదోఁటలోన నొక్కలతాగృహంబునందుఁ దనపా
దంబులు సుగాత్రి వేడుకతోడఁ దొడలమీఁద నిడుకొనియొత్తుచుండ నిష్టసల్లా
పంబుల నలరుచుండి నన్నుం జూచి నగుచు నుపాధ్యాయులు పుస్తకంబునకుఁ
బంచి రే యది యిక్కడన యిదే డాచినాఁడ నని తనుయుపరిభాగశాఖఁ జూపి
కొంచుఁ బోదువు గాని యటఁ గూర్చుండు మన యెదుట నున్నయొక్కవిహార
వేదికతోడిలేమావినీడఁ జూపినఁ గూర్చుంటి నంతఁ దపయింతిమూఁపునఁ
జేయిడి యాయమ కి ట్లనియె 45

క. అమృతము సేవించితివో, రమణీ యే మైనసిద్ధరస మబ్బెనో కో
కౌమరుంబ్రాయము మిక్కిలి, గోమరొం దెడుదినము క్రొత్తక్రొత్తగ నెలమిన్. 46

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మండ్రు మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగఁ బొలుపొందుటకు నిమిత్తముఁ జెపుమా 47

వ. అనుటయు నవ్వనిత చిఱునవ్వుతోడ నాయనం జూచి. 48

లయగ్రాహి. ఏ నెఱుఁగ నేమియును దీనికి నిమిత్తము న
నూనమమతామహిమచే నైనఁ దోఁచుర్
లేనికొమరుందనము లేనిచెలువంబు నన
నోనెలఁత యీాగతిన లేనియవిగా వి
మ్మేనిపస లీవెఱుఁగ వేని వినుపింతు విను
దీనికి నిమిత్త మది యేన యనుచుఌశా
లీనుఁడు సుగాత్రి దనపై నొరుఁగ వంచి చెవి
లో నొకటి యే మనుచు నో నగుచుఁ జెప్పెన్ 49

ఉ. చెప్పిన మోముఁ ద్రిప్పి కడుచిత్రము నొందుచు నాథువక్త్రముఌ
దప్పక చూచి యే నొకటి తఌ మును వేఁడిన సమ్మతించెఁ దా
నప్పలు కేమి సేయునొకో యాజగదంబ యిఁకఌ వినుం డదిఌ
జెప్పెద నంచు మోము చెవిఁ జేరిచి యేమియొ చెప్పెఁ జెప్పినన్. 50

క. ఘనరోషుఁ డగుచు నతఁ డా,వనితయుఁ దో నరుగ దేర వడిఁ జని యాచే
ర్పనను శతతాళదఘ్నం, బనుపేరఌ వెలసియున్న హ్రదమున నుఱికెన్. 51

క. పడఁతియు నాకుం గతి దన, యడుగుందామరల కాక యన్యము గలదే
విడిచెదనే తను ననుఁ దా, విడిచిన నని పాఱి యుఱికె విభుఁ డుఱికినచోన్.

క. కడు నెడ గావున నది యి,క్కడఁ వినఁబడ దేమొ వీటఁ గలవారెల్లఌ
వడి నేఁగి వలలచే న,మ్మడు గిటు నటు నరసి యిపుడు మగిడిరి వగతోఌ 53

వ. ఏనునుం దిరిగి శాలీనుండు మున్ను చూపినచోటిపుస్తకంబుఁ బుచ్చుకొని వచ్చితి నని చెప్పిన. 54

క. విని యానిప్రవరేణ్యం, డనయంబును శోకవిస్మయవిషాదములఌ
మునుఁగుచు నాశుభదంః తు,లను జెం దెనె యకట యితరుల తెఱం గనుచున్.55

చ అదె శతతాళదఘ్న మనుసార్థపునామముతోడ నుత్తమ
హ్రదములలోఁ బొగడ్తఁ గనినట్టిది యందును బడ్డవారికిం
బ్రదుకులె యంచుఁ దప్పదు పురాకృత మెవ్వరి కైన నంచుఁ గొం
తదడవు గుందెనే నపుడు తద్ద్విజముఖ్యునిఁ జూచి యొయ్యనన్. 56

క. అనఘా! యాశాలీనుం, డనఁగ సుగాత్రి యన నెవ్వ రాదంపతులఌ
వినుతించెదు కడునుత్తము, లని తత్కథఁ జెప్పవలయు నంటి ననుటయున్.57

క. ఆయనఘులచరితము గా,దే యీపుస్తకములోనిదియు మాకు నిఁకఌ
శ్రేయస్కర మది వినుటయుఁ, బోయెం దద్దర్శనంబుపుణ్యోత్సవముల్. 58

వ. అని యాబ్రహ్మచారి తెచ్చినపుస్తకంబుఁ బుచ్చుకొని శిరంబున మోపుకొని కన్నుల కద్దుకొని తిరుగ నతనిచేతిక యిచ్చినఁ జదువు మనుటయు నతం డిట్లనుచుం జదివె 59

సీ కాశ్మీరభూమికిఁ గర్ణిక యగుశారదాపీఠమున శారదను భజించు

పూజారి బ్రాహ్మణపుత్త్రి యొకర్తు సుగాత్త్రి నాఁ బరఁగెడుకాంత గలదు
దానివరుండు శాలీనాహ్వయుం డిల్ల,టపుటల్లుఁ డత్తయింటను వసించు
నాతండు దనకడ కాకన్యఁ బ్రథమసంగమవేళఁ గడు నలంకారకలితఁ
ఆ. జేసి యనిపి దానిచెలు లింతటంతటఁ, బొంచియుండఁ దద్విభూషణాది
మహిమఁ దలఁకి పట్టె మదిని సంకోచించెఁ, దరుణి యుండియుండి తిరిగిపోయె.
ఉ పోయినఁ దద్విధం బపుడు బోంట్లు తదంబకుఁ జెప్ప భూమిలో
నేగెడ లేనిచంద మిది యేమినిమిత్తమొ యంచు మించిలేఁ
బ్రాయపువాఁడు గర్గె భళిరా యితఁ డంచు నెటైన నేఁటికిఁ
బోయెనొ కాక యెల్లి తమపోకలు చూడమ యంచు నవ్వఁగన్ 61
క. ఆయన వినఁ బ్రెలెదరు సుఁ, డీ యిట్లు గయాళులార! డిగ విడుతురు ల
జ్జాయుతులు సర్వమును దము, నేయెడ హాసాస్పదం బొకింత వొరసినన్ 62
తే అని పలికి రెండుమూఁడునాళ్లట్ల యనిపె, నల్లునొద్దకుఁ బుత్త్రిక నపుడతండు
నాడి నేభావమునఁ జూచె నట్ల చూచె, వట్టిరాకపోక లొనర్చె వానిసతియు.
వ అంత లజ్జావతికిఁ దజ్జననియనుమతిఁ బ్రియవయస్య లేకాంతంబున నిట్లనిరి. 64
ఆ పొలఁతి యాలిమగనిపోఁడుము లేమియుఁ, గలిగినట్టిచొప్పు గాన రాదు
మీతెఱంగు చూడ మేల్మేలు దంపతు, లిరువురును వివేకు లేమి చెప్ప. 65
క. కాంతుఁ డుచితజ్ఞుఁ డైనను, గాంతకు సిగ్గువడఁ జెల్లుఁ గాక కటకటా!
కాంతుఁడు సిబ్బితి కాఁ డై, కాంతయు నట్టైన నెట్లు కాఁపుర మింకన్. 66
ఆ. నలినవదన! యెన్ని నాళ్లైననఁ జిన్నకూఁ,తురవు గావు నీవు తొడఁగి పలికిఁ
దగినసేవ సేయ కగునె యూరక యుండ, నాతఁ డేమియు ననఁ డనుచు నిట్లు.
క మగవాఁడు భాగ్యవంతుఁడు, మగువకు నొప్పగునె యిట్లు మానపుబిగి గ
ట్టిగఁ దాల్పఁ దనంతన యూ,డిగ మిటు నటు సేయ నతనిడెందము గరఁగున్.68
క. గారాముసఁ దొడ్డోడన, రా రమ్మనఁ డనుచు మగిడి రానేటికిఁ గ
ర్పూరంబుతోడిబాగా, కీరాదో యాకు మడిచి యీరాదో చెలీ 69
క వెంగలివి గాక నీ వో, యంగన భోగములపంటయామని యగునీ
బంగారువంటిప్రాయము, సంగతియే యకట రిత్తశయ్యకు నొసఁగన్. 70
క. యౌవనము గలిగినప్పుడ, పూవుంబోఁడులకుఁ బతులభోగంబులు గా
కావిభవములకుఁ గొఱయే, యౌవనజాతాతి ప్రాయ ముడిగినవెనుకన్. 71
క. అన విని యా పెడమాటల, నను నేటికిఁ జంపెదరు వినరా నైనఁ బు నా
కని సిగ్గునఁ బలుకుచు నాఁ, డొనరిచి చూచెను పదియయుక్మల తెఱఁగున్. 72
వ. చూచి యెందును ఫలంబు గానక యాసుగాత్త్రి యాయన నింకేమి ప్రపంచంబుఁ
జేసిన నెఱయ నెడసిపోవుటఁ దక్కఁ బ్రయోజనం బేమియు లేదు నాకును మం
గళసూత్త్రం బీపాటిశుభస్థితి నుండుటయ పదివే లనుచు నెంచుకొనియు వేత్తో
క్కలాగున నుండక యతనికి నాయురభివృద్ధికరంబు లని వివిధాలంకారంబు

నెప్పుడు నేమరక తాల్చుచుఁ దనతల్లి యతని నేమియు నిట్టట్టాడకుండం బ్రార్థించుచుండె నదియును ప్రత్యర్థనావశంబునఁ బెక్కుదివసంబు లెడనెడఁ గూఁతుచేత నివారితదురాలాప యగుచు నోర్చి యోర్చి యంత నొక్కనాఁ డమ్మెఱుంగుఁ బోఁడితోడ. 73

ఉ. ఇట్టినిరర్థ నెందుఁ గన మే మనఁ బోయిన నీవు ముక్కలిక్ దిట్టుదు నాదుసంపదకు దిక్కగుచుక్ మొగమెల్ల నీ కికక్. బుట్టునొ యంటిమే నితనిపోఁడిమిఁ గంటిమి వట్టిగొడ్డుతా క ట్టితఁ డెంత యున్న నినుఁ గాఁచియుపెట్టుట వెళ్లఁగొట్టినన్. 74

ఉ. పూవులతోఁటకై న నటు పోయి విచారము చేసి రమ్మనం గావలయుం గదా యనుచు గారవ మొప్పఁగ నట్లు పిల్చి ము న్నావిధి కంపి యందుఁ గలయట్టిపనుల్ సకలంబుఁ జేయ నే ర్పావహిలంగఁ దా నతని నంతటఁ గట్టడఁ జేసెఁ జేసినన్ 75

తే. దివిజనుత యైనశారదా దేవిపూజ, కుపకరించుకార్యం బిది యొప్పు ననుచు నధికమోదంబుతో నతఁ డాదరించి, సంతతంబు తదేకనిష్ఠతఁ దలిర్పు. 76

క. సమధికమధుమదగరిమా,సమచంచలచంచరీకసంచయసంచా రమనోరమ సుమనోరమ, నమరఁగ నాపూవుఁదోఁట ననిశముఁ బెంచెన్. 77

సీ. నీ రెత్తువేళల నీ రెత్తుఁ బాదుపాదునకుఁ గాలువలు పొందుగ నమర్చి త్రవ్వటంబులతఱిఁ ద్రవ్వటంబులు వెట్టుఁ దగినట్టికట్టు గుద్దలి గడించి యెరువుఁ జల్లెడువేళ నెరువుఁ జల్లు గతాభిమానుఁ డై గంపలఁ దానతెచ్చి యం ట్లొత్తుపదనున నం ట్లొత్తు నెలమిఁ గాన్పించు లేఁగొమ్మలు వంచి వంచి

తే. నారువోయంగవలయుచో నారువోయుఁ,గ్రొమ్మినాటంగఁదగునెడఁగ్రొమ్మినాఁటు నొకటి విసువక యంతకంతకును హెచ్చు,వాలితోడను శాలీనుఁ డవిరతంబు.

లయగ్రాహి. అంగపరిభేదము నెఱుంగ కతఁ డీ గతిఁ గడంగి తులసీవనముఁ జెం గలుపలుం గేఁ, దంగులును జంపకములుం గురవకంబులు లవంగములు జాదు లును లుంగతతులుం గొ,జ్జంగులును మల్లెలును రంగములుఁ బాటలములుం గదలికాచయముఁ దుంగతతులుక్ నా,రంగములు నాదిగ ధరం గలుగునట్టి హృదయంగమబహూద్రుమకుడుంగములుఁ బెంచెన్. 79

చ. రవికిరణాళి కెందును జొరంగ నగోచర మైననీడచే నవిరళపుష్పరేణుయుత మై పొలుపొందుమరందవృష్టిచే నివము గొనంగఁ దద్వనసమృద్ధిఁ గనుంగొని యవ్వసుంధరా దివిజకులప్రసూతుఁడు మదిం బరితోషము నొంది యత్తఱిన్. 80

క. ఎంతయుఁ బ్రొద్దున లేచి ని,తాంతాచరితస్వజాతిధర్ముఁ డగుచు ని శ్చింతుఁ డయి గురుపరంపరఁ, జింతించి తదుక్తజపము చేసి ముదముతోన్ 81

తే. నియమమునఁ బుష్పములు గోసి నేర్పు మీఱఁ
బలుతెఱంగుల వింతవింతలుగ మాలి
కలను బొందులు కందుకంబులు రచించి
బ్రహ్మాయిల్లాలికిని సమర్పణము సేయు 82

వ. అప్పుడు సుగాత్రి పాతివ్రత్యధర్మనిష్ఠకతంబున 83

తే. తల్లిమాటలచే నిట్లు తనవిభుండు, తనువుబడలంగఁ బూఁతోఁటపనులు సేయఁ
జూడ నోర్వక తానునచ్చోటికరిగి, తోడుపడియెద ననిచూచు వ్రీడ నుడుగు.

వ. అప్పు డొకనాఁడు శాలీనుండు తోఁటకుం జని యుండ నాసమయంబున. 85

క. ధళధళ మెఱపులు మెఱయఁగఁ, బెళ పెళనుఱుముచుఁ బెల్లు పెళిలునఁ బిడుగుల్
నలుఁగడఁ బడ బెడిదపుధా,రలు గలబలువాన జలధరంబులు గురిసెన్. 86

చ. మిగుల జగంబు బెగ్గడిల మించెఁ దదుద్ధతవృష్టి యద్భుతం
బగుచు ఘనాఘనౌఘసముదగ్రనిరర్గళఘుర్ఘురార్భటీ
లగనఘనోచ్ఛలజ్జలఝళంఝళనిర్ఝరజర్ఝరీభవ
న్నగవిగళచ్ఛిలాగణఘణంఘణఘోషణభీషణంబుగన్ 87

సీ. ఉదధిసమేతపీతోద్వాంతబాడబజ్వాలాయితోగ్రశంపాలతంబు
నిర్ఘాతరవసరంధ్రీకృతాజాండబహిర్గలభ్రమదభారోర్జితంబు
నిర్జాడ్యగర్జితస్ఫూర్జథుర్జర్జితప్రళయభైరవరటత్పటహరవము
ఝంఝూప్రభంజనజాతసంఘట్టనపరిగళత్తారకత్కారకగణము

తే. నగుచు ఘనఘనాఘనసంఘ మవిరళమునఁ
బూని హోరన బెడిదంపువాన గురియఁ
గరము భూనభోంతరము చీఁకట్లు గొనియె
నఖిలలోకంబు నుదకమయత్వ మొందె 88

క. అటమున్ను మొగులు బలియుచుఁ, జిటపొట మని పాటపాటచినుకులు వడిఁజొ
చ్చుట యాదిగాఁగఁ దనపెని,మిటి దడియునొ యనిసుగాత్రిమిగులవగపుతోన్.

చ. అపుడు మనంబులోన ననయంబు పతిం దలపోసి యిట్టిఘో
రపుఁ బెనువాన నెట్లయితొ ప్రాణవిభుండ యటంచు నీకుఁ బా
పపుఁబువుఁదోఁటపాల్పడుటఁ బ్రాప్తము లయ్యె నటంచు నెంతయుఁ
విపులతరార్తిఁ జేడ్పడుచు నింగిఁ బొరింబొరిఁ దొంగి చూచుచున్. 90

క. ఓశారద యోపరమద,యాశాలిని యోమదంబ యారసి మత్ప్రా
ణేశు నటు చూడుమీ నీ,వే శరణము గాని యేను వేఱొం డెఱుఁగన్. 91

శా. ఈదేహంబునఁ బూర్వదేహములయం దేనిఁ ప్రతధ్యానదా
నాదిప్రోద్భవ మేమి యేమి గలదా యాపుణ్య మీవర్షపీ

డాదోషంబును మత్పతిం బొరయ కుండఁగ మానుపుఁగాత నే
నాదుం గావుతఁ దన్ని మిత్రపతిపాపాక్రాంతికిఁ బాత్రమున్ 92

వ. అని హృదయంబునఁ దమకులదైవతం బైనసరస్వతిం బ్రార్థించుచు నంతట నిలువం జాలక తద్వర్షఘోరతయుఁ గైకొనక యత్యంతసాహసంబునఁ దల్లియు నెఱుంగకుండ నిల్లు వెడలి తనదుపాతివ్రత్యధర్మంబులచేతవృష్టిబాధఁ బొరయక తొలంగుచుండం బోలుప వెల్లి యైనజలపూరంబు పాయ యిచ్చుచుఁ దెరువు విడువఁ బ్రాణవల్లభుం డున్నవనంబునకరిగి కడన యుండి పరికించి యప్పటియవ్వాతవర్షోపద్రవం బొక్కించుకయు లేక యాత్మసంప్రార్థితబ్రాహ్మీప్రసాదవిశేషంబున నెప్పటియట్ల శుభవర్తనంబుననున్న తనభర్తను దదారామంబును జూచి నాతల్లి యోసరస్వతీ నీభక్తవాత్సల్యచింత ప్రకటించితే యని తత్కారుణ్యంబునకు నుబ్బుచుఁ గ్రమ్మఱ గృహంబునకు వచ్చి తనవచ్చుటయుం బోవుటయు నెవ్వరికి నెఱుకపడనీక వ్రీడావశంబున నడఁగి మడఁగి యథాపూర్వస్థితిఁ బ్రవర్తిల్లుచుండె నప్పు డప్పువ్వుఁదోఁట గాటంబుగాలివానచేత నేకీడునుం బొరయకునికిజనులు వెఱఁగందుచుండి రాసుగాత్రియు మఱియుఁ గొన్ని దినంబులు లజ్జపెంపున వల్లభునియిడుమపాట్లు కోర్చి యోర్చి 93

ఉ. అంతట లజ్జ గ్రిందుపడ నత్యధికంబుగ మించి మానసా
భ్యంతరపూర్ణమైనపతిభక్తికతంబునఁ దల్లిమాట యొ
క్కింతయుఁ దాను గైకొనక యెప్పటియట్ల యలంకృతాంగి యై
యెంతయు నింపుతోడఁ జనియెఁ బ్రియుఁ డున్నవనంబులోనికిన్.

క. చని యాతఁడు దాఁ జలిపెడు, పనులకు నీయకొన కున్న బలిమిఁ గడంగెఁ
దనసొమ్ము లెల్ల నొకమఱుఁగున నిడి పిరిసుట్టు సుట్టుకొనినవలువతోన్. 95

సీ. తోరంపుఁజనుదోయి త్రుళ్ళింతల నిడంగఁ దగుచోట్లు గుద్దంటఁ ద్రవ్వి త్రవ్వి
వ్రేఁగైనపిఱుఁదు బల్విడిఁ జలింపంగను వడి నిట్టు నట్టును నడచి నడచి
యడుసుతుంపురు చెక్కుటద్దంబులను బర్వ మళ్లకు మడవలు మార్చి మార్చి
నడుము లేఁదీవియ నకనకల్ గుడువ నింపునఁ దగు మోఁపులు మోసి మోసి

తే. చిఱుచెమటఁ బేర్చువింతకొమ్మెఱుఁగుతోడఁ
గొమరుమే నొప్ప సారెకుఁ గొప్పు వదల
నేమిటికి నైనఁ దా మున్న యేఁగి యేఁగి
యొల్లపనులు నొనర్చె నిం పెసక మెసఁగ. 96

తే. పడఁతి సంభ్రమించుచు నిట్లు పనులు సేయఁ
బిఱుఁదు పాలిండ్లు గొప్పుఁ గంపించుచొప్పు
గనుఁగొనుచు నేఁచుకొనుగతిఁ గాంతుమదిని
బెల్లుశరముల వైచె దర్పించి మరుఁడు. 97

చ అపు డతఁ డట్లు పేర్చుకుసుమాస్త్రునియుద్ధతి యోఁపలేక వె
ల్తిపడుచ యెంత మాన్చిన నెఱింగెడుదానవు గావు నీకుఁ దోఁ
టపనుల కెంతదూర మకటా యనుచుం దనయుత్తరీయవ
స్త్రపుముసుఁగొంగునం దుడిచెఁ దన్వికపోలపుఘర్మబిందువుల్. 98

చ తుడిచినఁ బోక మన్మథుని దుర్జనతామహిమన్ బొరింబొరిం
బడఁతి మెఱుంగుచెక్కిళులఁ బర్వెడుఘర్మము గాంచి యంత నా
బడలిక చూడలే కిడుమపాట్లకుఁ జొచ్చి నలంగి తంచు నె
క్కుడుతమకంబుతోడఁ దలగ్రుచ్చి కవుంగిటఁ జేర్చె నత్తఱిన్. 99

క. తదనంతరంబ మిక్కిలి, పొదిగొన్న చిగుళ్ల జొంపమున సొంపగుపూఁ
బొదరింటికిఁ దార్చి సతిన్, మదనమహారాజ్యభోగమహిమం దేర్చెన్. 100

తే అట్లు దేర్చుచు సతి నతఁ డపుడు విడక
కౌఁగిట బిగించె పైఁబయిఁ గాముఁ డడర
నివి మిగులఁ గ్రొత్త లింటికి నేఁగవల దె
యని ప్రియముఁ జెప్పి విడిపించుకొనియె పతియు. 101

క విడిపించుకొని మఱుంగున, నిడినతనదుభూషణంబు లెల్లను బ్రేమన్
దొడిగి గృహంబున కల్లన, నడిచెఁ బతిచరిత్రభావనల మనములరన్. 102

క. వసివాళ్లు వాడి యప్పుడు, వసంతసమయంపు టెండవలనన్ నెఱివోఁ
గసుగందులు గందిన నవకుసుమలతికవోలె మిగులఁ గోమలి యొప్పెన్. 103

వ. ఇవ్విధంబునఁ బతియనుగ్రహంబు వడసి భాసిల్లుసుగాత్రి గృహంబునకుఁజనియె నప్పు డప్పడంతిసఖులు ముఖవికాసాదులవలనం దన్మనోరథసిద్ధి యెఱింగి నర్మాలాపంబుల వినోదించుచుండిరి తల్లియుం బ్రమోదంబు నొందె నంత నాఁటినిశా సమయంబున నయ్యంబుజాక్షికిఁ దద్వయస్యలు కౌతుకాతిశయంబున నెప్పటికంటె మిగుల నలంకరించి కేళికాభవనంబుననున్న తత్ప్రియునికడ కనిపిరప్పుడు.

సీ. గతిసంభ్రమంబునఁ గరము బెడంగుచు నకనకల్గుడుచు నెన్నడుముసొబగు గుఱుమాపుదడిమంపుఁగోకలోఁ దొలఁకెడుకంపమాననితంబకాంతిసొంపు బిగువుఁబయ్యెదలోనఁ బిక్కటిల్లుచుఁ జాలఁ ద్రుళ్లుచన్నుల నొప్పుముళ్లపేరు చెమటచిత్తడిఁ జిట్లి యమరుకస్తురిచుక్కబొట్టుతోడిపసుపుబొట్టుసిరియుఁ

తే. గునిసి సారెకు వడఁకెడు గొప్పకొప్పు
గలిగి యాకె దన్నొకటియు సలుపనీక
తోడఁ బఱువులువారుచుఁ దోఁటపనులు
సేయురూపు మదిన్ హత్తి పాయ కునికి 105

ఉ. అప్పటితద్విలేపనపటాభరణాదులవైభవోన్నతుల్
రెప్పలు విచ్చి చూడక చరింపనియట్టిపరాకుచేతఁ దా

నెప్పటియట్ల యుండె నతఁ డింటికడం దడ వుండి యుండి నా
యొప్పమి యేమి సంఘటిలె నొక్కొ యటంచు విషాద మొందఁగన్. 106

తే. తొలుదొలుత నట్లు సాధ్వసాద్భుతకరంబు
లగుచు మరుసుద్ది లేకుండ నెగయ మీఁటి
పెక్కునాళ్లు తద్వాసన ప్రిదులనీని
ఘనవిభూషాదు లపు డింపు గామి యరుదె 107

ఆ. తిరిగి యరుగఁ జూచి యరిగి రేమే నెచట నె,వ్వారిదాన నచట నూరక పడి
యుండ దైవ మెద్ది యొనరించె నది యగుఁ,గాక యనుచుఁ దలుపుకడనయుండె.

ఉ. ఆలలితాంగి చాలఁ దడ వచ్చట నమ్మెయి నుండి సాహసో
ద్వేలత నంతఁ జేరి కడుఁ ద్రిమ్మటచే శ్రము మొందినారు గాఁ
బోలును బోదునా నిదురఁ బోయెదరే యని కప్పురంపుఁదాం
బూలముతావి భుగ్గు రని ముంచుకొనం జెవిదండఁ బల్కునన్ 109

క. పైకొన్నపరాకున నతఁ, డేకోర్కిని వచ్చి తనియె నింతియు నగతో
లోకమువారలు పతికడ, కేకోర్కిని వత్తు రను మ నెంతయుఁ బొలసెన్ 110

క. ఓనాయక యితరంబులు, పోని మ్మాపాటి యైనబుద్ధి గలిగి నా
మానసములోనికోర్కుల, పూనిక యడిగితిరి లోకపూజిత నైతిన్. 111

మ. అకటా యేమని దూఱుదాన మిము నాథా వేగుజా మయ్యెఁ బొం
దిక గాఁ బాదము లొత్త ర మ్మనుట గానీ యొంటి యేమో కదా
నికటక్షోణికి నేఁగుదె మ్మనుట గానీ కొంతనెయ్యంపుఁబూ
నికతోఁ గన్నులు విచ్చి చూచుటయె కానీ లేద యొక్కింతయున్ 112

ఉ. నేఁడలతోఁటలో నపుడు నిబ్బర మైనమదీయభాగ్యమున్
బోఁడిమి యేమిపాకమునఁ బొందెనొ మీకృప యట్లు గాంచి పె
న్వాఁడిఁ దనర్చునాదనువునన్ మిము నెమ్మెయి నంటిఁ గాని యే
నాఁడును బుణ్యసాధ్వికి గుణం బిది గా దని నేనెఱుంగుదున్. 113

వ. అని పలికి యంతరంగంబున నంతకంతకుం బ్రబలుకంతుసంతాపంబున వంత
నొందుచుఁ గొంత చింతించి 114

క. రా యైనఁ గొంతమేల్ నా,రాయణ మీమనసుకంటె రహి నీక నెపుడున్
మీ యంతఁ దడవెద రె యని, యాయంగన యతనిపాద మల్లన పట్టెన్ 115

ఉ. పట్టి యొకింత యొత్తుచునె పాన్పుకడన్ వెసఁ గూరుచుండి హాం
బట్టున నొప్పునూరువుల పై నిడి యొత్తి తదంఘ్రి యంతఁ జ
న్కట్టుపయిన్ ఘటించుచును గన్నులు చేరుచుకొంచుఁ జెక్కుటన్
గట్టిగ నద్దుకొంచుఁ దన గాటపుఁగూరిమిఁ దెల్పె మిక్కిలిన్. 116

క. ఎందుఁ బరా కుడుగమికిఁ, సందియ మందుచు నిదేమి చందమొకో యం
చుం దనడెందము గొందల, మందఁగ నిందుముఖి యతని నల్లన పలికెన్ 117

ఉ. చిత్తము వేఱొకర్తుపయిఁ జేర్చి మరల్పఁగ నేర కేమొ మీ
రత్తరళాక్షిఁ దెచ్చుకొను. డాయక నావశ మైనఁ బంపుఁ డే
దెత్తు నవశ్యముఁ మఱియు దేవరకుం బలె నవ్వధూటికిం
దొత్తగుచుఁ బనుల్ సలుపుదుఁ నిజ మాడెద దైవసాక్షిగన్ 118

క. తుదఁ జిక్కులేల మీమది, కొద దీఱినఁ జాలు నమ్ముకొనవలసిన వ
చ్చెద నమ్ముకొనుఁడు నన్నో,హృదయేశ్వర యేమిచింత యిది దెల్పఁ దగున్.

వ. అని యిట్లు పలుకుచుం బాదసంవాహనసేవలు సలుపుచుండ. 120

చ అది యొకయించుకైన నరయంగ నెఱుంగక యాతఁడత్తఱిఁ
మదిఁ గడు నాఁటి యున్నప్రథమంపుఁదదాకృతియొప్పిదంబు లా
చెదరినవన్నె యాఁపనులు సేయుఘనత్వర యావినీతి యా
పదిలపుఁబ్రేమ యారతులభంగులు చాల విరాళి గొల్పఁగన్ 121

క. ఆసతియును దత్పదయుగ,ళీసంవాహనము విసువు లేక సలుపుచుఁ
భాసురపాతివ్రత్యగు,ణాసక్తిఁ దదన్య మెన్న కన్నిశి గడపెన్. 122

తే. అంతఁ దొలునాఁటియట్ల యత్యాదరమునఁ
బోయి పూఁదోఁటఁ బను లెల్లఁ జేయుచుఁ బతి
మన్నలు గాంచి యెంచెఁ దన్మతికి నట్టి
సొంపు లే కాని భూషణాలింపుగామి.

ఆ. ఎంచి దినము నట్ల యేఁగి యాతోఁటలో, నట్లు పనులు సేసి ప్రాణవిభుని
నట్ల నిష్ఠురతుల నలరించెఁ దద్విధం, బంత నంతయును దదంబ యెఱిఁగి 124

వ ఎఱిఁగి కూఁతుతో నేకతంబున నున్న వేళ నిట్లనియె. 125

ఉ. అమ్మ సరస్వతీవరమహత్త్వమునన్ జనియించి తీవు నా
కిమ్ముగ సర్వధర్మములు నీవ యెఱుంగుదు వంశ మెల్లఁ బూ
తమ్మగునీదుచర్య నని ధాతపడంతియె యానతిచ్చె స్వ
ప్నమ్మున వచ్చి తావకగుణంబులు చూచినయట్ల గట్టిగన్. 126

క. పెనిమిటి దేశాంతరి యై, చనినన్ భవదీయ దైవసంతతి నాము
ప్పున కయ్యెడు నను చును ద,జ్జననంబున కెదురుచూతు సతతము నాత్మన్. 127

సీ. ఆయాశ విఫల మై పోయెనో యనియొడు బుద్ధినిజేసి యోపుత్త్రి యేను
నీపతి నిటమున్ను నిన్నుఁ జేపట్టక యుండు కాలంబున నోర్వలేక
విసివి యే మాడిన విన సహింపక నీవు నన్నుఁ గోపించుచందంబు దలఁప
నిలఁ బతివ్రతలలో నీలువు గలయట్టి తల్లివి కొద యొకింతయును లేదు

తే. చిన్ననాఁడును బ్రియు నొకచిన్నమంత
మాట యాడిన విని తాపమగ్న వగుదు
తద్గుణము లెవ్వ రేపాటి తడవిన విని
యలరు దొండొరుఁ బఱపి నెచ్చెలులు నగఁగ. 128

సీ. మఱచి తప్పియు నన్యమహిమ విమర్శింపఁ జూడ వీ వన్యునిసొబగు వేడ్కఁ
బతిభక్తియందుఁ గీడ్పడ నీవు వేఁడుదు తత్పుష్టి యేదైవతంబు గనిన
నధిపుఁడు హర్షింప హర్షింతు చింతింపఁ జింతింతు చిక్కినఁ జిక్కు దెప్పుడు
గడుఁ జన విచ్చినన్ గర్వింపనీక యుండిన భేద మొందవు డెందమునను
ఆ. నిండుగడవరీతి నుండు దెప్పుడును గం,భీరతకుఁ గలంగి చేరనీక
పతిప్రవాసవేళఁ బాటించుకొనవు నె,మ్మేన గరగరికలు మెఱుఁగుఁబోఁడి. 129

క. రాతిరిపగల్లు దృఢనే,వాతాత్పర్యమున నున్నవార లటుండన్
నీతోడ మాటలాడుం, బాతివ్రత్యమునఁ గాదె భారతి కృపతోన్. 130

క. ఓతల్లి కొదువ యొక్కటి, నాతలఁపునఁ దోఁచినది వినన్ వలయు గుణా
న్వితుండు గానిసుతుఁడు ప్రసూతుం డగు నఁట యకాలసురతక్రియలన్ 131

ఉ. నాఁటికి నెట్టిదైవఘటనంబుననో నిను నొల్ల కెంతయున్
గాటపుఁగోపమున్ బెనుపఁగాఁ దను నెమ్మెయి నంటెఁ గాక పూఁ
దోఁటకు జీతగాండ్రు మనతొల్లిటివారలు లేరె నీవిభుం
డేటికిఁ బోవఁగావలయు నీ వటు పోవఁగ నేల కూఁతురా! 132

క. ధవళాక్షీ! వయసునఁ జిన్నవు గాని వివేకగుణమునన్ మిక్కిలి పె
ద్దవు నీకుం దెలియు నియ్య,ట్టివిధినిషేధమ్ము లెక్కడివి తలపోయన్ 133

వ. అని పలికిన మొలకనగవు మొగంబున నిగుడొత్తఁ దల్లిం జూచి సుగాత్రి యి
ట్లనియె. 134

చ. వరునకు నెద్దియిం పది సువర్తన గాఁగఁ దదప్రియం బస
చ్చరితము గాఁగ నెన్నుదు నిసర్గము నా కిది తూఁపరాద యీ
శ్వరుఁడును వేదమున్ గురుఁడు సర్వము భర్తయ యేఁ దదాజ్ఞ సు
స్థిరమతిఁ జేయుచున్ విధినిషేధము లెవ్వియుఁ గైకొనం దుదిన్. 135

క. విను మెయ్యదియు నిషిద్ధం, బని విడుచుట లేదు విహిత మని సేయుట లే
దనుమానింపక యెద్దియుఁ, బెనిమిటి యొల్లనిది విడుతుఁ బ్రియ మొనరింతున్.

సీ. అని తల్లితోడ ని ట్లాయింతి పలుకఁ దత్పతిభక్తిమహిమ కెంతయును మెచ్చి
వాణి ప్రత్యక్షమై వాత్సల్యమున మిక్కిలిని గారవించి తజ్జననిఁ జూచి
యీసాధ్వివర్తన కిట్టట్టు వంకలు దిద్దఁ జూడకుము సుస్థిరత నొప్పు
పతిభక్తిచే నిజపాపంబ కాదు నీ యుభయవంశములపాపోత్కరములు
తే. నెఱయ నిర్ఘాతములుగ నిన్నేలఁత చేసె, నిదియ కా దింక నిమ్మీఁద నీపతికథ

వెలయు మత్ప్రీతికరముఁ బవిత్రము నయి, నేన వెలయించుదాననంచానతిచ్చె

క. అని యిట్లు చదివి పుస్తకమును గట్టిక వటువు విప్రపుంగవుఁడు ననుఁ
గనుఁగొని యిదిగో నయ్యా, యనఘుము వారలచరిత్ర మని యిట్లనియెన్.

వ. ఆసుగాత్రి శాలీనులయందు నరవిందభవునికాంత కెంతదయయో యెఱుంగము నాకు నద్దేవియ కలలోన వచ్చి యీపుస్తకంబు నిత్యంబును బ్రాతఃకాలంబునఁ జదువుకొను మని యిచ్చె మఱియు నవ్వీటం జదువ వ్రాయ నేర్చినవారికెల్ల నాశాత్రియంద యట్ల యిచ్చినది యందఱు నిది యొండొరులతోడఁ జెప్పుకొని వెఱఁగుపడిరి నిన్న నే నాపుణ్యదంపతులసందర్శనంబుకొఱకుఁ దత్కుసుమోద్యానంబులో వారలచేతం బ్రత్యుత్థానాసనార్ఘ్యపాద్యాదివిధుల నుపచరితుఁడనగుచు నచ్చట నీపుస్తకంబు మఱచి వచ్చి నేఁడు రేపకడఁ జదువం బోయి తలంచుకొని యది దెచ్చుటకుం బంపిన నిట్టిఘోరంపువార్త వచ్చెనని వెండియు నయ్యుత్తములహ్రదపాతంబునకుఁ బెక్కులాగుల వగచె నేను నాయధ్యాపకుని వీడుకొని యప్పటికి నప్పురంబు తత్ప్రసంగాకులం బగుట యరసి నావిద్య యొరసి చూచుట కిది సమయంబు గాదని నాగలోకంబున కరిగి యంతఁ గొంతకాలంబునకు సంగీతవిద్య సవిశేషంబుగా నభ్యసింప వేడ్కపుట్టిన నారదమహామునిం గొలిచి తిరుగ దొరకొంటి నని చెప్పి మణికంధరుం డాకలభాషిణి యట్లు శాలీనుని చిత్తంబు జానపదత్వముగ్ధత్వదోషంబునం జేసి మున్నత్యంతాపూర్వవస్త్రభూషణాద్యాడంబరంబునం దలంకి తదలంకృతపత్నీరూపంబునకు నెఱయ గొలుపకుండుటయు వెనుకఁ దోఁటపనుల నాకలితంబైన యత్తన్వివిచ్ఛిత్తివిలసితాకారంబున హత్తి యితరంబు నెఱుంగమి భవదీయవృత్తంబునకు దృష్టాంతంబు లని పలికి సుముఖాసత్తిం జూచి.

తే. నీకులస్థానవార్త గణించి చూడ
నాసుగాత్రిచరిత్రంబు నంతవట్టు
నీ వెఱుఁగ కున్కి యె ట్లన్న; నేల యెఱుఁగ
నాసుగాత్రిన యే నని యాకె నగియె. 140

క. ఆమ్మాటకు వారందఱు, నెమ్మనములఁ జోద్య మంది నీ వాసతివే
నెమ్మెయిఁ బ్రతికితి వేమిక, తమ్మున నిమ్మాఱుపేరు దాలిచి తనుడున్. 141

సీ. శతతాళదఘ్నసంజ్ఞితమైనయట్టిపెన్మడుపున నే నట్టు వడియెడుతఱి
మత్పతిపాదపద్మము లాత్మలోనఁ దిరంబుగా నిడి తదన్యం బెఱుఁగక
మునుగుచో నడుమఁ గోర్మొసలి మ్రింగెనది మ్రింగినవెన్క నఱిగించుకొనఁగలేక
మఱునాఁడు తత్తీరమహిఁ బడి పొరలుచు వెసలఁ గ్రాసినని యవ్వేళయందు

తే. నచట నున్న వారిది చెప్పి రంత నేను
నెల్లజనులును వెఱఁగంద నింటి కేఁగి

వాణికిని మ్రొక్కుకొనుచుంటి వదల కెపుడు
పతి దిరుగఁ గూర్ప నింక నీభార మనుచు 142

సీ. దేవి నాలీలఁ బ్రార్థించుచుండఁగ వచ్చె నరలు నాకప్పుడె నాథుసేవ
యెక్కడి దీవాణి యెటు నేసె నట్లు గా ని మ్మది యని విరాగమ్ము పొడమ
వేదాంతశాస్త్రకోవిదులగోష్ఠిని గొంత యోగశాస్త్రజ్ఞులయొద్దఁ గొంత
ప్రొద్దుపుచ్చుచు యోగములకు నంగము లైన యాసనాదులకు సమర్థ మైన

తే. ప్రాయ ముడివోవుటకు వెతఁబడుచు నుంటి
నా కపుడు సుముఖాసత్తినామ మొదవె
సుముఖు లన శాస్త్రవిదులు నిత్యమును దత్స
మీపవర్తన గలిగి యే మెలఁగు చునికి 143

తే. అట్టిపేరఁ బ్రసిద్ధ నై యంతలోనఁ, దల్లితగు లూడఁ దీర్థయాత్రగ ధరిత్రిఁ
గ్రుమ్మరుచుఁ దుదనిద్దేవిగుణములు విని,యిచటఁ జేరితిఁ గడమ మీ రెఱిఁగినదియ.

క. అమ్మాడ్కిని బాతివ్ర,త్యమ్మున నుతి గనియు నిట్టిదశ నొందితి నేఁ
గ్రమ్మఱఁ బ్రతికియొకింతఁయు,నష్టుడుగునఁ గాంతుఁ డేమి యయ్యెనొ యెఱుఁగన్.

మ. అనుచుం గ్రాహము మ్రింగి యుండ మనునాఁ డాలీల నక్లిష్టమూ
ర్తిని రా నేర్చిన నీయసంకుచితపాతివ్రత్యమో యుత్తమాం
గన నీనాథుని బ్రోవకున్నె వెఱశంకల్ మాను ప్రాపించె దా
తనిపొందుం దుద నాతఁడే నని మణిస్తంభుండు సూపెం దనున్. 146

సీ. చూపి యే బ్రదికినవో పెల్ల విను మట్లు నీమాటఁ గడు నల్గి యేమికర్మ
వశతనో యాయల్కవడి యాఁపలేక వే గోద్ధతిఁ జని నీట నుఱికితిఁ గద
యావెన్క నొక్కించు కంత సేపునకు జలస్తంభవిద్యావిలాసగుప్త
నొకసిద్ధునింటిలో నున్నట్లయున్న మహాత్ముఁ దేజోవిధూతాంధకారుఁ

తే. జేరితిం జేరి యటమున్ను దూరపాత
సంభవం బైనయప్పరిశ్రాంతిచేతఁ
బ్రక్కలెగయంగ రోఁజుచు నొక్కక్షణము
నిలిచి కనుఁగొంటిని సమాధినిష్ఠు నతని 147

తే. అంతఁ గనువిచ్చి చూచె నన్నాతఁ డేను, బ్రణుతి చేసితిఁ జేసి తత్ప్రణుతిసరణి
వెంబడిని జెప్పితిని నాదువృత్త మతఁడు, నింతకోపివే యనుచు నొక్కింత నవ్వి.

క. ఇది మిక్కిలి యేకాంతపుఁ, బద మని యిట్లున్నవాఁడఁ బయల నునుపఁ గూ
డదు క్షణమునందు నని మ,ద్వదనము దెస యంతఁ జూచి దాక్షిణ్యమునన్.

సీ. నాఁడెల్లఁ దనయొద్ద నను నుంచుకొని నాదు గురుభక్తి తెలిఁగుఁగన్గొనుచు నలరి
నాకు పఞ్చస్తంభనపుమణి యొకటియుఁ దా నెక్కుసింగంపుఁదత్తడియును

దద్వశీకరణౌషధజ్ఞానమును వాద విద్యయు నివ్వాలు వేడ్క నిచ్చి
పొమ్మని యనిపినప్పుడు గాదె యీపట్టి మెవ్వరి ప్రేయంగ నెత్తఁబడును
తే. వారిఁ జంపును దుద ననువాక్యమునకుఁ
గడు నలరి మ్రొక్కి యతనియాకర్ణనమున
నటకు మును వచ్చినట్టిసింహంబు నెక్కి
మడమ యొక్కింత దాఁకించుమాత్రలోన. 150

శా. గంభీరహ్రాదమున్ వడిన్ వెడలి యాకాశంబునం బాఱునా
కుంభిద్వేషిని మెచ్చి యెన్ని గల వీక్షోణిన్ విచిత్రంబు లా
కుంభద్వస్తువు లెల్లఁ జూతు నని పోచున్ వేడ్క నుంటిన్ వయః
స్తంభంబున్ మణిచేతఁ గాంచుట మణిస్తంభుండు నా నొప్పుచున్. 151

ఆ. అతివ నాదుగురువు లంగీకరించిన, యట్టిది యని మిగుల నాదరమున
నేను నాఁడు మొదలు గా నిట్టిసిద్ధవేషమున వలయుచోట్లు సంచరింతు. 152
క. ఆవేడ్కలతమి నెప్పుడు, నీవిధమె తలంప నంత నీవు నెఱుఁగు ది
-చ్చో వచ్చియున్న తెఱఁగులు, నావుడు నవ్వారిజాక్షి నగి యిట్లనియెన్ 153
స్రగ్ధర. ఆశాలీనుండ నీవే యగుట గలిగె నా యల్ల నాఁ డంత క్రోధా
వేశం బేతేర నీ వేవికటపుఁ బలుకున్ వింటి నాచేతఁ గర్ణా
భ్యాసంబుం జేరి చెప్పన్ బ్రథమమున వయఃప్రస్తుతుల్ చేసి గూఢం
బై శోభిల్లంగ నీ వే మని పలికితి మా కానతి మ్మంతవట్టున్. 154
సీ అని కలభాషిణిఁ గనుఁగొని నీ విటురమ్ము నీ కారహస్యమ్ము మునుపు
చెప్పి తౌ దాక్కణగాఁ జెప్పింపఁ దగు మఱి యాయనచే నని యప్పడంతి
చెవిలోనఁ జెప్పంగఁ జేరి యోహో యది గా దుపాయ మతండు గట్టిగాఁగ
దూరశ్రవణశక్తి తోడ్తోడ విని యెడు నటుగాన వ్రాసి నీ కది తెలిపెద
తే. ననిన దూరదృష్టిని గనునదియుఁ గూడ
దనుచు మణికంధరునిఁ జూచి వినుము నీవు
మును పతనిచేతఁ జెప్పించుకొనుతదర్థ
మంత నేఁ జెప్పెదను గాని యనుడు నతఁడు. 155

వ. అమ్మణిస్తంభుని నేకాంతంబునకుం దోడ్కొని పోయి యతనిచేతఁ దొల్లిటి తత్కోపకారణంబును నట మునుపటిరహస్యవాక్యంబులను జెప్పించుకొనివచ్చి సుముఖాసత్తిం జూచి యింత నీవేమని చెప్పెదో చెప్పు మనుటయు నవ్వనితామణి యిట్లని చెప్పె నట్లు శాలీనుండు మడువునం బడుటకు మునుపు నాతో నేకాంతంబున నుండి ప్రసంగవశంబున. 156

క. అమృతము సేవించితి వో, రమణీ యే మైన సిద్ధరస మబ్బెనొకో
కొమరుంబ్రాయము మిక్కిలి, కొమరొందెడు మిగులఁ గ్రొత్త క్రొత్తగ గలదిన్

క. మగవానికంటె మునుపుగ, మగువ కెడలుఁ బ్రాయ మందు మానవతీ నీ
జిగిబిగువు లంతకంతకు, మిగులఁగఁ బోలు పొందుటకు నిమిత్తముఁ జెపుమా.

క. అని యడిగిన నే నెయ్యది,యు నిమిత్తం బెఱుఁగ ననుడు నూరక యిట్లం
టిని గాని యేన చెప్పెద, విను మని మొగము చెవిఁ జేర్చి విభుఁ డిట్లనియెన్.

చ. అనిశము నీద యౌవనశుభాకృతిఁ గౌఁగిటఁ జేర్చు వేడుకన్
దనియమిఁజెసి వేఁడితిని దక్కక నీకును గర్భ మెన్నఁడున్
జనితము గాక యుండ నలశారదఁ బూజ యొనర్చువేళ వా
రనికృప నట్టు లిచ్చితి వరం బని యాయమ పల్కె నత్తఱిన్. 160

క దానన సుమ్మీ నీనె,మ్మేనన్ సౌందర్యగుణసమృద్ధి దలిర్పం
గా నవయౌవన మెప్పుడు, గానఁబడుట యనుడు నేను గడు వెఱఁగొందన్.

తే. నాదుసంగంబునన నీకు నందనుండు, గలుగువర మిచ్చె నాకు నన్నలువసతియు
నేన వేఁడిన నొక్కనాఁడిదియు నదియు,నొనరు టెట్లకో యట్ల నయ్యనఘుతోడ

క నావుడు నాయిష్టమునకు, నీవు విరుద్ధముగ వరము నిట్లడిగితె య
ద్దేవి నని దుర్దమక్రో,ధావిలమతిఁ జని యతండు హృదమున నుతికెన్ 163

క. అని చెప్పుటయు మణిస్తం,భునిమాటయు నదియు నైక్యమున శోభిల్లన్
విని మణికంధరుఁ డోమా,నిని సందియ(ప)డకు మితఁడ నీవిభుఁ డనియెన్ 164

సీ. ఆవధూటియును సవ్యాఃకందళత్త్రపాలంకృతం బగుసద్విలాస మనురఁ
బతిఁ జూచి సంతోషభయభక్తివినయంబు లుదయింపఁ దగురీతి నుపచరించి
యిందాఁక నెఱుఁగ కేనేమియంటినో మిమ్మునను చుఁగన్నీళ్లొరానడఁచుకొనుచు
నడపుల మాటల నగవులవిన్నాయందుఁ దొంటికై వడిఁ గొంత దోఁచుచున్న

తే. వసుధ మానిసిఁ బోల మానసులు లేరె
యనుచు నుండుదు భాగ్య మట్లునికిఁ జేసి
యిప్పు డీయన్న చే ఫలియించె నదియు
సజ్జనులగోష్ఠి యిహపరసాధకంబు. 165

క. అని మణికంధరుఁ గనుఁగొని, విను చుండుదు మునుపు నిన్ను వేమఱు నిచ్చో
టన దూరశ్రవణబలం,బున నీయన నీదుగానమున్ విని పొగడన్. 166

శా. గంధర్వుండవు జాతి యెంచఁగ శుభాకారంబు చంద్రత్రపా
సంధానక్షమ మద్వితీయుఁడ విఁకన్ సంగీతసాహిత్యధౌ
రంధర్యం బరయం దపస్వి వసురప్రద్వేషిభక్తుండవున్
బంధం బొక్కటి గల్గె శాప మనఁగా నాయన్న నీకుం దుదన్. 167

తే. అనినఁ దచ్చాపగతి కాత్మయందు వగపు
దనరఁ గలభాషిణి మణికంధరుని జూచి

మును కళాపూర్ణకథ నీవు వినవె ధనదు
పట్టిచే నంత య ట్లేల తిట్టువడితి 168

చ. అన నతఁ డెందు నే నెఱిఁగినట్టిద గా దని నీకు నెచ్చటన్
వినఁబడి యున్కినో యది వివేకము సేయఁగలేక పల్కె ది
ట్లనుడు మదిం దలంచుకొని యా నవు నీ వెడ గాఁగఁ బోయి యుం
టి నిజము తత్ప్రసంగము ఘటిల్లినయప్పుడు పల్కె య త్తఱిన్. 169

సీ. నారదు ప్రథమసందర్శనం బైనట్టి నాఁడు తత్కథకుఁ బ్రశ్నప్రసంగ
మేతెంచినవిధంబు నాతపస్వియు నపూర్వం బిది యని యద్భుతంబు నొంది
భూతభవద్భావిభువనవస్తువు లెల్ల నిజయోగదృష్టిచే నెమకి కాంచి
తన కది చెప్పరా దని పల్కుటయుఁ జెప్ప రాకయుండుటయుఁ గారణము గాఁగ
తే. నతఁడు దెల్పిన బహుసంపదాదిఫలము
దాను వినినంతవట్టో కింతయును విడక
బూస గ్రుచ్చినరీతి నాపువ్వుఁబోఁడి
చెప్పినది విని వార లచ్చెరువు నంద 170

వ. అప్పుడు. 171

క. మళయాళపుబ్రాహ్మణుఁ డొకఁ, డలఘువ్రతనామధేయుఁ డచటికి సంప
త్కలనాకాముఁడు జపవిధి, దలఁపున నేతెంచి వినియెఁ దత్కథవిధమున్.

సీ. విని యాకళాపూర్ణుఁ డననెట్టిఘనుఁడొ తత్కథయంతయును వినఁగలుగు టెపుడొ
సంపదర్థంబున జపము చేసిన నయ్యపూర్వపుఁగథ వినుపుణ్య మబ్బ
నది వినునట్టిభాగ్యంబు సాధించినఁ దన్మహత్త్వంబుచేతను సమస్త
భోగవైభవమాత్రములు గాక దీర్ఘాయువును బుత్త్రపౌత్త్రాదిఘనవిభవము
తే. గలుగునఁట కడు మంచిమార్గంబు దొరకెఁ
దత్కథాశ్రవణార్థ మీతల్లి నేఁ బ్ర
సన్నఁ గావింతు ననుచుఁ దా నలుపఁ దొడఁగె
మహిత మగుభువనేశ్వరీమంత్రజపము. 173

క. మనమునఁ గలభాషిణియున్, దనశాపముఁ దలఁచుకొని వృథాహతి నిచ్చోఁ
జనఁబడునో తడసిన నం,చును సిద్ధుని నతనినాలుఁ జూచి ఘనధృతిన్. 174

క. ఏల యికఁ దడయ నీబలు, వాలు నియమమునకుఁ ద్రిదివవారాంగన యా
భీలపుశాపమునకు ననుకూలంబుగ నడచి చేర్చుకొను రాజ్యంబున్. 175

సీ. ఆమణిస్తంభుఁ డాయకఁ జూచి యీసుము ఖాసత్తి యో హరిణాక్షి తొలుత
నేను నీపైఁ గత్తి యెత్తిన నిన్ను బ్రేయక యుండ నీజగదంబ మీఁది
యాన వెట్టదె యటుగాన నే వెఱతు నీపయిఁ దెగమునుపటిపాల్పె చాలు
నని మణికంధరుం గనుఁగొనినాఁడువా లౌసఁగెదఁ గొని యీపయోరుహాక్షి

ఆ. చెప్పినట్లు చేసి చేకొను మత్యంత, విపుల మైనరాజ్యవిభవలక్ష్మి
ననుచుఁ బలికె నతనివనితయు నోమణి,కంధర యిది మంచికార్య మనియె 176

వ. అనిన నతం డతనితోడ వెండియు ని ట్లను నలకూబరుశాపానుభవంబునకుం గాంచుకొనియున్న వానికి నీదుష్కర్మంబున సాధించినరాజ్యవైభవం బెమికీర్తి సుకృతంబులకు సాధకంబు నయ్యెడు నని చింతింపవల దనివార్యం బైనశాపానుభవంబు పరోపకారంబు నెక్కింప నుద్యోగించి తనయంతనచేరి యత్యంత ప్రార్థనంబుచేయుచున్న యిన్నెలంతచేత మహాదేవికి సంతర్పణము సేయుట దుష్కర్మం బనరాదు కావున నప్పడంతి చెప్పినచొప్పున నడపు మని యత్తెఱంగున మఱియుఁ బెక్కుప్రకారంబుల నొడంబఱచిన నెట్టకేలకు నాదయాళిం డియ్యకొని నియమపూర్వకంబుగా సవ్విధికిఁ గడంగెఁ గలభాషిణియు మణిస్తంభునకుఁ దదంగనకుం బ్రణామంబు చేసి కన్నీళ్లు గ్రుక్కుకొనుచు నిక్కలంకపాటు తక్కినభయంబునకుఁ గాదు సుండు మిమ్ము నెప్పుడు గురుభావన నారాధింపుచుండ లేమికిం గాని యనుటయును సుముఖాసత్తియు నోయమ్మ మనసెమ్మనంబులకూర్మి యింతటన పోయెనే మీఁదట నైన నీపతియు నీవుఁ గోరినట్లు మమ్ము గురుభావంబు నడుపుకొనియెద రనినఁ గలభాషిణి పునఃపునఃప్రణామంబు లాచరించి ముకుళితకరమల యగుచు ని ట్లనియె 177

శా పూతం బైనమదీయపుణ్యయుగ మోపుణ్యాంపుటిల్లాల నీ
పాతివ్రత్యముచందముం విన మది భావింపఁగా నెట్టిదు
ర్నీతిప్రక్రియవారి కైనఁగృపతో నీవచ్చినం గల్గుఁ ద
త్పాతివ్రత్యము నాకు మీఁద నయినం బ్రాపింప దీవింపవే 178

క. నావుడుఁ బరమపతివ్రత, వై వెలయుము రాజ్యవైభవానుభవం బెం
తే వర్తిల్లఁగ నలరుచుఁ, బ్రోవుఁడు మముబోంట్ల నీవిభుండును నీవున్. 179

ఉ. అట్టిట్లుచంచలింపకు దృఢాత్మత నుండు మటంచు నిప్పుడే
మిట్టివి నీకుఁ దెల్పునవి యెయ్యవి పెండ్లికిఁ బోవునట్లు గ
న్పట్టుచు నున్నదాన వతిభవ్యవికాసము నుబ్బుఁ జూడ నిక్క
గట్టిగ నెన్న దేవతవు గాక నరాంగనవే మృగేక్షణా. 180

చ అని తనుఁ బల్కునజ్జలరుహాక్షిని వీడ్కొని సిద్ధువక్త్రముం
గనుఁగొని నన్ను నంపితిరె ఖడ్గము నిచ్చెదరే యటంచు నా
తని బలుకత్తిఁ బుచ్చుకొని తా మణికంధరుచేతి కిచ్చియోగ్య
నియమ గంధమాల్యవతి యై కలభాషిణి నిర్విశంకతోన్. 181

క. తగ నాశక్తికి నభిముఖి, యగుచుం బద్మాసనస్థ యై కూర్చుండెక్
మొగ మెంతయు వికసింపఁగ, బిగివదలక పొదలు మదిగభీరత మెఱయన్ 182

ఉ. కాంత యనంతరంబ మణికంధరుఁ గన్గొని నీ వికర్ణ విని
ర్భ్రాంతత దేవి కర్పణము సేయుము కొంకక దద్దరిల్ల కొ
క్కింతయు శంక లేక మెఱయింపుము చూచెద నుద్ధతద్విష
త్స్వాంతతికంఠఖండనవిచక్షణదక్షిణబాహుశౌర్యమున్. 183

క. సమరంబున నెదిరించిన, సముదాహితవీరవరులఁ జక్కాడఁ చుట నై
జము మీకు నిట్టియెడలఁ, భ్రమయక చేయుఱవ కునికి పటుశౌర్యమునన్. 184

క. అని తెలిపెడికలభాషిణి, మనసు తెలివి కరుడుపడుచు మణికంధరుఁ డే
మని చెప్ప నెట్టకేలకుఁ, దనమది నూల్కొల్పి నడపెఁ దద్వచనంబున్. 185

వ. అప్పుడు మృగేంద్రవాహన యతని నుద్దేశించి యోమణికంధర నీవు దయాకు
లత్వంబునం జేసి యాబలిసమర్పణవిధానం బొకించుక విలంబనంబునం జేసి సలిపి
తివి గావున జన్మాంతరమాత్రవ్యవధానంబున సద్యోయోగావనుండ వగుచు మ
హారాజ్యవైభవంబు లనుభవించెదు కలభాషిణియుఁ బ్రాణభయంబు లేశంబును
లేక [1]మత్ప్రీణనతాత్పర్యధైర్యాదిగుణంబులచేతను మిక్కిలి మెప్పించెం గావున
మామకప్రసాదవిశేషంబునం జేసి యిపుడు పునస్సహితమస్తకయు నిజపురీవర్తి
యు నైతనబంధుమిత్త్రాదుల నలంకరించు నని యానతిచ్చె నిచ్చెలువయు నట్లు
బ్రదికి కను విచ్చి నలుదిక్కులు పరికించి యప్పుడు దా నున్న యదిద్వారకానగర
వేశవాటిభూషణాయమానస్వభవనారామభూమి యై యుండుటకు వెఱఁ గం
దుచు నిది యంతయు మృగేంద్రవాహనామహాశక్తికృపావిలసనంబు గాఁబో
లు నని యద్దేవిం గొనియాడి తనగమనాగమనప్రకారంబు సఖీప్రముఖనిఖిల
జనంబులను వినిపించి ఘనతరాద్భుతంబులు గావించుచుండె నిట మణికంధ
రాదులు నవ్వరవర్ణినీశరీరఖండంబులు నదృశ్యంబు లగుటకు వెఱఁగంది య
య్యాదిమశక్తిసూక్తిమహిమ పలుదెఱంగులం బ్రశంసించి రంత మణికంధరుం
డు మృగేంద్రవాహనకు దండప్రణామంబు గావించి సుముఖాసత్తిమణిస్తంభు
లఁ దగువిధంబుల వీడ్కొని శాపానుభవకాలంబు ప్రతీక్షించుచుఁ గృష్ణదత్తం
బై సతతరత్నమాలిక యచ్చట జపపరుం డై యున్న యలఘుప్రతునకుఁ గృ
ష్ణార్పణబుద్ధిని సమర్పించి విపంచి యద్దేవిగృహంబున నొక్కవలభివిశేషవివరం
బున నన్యులకుం గానరాకుండ గుప్తంబు చేసి 186

క. అమ్మణికంధరుఁ డంత మ్మనమ్మునఁ, బ్రేరేచుచున్న నలకూబరశా
పమ్మునఁ జనియెను శ్రీశైలమ్మునకును భృగునిపాతలంపటమతి యై 187

సీ. తనసుముఖాసత్తి దనకు శుశ్రూషసేయఁగ మణిస్తంభుండు సమ్మృగేంద్ర
వాహనదేవినివాసంబునందు నత్యంతజితేంద్రియత్వంబు మెఱసి
యష్టాంగయోగవిద్యాభ్యాసనప్రౌఢిఁ దనరె నజ్జలజనేత్రయునుఁ బతికి
వలసినపరిచర్య సలిపినతుదను దదాజ్ఞను మునుపటితనదుయోగ

1 మత్ప్రీణానుతాత్పర్య.

ఆ వ_ర్తనంబు ప్రేమ వదలక తత్పరి,శీలనంబు నెపుడు సేయు చుండెఁ
దదనిశప్రయత్న తాత్పర్యమున నల,భ్ధావకాశుఁ డగుచు నతనుఁ డుడుగ. 188

క. అంత మణి స్తంభుఁడు దన,యంతఃకరణంబునందు నలరారెడు దే
శాంతరవస్తువిశేషా,త్యంతదిదృక్షన్ దిగంతయాత్రాపరుఁ డై. 189

క. వరజవశాలిం దనకే,సరి యాకర్షించి యాత్మసతియుం దానుం
బరమోత్సాహమునఁ గృతా,ధిరోహుః డై గగనమున యథేచ్ఛాగతులన్. 190

క అరుగుచుఁ గనుఁగొనియెను భీ,కరమకరతిమింగిలాదిఘనజలజంతూ
త్కరవిహరణభృశసాంద్రో,ర్మి, నిరుపమఘుమఘుమరవాపనిద్రు సముద్రున్. 191

వ. ఇవ్విధంబున నయ్యంబుధిం గనుంగొని తత్ప్రకారంబు కౌతుకకారణం బగుచు
సొంపు మీఱఁ దనవనిత కతం డి ట్లనియె. 192

ఉ. శీకరబృంద మెంతయు నశీతమరీచిమరీచిజాలమై
త్రీకృతధాళధళ్య మయి తేజరిలన్ నిజధర్మ మైనర
త్నాకరభావ మీజలధి యంబుజలోచన చూచితే కడుం
బ్రాకటమై తనర్పఁ దనబాహ్యవిభాగమునందుఁ జూపెడున్. 193

ఉ ఓలలితాంగి చూడు కడు నొప్పెడునీరము నిండఁ గాఁగఁ దాఁ
గ్రోలి తిమిప్రకాండము శిరోవివరంబున వెల్వరించును
ద్వేలపుటూర్ధ్వధార యలవేలుపుటేటిపయిం గుతూహల
శ్రీల మరున్నదీవిభుఁడు చిమ్మెడుచిమ్మనగ్రోవిసీ రనన్ 194

తే. ఉగ్రతిమిశిరోరంధ్రనిష్ఠ్యూత మగుచు
నెగయుసలిలౌఘు మది యెందు మిగుల నొప్పె
నబ్ధి పేరిటికుండలితాంగభోగి
యుస్సు రనఁ దనపడి గ్రైనో యనంగ. 195

ఉ. ఔర్వముపేర ఘోరవిరహానల మెంతయు నంతరంబునన్
బర్వఁ దరంగబాహువులు బారలు చాఁపుచు నీపయోధి యో
పర్వసుధాంశుబింబముఖ భాసిలెడుం గడు నుల్లసద్రసా
ఖర్వసుపర్వసింధువును గౌఁగిట నెంతయుఁ జేర్చుకై వడిన్. 196

మ వికచాబ్జానన యీపయోధి శశియావిర్భూతకాలంబునన్
సకలద్వీపవతీగణంబు యుగపత్సంప్రాప్తినవ్యోల్లస
న్మకరీభంగపయోధరత్వమునఁ గన్పట్టన్ రసోజ్జృంభణా
ధికతం జేయుచు నాచరింపఁ గడఁగున్ దివ్యోపగాశ్లేషమున్. 197

చ ఉదకముఁ గ్రోలవ్రాలెడుపయోదము పౌరుషకేళిసంభ్రమా
[1]భ్యుదయగళద్రమాకబరిపోలిక నొప్పెఁ దటిద్విలాసముల్

1 ద్భుతవిగళ.

తదభివృతాంగకస్ఫురణలం దలపింపఁగ నీపయోధియై
ప్పిదము శయించినట్టిమురభేదితెఱంగు వహించెఁ జూచితే. 198

క. అని పలుకుతనదుపలుకుల,కును మునిమునినగవుతోడఁ గోమలి లజ్జా
వనతముఖి యయినఁ దద్విల,సనజృంభితకుసుమశరవశంవదుఁ డగుచున్. 199

తే. తనదుభావంబుఁ దెలుప నవ్వనిత మీకు
వలసినవిధంబునం బ్రవర్తిలుట గాక
యిందు నాకు స్వతంత్రత్వ మెక్కడియది
యనియె ననుటయు నాసిద్ధుఁ డాత్మ నలరి 200

మాలిని —

కిసలయకుసుమౌఘాకీర్ణ నానావనాంతో
ల్లసదభినవకుంజల్లాఘ్యభాగంబులందుక్
బిసరుహదళనేత్రక్ బ్రేమతోఁ గూడి నానా
ప్రసవశరవిహారప్రౌఢిఁ గ్రీడించుచుండెన్ 201

క. అలఘువ్రతాహ్వయుం డను, మళయాళపుబ్రాహ్మణుండు మహనీయసము
జ్జ్వలనియమంబున జపవిధి, సలిపెం బూర్ణముగ రెండుసంవత్సరముల్. 202

ఉ. శీతలసత్యభాషణ విశేషవిలాసపమార్జితాఖిల
శ్రోతృజనానురంజన విరోధినరాధిపగర్వభంజనా
నీతికలాతికౌశలవినిర్మితభార్గవదేవమంత్రివి
ఖ్యాతివిభూతిగర్హణ నిరంతరకల్పితవిద్వదర్హణా 203

క. నరసింహప్రభునందన, నరసింహబలారిగమఘునస్థేమబలా
నరసింహకృపాస్పద కి,న్నరసింహాసనపదస్థనతికృద్ధ్రివిణా 204

తోటకవృత్తము.—

మానసురయోధన మంజులనిత్యా,నూనయశోధన యుజ్జ్వలకృత్యా
దానసుబోధన ధర్మదకృత్యా, దీనమహాధన దీపితసత్యా. 205

గద్యము ఇది నిఖలసూరిలోకాంగీకారతరంగితకవిత్వ వైభవపింగళియమరనార్య
తనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతంబైనకళాపూర్ణోదయం బను
మహాకావ్యంబునందుఁ జతుర్థాశ్వాసము.



శ్రీరస్తు.

# కళాపూర్ణోదయము.

## పంచమాశ్వాసము.



దఖ్యాతినిరాకృతి
వైదుష్యసుపుష్యదర్థవైభవ యపరి
చ్ఛేదప్రాభవ యాచక
ఖేదప్రశమనవిలోల కృష్ణనృపాలా. 1

వ అవధరింపు మవ్విధంబున నలఘువ్రతుండు భువనేశ్వరీమంత్రజపంబు రెండుసంవత్సరంబులు పరిపూర్ణంబుగాఁ జేయ నంతటమ్మృగేంద్రవాహానయో బ్రాహ్మణుండ నీయభీష్టంబు వేఱొకచోట సిద్ధించు నని పల్కు నప్పలుకులు వినంబడునంతనతం డాకస్మికోద్ధూతతీవ్రవాతనిపతితుం డగుచు ననేకజనపదవ్యవహితంబైనయొక్క పురంబునడుమ రాజస్థానమధ్యంబునం బడి తదీయశోభాకులత్వంబున నొక్కింత తడవుండి మూసినకనుతెప్ప లంత విచ్చి నలుదిక్కులుం బరికించి తనపతనప్రకారంబునకు వెఱఁగుపడుచుఁ జుట్టునున్న సభాసదులఁ గొందఱనుగట్టెదుర రెండవ దేవేంద్రుంబోలె నపూర్వవైభవంబునున్న యొక్కరాజును నతనియగ్రభాగంబు నఁబసిండితొట్టియలలోపలఁ బొత్తులలో నున్న యొక్కచక్కనిబాలికనుం జూచిఁ యొక్కింతతడవు నివ్వెఱపాటున నిశ్చలుం డగుచు నుండి పదంపడి దిగ్గన లేచి మణికంధరదత్తంబైనతపరత్నమాలిక యాశీర్వాదపూర్వకంబుగా నారాజునకుఁ గానుక పెట్టుటయు నతండు నత్యాదరంబునం గైకొని కొంతసమీపంబునం గూర్చుండ నియమించి యప్పటికిఁ దత్కులనామమాత్రంబు లడిగి తెలిసి యిప్పటినీయాగమనప్రకారం బత్యద్భుతం బది చెప్పెదవుగాని యటు మాట లాడక యొక్కింత నిలువు మని పలికి యిప్పటికానుక లెవ్వియైనను దీనిసొమ్ముల యనియమ్మణిహారంబు దనయొద్ద నున్న యాశిశువునకుఁ బెట్టించె 2

క. అత్తఱిన తదీశుల నా, పొత్తులలో శిశువు చిబుకము గళంబుపయిఁ
హత్తనది చూచి తెలిదళు,కొత్తుచు లేఁజెక్కు లమర నొయ్యన నగియెన్. 3

క. తిరుగా రెండేండ్లకు నీ, సురుచిరహారోత్తమంబుఁ జూడఁగ నాకుఁ
దొరకెఁ గనుఁగవ చేసిన,యురుపుణ్యము నేఁడు రెండియును ఫలియించెన్. 4

తే అనిన విని యేమి చెప్పంగ నచట నున్న, వారలెల్లఁ జిత్తరువున వ్రాసినట్టి
ప్రతిమలునుబోలె నతినిశ్చలత నొకింత,తడవు గనుపట్టి రత్యద్భుతంబు నొంది.

ఉ. ఎంతయు విస్మయంబున మహీశుఁడు బాలికమోముఁ జూచి య
త్యంతము వింత లీపలుకు లారయఁగా నిదియొట్టిదేవతా
కాంతయొ కాక యేవిధపుఁగారణజన్మయొ యింక మాట లా
డింతము గాక యంచుఁ దనడెందమునం దలపోసి యిట్లనున్. 6

క. ఓయద్భుతంపుబాలిక, నీయుదయం బరయ రెండునెల లయ్యెనొ కా
దో యెట్టు పలికి తిమ్మెయి, నేయెడ రెండేండ్లక్రింద నిది చూచితివో. 7

క అన విని యిటమునుపటినా, జననంబున నేను దీనిఁ జాల గుఱుతుగాఁ
గనుఁగొన్నదానఁ గావున, ననఘ యామాట యంటి నని యది పలికెన్ 8

వ. అమ్మహీపాలుండును నబ్బాలికనుజూచి నీవు కారణజన్మవుగాని సామాన్యంబైన మనుజశిశువవుమాత్రంబు గావు కావున నీతెఱంగంతయు నెఱుంగునందాఁకడెందం బమందకౌతుకసంరంభంబున సంభ్రమించుచున్నయది నీపూర్వజన్మవర్తనం బెవ్వి యేమికారణంబుననిచ్చటఁ బుట్టితి వెఱింగింపవలయు నని ప్రార్థించుటయు నది తనపూర్వజన్మవర్తనంబును దజ్జన్మనిమిత్తంబైనతత్పూర్వవర్తనంబును సంస్మరణసంబంధపరంపరావశంబున సమస్తంబును గరతలామలకంబుగా నాక ళించి తనపలుకు లాస్థానంబెల్ల సావధానం బగుచు వింజమాఁకిడినట్లు వినుచుండ నన్నరేంద్రచంద్రునకు నిట్లని చెప్పం దొడంగె 9

సీ వినవయ్య యోకీర్తిధన యిట మునుపటిపుట్టువు గాక తత్పూర్వమైన
పుట్టువునందు నంబుజగర్భుదేవి పెంచినయట్టిప్రోదిరాచిల్క నేను
నాకుఁ దజ్జన్మంబునఁ శాప మొక్కటి తగుల రెండవమేను దాల్పవలసెఁ
దచ్ఛాపమూల మంతయు నీకు వినుపించెదను విను మిది నిమిత్తముగ నైన

ఆ. నొకయపూర్వకథ సముజ్జ్వలరసభావ, మాయురభ్యుదయకులాభివృద్ధి
హేతు వతిపవిత్ర మిప్పుడు వినిపింపఁ, గలిగె జిహ్వ కలిమిఫలమునొంద. 10

మత్తకోకిల. అంబుజాసను రాణివాసమునందు నేను వసించు కా
లంబునం దొకనాఁడు మోద మెలర్ప నాయన వాణితో
నంబరాభరణాంగరాగసమంచితాకృతియై భవా
డంబరంబు కరంబు వింతబెడంగునం గనుపట్టఁగాన్. 11

క భవనారామమునకుఁ జని, నవనానాఖేలనము లొనర్చుచు నరవిం

దవనామోదభరాలస,పవనామోదములచేత భావము లెసఁగన్ 12

తే. తరుణసంతానకచ్ఛాయఁ దలిరుఁబాన్పు
నందు నాసరోవరమున కభిముఖముగఁ
బవ్వళించెను దనపాదపల్లవంబు
లూరువులఁ జేర్చుకొని వాణి యొత్తుచుండ 13

ఉ. అంతట నంతకంతకు నిరంతరమై తనరారుమారదు
ర్దాంతతఁ గాంతఁ బాన్పునకు దార్చెను దన్మధురాధరామృతా
క్రాంతిరసోద్ధతిన్ దనమొగంబులు నాల్గును నొక్కమాఱె య
త్యంతముఁ దత్తరిల్లఁగఁ దదాననముం దనకై మరల్చుచున్. 14

సీ. ఆలీలలకు నవ్వి మేలుమే లెంతయు నీవింత లన్యాయ మింత గలదె
మీమొగంబులు నాల్గు నీమాడ్కి నువ్విళులూరిన నేకాస్య నొకతె నేను
జాలుదునే యివి చాలించెదరొ మఱి యేమైనఁ గలదొ యం చామృగాక్షి
మెడబిగించుచు నించుకెడగ వక్త్రము నిల్పి యధరంబునన పాణి యడ్డమిడుచు

తే. మొలకనగవును గోపంబు చెలువుఁ జిలుకు
తళుకుచూపులు చూపులోఁ దర్జనముల
వక్రితభ్రూలతాతాండవంబు సిరుల
మిగులఁ గెరలించెఁ బ్రియుమది మెఱయుమరుని 15

ఉ. ఆయజుఁ డప్పు డంగనముఖాబ్జము బల్మిని వంచి మోవిపైఁ
జే యాటు పారద్రొబ్బి పలు చేర్చె నొకించుక నాటునట్లుగా
నాయమకుం గళాభిదురమై మది నిం పొనరింప మోహానం
బై యుదయించె నొక్కమధురాంచితశబ్దము కంఠసీమలోన్ 16

వ. అంత నావాగ్దేవి యావిధంబున నాదవినకళామర్మభేదనసామ్రాజ్యసంపదనుభ
వావస్థమానలాఘవశంక నప్రకాశంబుగాఁ గడపి పుచ్చుటకు నుపాయంబుఁజిం
తించి తద్విరోధకారిణి యైనవిభునియభిమతకేళికి విఘాతంబుగ నధరపీడనాసహ
త్వనాటితకంబున నలుకఁ గల్పించుకొని యవ్వలిమొగంబుగాఁ బొరలె నేనప్పుడు
తదీయభావం బంతయు నూరుశ్లేషనయనాంతమీలనాదు లైనశాస్త్రప్రసిద్ధలక్ష
ణంబులచేత నూహించితి నజ్జలజభవుండు తద్విరహదశావికలితధైర్యుం డయ్యు
నుల్లంబు నల్లుట నట్టు నెట్టుకొలిపి యి ట్టటు దెల్పుటకుం జొరకుండి యంతటఁ
బురోవర్తిశాఖాసమాసంజితసమంజసరత్నపంజరంబున నున్ననన్నుంజూచి యో
చిలుకచెలువ యుబుసువోదు కథ యొక్కటిఁ జెప్పవుగా యనుటయు నేను
నోదేవ దేవరముందఱ నెట్టికథయు నేను జెప్ప భాజనంబనే మీరు చెప్పితి
రేని వినియెద ననుడు నట్లని వినుము చెప్పెద నని యి ట్లనియె 17

క. కాసారసంజ్ఞతోడను, భాసిల్లుచు నున్నయొక్కపట్టణమున ల

క్ష్మీసంపద నొప్పెడుసువి,లాసుఁడు రా జొక్కరుఁడు కళాపూర్ణుఁ డనన్. 18

క ఈజగములఁ గలతనసరి, రాజుల నందఱను జయధురంధరుఁడు మహా
రా జితఁ డొనరించెను నిజ, రాజితలీలాకళాప రాజితు లనఁగన్. 19

క. ఆతఁడు సద్యోయౌవనుఁ, డై తోడన యొకస్వభావుఁ డనుసిద్ధునిచే
నూతన మొకమణియు సము, ద్ద్యోతితశార్ఙ్గము మెఱుంగుదూపులుఁ బడసెన్.

తే. ఆమణిశలాక యరుణ మై యద్భుతంపు
రంగు గలిగినయది యామెఱుంగుఁదూపు
లక్షయము లాశరాసన మతనువిజయ
గౌరవానీకసంప్రాప్తికారణంబు 21

సీ. అంతట నొకఁడు మదాశయుం డనుజగతీనాయకుండు రూపానుభూతి
యనుభార్యయును దాను దనమంత్రి ధీరభావాఖ్యుండు దోడు రానట యదృచ్ఛ
నొక్కింత పొలయుటయును దత్కళాపూర్ణుఁ డాత్మకోదండవిహారపటుత
ధీరభావునిఁ గడుదూరంబుగాఁ బలాయనము నొందించి మదాశయాఖ్యుఁ

తే దనకు శరణు చొచ్చినవానిఁ దత్కళత్ర
యుక్తముగ దాసుఁగా నేలి యూడిగంపుఁ
బనులు సేయించుకొనుచు నింపెనయ నిలిపె
నతఁడు వర్తిలుచుండెఁ దదాజ్ఞలోన. 22

వ. అని చెప్పిన నప్పలుకులు సభ్రూవిలాసలోలలోచనాంచలకషితకర్ణిక యగుచు నాకర్ణించి యించుక నగుచు శారద నన్నుం జూచి యాకళాపూర్ణుండు మఱి యేమి యయ్యె నతనికిఁ దల్లిదండ్రు లెవ్వ రడుగు మని కఱప నేను నట్ల యడుగుటయు నజ్జగద్గురుం డి ట్లనియె 23

సీ. అభినవకౌముది యనుకాంతచే నంత వరియింపఁబడియె నవ్వారవిలాసుఁ
డాతనికిని సుముఖాసత్తియనునది తండ్రియు మఱి మణిస్తంభుఁ డనెడి
వాఁడు తల్లియు నన వాణి హాసంబుతోఁ గ్రక్కునఁ గ్రమ్మఱి కౌఁగిలించి
యింతలోనన యూర యెన్నితబ్బిబ్బులు దద్దరిల్లకుఁ డంచు ధవునివీఁపు

తే. చఱచి యెట్టెటు లారాజుజనని మొగది
యును జనకుఁ డాఁడువాఁడునా యనుచు మఱియు
మిగుల నవ్వుచుఁ జెప్పఁ డామీఁదు ప్రాణ
రమణ మఱి యేమి యయ్యె నారా జనుటయు 24

క. ఆనర్మలీలచేత శ, తానందుం డధికసంభృతానందుం డై
తానును మే లొప్పఁగ న, మ్మానిని మెడఁ గౌఁగిలించె మక్కువ మీఱన్. 25

తే. వదనములు నాలుగిటికిని వరుసఁ గలియ
మెలపుతోడన కంఠంబు మలఁచి మలఁచి

యొసఁగెఁ దదధరపానమహోత్సవంబు
గళము గౌఁగిలితోన చెక్కులు నిమురుచు. 26

చ. చెలువయు నంత నం దొకటిచే జనితాధరపీడ యైన మదిం
గొలఁది యెఱుంగ రెండు నని కోపముఁ జూపుచుఁ జాలుఁ జాలు న
వ్వలఁ జెపుఁ డేమి యయ్యెను భవత్కథితుం డలరా జటంచుఁ గౌఁ
గిలి విడిపించి మోము లిరుగేలను బాయఁగ బట్టెఁ బట్టినన్ 27

ఉ దానఁ బ్రకాశితంబు లగుతత్కుచకుంభవిజృంభణంబు లేఁ
గౌనుబెడంగుఁ గొంతవడిఁ గన్గొని చొక్కుచు నంత మోవితీ
పానె నజుండు వెండియుఁ బ్రియత్వముతో నివి యెల్ల నేర్తు రా
నౌ నృపుఁ డేమి యయ్యెఁ గథ యానతి యిం డని పల్కె వాణియున్. 28

సీ ఏమియు నేల యయ్యెడు నమ్మహారాజు సత్వదాత్ముం డనుసచివుఁ డంత
రమణితో నంగదేశమునందుఁ గ్రముకకంఠోత్తరం బనుపట్టణోత్తమమునఁ
దన్నుఁ బట్టము గట్ట నున్నతసామ్రాజ్యవైభవశ్రీసముజ్జ్వలత నొప్పె
నతని యాపురికి మదాశయుండు పసిండి కోట పెట్టించి యెక్కుడుగ నతని
తే దయ వడసె నంతఁ దనదుభార్యయును దాను
నుడుగ కభినవకౌముదీయుతుని నతని
గొలుచుచును దన్మణివిలోకగుణమహత్త్వ
మునను మధురలాలస యనుతనయఁ గనియె. 29

సీ. కని తన్మణీగుణంబునకు మెచ్చుచుఁ బ్రథమాగముండును ద్వితీయాగముఁడు తృ
తీయాగముండుఁ దురీయాగముండు నాఁ బ్రఖ్యాతి నొప్పువారలు నలువురు
తత్పురోహితులు సత్వరము కళాపూర్ణుఁ జేరి యాతఁడు దాల్చుచారుమణిని
బర్యాయమునఁ దారు పట్టి తత్సంస్పర్శమహిమచే నానందమగ్ను లయిరి
ఆ. యతఁడు తద్వశీకృతాత్ము లైవారాత్రి,ఋంచి యునికిఁ దనదుహృదయమునకు
నియతివశతఁ జాలఁ బ్రియ మగుచునికిఁ దత్క్రియలు కెల్ల నిచ్చగించియుండె

వ. అంత వారిలో నొక్కరుండు మిక్కిలి మందె మేలమ్మున నమ్మణిని గరంబు నొక్కి
పట్టుటయుఁ గళాపూర్ణుండు కోపగించుకొని వారిఁ బాయందోలితదపరాధంబు
నం జేసి తత్స్వామి యైనమదాశయునికనకప్రాకారంబు నొల్లక విఘటితంబుగాఁ
జేయించె నతండును దానికిఁ దలంకక యందుల కేమియెట్లైనను దనవాఁడనతని
దేశంబునంద యెందైనను బ్రతికెద నని కళాపూర్ణుసేవ విడిచి కుటుంబసహితం
బు గాఁ గ్రముకకంఠోత్తరపురంబు వెల్వడి యెక్కించుక చనుచుండె 31

సీ. కట్టెదుటను బూర్ణకలశద్వయం బతిశోభనస్ఫూర్తి మై సొంపు మీఱఁ
గని వేడ్క నుబ్బుచుఁ జని సుఖంబున మధ్యదేశంబునను జిరస్థితిఁ దనర్చు

క్రముకకంఠోత్తరాఖ్యపురంబు వెడలునప్పుడు ప్రయాణక్షోభమునఁ గృశత్వ
మును బొంది తేరనిముద్దులపట్టిని మధురలాలసఁ దలంపఁగ నెఱుఁగఁడ

ఆ. అప్పు డేమి సెప్ప నాతఁ డాపుఁబోఁడి, యెట్టివా రని గణియింప దంత
మీఁదమీఁద సుఖనిమిత్తంబు లౌదవుచో,నడుమఁ జెందునిజజనంబుపీడ 32

తే క్రముకకంఠోత్తరపురోత్తమమున కంత, నరుగుదెంచెను దిరిగి మదాళియుండు
నిజకుటుంబయుక్తముగనన్నిసువుభాగ్య, మెల్లు పేరేచెనో మఱియొందునిలక.

క. ఈపగిది నేగుదెంచి కళాపూర్ణుని గనుఁగొనం జెలంగె నిజకృశ
త్వాపగమోల్లాసిని యై, యేపునఁ దత్పుత్త్రి యంత నెంతయుఁ దెలివిన్. 34

సీ. అంత మదాళసయుం డట్లు దేఱి కరంబు పాదలెడుసుత గళాపూర్ణునొద్దఁ
దగ నిల్పి యతనికిఁ దత్ప్రకారముఁ దెల్పి యిట్టిచిత్రమహత్త్వ మేరికైనఁ
గలదె యొందును నీక కాకంచు భార్యయుఁదానుదన్మహిమయంతెయునురమణఁ
బొగడుచు నింపునఁ బొదలి రత్యంతంబు నతనిపురోహితు లపుడు వినయ

తే. పరతఁ బ్రథమాగమాదులు తిరుగఁ జేరి
రాకళాపూర్ణు నాతండు నాత్మ నిచ్చ
గించుకొని యుండె నోతటిచ్చంచలాక్షి
సుప్రసన్నత్వ మెంతయు సొంపు మీఱ 35

తే మధురలాలస యంతఁ గ్రమంబుతోడఁ,దల్లిదండ్రులప్రోదిని దరుణి యగుచు
నాకళాపూర్ణుచేత ననన్యసదృశ, మైనయౌవనఫలము దా ననుభవించె. 36

క నిరవధికప్రేమోదయ, దురపహ్నవకందళన్మృదుస్మితశోభా
సురుచిరకృత్రిమరోష,స్ఫురణంబున బొమలు ముడుపుచుఁ సతి పతితోన్ 37

చ. అటు దలఁ డౌర యెంతటిమహాత్ములు మీరలు నాదుమీఁదనా
కటకట మీవచోరచనకౌశల మోభువనప్రపంచసం
ఘటనధురీణ యన్న నగి కామిని యిం దిపు డేమి గాంచి యీ
కిటుకు గడించి పల్కె దెఱఁగింపుము కల్గిన నాకు నావుడున్ 38

సీ చెల్లఁబో మీసేవ సేయుచు నింతమాత్రము నెఱుంగఁగలేన ప్రాణనాథ
యీదంటమాటలు నిట్టిభావంబులవిధము నే నిచ్చినవిద్య లకట
యిప్పటిమనవృత్త మీకథ సర్వంబు తుదముట్ట నేమిసెప్పెదరొ యనుచు
నూరక యిందాఁక నుంటి నంతయుఁ జెప్పెదను నది వినవలసిన వినుండు

తే. కొలఁకు కాసారపురముగాఁ బలికి యందుఁ
బొలుచునామోమునీడ సంపూర్ణశశియు
ననుతలంబునఁ బలికితి రపుడు దానిఁ
బ్రకటముగఁ గళాపూర్ణుఁ డఁట రాజు గాఁగ. 39

వ. ఆరాజు=ఆకళాపూర్ణుఁడు; సరిరాజులనెల్ల లీలాకళాపరాజితులం జేసెననుట = ఆవదనప్రతిబింబచంద్రుఁడే ఎల్లముఖచంద్రులకు నెక్కుడైనసౌందర్యముగల వాఁడని యతిశయోక్తి మీమహత్త్వవిశేషంబు దెలిపితిరి ఇది యంతయు విస్పష్టంబు; మఱి యతండు,స్వభావుం డనుసిద్ధునిచేత ధనుర్బాణంబులు నొక్క-యరుణమణిశలాకయుం బడసె ననుట = భ్రూలతావీక్షణంబులు నధరంబును స్వభావంబుచేతన గలిగియున్నవి యనుట యని యెవ్వరి కెఱుంగఁబడదు. మదాశయుం డనువాఁడు రూపానుభూతి యనుభార్యయుం దాను ధీరభావుం డనుమంత్రితో నలవోక యటుల వలసినమాత్రఁ గళాపూర్ణుం డాధీరభావుని దనధనుర్విలాసంబునం బలాయనంబు నొందించి మదాశయు నతనిభార్యతోడఁ గూడ నొక్కించుక ప్రవర్తించె ననునది-మత్ప్రతిబింబంబు నిజభ్రూవిలాసంబున ధైర్యంబుం బాఱఁ దఱిమి మీహృదయంబును దృష్టిసహితంబుగా నాకర్షించి విడువ దనుట యై కానుపించుచున్న యది; అంత నిప్పలుకులకు నాకు నవ్వు వచ్చినది మత్ప్రతిబింబంబునం దోఁచినఁ జూచి యానవ్వును లేఁతవెన్నెలతో సామ్యాతిశయంబు దోఁపఁ దదభేదాధ్యవసాయంబు గల్పించి యభినవకౌముదీ శబ్దంబునఁ బలికి యది స్త్రీలింగత్వసామర్థ్యంబున స్త్రీనామధేయంబై కానుపింప నభినవకౌముది యనుకాంతచేత నతండు వరియింపఁబడెననంటిరి; ఆకళాపూర్ణునకు సుముఖాసత్తియనునది తండ్రియు మణిస్తంభుఁ డనువాఁడు దల్లియు ననుట=ఆప్రతిబింబంబు శోభముఖసామీప్యంబు కారణంబుగాఁ దత్కాసార మధ్యమణిస్తంభగర్భంబున నుదయించె నని చెప్పుటకాదె; అందు స్త్రీపురుషత్వంబులు మీర లేమితడఁబాటుననో విజ్ఞోదుపడఁ గల్పించి పలికిన నేను హాసౌత్సుక్యంబుల నాఁపలేక మీ కభిముఖంబుగాఁ బొరలినఁ గాసారమధ్యవిద్యోతమానప్రతిబింబంబు వోయి మన్ముఖంబు మీకు నెదుటఁ గాన్పించిన నగి మదీయదేహంబునందుఁ గంఠోపరిభాగంబునం గనుపట్టుటం జేసి యాకళాపూర్ణుం డంగదేశంబునఁ గ్రముకకంఠోత్తరపురంబునం బట్టంబుఁ గట్టుకొనియె నంటిరి. అదియే మదీయాత్మాధీనంబు గావున సత్వదాత్ముం డనుమంత్రిపట్టంబు గట్టుటగాఁ జెప్పితిరి; సత్వదాత్ముం డనఁగ - సమీచీనత్వదాత్ముం డనుట తోఁచుచున్నయదియ; అంతట మీరు మత్కంఠపరిరంభణంబు గావించి యిది యుష్మదాత్మాధీనం బగుటను మీబాహువులు సువర్ణవర్ణంబు లగుటను మదాశయుండు క్రముకకంఠోత్తరంబునకుఁ బసిండికోటఁ బెట్టించె నంటిరి; మీయాత్మయు దృష్టియు నెట్టిమమతావశంబుననో మన్ముఖంబునం బాయక వర్తిల్లుచు మధురాధరేచ్ఛ యార్జించుట యరసి మదాశయుండు రూపానుభూతి సహితుం డై యాకళాపూర్ణునకు సేవఁజేయుచుఁ దన్మణిశలాకమహత్త్వంబున

†[మధురలాలస యనుతనయుం గాంచె నంటిరి;అట్లు]మధురలాలసఁ గనిన దస్మణిశలాకమహిమకు మెచ్చుచుఁ బ్రథమాగమప్రముఖు లయినమదాశయునిపురోహితు లస్మణిశలాకం బట్టి చూచుచుఁ దత్సంస్పర్శనమహత్త్వంబున నానందమగ్నులయి రనుట = చుంబనేచ్ఛానంతరంబున మీముఖంబులు నాల్గును మదీయాధరపానంబున నింపొందె ననుటగాదె? యాముఖంబులు ఋగ్యజుస్సామాథర్వణప్రాదుర్భావకారణంబు లగుటను మీయాత్మకు నధీనంబు లగుటను గ్రమంబునఁ బ్రథమాగమాదినామధేయు లైనమదాశయునిపురోహితు లంటిరి. అంతట నేను మీముఖచేష్టలచేత నధరపీడ జనించినఁ గోపించి వాని వారించి కౌఁగిలి విడిపించుకొనిన నది కళాపూర్ణుండు తనతాల్చినమణిశలాక యాబ్రాహ్మణులయందు నొక్కరునిచేతఁ గొంతపీడితం బైనఁ గనలి వారిం బాయఁదోలించె ననియుఁ దత్స్వామి యైనమదాశయుని కనకప్రాకారంబు విఘటితంబు చేయించె ననియుఁ బలికితిరి; అంత దేవరచిత్తంబు దృష్టిసహితం బై మన్ముఖంబును విడిచి పరిరంభవిశ్లేషప్రకాశితంబు లైనయితరావయవంబులకుఁ బోయిన నన్మదాశయుండునిజభార్యాసమేతుం డగుచు నాకళాపూర్ణుసేవ విడిచి తదాశ్రయం బైనయంగదేశంబునకుఁ బోయె నంటిరి; అట్లు పోవుచు నెదుట నొదవిన పూర్ణకలశద్వయశుభనిమిత్తదర్శనంబున నుబ్బుచు నేగి మధ్యదేశంబునం జిరనివాసంబు గావించె ననుట=వక్షోజయుగళసందర్శనంబున నానందించుచు నరిగి వలగ్నభాగంబు నవలంబించి తడవు నిలిచె నని పలుకుట గాదె; ముఖంబుఁ బాయుట యాదిగాఁగ నధరేచ్ఛ యడంగినఁ బ్రయాణక్షోభంబున మధురలాలస కృశత్వంబు నొందె నంటిరి; అంత దృష్టిసహితంబుగా మీయాత్మ తిరిగి మన్ముఖంబునకు వచ్చుటయు దానఁ జుంబనేచ్ఛ మగుడఁ బరితుష్టినొందుటయు నది ముఖపానంబుచేత సఫల మగుటయుఁ గ్రమంబున మదాశయుండు కుటుంబసహితంబుగా మరలి కళాపూర్ణునిసేవకు వచ్చె ననియుఁ దత్కారణంబున మధురలాలసకుఁ గృశత్వంబు మానెననియును, నదియాహావనంబునఁ గళాపూర్ణుననుగ్రహంబు వడసె ననియును మీకాముకత సముచితవచనరచనలఁ దేటపఱచితిరి; ఇది యంతయు నిట్లు యగునో కాదో యానతీవలయు ననిన నతండిట్ల తప్పదని నగుటయు నతనియథార్థవాదిత్వంబునకు మెచ్చుచు నిట్లనియె. 40

క. ఇమ్మగుపరిహాసపువా, క్యమ్ములయెడ బొంకు వినముగా మీవలనన్
మిమ్ముఁ గనినహరిపొక్కిటి, తమ్మి కడుపు చల్ల నై సదా మనవలయున్. 41

క. అని పలికినతనప్రియభా, మినిపలుకులకును బ్రమోదమేదురహృదయుం
డును దత్పరిరంభణపరుఁడును నై యాపద్మజుఁడు గడుం బొలుపొందెన్. 42

---

† కుండలితభాగము కొన్నిపుస్తకములందుఁ గనఁబడదు,

ఆ. అని సరస్వతికిని గనకగర్భుఁడు రహ, స్యమునఁ జెప్పినట్టిసరసపుఁ గథ
యేర్పడంగఁజెప్పి యిట్లని పలికె నా, శిశువు వినుజనులకుఁ జిత్ర మొదవ. 43
ఆ. తమయభీష్టకేళితమినొ తిర్యగ్జంతు, వనియొ నను గణింప కవ్విధమునఁ
జెప్పుకొనఁగ వింటి నప్పల్కు లేను నా, నడుమఁ గదలి పోవ జడిసియుంటి 44
ఉత్సాహ. అంతఁ బంజరంబు వెడలి యట్టు నిట్టు నొయ్యనన్
గంతు లిడుచు జాతిజాతి కడకుఁ దొలఁగి వచ్చితిన్
జింత సేయ మింతతడవు చిలుకయున్కి యనుచు నా
యింతి గొంత యలుగ నున్న నేమి యనుచుఁ బల్కెనన్. 45
సీ. అంతట నొకసమయంబున నంభోజ సంభవుసేవ తా జరుపుకొఱకు
జనుదెంచునిర్జరేశ్వరునివెంటను రంభ చనుదెంచి భారతీశ్వరునిఁ గొల్వ
నంతఃపురంబుకక్ష్యాంతరంబులు గొన్ని చొచ్చి యేతెంచి యిచ్చోట నొక్క
పంజరంబునను మున్నటియట్ల వాగ్దేవి, మణితవిశేష మాత్మకు సుఖముగ
తే. నొయ్యనొయ్యన వర్తించు చున్న నన్నుఁ,జూచి దగ్గఱ వచ్చి,యాసొంపు మిగుల
జిత్ర మిది యయ్యె వారిసంసేవవేళ, నమ్మవా రుగ్గడించిరో యనుచు నడిగె
ఉ. ఏనును దాఁపురం బెఱుఁగ కేర్పడఁ జెప్పితిఁ దత్సరోదయం
బైనతెఱంగుఁ దత్ప్రభవ మైనకథాకథనంబు నంతటన్
మానఁగనీక యవ్విబుధమానవతీమణి ప్రేమతోడఁ బై
పై నడుగన్ వివేక మొకపాటియొ చిల్కల కేమి నేర్చెనన్. 47
ఆ. ఇట్లు చెప్పి యంత నే నవ్విలాసిని, పలుకు మనగఁ దొంటి పలుకులకును
రెండుమూఁడుమార్లు వెండియుఁ బలుకఁగ,నచటి కేఁగుదెంచె నజునియతివ. 48
వ. ఇట్లేఁగుదెంచి కనుబొమలు ముడుచుచు నన్ను నవలోకించి. 49
చ. తలఁకక యోసి! యేమిటికితల్ దలపెట్టినదాన విచ్చటన్
దెలియము గాని నీవు పెనుద్రిమ్మరికూఁతలదానవే కదా
భళిభళి యీవికారములు భ్రాంతి యవిఘ్నుతఁ జాగిలంబె వై
యిలపయిఁ బుట్టు మంచు శపియించె మనంబున నల్క హెచ్చఁగన్. 50
క. రంభయుఁ దత్కోపపుసం, రంభమునకు వెఱచి యొక్కరత్నమయోరు
స్తంభముమఱుఁగున నొదిఁగె వి, జృంభితతద్రోషభాష వినఁబడ నంతన్. 51
సీ. నలువ యేతెంచి యెన్నఁడు లేనియింతకోపపుఁబలు కిదియేమిపడఁతి యనుచుఁ
దనభార్యఁ బలికె న వ్వనితయుఁ గోపంబు మించి శోభిలుమృదుస్మితముతోడ
వినరుగా యీచిల్కవిధము మున్నుద్యాన వనములో మన మాడుకొనినయట్టి
యాకథమాట లాద్యంతంబు రంభతోఁ జెప్పుచున్నది యేను నప్పలుకులు
తే. వింటి నిపుడు వచ్చుచు గోడ వెనుక నిలిచి
యనుడు నది యేమి యెఱుఁగు నిట్లదయవృత్తిఁ

దిట్టుదురె యంచు సతిఁ బల్కి యట్టిశాప
గతికిఁ గుందెడున న్నంతఁ గరుణఁ జూచి 52

వ మీయమ్మశాపంబునకు నోఁ గా దన నెవ్వరికి నెట్ల వచ్చు నది య ట్లనుభవించి తదనంతరజన్మంబున మదాశయుం డనుజగతీపతికి మధురలాలస యనందనయవై జనియించి కళాపూర్ణుం డను రాజునకు భార్యవై యనన్యసాధారణం బైనయైశ్వర్యభోగంబు లనుభవించుచు నహజం బైనపరమపాతివ్రత్యంబున సకలధర్మంబులను సాధించి కృతార్థ వయ్యెదు. విచారింపకు మని పలికిన శారద యవ్విభునిం జూచి యిరివే మయ్యా వెండియు మదాశయుండును మధురలాలసయును గళాపూర్ణుండు నంచుఁ బల్కుచున్న వారు దేవరకు నిప్పుడు నవియకలవరింతలై యున్నవి యనుచుఁ బలికి నవ్విన నతండు భవదీయవదనవర్ణనాసంబంధికథలయందు నాకుఁ గలవరింతులు సంతతంబును గలుగుట నిజం బైనయది యట్లు గాదు మేదినిమీఁద నింకఁ గళాపూర్ణుం డనురాజు పుట్టఁగలం డతని కిది పత్నియుఁ గాఁ గల దనుటయు నేఁ దత్కథ వినవలయు నానతి మ్మని సరస్వతి పల్కిన ని ట్లనియె 53

సీ కాంత ము న్విన్నయాకథ యీకథయు నాఁగ నమ్ము వాచ్యత తోఁచినట్టినామ
జాతిక్రియాదికసకలపదార్థవాక్యార్థాంతరము నెవ్వి యవియ యందు
గలయవి యిందుఁ దత్కథకంటె భేదంబు పరికింప నొనరించెఁ బడసె నిలిపె
ననునివి మొదలైనయట్టిభూతార్థంబు క్రియలపట్టున నొనరించుఁ బడయు
తే. నిలుపు ననునివి యాదిగాఁ గలభవిష్యదర్థవచనంబు లైనక్రియాపదంబు
లునుచుకొనుటగొ వానియందును దలంప,నోసుధాంశువిలాసప్రహాసవదన.54

వ. మఱియు శ్రోతృజనాపేక్షానుసారంబునఁద త్తన్నిమిత్తోపాఖ్యానంబులచేత నిదియ కొంత విస్తారంబు నొందఁగల దది చెప్పఁ బనియేమి ప్రధానకథాభాగం బింతియె కావున 55

సీ. అనిన సరస్వతి యద్భుతం బంది యొక్కింత విచారించి కాంతుఁ జూచి
యా రాజునకు సుముఖాసత్తియనునది తండ్రియు మఱి మణిస్తంభనాముఁ
డగువాఁడు దల్లియు నయెద్యరే యన్నఁ నం దేమి సందియ బదియు నీదు
చేష్టావిశేషంబు చేతన కాఁగల దని బ్రహ్మ పలికె నయ్యబ్జముఖియు
తే మిగుల వెఱఁగంది యంతట నగుచు మీరు, సృష్టికర్త లెట్టైనను జేయఁగలరు
మదికి వలసినయట్ల చేయుదురు గాని, వట్టికోడిమెలు నాకును గట్టఁ జనదు. 56

క తలపెట్టకుఁ డీక నెన్నఁడు, గల నైనను మత్ప్రసంగకారణమున వ
ర్తిలినట్టియీకథాస్థితి, యిల నిట్టివి గోరఁ దివియ నేతైౖ పాఱున్ 57

సీ మన మంత నేకతంబునఁ జెప్పికొనినట్టి కథ యిది తోన యిక్కడను బుట్టె

నింతమాత్రము గాక యిటమీఁద నీకథ పృథివిపైఁ గలుగఁ జెప్పితిరి మీరు
తొలుతన యిది బ్రహ్మవలన వచ్చినయది యనఁగఁ దన్మూల మెట్టిదియో యనఁగఁ
వాఙ్ముఖప్రతిబింబవర్ణన యనఁగ నిట్టిప్రసక్తి నిది సంఘటిల్లె ననఁగ

తే. వచ్చె నగుఁ బాట్లు నాకు మీవలన నాథ,నన్ను మన్నించి యింక నైనను దడవక
మీర లూరక యున్న నెవ్వారు నంత, వినరు గాన గుప్తంబు గావింపవచ్చు.

మ అనుడుం బైపయిమాట గాక యిది యాహా యాత్మశృంగారశో
భనలీలాయశ మేరి కప్రియము నీపల్కుల్ మనోవర్తనం
బును నేకం బగు నేని నాలుకతుదల్ ము క్కంటికొమ్మా విలా
సిని యే నమ్మెద నంచు బ్రహ్మ నగిపించెల్ మేలుమాటల్ సతిన్. 59

మ ఘనయత్నంబున నవ్వడంచికొనుచుం గంజాతయుల్ నాథ యే
మనినం గోపము వచ్చుచున్నది సుఁడీ యత్యంతముల్ నన్నిఁకం
జెనఁకల్ రాకుఁడు చాలు నవ్వు లని వైచెం గాంతుమీఁదల్ నిజ
స్తనగుచ్ఛప్రతిమల్లహల్లకదళోద్యత్కందుకం బంతటన్ 60

మ అనయంబుం జల మొప్పఁగా మఱియు నాయబ్జాసనుం డట్లు యా
డెను మానుం డిది యంచు వాణియును వేఁడెల్ జేరి తా నొక్కచే
తన కంఠంబును గౌఁగిలించి యొకచేతల్ గడ్డముల్ బట్టి చె
క్కునఁ జె క్కానుచు నొక్కచన్నొన యురఃకోణంబుతో రాయఁ గన్ 61

తరల. అతఁడు నేల యెనంగె దోజలజాతి పల్కెటు లున్న నీ
కత ప్రకాశిత మాట నీమదిఁ గాంతితంబ యవశ్యముల్
క్షితిఁ బ్రసిద్ధము గాఁగ నున్న విచిత్రసత్కథ నీ కస
మ్మత మె య ట్లగు నేని యేమహిమం బ్రసిద్ధత గల్గెడున్. 62

సీ. వివరింప సకలవస్తువుల ప్రసిద్ధి వాగ్జాలమూలంబు వాగ్జాల మెల్లఁ
దన్మయం బిట్లుండఁ దనరు నీమది కసమ్మత మైనయట్టిది మహి వ్వలయు నె
యాకళాపూర్ణమహారాజుకథ తావకీనశృంగారలీలానిమిత్త
మగుచు మన్ముఖజాత మగుచు నవశ్యంబుఁ గరము ప్రసిద్ధంబుగాఁ గలయది

తే. నీకుఁ బ్రియ మని వేఱ వర్ణింప నేల, నీ విపుడు పల్కుపల్కు స్వాభావికంబ
పతులయను రాగలీల లేపగిది నైన,వెలయఁ గోరియు దాఁచు టింతులగుణంబు.

వ. అనిన విని యాభారతీదేవి యావారిజాసనుం జూచి మీర లింతచలముఁ గొని
సమర్థింప నాకు నొఁ గా దన నేల యదియునుం గాక యారాజు వాలాయంబు
గా ధరణిం బుట్టఁగలం డఁట రాజ్యంబునుం జేయునఁట యతనిచరిత్రం బెట్లును
వెలయం గల దఁట యిది సిద్ధంబు దానిసంగడిని నస్మద్రహస్యకథ వెలయుటకు
నియమం బే యనుటయు నతం డిది మునుపును నది వెనుకనుం గా వెలయు
నని పలుక నట్లేని వెలయుభంగు లెవ్వియో యెఱుంగవలయు మీర లెక్కడ

నుడువకుండుఁ డని ప్రార్థించి నుడువ ననిపించుకొని తన్నుఁ గనుంగొని యిది యిప్పుడు వారాంగనాజన్మంబునఁ బుట్టి యున్నయది యందు నేతద్బోధశంక నెఱయలే దని పలికి రంభ యనునది యిప్పు డెందుఁ బోయె దానికిఁ దగినబుద్ధి చెప్పవలయు ననుడు నప్పుడంతి గడగడ వడంకుచుఁ గంబంబుమఱుంగు వెడలి వచ్చి యడుగుల కెఱఁగిన లే లెమ్ము నీవీకథ యెక్కడం దడవిన నాలా గెఱుంగుదు గద యని పలికిన నలువ నగుచు నీలాగు మఱియెవ్వరు నే మెఱింగెదరు; ఈకథ యింకఁ జెప్పినట్టివారును వినినట్టివారును ధాత్రియందుఁ బుత్త్రపౌత్త్రప్రపౌత్త్రాదిబహుసంతతిఁ దనర్చుచుఁ జిరకాలంబు ప్రచురసంపదభివృద్ధిశోభిత శుభసౌఖ్యంబులు గాంతు రిది యంతయు నావశ్యకంబుగ మదీయాశీర్వాదం బని పల్కిన.

చ. సతి పతిఁ జూచి మీచలము సాగినఁ జాలును మీర లన్నప
ద్ధతియ కదా నిరర్గళత ధాత్రిఁ బ్రవర్తిలనిం డ టంచు నిం
పతిశయిలంగ నవ్వె నపు డచ్చటు వాసి తదాజ్ఞ నేను నీ
క్షితిపయి ద్వారకాపురిని జెందితి జన్మము వారకాంత నై. 65

క. అని యీజన్మంబునఁ గల, తనవర్తన మించుకయును దప్పక యుండన్
వినిపించి విచిత్రజ్ఞా, ననిధానము శిశువు రాజునకు నిట్లనియెన్. 66

క. కలభాషిణి యనుపేరన్, వెలయుచు నే వాణిశాపవిధిఫల మాలీ
లలఁ గడప నొదవె నంతట, నలినజుసదయోక్తిఫలము నా కీతను వై. 67

తే. శక్తి గుడిలోనఁ బ్రాగ్జన్మసమయమునను
నాకు నిద్దివ్యహారసందర్శనంబు
కలిమి వింటి గదా యది దలఁచి యిపుడు
గ్రమ్మరంగ రెండేండ్లకుఁ గంటి ననుట 68

క. అలరుచుఁ బ్రమదాశ్చర్యం,బులు మనమునఁ దనర వినయమున నుత్థితుఁ డై
యలఘువ్రతుఁ డాబాలిక, కిలఁ జాఁగిలి మ్రొక్కి లేచి యి ట్లని పలికెన్.

క. తొలుతటిజన్మమునందును, గలభాషిణి యనఁగఁ బరఁగి కావించిననీ
యలఘుచరిత్రలలో నా, తలఁపున నొకవర్తనంబు దార్కాణ మగున్. 70

తే. అనుడు నీ కేమి దార్కాణ మయ్యెఁ జెప్పు
మనుచు నాన్నృపుఁ డడుగ నయ్యతివవలనఁ
దగఁ గళాపూర్ణువినినచందము జపంబు
తెఱఁగు నాసభఁ బడినరీతియును జెప్పె

ఉ. చెప్పి యతండు బాలికకుఁ జేతులు మోడ్చుచు నీదువాక్యముల్
దప్పవ యందు నామధురలాలస వై నవిధంబ యిప్పు డీ

యొప్పింక నీకు నాథుఁడుగ నున్నమహామహు నాన్నృపాలు నా
కెప్పుడు చూడఁగాఁ గలుగు నింతయుఁ జెప్పుము నీవె నావుడున్. 72

ఆ. తీతిసుపర్వ యేను జెప్పిన నిఁక లెస్స, యుండ దది యెఱింగి యున్నవారు
వీర లెల్ల నడిగి వీరు చెప్పఁగ విను, మనియె శిశు వతండు నాదరమున. 73

తే. ఆసభాపతిఁ జూచి యాయమ్మ యాడు, పలుకు వింటి నృపాల యేర్పఱుపవలయు
నాకు మీపేళ్ల మీవర్తనముల నేత, దీయనామవర్తనములు దెలియఁ బడఁగ.

మ. ఇది యేలోకమొ యేపురంబొ మఱి మీ రెవ్వారొ మీబాలయె
ట్టిదియో యేమియుఁ గాన కెంతయును నా డెందంబు విభ్రాంతతన్
జెదరన్ బ్రాన్పడి యున్నవాఁడఁ దెలియం జెప్పించుకో వేళ గ
ల్గద యిందాఁకను దత్కథాకథనలీలాభవ్యవైచిత్రి చేన్. 75

సీ. అనుడు సజ్జనపాలుఁ డట్ల యావేళ గల్గద యనమాట నీకతయు నాకు
నడుగఁగ నెడలేద యంతకంతకు నద్భుతప్రఁగథ లొదవ నిందాఁక నవఘు
వింటిమి కొంత నీవృత్తాంత మిపుడు మా, విధ మింకఁ జెప్పెద విను మెలియ
నేఁ గళాపూర్ణుఁడ నీవె స్వభావుఁ డిచ్చినయట్టిమణియును సింగిణియును

తే. నమ్ములును వీరు ప్రథమాగమాదులైన
యట్టినలువురు మఱి సత్త్వదాత్ముఁ డాతఁ
డాతఁడు మదాశయుండు రూపానుభూతి
యల్లయది యాకెబిడ్డ యా యరిదిశిశువు 76

చ. తనగురుఁ డమ్మదాశయుఁడ తప్పక యట్లు మముఁ భజించి ముఁ
జని చను దెంచినాఁ డిపుడు నాకడకుం దను నట్లు నాదుద
ర్శనమున నేద దేఱె నని జాయయుఁ దాను ముదద్భుతంబులన్
దనరుచు నిట్లు ముందట నతం డిడినాఁడు పసిండితొట్టితోన్. 77

వ. దీనిపేరు మధురలాలస యనం బరఁగు నని యాయాపేళ్ల వారి నందఱిం జూపి
చెప్పి యిది యంగదేశంబు నగు నీపురంబును గ్రముకకంఠోత్తరనామధేయంబ నే
జనియించినదియుఁ గాసారపురంబ యది యిచ్చటి కనతిదూరంబున నున్నయది
యన్నియుం జెప్పనేల వెరసిమాట యొకటి గల దని యి ట్లనియె 78

సీ. అజుఁడు వాణికిఁ జెప్పినట్టియాకథలోని వారివేళ్లును వారివర్తనంబు
లొకటియుఁ దప్పక యుండ మావేళ్లను మావర్తనములు నై మదికి మిగులఁ
బరమాద్భుతం బొనర్పఁగ శారదావద నప్రతిబింబాదినామకర్మ
కల్పనాకేళిప్రకారమాత్రము లైన యస్మదాఖ్యానక్రియాదికముల

తే. తోడ నెందు నొకింత విజ్జోడుపడక
నమ మగుట యెట్లొ యనువిచారము గలిగియు

నడుమఁ దత్కథలకును విఘ్నంబు సేయఁ
జనమి యూరక యుంటిమి వినుచు మేము. 79

క. అంతటఁ దత్కథ తుదవృ,త్తాంతముచేఁ దీఱె మాకు నాసందేహం
బంతయు ననుటయును మహీ, కాంతున కిట్లనియె నతఁడు గడుఁ జోద్యముగాన్

తే అజుఁడు చెప్పినకథలోనియట్ల తండ్రి
యాఁడుమానిసియును మగవాఁడు దల్లి
యును మహీపాల నీకు నాయుల్లమునకు
నిది వెఱఁ గొనర్చుచున్నది యెఱుఁగఁ జెపుమ. 81

క అన నాకును దద్వాక్యం బనయము చిత్ర మగుచున్న యది యాశిశువా
త్మనెఱుంగనియది లేదీ, యనుభావము చూడ నడుగు మది దెల్పెడన్. 82

క ఆవాక్యము నీబాలిక, యావనఫలకథయు నవిదితార్థము లెందుల్
భావింప నొకటి పొసఁగుల్, భావి యగుటను మొదలిది వినం దగుఁ దెలియన్.

క, అలఘువ్రతుఁ డపుడు కృతాం, జలి యై యాశిశువుఁ జూచి సర్వము నీకుం
దలఁపఁగ విదితమ యీభూ, తలకతిజన్మము తెఱంగు దయఁ దెలుపఁ దగున్. 84

వ మున్ను నీకారణంబున నీకళాపూర్ణకథాకర్ణనఫలమహాత్వంబు వింటిఁ బదంపడి యిట్టినాజపంబునకు ఫలంబై నయితనికథ వినికియు నీకృపనే కలిగె నంతమాత్రం బును గాక యీకల్యాణచరిత్రునిఁ బ్రత్యక్షంబు చూడఁ గంటి నత్యద్భుతంబైన యీతనిజన్మప్రకారంబును సవిస్తారంబుగా నానతి యిచ్చి నన్నుం గృతార్థునిఁ జేయు మనిన నమ్మధురలాలస యిట్లని వినిపించె. 85

సీ. భూవిబుధోత్తమ నీవు మృగేంద్రవా, హనగేహమునకు మున్నట్లు వచ్చు
నపుడు మణిస్తంభుఁ డనుసిద్ధుఁడును సుముఖాసత్తి యనియెడునతనిసతియు
నాతోడిసంభాషణమున వర్తిలుచుండి, రెఱుఁగుదు దగ నని యేర్పడంగఁ
దత్పూర్వవృత్తమంతయుఁ దెల్పి యిట్లను, వారలు యోగప్రవర్తనమున

తే నమ్మహాశక్తిభవనంబునందు గొన్ని
నాళ్లు విజితేంద్రియతఁ బ్రవర్తిల్లుచుండి
రదియు నీకును దెలిసినయదియె యంత
వా రచటు వాసి చని యొక్కవనములోన

తే రతి సలిపి రందు సిద్ధుఁ డోయతివ నీవు,పురుషుఁడవుగమ్ము నారీత్వమును భజింతు
నే ననుచు విపరీతరతేచ్ఛఁ బలికెఁ, బలుకుటయు నాదరమున నజ్జలజముఖియు.

క. స్త్రీత్వము నీ వొందుము పురుష,త్వము నేఁ దాల్తు నని నిజప్రియుఁ బలికెల్
సత్వరత నట్ల వారల, స్త్రీత్వము పురుషత్వము విపరీతము లయ్యెన్ 88

వ. అప్పుడు. 89

మానినీవృత్తము. ఎక్కడనుండియొ కల్గెను సిద్ధున కేమరుపాటఁ గృశోదరముల్
జొక్కపుగుబ్బలు గొప్పపిఱుందులు సోగకనుంగవ యొప్పిదముల్
జక్కనిముద్దుమొగంబు నితాంతలసత్కబరీభరవై భవముల్
మిక్కిలిఁ గోమల మైనశరీరము మీఱఁగ నాఁడుదనంబుసల్. 90
ఆ చాల నద్భుతముగ నాలలితాంగియు, ధవునిరూపొకింత దప్పకుండఁ
బూనె నాక్షణంబ నూనూఁగుమీసలు, గుఱుచపల్లజడలు కొమరు మిగుల. 91
ఆ. నలువుగిలువు దంపతుల కొకప్పుడు దడం,బడును గాని యొట్టియెడల నట్లు
జగతి నాఁడుఁదనము మగతనమును దడం,బఱచుకొనుటయెందు నెఱుఁగఁబడదు.
తే. స్త్రీత్వపురుషత్వదశ లిట్లు చెందువేళ, వారి కొండొరుపై దృష్టి వర్తిలుటను
దొరకె నొండొరుచూపు లొండొరుల కట్లు,భావనయె ప్రధానం బెట్టిపట్లనరయ.
ఆ. అమ్మెయిం బరస్పరాకృతివ్యత్యయం, బగుటఁ జూచికొని మహాద్భుతంబు
హృదయమున వహించి రిది యేమి మాయయొ,కొ యటంచు వారుగొంతతడవు.
సీ. అంతట నాసుముఖాసక్తి యాత్మలోఁ దన్నిమిత్తంబును దలఁచుకొనుచుఁ
దననాథువదనంబుఁ గనుఁగొని యిప్పు డే ననినట్టిమాటమహత్త్వమ యిది
తప్పదు మును జరత్కాయ మే నలశక్తిసన్నిధి వీడ్కొనుసమయమునను
నను సత్యవచనఁగా నొనరింప నాయమఁ బ్రార్థించితిని వృథ యైచన దది
తే. శాసనస్తంభలిపిరీతిఁ జర్చనేయ, ననిన విని యింక నేమియు ననకు మెద్ది
యాడఁబోవఁగ నెట్లౌనొ యనుచుఁ బలికె నమ్మణిస్తంభుఁడు భవిష్యదర్థవశత.
వ. ఇట్లు పలికి వెండియు నిట్లనియె 96
తే నీకు గర్భంబు గాకుండ నాకు నాకు
కొడుకు నీకూటమిన గలుగుటకు నీకు
వరము లిచ్చినయవ్వాణివాక్య మెట్లు
ఫలితముగ నున్నదియొ యెందుఁ బదరఁ జనదు 87
చ. అదియును గాక యంగనల కంగజసంగరకేళికావిశే
షదశలయందు నెక్కుడఁట సౌఖ్యగతుల్ మగవారికంటె నా
కిదియు నెఱింగికో నిపు డభీష్టము గావున నిట్టు లుండఁ గో
రెద నొకకొన్నినాళ్లు విహరింపుము నీవును బూరుషాకృతిన్. 98
వ. అనిన విని సుముఖాసక్తి యోయనఘ నీ వేరూపంబున నుండు మన్న నీదువాక్యం
బు నాకు వేదవిధిసమానంబు గావున నీకల్కినయట్ల చేసెద నని తదుక్తప్రకారం
బునఁ దనపురుషరూపంబుతోడ నడుపుచుండె మణిస్తంభుండును నష్టనారీరూ
పంబున మదనక్రీడలు సలుపుచుండె నప్పుడు దమసుముఖాసక్తిమణిస్తంభనామ
ధేయంబులుస్త్రీత్వపురుషత్వంబులవెంబడిన వీడ్పాటుగా సంకేతంబులు చేసికొని
రంత నాకృత్రిమవనిత తనపురుషుండును దానును నానావిహారయోగ్యంబు

లై నయారామ ప్రదేశంబులు చూచు వేడ్కఁ దనసింహంబునాకర్షించి తదారూ
ఢు లై దానియభీష్టసంచార వేగంబునకు సంతసిల్లుచు నంతరిక్షంబునం జరి
యించుచుండి యెదుట నొక్కపురంబుఁ గని తనహృదయవల్లభున కిట్లనియె 99

క. పుర మల్లదె యద్భుతగోపుర మై వరణమిషలసితపుణ్యస్త్రీనూ
పురమై విభవములకుఁ గాఁపురమై శోభిలెడు నగ్రమునఁ గనుఁగొంటే 100

చ. కలకలహంససారసబకప్రముఖాంబువిహంగమండలీ
కలకలనాదలీలఁ దనకై రవశామరసాటలక్ష్మి జో
కలకలమానసాభ్యుదయగౌరవముల్ సరిగా దటంచుఁ దాఁ
గలకల నవ్వుచున్న పరిఖావలయంబువిధంబుఁ జూచితే 101

క. ఈరమ్యపరిఖనడుమన్, సారపుశృంగములతోడ సాలము పద్మా
కారత నొప్పఁగ నిది కా,సారపురం బండ్రు కొలనిచాడ్పున నునికిన్. 102

క. తోరణము లింద్రధనువుల,తో రణము లొనర్ప నొప్పుతోరపుఁబురముల్
సారపురీతుల నీకా,సారపురీతులను రావు చర్చింపంగన్ 103

ఉ. తోరపువస్తుసంపదలతో రమణీయత నొప్పు నిప్పురం
బోరమణుండ రత్నఖచితోజ్జ్వలసౌధవిహారిణీసక
ర్పూరసువీటికారుచిరభూరిసుగంధసమేతవాతపం
చాలకృతావిదూరసురసంపదపూర్వమనఃప్రమోద య్యై 104

క ఇచ్చోటికిఁ దొల్లియు నే, వచ్చి యెఱుంగుదును దీనివైభవమహిమం
బచ్చెరు విందు వసింపఁగ, నిచ్చ యగుచు నున్న యది యధీశ్వర నాకున్. 105

క. అని పలికి యంతటను దీ,నిని దిగవలయు నని యపుడ నేలకు డిగ్గం
దనసింహవాహనముఁ బట్టి నిజేశుఁడు దాను దాని డిగి నడిచి చనన్. 106

వ. అప్పట్టణంబేలురాజు సత్వదాత్ముండనెడువాఁడు వాహ్యాళింబోయితిరిగియరుగు
దెంచుచు నాపూఁబోఁడిరూపలావణ్యంబు లాపోవక నిర్నిమేషుండై నిరీక్షించి
తదనంతరంబున. 107

క. ఒంటని రాజులఁ గప్పును, గొంటిక మే లేర్చి కలికిగుబ్బెతలను వా
రింటఁ గల రంతకంటను, గంటికి నిం పైనవాలుఁగంటిక గంటిన్ 108

క. అనరాదు గాక నాయిం, టన కా దిటువంటి చెలువ నాకంబునఁ గ
ల్గునె చెప్ప నేల సకలా, వనితలనాయకులయిండ్ల వనితలసుద్దుల్ 109

క. ఆసిద్ధునిసంబంధం, బీసౌందర్యైకనిధికి నేరీతినొకో
దోసం బిట్టటు భావన, చేసినఁ దెలియుదము వారు చెప్పిన నింకన్. 110

మ అని చింతింప యదృచ్ఛ నచ్చెలువ తన్నావేళ నీక్షించినన్
ఘనసైన్యంబులు గొంత మించఁ దనతుక్కారంబు తేజీఁ బివు

క్కున దాఁటించి గుదించి చిత్తరువుబాగుల్ మీఱ నాడించె శో
భనతద్వల్గనవల్గదగ్రిమరుచిస్ఫాయత్కిరీటంబుతోన్. 111

వ. ఇవ్విధంబున ఘోటకంబును నొక్కింతవడి యిట్టట్టు ద్రొక్కించి యాఁకించి కించి దుదంచితరత్నకంకణక్రేంకారంబులు కందళింపఁ గంఠం బప్పళింపుచు నిలిపి యప్పుడు. 112

సీ. కేయూరమాణిక్యకిరణముల్ మెఱయంగఁ జెలికానిమూఁపునఁ జెయ్యిఁ జేర్చు
రత్నాంగుళీయకప్రభ పేరెములు వాఱఁ గేలిపద్మంబు కెంగేలఁ ద్రిప్పు
లలితదంతాగ్రకాంతులు దొలంకఁగ దండధరునితో రిత్తమంతనము నడపు
తెలినవ్వుడాలు ముత్తియపుఁజౌకట్లఁ బెంపఁగ నర్మసచివుతో సరస మాడు

తే. మణికిరీటంబు చాలించి మగుడ దిద్దుఁ, దళుకుకొనగోర మీసలనులి యడల్చు
నాచకోరాక్షి తనుఁ జూచు టరసి యరసి, భావజవికారములు కడుఁబరిఢవిల్ల. 113

ఉ. కంతువికార మీఁకరణి గాటముగాఁ దనయందుఁ బ్రస్ఫుట
క్రాంతిగ నున్నచో నొకఁడు కానుక యిచ్చినపూవుబంతి బా
హాంతరపీఠ నద్దుకొని యామృగలోచన జూచెఁ దాన న
క్కాంత యొకింతజాఱుచనుకప్పు ఘటింపుచు మోము వంపఁగన్ 114

వ. అంత నశ్వంబు డిగ్గి తా నొక్కరుండ యాసిద్ధునిఁ జేరంబోయి మహాత్మా మీర లెచ్చటనుండి వచ్చితి రెందుఁబోవుచున్నవారు మీనామధేయంబులెవ్వి యివ్వనిత నీ కేమి యగు నని యడిగిన నతండు తమవచ్చినతెఱంగు చెప్పి యే మణిస్తంభుం డనువాఁడ నాపూఁబోఁడి సుముఖాప్తి యనుపేరం బరఁగు నని పలికి యిదితనభార్య యని యెఱింగించిన నీకురంగలోచనయే తెఱంగున నైన సన్నిధి నున్నం జాలు నటమీఁద భాగ్యవశంబున నైనయ ట్లయ్యెడుఁగాని యని చింతించుచు నతనికిం గపటవినయంబునం గృతాంజలి యై 115

చ హృదయము రంజిలంగ మిము నెంతయు భక్తిని గొన్నినాళ్లు మా
సదనమునందు నుంచికొని శక్త్యనుసారకృతోపచారసం
పదఁ బరిచర్య సేయుటకు మామది నున్నది వేడ్క మీర లే
తదభిమతం బొనర్చు టుచితంబు మహాత్మక సిద్ధశేఖరా 116

క. అనిన మణిస్తంభుం డం,గనవదనముఁ జూడ నట్ల కాని స్మేరం బుం
డిన మన కేమీ యని భ,ర్తను బలికెఁ నగుచు నాకురంగేక్షణయున్. 117

క. ఆరీతి ననుమతించిన, వారలఁ దోడ్కొనుచుఁ జనియె వసుధావరుఁ డిం
పారెడునవమణిమయశిబి,కారూఢులఁ జేసికొని నిజాలయమునకున్. 118

తే. ఇట్లు దోడ్కొని చని కరం బింపుమీఱ, నట్టిమణిగేహములు పైఁడిపట్టెమంచ
ములును సొమ్ములు పరిమళమ్ములును జేటి,కాజనంబులుఁ గడునధికముగ నిచ్చె.

క. ఇచ్చి పలుమాఱు వారల, నచ్చటికిం జని వినీతుఁ డై కొలుచుచుఁ దా

నచ్చెలువను దనయొద్దకు, వచ్చుట కడిగించెఁ దగినవారలచేతన్. 120
ఆ. ఆలతాంగియుఁ దన కప్పటి కొక్కింత, గర్భజననశంక గల దటంచుఁ
జెప్పె సిద్ధసుతుని సిద్ధున కీక యేఁ, గలయ నన్యు ననుచుఁ గడపి పుచ్చె. 121
క. ఆవారిజముఖి కంతటన్, వేవిళ్లుదయించెఁ జిక్కె నెమ్మేను గడున్
భావము మృద్భక్షణవాం,ఛావర్తనఁ జెందె గర్భసంసూచనగాన్. 122

కవిరాజవిరాజితము.—

కడుఁ గృశమైనసనాభిని మధ్యముఁ గన్గొని కన్గొని యేమొ బలం
బెడలఁగ జిక్కెఁ గరం బపు డంగము లెల్లఁ దదీయకృశత్వముఁ బోఁ
గడఁగుటయుం బొదలెన్ గఠినం బగు కాంతచనుంగవ మున్నుగఁ దా
బడలదు తత్పరిపుష్టితతిం గనుపట్టు మొగంబుల నవ్వ్యాదవన్. 123
మ. కడుఁ బోరంపుఁబయోధరంబుల మొనల్ గప్పారుచుం బర్వన
ప్పుడు తద్వక్త్రసుధాంశుబింబ మనయంబుం బాండురశ్రీ గనం
బడియెన్ గార్తికపూర్ణిమాతిథిబలెన్ భావించి చూడంగ నె
య్యెడనున్ స్థానగుణంబునం గలుగవే యేమేనియుం జిత్రముల్. 124
తే. అంతఁ గడుఁ గౌను పొదలె రత్యాశ వదలె
వళులు విరియంగఁ బాతెఁ బేరలఁత మీఱె
నాభి వికసించె గతులమాంద్యంబు మించె
సతికిఁ బ్రొద్దులనెల చొచ్చె జడత హెచ్చె. 125
క. ఈరాజోత్తముఁ డంతట, నారమణికి నుద్భవిల్లె నైదుగ్రహంబుల్
సారగుణత నుచ్చస్థా,నారూఢిం దనర భవ్య మగులగ్నమునన్. 126
సీ. సకలదిక్కులను బ్రసన్నతఁ గాన్పించెఁ జలువనెత్తావిగాడ్పులు చరించెఁ
గుసుమవర్షంబు లోకుల కద్భుతము చేసె శుభలీల దివ్యదుందుభులు మ్రోసె
సర్వామరులజయశబ్దముల్ విలసిల్లెఁ బరఁగఁ ద్రేతాగ్నులు ప్రజ్వరిల్లె
బరమసాధుజనంబుభావంబు లుప్పొంగెఁ గలుషచారిత్రులబలిమి గ్రుంగె
తే. శౌర్యగాంభీర్యధైర్యసౌజన్యనీతి, సత్యకీర్తిప్రతాపాదిసకలసుగుణ
పుంజరంజిష్యమాణభూభువనుఁ డగుచు, నిమ్మహారాజవరుఁ డుదయించునపుడు.
వ. బ్రహ్మదేవుం డితనితల్లిదండ్రులకు నాగంతుకంబు లైనవర్తమాన స్త్రీత్వపురుషత్వ
నామధేయంబులు చూడక సహజస్త్రీత్వపురుషత్వనామధేయంబు లవలంబించి
యవ్విధంబున నవ్విభునకు మణిస్తంభుండు తల్లి యనియు సుముఖాసత్తి తండ్రి
యనియుఁ బలికినవాఁ డతనివాక్యంబున కన్యథాభావశంక గలదే యమ్మణి
స్తంభుండు పుత్త్రోదయం బైనయనంతరంబ తనతొల్లిఁటిమగతనంబు తన
కును సుముఖాసత్తియాఁడుతనంబు సుముఖాసత్తికిని గలుగునట్టు నాయమ
చేతం బలికించి యాభార్యయుం దాను దమతమపూర్వనామధేయంబులతో

డన తిరుగ యోగాభ్యాసభాసురు లగుచుఁ గాసారపురంబునన యున్నవార
లీరహస్యంబు వారివలనం దార్కాణగాఁ దెలియవలసినఁ దెలియుం డని పలికి
యి ట్లనియె 128

ఎప్పు డితండు దల్లి కుదయించెఁ గరంబు విచిత్రలీలమై
నప్పుడ కల్గె యౌవనము యౌవన మెప్పుడు గల్గె నిచ్చె డా
నప్పుడ వచ్చి యొక్కమణి యమ్ములు విల్లు స్వభావసంజ్ఞతో
నొప్పెడుసిద్ధుఁ డిందుఁ బ్రథమోత్తమభావము గాన రెవ్వరున్. 129

అంతఁ గళాపూర్ణుఁ డనునామ మితనికి నిడియె నాసిద్ధిలోకేశ్వరుండు
అప్పుడ తత్పట్టణాధీశుఁ డతనిసద్యోయౌవనాదిమహోన్నతి విని
యితఁ డెవ్వఁడో మహాద్భుతవైభవుఁడు దివ్యపురుషవర్యుండు గాఁబోలు నితని
తల్లి నే నితరసాధారణంబుగఁ జూచి కామించి పాపంబుఁ గట్టుకొంటి
నిది మఱవఁ జేయఁ దగు నేమి యిచ్చి యైన
ననుచు నాసాధ్వికడ కేఁగి యమ్మ మిమ్ము
నెఱుఁగ కొనరించినట్టినాయొగ్గు లెవ్వి
గల్గినఁ గృతార్థచిత్తవై కావు మనుచు. 130

తత్ప్రియంబుగా నితనికి నిజాధిపత్యం బెల్ల సమర్పించి తాను మంత్రియై కొలిచి
యుండె నని చెప్పిన నలఘువ్రతుం డాబాలికం జూచి స్వభావుం డనఁ బరఁగు
నాసిద్ధుఁ డెవ్వఁ డేమికారణంబున నమ్మణియు శరచాపంబు లితనికిఁ దెచ్చియిచ్చె
నని యడిగిన నది యి ట్లని చెప్పె. 131

ఓవిప్రవర యాస్వభావాఖ్యసిద్ధుండు విను సుముఖాసత్తిజనకుఁ డాతఁ
డాపుత్త్రి జనియించినట్టిపిమ్మటఁ దనకాంతను విడిచి దేశాంతరి యయి
తిరుగుచు మాహురీపురమున కేతెంచి యందు దత్తాత్త్రేయు నఖిలయోగ
విద్యారహస్యకోవిదు మహామహుఁ దపశ్చర్యచేఁ దనకుఁ బ్రసన్నుఁ జేసి
కొనియెఁ దత్కృపచేత యోగప్రకార
ములు సమస్తంబు తద్యోగవిలసనమున
భావ మెప్పుడు దనయందుఁ బాదుకొలుపు
చునికిఁ జేసి స్వభావాఖ్య యొనరఁ దాల్చె. 132

అనుడు వినయ మొప్ప నలఘువ్రతుండు గే, ల్మోగిచి సకలబోధములకు నిధివి
నీ వెఱుంగనియవి లేవెవ్వి యోగముల్, చెప్పవలయు ననిన శిశువు పలికె
విమలాత్మక వినుము ప్రశస్తము జీవాత్మపరమాత్మసంయోగము యో
గ మనఁ దదంగము లెనిమిది, క్రమమున వినిపింతుఁ దత్ప్రకారము దెలియన్.
ఆయోగాంగంబులు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యానధారణ

సమాధు లనం బ్రసిద్ధంబు లై యుండు నందు నొక్కటొకటి యనేకభేదంబు
లగు నవి యెఱింగించెద వినుము. 135

మ. యమములు సత్యదయాక్షమాధృతిమితాహారార్జవబ్రహ్మచ
ర్యము లస్తేయ మహింస శౌచ మన నొప్పారుల్ ధరిత్రీసురో
త్తమ యందుల్ దశభంగు లై పరుల బాధం బెట్ట కింపారు భో
కమి సత్యంబు పరార్తి కోర్వమి దయాఖ్యం బెంపు మీఱుం గడున్. 136

క. విను మొరులతప్పులందుల్, గనలక సైరించి యునికి క్షమ యనం బరంగుల్
ధనబంధువియోగాదుల,కును హృదయము కలంగమికిని గొఱలు ధృతి యనన్.

క. ఎనిమిదికబళంబులు యతి, కినుమడి వనవాసి కతని కినుమడి గృహికిల్
విను లఘుభోజన మితరుల, కనఘ మితాహార మనంగ నభినుతి కెక్కున్ 138

తే. విహితకర్మంబు లెందుం గావించునెడల, మఱి నిషిద్ధకర్మంబులు మానునెడల
వాఙ్మనఃకాయకర్మప్రవర్తనంబు, సూవె యార్జవమన మహీసురవరేణ్య 139

సీ. సన్న్యాసికిని బ్రహ్మచారికి నైష్ఠికుం డగువనస్థునకు నోయనఘచరిత
స్త్రీసంగమంబును ద్రికరణంబులయందు నొకయప్పుడును జేయ కునికి బ్రహ్మ
చర్యంబు ఋతుకాలభార్యాభిగమనంబు దక్క నబోంట్లతోఁ దద్వ్యవహార
మును మానుటయు గృహస్థునకును బ్రహ్మచర్యం బింక నస్తేయ మనంగ నెందు

తే. శౌర్య మెఱుంగమి యెప్పుడు నేజంతువులకు
నెగ్గొనర్పక యునికి యహింస యనంగ
శౌచ మన రెండుతెఱంగు లై శాస్త్రములను
బాహ్యమును నాంతరంబు నాఁ బ్రణుతి కెక్కు. 140

ఆ. అందు బాహ్యశౌచ మనంగ మృజ్జలములఁ, జేయంబడినయది ప్రసిద్ధి కెక్కు
నాంతరం బనంగ ననఘ ధర్మమున న,ధ్యాత్మవిద్యచేత నయినశుద్ధి 141

క. విను నియమంబులు పది తప,మును సంతోషాస్తికత్వములు దానేశా
ర్చనసిద్ధాంతశ్రవణము,లును హ్రీయును మతిజపంబులును వ్రతము ననన్. 142

తే కృచ్ఛ్రచాంద్రాయణాదికక్రియలు కాయ
శోషణము సేసి తపము సంతోష మనంగ
నిష్పడమి లాభమును గల్గె హృదయవృత్తి
నదియ చాలు నంచునికి సు మ్మనఘచరిత. 143

క. విను పుణ్యపాపములు గల, వనియెడువిశ్వాస మెద్ది యది యాస్తిక్యం
బనఁ బరఁగుల్ న్యాయార్జితధన మర్థుల కొసఁగు టొప్పు దానం బనఁగన్. 144

క. ఈశార్చన మన హరిఁ బర,మేశుం బూజించుటయును నెపుడును రాగా
వేశాగత హింసాప్రము,ఖాశంకలు లేనిహృద్వచోంగస్థితియున్. 145

సీ. అనఘాత్మ వినుము సిద్ధాంతశ్రవణమును వేదాంతశాస్త్రంబు వినుచు నునికి

వైదికలౌకికవర్తనలకు దూర మగునింద్యకర్మంబునందు లజ్జ
యొయ్యది యది సుమ్ము హ్రీశబ్దవాచ్యంబు విహితసదాచారవిధులమీఁది
శ్రద్ధ మతి యనంగఁ బ్రస్తుతి కెక్కును వేదబాహ్యము గానివిమలమంత్ర
ఆ. మును గురూక్తమార్గమున జపించుటయు నధీత మగుశ్రుతిస్మృతీతిహాస
ముఖ్యవాఙ్మయంబు మునుకొని యావర్తనంబు సేఁత జప మనంగఁ బరఁగు.
క. వినుము విశిష్టాచారం, బును ధర్మప్రముఖనిఖిలపురుషార్థకరం
బును నగునుపవాసాదిక, మనఘాత్మక సుప్రసిద్ధ మగు వ్రత మనఁగన్. 147
క. ఈయమనియమంబులు గల, ధీయుతుఁ డధికారి వసుమతీసురవర నీ
శ్రేయస్కరాసనప్రా, ణాయామాద్యుత్తరప్రయత్నంబులకున్. 148
వ ఆసనంబు లనేకభేదంబులఁ బ్రవర్తిల్లు నం దుత్తమంబు లయినకొన్నింటిని
వివరించెద. 149
క. విను జానూర్వంతరభా, గనివేశితపాదతలుఁడుఁ గడు బుజకాయుం
డును నై కూర్చుండఁగ యో, యనఘాత్మక వెలయు స్వస్తికాసన మనఁగన్.
తే వామపృష్ఠపార్శ్వమునన వామగుల్ఫ
మమరఁ బార్శ్వాంతరమున గుల్ఫాంతరంబు
నునిచి గోముఖాకృతి దృఢాసనత నునికి
యమలగుణ గోముఖాసన మనఁగఁ బరఁగు. 151
సీ. దక్షిణపాదం బదక్షిణాంకమున నదక్షిణపాదంబు దక్షిణాంక
మున నిడి యిరుగేలు వెనుకగా వీడ్వడ నిగిడించి బొటవ్రేళ్లు దగులఁ బట్టి
యురముపైఁ జుబుకాగ్ర మొనరంగ హత్తించి దృష్టి నాసాగ్రసుస్థితము సేసి
యునికి పద్మాసన మన నొప్పు నిందుఁ గొందఱు చిబుకవ్యవస్థానియమము
తే చెప్ప రొకకొంద ఱూరుసుస్థితిగ నడుఁగు
దోయి యుత్తానముగ నిడి తొడలనడుమ
నట్ల పాణులు నిలిపి నాసాగ్రదృష్టి
యగుచు నునికి పద్మాసనం బండ్రు బుధులు. 152
తే. అనఘ తుదఁ జెప్పినట్టి పద్మాసనవిధి
యందుఁ జుబుకాగ్రమును హృదయమునఁ జేర్చి
రాజదంతమూలంబున రసన చేర్చి
వాయుకర్షణ మొయ్యనఁ జేయవలయు. 153
క. కుడితొడపై వామపదం, బిడి యితరముమీఁద నితర మిడి నిశ్చలతన్
గడు కుదురై కూర్చుండుట, పుడమిన్ వీరాసనాఖ్యఁ బొలుచు మహాత్మా. 154
శా. అండాధఃస్థిత మైనరేఖ యుభయోపాంతంబులన్ గుల్ఫముల్
రెండున్ వీడ్వడఁ జేర్చి బాహుయుగమున్ వ్రేళ్లన్ గడుం జిక్కనై

యుండఁగా జానువులందుఁ బూన్చి వివృతాస్యుం డైన నాసాగ్రవీ
క్షుం డై యుండెడునట్టియాసనము మించుగా సింహాసంజ్ఞాక మై 155

మ. తనగుల్ఫంబులు రెండు నంటి యుగళాధశ్శేఫనీపార్శ్వవ
ర్తన నుండఁగా ఘటియించి హస్తములఁ దత్పార్శ్వంబు లత్యంతయ
త్ననిరూఢిం గ్రహియించి వర్తిలుట యో ధర్మాత్మ భద్రాసనం
బనఁ బ్రఖ్యాతి వహించి యుండు నది సర్వారోగ్యదం బెప్పుడున్ 156

క. తగ మేహనంబుపై స, వ్యగుల్ఫ మిడి దానిపైఁ దదన్యం బిడి గ
ట్టిగఁ గూర్చుండుట యో భ,వ్యగుణా ముక్తాసనాఖ్య మై పెం పొందున్. 157

క. కొందఱు సిద్ధాసన మని, కొందఱు వజ్రాసన మని కొనియాడుదు రిం
పొందఁగ దీనిని మఱియొక, కొందఱు గుప్తాసన మనుకొందురు మహాత్మా. 158

చ కరతలముల్ ధరిత్రిపయి గట్టిగ రెండును నూఁది వానికూ
ర్పరముల నాభిపార్శ్వములఁ గన్పడ వానిశరీర మెల్ల నం
బరమున దండలీలఁ గనుపట్టఁగఁ జక్కఁగఁ జాగి యున్కి ను
మ్మరయ మయూరసంజ్ఞ మగునాసన మోధరణీసురోత్తమా. 159

తే. జగతిపైఁ బాదములు రెండుఁ జక్కఁజాఁచి
పాణులఁ దదగ్రములు బిగఁ బట్టి నుదురు
జానువులఁ జేర్చి యున్కి యోసాధుచరిత
తాపసేంద్రులు పశ్చిమస్థానమండ్రు. 160

క. ఈయాసనములు మిక్కిలి, కాయలఘుత్వమును సకలగదనాశనముఁగా
జేయుచుఁ బాపనికాయము, పాయందోలుచును బరఁగు భవ్యచరిత్రా. 161

సీ. [1]ధౌతనీతికపాలభాతివస్తిత్రాటకములు నౌలియు నాఁగ నమరు యోగ
షట్కర్మముల దేహసంశుద్ధికలితుఁడై పరఁగ నీచెప్పినభద్రసింహ
పద్మాసనాదులఁ బరిచయం బమరంగఁ బ్రణవసంఖ్యాభేత గుణనిరూఢిఁ
గొమ రొందుపూరకకుంభకరేచకంబులవిశేషంబుతోఁ బొలుపుమీఱు

తే. చున్నయట్టిప్రాణాయామ మోమహాత్మ
సలుపఁ జలుపంగ మారుతజయము గల్గు
నంతకంతకు సంసిద్ధి నతిశయిల్లు
నాఁడునాఁటికి మేనిలో నాళు లెల్ల. 162

తే. విను మపానంబునకు రెండువ్రేళ్లయెడను
బై నెసఁగుపావకునియున్కిపట్టునకును
బైనితొమ్మిదివ్రేళులపాటియెడను
ధరణిసురవర్య నాడికందంబు వొలుచు. 163

---

1 'ధౌతనీతికపాలభాతినత్రిస్త్రాటి, కములు నాళియునాఁగనమరు' అని యొకప్రతి.

తే. ఉండుఁ దనువున డెబ్బదిరెండువేలు
నాడు లొకటియు నూఱు గణ్యంబు లందు
నందుఁ బదునాల్గు శ్రేష్ఠంబు లందులోన
మూఁడు నుతి కెక్కునందును ముఖ్య మొకటి. 164

వ. పదునాల్గునాడులలోపల సరస్వతీప్రముఖంబు లైనయేకాదశనాడులు జిహ్వాది వ్యాపారకారణంబులై పరఁగు నిడాపింగళు లనునాడీద్వయంబు వామదక్షిణ నాసారంధ్రగామిను లగుచుఁ బ్రాణాయామసాధనం బై ప్రవర్తిల్లుచుఁ బ్రఖ్యాతమం బైనసుషుమ్నాహ్వయనాడి బ్రహ్మనాడి యనం బరఁగుచు నాడీకందమధ్యవర్తిని యై బ్రహ్మరంధ్రగామిని యై యుండు నందుఁ బవనంబుఁ బ్రవేశింపఁ జేయుట యుత్తమయోగం బనం బరఁగు నింకఁ బ్రత్యాహారప్రకారంబులు విను మని యిట్లనియె 165

సీ. ఇంద్రియార్థములందు నింద్రియంబులఁ బ్రవర్తిలనీక కుదియించి త్రిప్పుటొకటి
యవియందుఁ జరియించెనదిసమస్తంబు నాత్మయకాఁగమనసులోఁదలఁచు టొకటి
నిత్యకర్మంబు లన్నియు నాత్మయంద సంతతము చిత్తముచే నొనర్చు టొకటి
తనువునఁగలపదునెనిమిదిమర్మసీమలఁ గ్రమంబున గాఢ్పనిలుపు టొకటి
ఆ. యోగశాస్త్రశీలయుతులు ప్రత్యాహార, భేదరీతు లనుచు నాదరమున
సాంప్రదాయికముగ సలుపుచు నుండుదు, రోవసుంధరాసురావతంస 166

సీ. పాదాదిగా జానుపర్యంత ముర్వి యురాద్యాదిగాఁ బాయుపర్యంత ముదక
ముదకాదిగా మఱి హృదయాబ్జపర్యంత మగ్ని యగ్న్యాదిగా నందుమీఁద
భ్రూమధ్యపర్యంతము మరుత్తు మరుదాదిగా మూర్ధపర్యంత మోమహాత్మ
నభము వర్తిల్లుఁ దానక మవి యైదు భావింపఁగా వేర్వేఱ విహితగతిని
తే. ధాతృవిష్ణురుద్రేశసదాశివాఖ్య
దైవతములఁ బృథివ్యాదితత్త్వపంచ
కమున ధారణ మొనరింపఁ గా వలయును
బ్రణవమునను బ్రాణాయామభంగు లమర. 167

ఆ. అని మఱియును దద్రహస్యవిశేషంబు, లన్నియును వచించి ప్రాణముఖ్య
పవనగతులతెఱఁగు పదునెనిమిదిమర్మములును నాడు లుండుపొలుపుఁ దెలిపె

వ. తెలిసి యింక ధ్యానప్రకారంబు విను మని యిట్లనియె 169

క. అప్రతిమముగ విజాతీ,యప్రత్యయవాసనాసికాసంవిచ్ఛి
న్నప్రవహాదురుసజాతీ, యప్రత్యయరూప మగుచు ధ్యానము వెలయున్ 170

క. అది సగుణధ్యాన మనఁగ, సదమలగుణ వినుము నిర్గుణధ్యాన మనఁగ
విదితముగ నిరుతెఱంగుల, మొదలిటి యది చేయ నితరమును సిద్ధించున్. 171

చ. సగుణ మనంగ నింక విను శంఖసుదర్శనముఖ్యచిహ్నితం
బగుపురుషోత్తమాకృతిఁ దదన్యము నిర్మలనిత్యచిన్మయం
బగుపరమాత్మరూప మది యబ్బుట దుర్లభ మెట్టివారికిన్
సగుణవిలాసచింతనము సల్పఁగ సల్పఁగ దాని భూసురా. 172

క. మానసము విష్ణునందున్, లీన మగుచు నించుకయుఁ జలింపక యుండన్
బూనుట సమాధి యగు వి,ద్యానిరతా యుక్తరూప మది భావింపన్. 173

వ. యోగవిద్యాప్రకారంబు దీనిమహత్త్వంబునం జేసి యత్తెఱంగున భావంబు దన యందుఁ దిరంబుగా నిలుపుచు నాసిద్ధుండు స్వభావుఁ డనం బరఁగె. 174

తరల. అతఁడు నిత్యము నాత్మయోగసమాధికిన్ విజనస్థల
స్థితి మనంబునఁ గోరి పెక్కులు దేశముల్ చరియించుచున్
గతివశంబున జన్మదేశము గాంచి యందుఁ గడున్ వివి
క్తతల మంచు వసించెఁ దా శతతాళదఘ్నహ్రదంబులోన్. 175

సీ. అట్లు వసించి యోగారూఢి నుండుచోఁ దనయల్లుఁ డాలిపైఁ గినుకవలన
మడువున నారీతిఁ బడి తన్నుఁ జేర వయఃస్తంభమణి మొద లైనయట్టి
వానిఁ గొన్నిటి నిచ్చి తా నంపెఁ గాని యప్పుడు దనబంధుత్వమును దెలుపఁగఁ
బోయిన బంధంబు పోనీక తగిలించు కొననేల మగుడఁగ ననుతలఁపున

తే. నంత నెంతయు బహుకాల మరుగ నతఁడు నియతివశమునఁ దద్యోగనిష్ఠ వదలి
హ్రదములోపల వెలువడి యరుగుదెంచె, సకలబుధసేవ్య మైనశ్రీశైలమునకు

ఉ శీలితయోగవైభవుఁడు సిద్ధుఁడు వేడుక మించఁ గాంచె శ్రీ
శైలము నీలలోహితలసన్మణిచిత్రితసానువైభవో
త్తాలము సేవకేష్టఫలదానవిధానవినీదేవతా
పాలము నిత్యవర్ణగుణజాలము ముక్తిలతాలవాలమున్. 177

ఉ వెల్లగిలెన్ గుబేరు మలపెంపఱి ఘూర్ణిలె మందరంబు దా
విల్లయి వంగె మేరుగిరి వింధ్య మిలన్ నెఱయంగఁ గ్రుంగె యా
వెల్లఁ దుషారమాత్ర మగు టెన్న హిమాద్రికి సాజమై ప్రవ
ర్తిల్లెను గాన శ్రీనగము శ్రీనగ మర్ఘునకీర్తికిం దగున్. 178

సీ నవపుష్పవనము నానామణుల్ గ్రుచ్చిన పచ్చపట్టుఁగబాయి బాగు నెఱప
ధాతుస్థలంబు లాతతకుంకుమాంగరాగప్రకారంబునఁ గానుపింపఁ
దెలిడా లుపచరింపు సెలయేటికాలువల్ హారవల్లరులసోయగము దాల్ప
బహువిధోపలయుతోపత్యకాభాగ భద్రాసనలీలల నతిశయిల్ల

తే. నఖిలధరణిభృన్మూర్ధసమాదరార్హ, పాదకటకంబు లమరంగఁ బ్రణుతిఁగన్న
యన్నగేంద్రునికిని గిరీటార్పణ కరి, యైనయుడిగంపుఁగత్తెమధ్యాహ్నలక్ష్మి.179

క. సిద్ధమణుల్ గనుగనులున్, సిద్ధౌషధమూలికావిశేషపుఁబనులున్

సిద్ధరసధునులు గూడి ప్రసిద్ధిగఁ జేకొన్న రూపు శ్రీగిరి యయ్యెన్. 180

క. పాతాళగంగ యనియెడు, కైతవమున నన్నగేంద్రుకాలికడియ ము
ద్ద్యోతించు గండశైల, వ్రాతమిషస్థితనగాంతరప్రతిమలతోన్. 181

చ ఘనపరిరంభసంభ్రమవికాసములం గనుపట్టినట్టిమి
న్నుసుహరిపేరురంబు దనయందును దార్కొన కుండ నొత్తి ప
ట్టిన నిధిగర్భబాహులనవఁబ్రవర్తిలు నన్నగంబు శో
భనఖచరద్రుమావిరళపల్లవతల్లజశోణపాణి యై 182

వ. ఇవ్విధంబున నతిపవిత్రవిచిత్రమహిమంబున నతిశయిల్లుచున్ననగోత్తమంబు నత్యంతభక్తియుక్తుం డగుచు నధిరోహణుం డగుచు మల్లికార్జునమహాదేవసేవావిధానం బనూనంబున నడపి యదృచ్ఛావిహారంబున సంచరించువాఁ డందు నంతట భృగుపాతంబున కాయత్తపడుచున్నమణికంధరుం జూచి నీ వెవ్వండ వీసాహసోత్సాహంబునకుం గారణం బేమి యెఱింగింప వలయు ననుటయు నతండు దనపేరునుం జాతియుం దెలిపి తద్భృగుపాతోత్సాహపర్యంతంబు తన పూర్వవర్తనంబు సకలంబునుం జెప్ప నందు వినంబడిననిజపుత్త్రీజామాతల వృత్తాంతంబున నుత్కంఠమానమానసుం డగుచు మఱియుం దద్విశేషం బతనికి నెఱుకపడినంత యడిగి తెలిసి తాను సుగాత్రిజనకుం డగుట వినిపించి తనవర్తనం బంతయుం జెప్పి శారదాదేవి యాసుగాత్రీశాలీనులకు నిచ్చినవరంబు లెట్లు ఫలితంబు లగునో యని యొకింత చింతించి యవి యట్లట్ల సఫలంబులు గాక మానవు గా యని నిశ్చయించి మణికంధరున కిట్లనియె. 183

సీ. నారదుపరిచర్యచే రుక్మిణీకాంతు, శిక్షను సంగీతసిద్ధిఁ గనుట
యమ్మౌనికరుణచే హరిభక్తితీర్థయా, త్రాదిపుణ్యంబుల నతిశయిలుట
నడుమఁ బ్రమాదంపునడకఁ జేకుఱినశా, పము రాజ్యఫలముగాఁ బనుపఱుచుట
యధికపుణ్యప్రాప్య మైనగంధర్వజా, తిని సముద్భవ మంది తేజరిలుట

తే. యూహ సేయంగ నీ వింక నొందుజన్మ
మమితసాద్గుణ్యసంపన్న మగుట ధ్రువము
పుణ్యవాసన లూరక పోవు సూవె
యెట్లుఁ దమతమఫలముల నిచ్చుఁ గాని. 184

క. సుగుణగణైకనివాసం, బగుజన్మము నీకుఁ గలిమి కాదిమహేతూ
పగమంబ చాలు నిచ్చట, భృగుపాతంబునకు నేమపేక్షిత మింకన్ 185

చ. అనుడు నతండు శ్రీమహితు లైశుచివర్తను లైనవారికిం
దనయుఁడ నై జనించుటయె తర్పిత మంచుఁ దలంచినాఁడ నా
విని యెటు లైన నెంతయుఁ బవిత్రచరిత్రత నీకుఁ గాన్పడం
దనరినవారు మత్సుతయుఁ దత్పతియుం దలపోసి చూడఁగన్. 186

ఉ. వారలు తల్లిదండ్రులుగ వాంఛ యొనర్చుట మేలు గాదె యిం
పారఁగ దాన నాకును బ్రియం బగు టొక్కటి యొక్కఁ డాప్రియం
బూరక పోదు నీమదికి నోపమి యట్టిమహోపకార మో
సారగుణాఢ్య యేఁ జలుప శక్తుఁడ మీఁదట నీవు నెంతయున్. 187

సీ. తొల్లి యొకపుడు మద్గురువుల నే నాత్మపరిరక్షకొఱకును బట్ట మొకటి
కావలయు నటంచు దైవసంప్రేరణ నడిగిన సృజియించి యట్లు నాకు
నొసఁగుచు నిది యమోఘోద్యమం బని పల్కి వారలు నన్ను నీవంశ మిఁకను
క్షత్రవంశంబు గాఁ గల దని రావాక్య మరసిన నీవు నాయల్లునకును
తే. గొడుక వై పుట్టుటకె యనుకూల మగుచు
నున్నయది క్షత్రధర్మ మత్యుజ్జ్వలముగ
జగతియే లేదు తక్కినసందియంబు
లన్నియును మాని నామాట యాచరించు 188

సీ. అనుడు నట్లని నాయాత్మచందము విను మట్లను మాఱుమేనత్త నందు
రాజ నౌటకును గారణములు సున్న వింకను బవిత్రులయింట జనన మొందు
కాంక్షచే నిప్పు డీకరిమేశ్వరపుఁ జఱి నుఱుకుచున్నాఁడను మఱియుఁ గొంత
మదిలోని మెరమెర మాన దేమిటికి నంటేని నెంతటిరాజ నైన నెట్టి
తే. పావనులయింటఁ బుట్టిన బహిరబహిర, రాతివర్గజయం బజస్రమును గలిగి
వర్తిలుట యబ్బురము గాన వగపు గలదు, చిత్తమున నాకు నోమహాసిద్ధవర్య.

ఆ. అదియుఁ గాక రాజ్య మహామహాభూతంబు, సోఁకినప్పు డెట్టిసుజనులకును
లేనిచీఁకుఁదనము లేనిమూఁగతనంబు, లేనిచెవుడు గొంత యైనఁ గలదు 190

తే. వేదశాస్త్రాదిసకలసద్విద్యలందు
నెందుఁ గొదవ వించుకయు లేక నెసఁగునట్టి
బ్రాహ్మణులగోష్ఠిచే నట్టిరాజ్యదోష
ములు నివారింప నగు నని తలఁచితేని 191

ఉత్సాహ. భోగవస్తుతృష్ణ లేనిపుడమితేనిదానముల్ !
యోగ్యములును గామిఁ జేర నొల్ల రుత్తమద్విజుల్
మృగ్యతముల వారి వెదకి మెచ్చఁ గొలిచి తెచ్చుకో
భాగ్య మతని కబ్బు టరుదు బ్రదుకె యదియు నక్కటా. 192

వ. అట్లుత్తమద్విజులచిత్తంబు నారాధించి చేర్చుకొనియెద నన్నఁ దద్వివేకం
బెన్నినాళ్లకుఁ గలుగవలయు నవియే యెంచిచూచిన నొక్కొక్కటొకటియు మిగుల
నసహ్యంబు లగుచు హృదయశల్యంబులై యున్నవి నీవు సకలకార్యఘటనాతి
సమర్థుండవు నాకు నివ్విచారంబు వాయ నొక్కతెరువు సూపి రక్షింపు మని

మణికంధరుం డాస్వభావాఖ్యసిద్ధు నెంతయుం బ్రార్థించె నతండు నతనికి విషాద
నివారణంబుగా ని ట్లనియె 193

క. సతతముఁ బెంపొందుజయో,న్నతి యొసఁగెడునొక్కవిల్లు నవశరములు నీ
మతికిఁ దగినవి సృజించెద, క్షితి దత్తాత్రేయుదయ కకృత్యము గలదే 194

శా. నీ కింకన్ సృజియించి యద్భుతపుమాణిక్యంబు నే నిత్తుఁ దా
నాకర్షించును నీదుసేవ గొన సర్వామ్నాయశాస్త్రాదివి
ద్యాకారార్థత నొప్పువారి నని యాత్మాలోకమాత్రంబునం
జేకూర్పన్ సకలాశ్రితాళి కఖలక్షేమాయురారోగ్యముల్. 195

క. అని యపు డొకసింగిణి విల్లును వాఁడిమెఱుంగుటమ్ములును గెంజాయం
దనరారుమణిశిలాకయుఁ, దనమాహాత్మ్యప్రకాశితముగ సృజించెన్. 196

తే. ఇట్లు సృజియించి దీని నీ వెప్పు డుదయ
మొంది తటమున్న యట్ల నీ కొనర నిత్తు
నేను గనిపెట్టుకొని వచ్చి యివి యొదవుట
యెట్లొ యెన్నినాళ్లకొ యని యెన్న వలదు 197

వ అని పలుకుచుండ. 198

సీ. అప్పుడు చేరువ నరుగుచుఁ దద్వాక్యములు విని శివరాత్రిపుణ్యకాల
శోభితమల్లికార్జునదేవభజనోత్సవాయాతు లైనమదాశయుండు
నతని భార్యయుఁ బురోహితులు నచ్చోటికి నరుదెంచి యాసిద్ధవరునినామ
మడిగి యెఱింగి మహాసమ్మదమున సాష్టాంగప్రణామంబు లాచరించి
ఆ. మాకు ఫలిత మయ్యె మల్లికార్జునదేవు, సేవవ హిమ యిపుడు సిద్ధవర్య
నిన్ను వెదకి వెదకి కన్నులు సాఫల్య, గరిమఁ జెందె నిచటఁ గనుటఁ జేసి. 199

వ. అని పలికినంతలో నృపాలుండు 200

మత్తకోకిల. ఏమదాశయుఁడన్ మహీశుఁడ హైహయాన్వయజుండ ని
బ్భామ యోయనఘాత్మ మత్ప్రియభార్య వీరు పురోహితుల్
ధీమహత్త్వగుణాభిరాములు దివ్యతేజులు ఋగ్యజు
స్సామతుర్యమహాగమక్రమసంప్రదాయధురంధరుల్ 201

క ఓయనఘాత్మక దత్తాత్రేయమహామునిని మాహురీపురనిలయున్
జాయయు నేనును వీరిస,హాయతఁ గొల్చితిమి బహువిధారాధనలన్. 202

తే కార్తవీర్యాఖ్యజుఁడు చక్రవర్తి యగుచు
నంత ఘనుఁ డౌట నాయోగి నాశ్రయించి
కాదె తద్రాజకులజుఁడఁ గాన నేను
నమ్మునీంద్రు భజించితి నవ్విధమున 203

వ. ఆదత్తాత్రేయుం డంతట నాకుఁ గలలోనం గానిపించి మదీయభక్తుండు స్వభావుం డనుసిద్ధుం డొక్కరుండు గలఁ డతనివలన నీకాంక్షితార్థం బీడేఱు నతనిసందర్శనంబు సాధించునది యని చెప్పిన నేను దేవరయున్నచోటును స్వరూపంబును నెఱుంగక యనేకవిధంబుల నరయుచు నిచ్చటికి నిద్దేవతామహోత్సవంబునకువచ్చి యిప్పటిమీమాటల దత్తాత్రేయశబ్దంబు వినంబడుట నిది దెలిసి పోదము గాక యని చేర నేతెంచితిమి మాకుం జిరప్రార్థితం బైనభవద్దర్శనంబు దొరకె నిఁక మాయభీష్టంబులు సిద్ధించిన ట్లయ్యె నన విని యాసిద్ధుండు తనుఁ బ్రసిద్ధునిం జేయ బన్నినగురువులవన్నె గడకు నద్భుతసంతోషంబు లంతరంగంబుల నెంతయుఁ గందళింప నింతభక్తవత్సలుండవే యని యమ్మునిం దలంచి కేలు మొగిచి యంత నారాజునుం జూచి యి ట్లనియె. 204

క. ఏ నెవ్వఁడ నీకోరిక, లీ నైనను మద్గురూక్త మిది యంటిఁ గదా
యానియతిచేత నెల్లవి, గా నున్నవి యట్లొదవెడుఁగానీ చెపుమా. 205

క. అనుడు జయంబును సంతతి,యును నాయభివాంఛితంబు లోయంచితవ
ర్తన యనుచు విన్నవించెను, జననాయకుఁ డతని కపుడు సంయమివరుఁడున్.

వ. అటమున్ను దాసృజించినధనుర్బాణంబులు మణికంధరునకుం జూపుచు నిట్లనియె.

సీ. మానవనాథ యీమణికంధరునకు భావిభవంబునందును విజయసిద్ధి
గావించుకొఱకు నే నీవిలునమ్ములు నిటమున్నుగా సృజియించినాఁడఁ
గావున నతని కొక్కనికిఁ దక్కఁగ నన్యరాజుల కెందుఁ బరాజితుఁడవు
గాక నీవు జయింతు గట్టిగ నన నట్లు కానిండు మీకృప గలిగినదియు

తే. చాలుఁ గడమకు మఱియేన చాలుదు మణి
కంధరునికి ధనుస్సాయకముల నపుడు
గాఁగలజయంబు తదితరకర్మకత్వ
మునను సిద్ధింప నేర్పునే యనియె రాజు 208

మ. అనఁ దద్గర్వపుమాటకుం గనలి యాయస్త్రప్రభావంబుచే
నిను నీజన్మమునం జితండు గెలుచుట నిస్సంశయం బట్టు గె
ల్చినమాత్రంబును గాక యీడిగము నీచేతం గళత్రంబుచే
తను జేయించుకొనం గలం డనియె సిద్ధశ్రేష్ఠుఁ డారాజుతోన్ 209

ఉత్సాహ. అనుడుఁ దనపురోహితుల్ మహావిభూతితోడ నా
తనికిఁ గేలు మొగిచి యోయుదాత్తచరిత యేమి యీ
యనకుఁ దెలియు మూఁడుమాట లాఱుతప్పు లేము మీ
కొనరఁ బల్కఁ గలమె యస్మదుక్తి తెఱఁగు లెంతురే. 210

గీ. మీరు గురువుల రగుటను మిమ్ము వెదకి
కొనుచు వచ్చుట యొకటియే గుఱిగఁ జూచి
యీనృపతికోర్కి లీడేర్పు మెట్టులైన
ననుడు వారలఁ జూచి యిట్లనియె నతఁడు 211

ఉ. తప్పదు నాదుమాటలు విధాతలిఖించినవ్రాత సుండిలం
దప్పక యెల్లరాజులను దాను జయించెను మీనృపాలుఁ డేఁ
జెప్పినవానిఁ దక్క నిఁక సేవయు వానికిఁ జేయుఁ జాలఁ డెం
పొప్పఁగ నాఁడు దాను దనయుల్లమునందు విముక్తమానుఁడై 212

క. మీనరపతిమదిఁ గలసం,తానప్రఁగోర్కియు ఫలించుఁ దత్సేవతఱిన్
దానును భార్యయు నేలిక, పూనినయొకమణివిశేషమును గనుఁగొనఁగన్. 213

వ. అనిన విని వార లొకింత చింతించి 214

శా. మాభోగంబులె యాత్మభోగములు గా మామాటయే మాట గా
నోభవ్యాత్మక మమ్ముఁ దా నడుపుకొం చున్నాఁ డితం డిమ్మహా
సౌభాగ్యంబుగ నున్న మాకును దగన్ సంసేవ్యుఁ డెవ్వాఁడో దా
నీభావంబున నీతఁ డట్లు పరుఁదా సేవించుకాలంబునన్. 215

మ. అనినన్ మీమహిభర్త యేలికయె మీ కారాధ్యుఁ డావేళ నా
తనిభూపామణి మీకు నెంతయుఁ బ్రమోదస్ఫూర్తి గావించుచున్
దనరున్ మీరలు నిమ్మదాశయుఁడు తత్సాంగత్యనిత్యోత్సవం
బునఁ బూర్ణోన్నతు లన్నియున్ మఱచి యింపున్ గాంతు రత్యంతమున్. 216

వ. కావున మణికంధరుండు వసుంధరాపతి యగుచు జన్మింపునందాఁక యభీష్ట విజయవిహారంబుల మీరాజు ప్రవర్తిల్లఁగలం డటమీఁద మదుక్తప్రకారంబునం దత్సేవ సేయం గలండు మీరుం దన్మణిస్పర్శమహిమంబున మహానందంబు నొందెద రని పలికి స్వభావనామసిద్ధుండు వారి నందఱి ననిపి తానును మణికంధరుని వీడ్కొని నిజేచ్ఛం జనియెఁ దద్వచనప్రకారంబున మదాశయుండును సకల శత్రుజయంబునఁ దేజరిల్లె ననిన విని యలఘువ్రతుండు మణికంధరుం డట్లు సిద్ధుని వీడ్కొని యటమీఁద నేమి సేసెఁ దద్వృత్తాంతంబు వినవలతుం జెప్పు మనుటయు. 217

ఉ. కావ్యకళారసానుభవకౌశలనూతనభోజరాజ సం
స్తవ్యనవీనగానసరసత్వమహత్త్వమరుత్తనూజ క
ర్తవ్యవివేచనారచనధార్మ్యగుణావరధర్మరాజ శా
స్త్రవ్యరసానుపాలన బుధవ్రజపాలన పుణ్యఖేలనా. 218

క. కించిదుదంచితరాగదృ,గంచలరుచినూతనాతపాంకురరేఖా
వంచితసకలప్రతిభట, సంచయగర్వాంధకార జలధిగభీరా. 219

మణిగణనికరము సమధికవితరణచతురిమగరిమ
క్రమజితరవిసుతఘనశితకరణా
శమదమముఖగుణసముదయకలనా
విమలితనిజమతివృతగురుచరణా. 220

గద్యము ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య తనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందుఁ బంచమాశ్వాసము.



శ్రీ ర స్తు.

# క ళా పూ ర్ణో ద య ము

## ష ష్ఠా శ్వా స ము.



మత్పదనఖకాంతి
స్తోమప్రచితానతారిచూడామణిని
ష్కామోద్దామప్రభావ
స్థేమ శ్రీకృష్ణ నాగసింహునికృష్ణా. 1

వ. అవధరింపు మమ్మధురలాలస యలఘువ్రతుం జూచి నీ వడిగినమణికంధరుని
వృత్తాంతంబు సకలంబును వినిపించెద విను మని యి ట్లనియె. 2

క అచలధృతి నతఁడు తద్దుల, వచనసరణిఁ దగిననియమవర్తన మమరన్
శుచి యై యాచటిదగ్గఱి, యుచితస్థితి నిలిచి యుఱక నుంకించుతఱిన్. 3

ఆ. మథనసమయఘూర్ణమానాబ్ధివోలెఁ బెన్
మ్రోఁత లడరఁ బరుపమూఁక లెల్ల
బిట్టు గలఁగి తల్లి బిడ్డ పట్టక పాఱె
నతనిమది మహాద్భుతాకులముగ 4

వ. అంత.

మ. బిగిచన్నుత్తులు గుత్తపుంబయ్యెఁటలోఁ బింపిళ్లు గూయంగ శీ
ఘ్రగతిన్ భామ యొకర్తు వచ్చి యిదె యోగంధర్వ నీ వాంచె దీ
భృగుపాతంబుఫలంబు నీపరుసవారిం గావు మంచున్ ధగ
ద్ధగితాశాంతర మైనఖడ్గ మొకటిం దత్పాణి కిచ్చెన్ వెసన్ 6

వ. తదనంతరంబ.

సీ చుట్టుపట్టుల నున్నయట్టిపెన్ప్రాఁకులు బలువిడిపై దూరి పాఱునవియు
గండోపలంబు లుద్దండవేగాధికోద్ధతిఁ జెక్కు లై తూలఁ దాఁకునవియుఁ

గరిసింహశార్దూలశరభాదిమృగముల నుగ్గునూచంబుగా నుఱుచునవియు
నంతరిక్షమున నత్యంతంబు దట్టమై పందిటిబాగుగాఁ బర్వునవియు
తే. నగుచు బలితంపుటినుపకట్లనుఱ నొప్పు
వెండిగునపంబులో కాక వెండికట్ల
యినుపగునపంబులో యనఁ దనరి కురిసె
నెంతయును జిత్తజల్లుగ నేదుముండ్లు 8
క. మణికంధరుండు తద్దారుణశిలలీవృష్టి మిగులఁ గ్రొత్తయగుచు వీ
క్షణముల కత్యద్భుతకారణమై తనరారఁ జూచి ప్రమదం బలికెన్. 9
ఆ. చెలువ యీయపూర్వశిలలీప్రవర్ష మెక్కడిది యీమహాసిఁ గార్య మేమి
సేయు మనుచు నాదుచేతికి నిచ్చి తెవ్వతెవు నీవు వినఁగ వలయు నాకు. 10
ఉ. నా విని యింక నేమియు వినన్ రణకోవిద నీ కొకింతయుం
దావల మెద్ది యాకపటదైత్యుఁడు చేర్పన కేఁగుదెంచు నే
మో వడిఁ బర్వఁ జొచ్చెఁ గదు ముండులవానయెదుర్పు మింతటన్
నీవు మహాసిచేతన వినిర్భరవేగతఁ జక్కుఁ జేయుచున్ 11
ఆ. ఏదుగూపుతోడ నిదిగో నొకించుక, దవ్వునందు వాఁ డుదగ్రవృత్తి
నీకు నెదురువచ్చునాకష్ట నిటు మించి, రాకయుండఁ దునుము రయముతోడ
వ. అని సత్వరంబుగాఁ బ్రార్థించిన నాయింతిం జూచి. 13
చ. అమరవిరోధిఁ ద్రుంతు నిదె యంగన భీరుల కెల్ల భీతి దీ
ర్చుము వెసఁ బొమ్ము నమ్ము మనుచుం గదలెన్ రయ మొప్ప దర్పదు
ర్దమరిపుఖండ కాండభుజదండమునందుఁ బ్రచండమండలా
గ్రము జళిపించుచున్ గిరగిరన్ దిరుగన్ నెగవైచి పట్టుచున్. 14
వ. ఇత్తెఱంగున నత్యంతోత్సాహసంభ్రమంబునం గదలి. 15
మహాస్రగ్ధర. శిలలీసందోహముం దోస్సమధికలఘిమాశ్చర్యచాతుర్యచర్యా
విలసద్ఘోరాసిధారావిహృతిహతము గావించుచుం బోయి కాంచెన్
శిలసంతానంబు మేనన్ గగురు పొడిచి కన్పట్ట నున్నట్టియేదుం
దులితానూనప్రసూనద్యుతిశిలలవనీధుర్యధాత్రీధరంబున్. 16
వ. ఇట్లు గాంచి నిరంతరాసారంబైన తద్ఘోరశిలలీవృష్టి తనకృపాణవిహరణవిచిత్ర
వేగంబునఁ దుత్తుమురు సేయుచు నక్కపటదానవు నుద్దేశించి. 17
క. ఓరి యవివేకి రాక్షస, యీరూపవికారవృత్తి నేమి గలదు దు
ర్వారత నీదుజగద్ద్రోహారంభము నిన్నుఁజెఱుప కకట విడుచునే. 18
సీ. దిగ్గజంబులకును దేటి చూడఁగ రాక యేపారుగజదైత్యుఁ డేమి యయ్యె
మొగులలో నుండి యమ్ములవాన గురియించు నింద్రజిద్దానవుం డేమియయ్యె
విశ్వమంతయునిండి వృద్ధిఁబొందుచుసురాహితకారియగువృత్రుఁ డేమియయ్యె

జగ మెల్లఁ జాఁపచుట్టుగ ఘనశక్తిచే నెసఁగుహిరణ్యాక్షుఁ డేమి యయ్యె
తే. వెండియును బెక్కుమాయల వెలయునట్టి
వారు శంబరప్రముఖు లే మైరి వినవె
యకట యోరిదురాత్మ యీవికృతరూప
మేమిటికి వచ్చు నిదె వధియింతు నిన్ను. 19
చ. అన విని రక్కసుండు నగి యక్కట యెక్కడివాఁడు వీఁడ చే
తనుఁడొ మతిభ్రమార్తుఁడొ మదస్ఖలితాత్ముఁడొ పుట్టువెఱ్ఱియో
తనభుజసత్త్వ మెక్కడ యధఃకృతదిక్కరివిక్రమప్రవ
ర్తను ననుఁ దాఁకు టెక్కడ విధాత కడుం జెడ రేఁచెనో సుమీ. 20
వ. అని యతని నుద్దేశించి 21
క. బ్రదు కొల్లకున్న రా ర, మ్మెదురుగ నిటువంటిమాట లిమ్మెయి నేలా
వదరఁగ దొంతుల కోపని, గుదియలునుం గలవె నీదుక్రొవ్వడఁగింతున్. 22
చ. అనుచు నొకింత మేమఱచి యత్యధికోగ్రశిలౌఘవృష్టిచే
మునుఁగఁగఁ జేయ దానిని సముద్ధతఖడ్గవిహారచాతురిన్
దునుముచుఁ జేరి తద్గళముఁ ద్రుంచె వడిన్ మణికంధరుండు త
ద్ఘనశిలజాల మాతెఱపిఁదన్ వెసఁ దాఁకి గతాసుఁ జేయఁగన్. 23
క. అని చెప్పిన లఘువ్రతుఁ, డనయంబునుఁ గుతుకయుక్తుఁడై యెవ్వాఁ డ
ద్దనుజుం డాతని నార్తి,తిని దునిమించినది యెవతె తెలియఁగ వలయున్. 24
వ. అనిన విని యాశిశువు వారిరువురితెఱంగును వివరించెద విను మని యిట్లనియె.
క. మహితాత్మక యాదైత్యుఁడు, మహిషాసురుమాతులునికుమారుఁడు దుర్గా
నిహతుఁ డగువాని విని తా, నహితము దుర్గకు నొనర్ప నాత్మం గోరున్. 26
తే. వాఁడు శల్యాసురుం డన వసుధఁ బరఁగు
శల్యరూపత నునికిఁ దచ్ఛలలచయము
గడ్డపాఱలకై వడిఁ గానిపించి
పేర్పుట ఖనిత్రశలుఁ డనుపేరు గలదు. 27
వ. మహిషాసురునిఁ జంపినసూడు తనమనంబునం బాయక యివ్విధంబున దుర్గ
యందు బద్ధమత్సరుం డై యారాక్షసుండు తనమనంబున. 28
చ. క్షితితల మంతయున్ వెదకి చెండుదునో వెసఁ గాలికార్చునా
వ్రతపరు లెంద ఱందఱ నవారణ నెన్నొడలందుఁ జంపికా
యతనముపేరు లేక ఖల మై చనఁ గూల్తునో యోర్చు టెట్లకో
మతి నొకయప్పుడున్ విడక మండఁగఁ బెట్టుచు నున్నకోపమున్. 29
ఆ. ఏను గినుకఁ బూని యిట్లు గావింప నే, మనుచు నుడుకు నొకో బలాంతకుండు
పేదకోప మెందుఁ బెదవులచేటుగా, నుడికి యేమి సేయ నోపు నన్ను. 30

క. భార్గవుదీవనఁ గన్నయ, నర్గళసద్విప్రులబలమహత్త్వము సుమనో
వర్గమునకు లోఁబడునే, దుర్గాశక్తికిని వెలివ దుర్దమశక్తిన్. 31

తే. ఏయుపాయంబుచే నైన నెచ్చిరిలఁగ
నీక రాక్షసకులము రమేశ్వరుండు
దునుము ననుశంక యొక్కటి మనమునందు
నున్నయది దీని కెద్దియో యుక్తి యింక. 32

క. వీనికిఁ దగినయుపాయము, గానంబడుఁ గాక శాంతి కంపగు తనువుం
బూని చరించుట మేలొ, దానవకులుఁ డయ్యు నితఁడు ధార్మికుఁ డనఁగన్. 33

తే. అనువిచారంబుతో నొకవనములోన, వాఁడు వర్తిలఁ గా దైవవశత వచ్చె
నచటి కభినవకౌముది యనుతుషార, కరకిరణజాప్సరోజాతి కన్నె యొకతె 34

ఉ. వచ్చినఁ దద్విలాసవిభవంబున కద్దనుజేంద్రుమానసం
బచ్చెరు వంది మున్నటిసమస్తవిచారము దక్కి మిక్కిలిన్
హెచ్చినపచ్చవిల్తుపస నెంతయుఁ జంచలభావ మొందఁ దా
నచ్చపలాక్షి కిట్లనియె నద్దివిజప్రతిపక్షుఁ డయ్యెడన్. 35

ఉ. కోమలి నాకు నెట్టియెడఁ గొట్టినపిండి సమస్తలోకముల్
నీమది కింపులైనయవి నిర్భరశక్తిని దేసమర్థుఁడన్
నీమహనీయరూపరమణీయతకుం దగునట్లు గాఁగ నే
నేమగరూపులైన ధరియింపఁగ నేర్తును గామరూపి నై. 36

ఆ. నన్ను నేలుకొనుము నావుడు నేమియు, ననక తన్ను నాదరావలోక
ములఁ దిరస్కరించి జలజాక్షి యటు వాసి, చనుచు నుండ నతఁడు కినుకతోడ.

ఆ. నాతి యిట్లు వేఁడు నన్నాదరింపక, పోవునిన్ను నింకఁ బురుషుఁ డొకఁ
డెవఁడు నేఁ దలంక నేరికి నెన్నిగుం,డియలు గలవు నాదుప్రియను జేర. 38

క. అని వెలిపించినదది దన, మనమునఁ జల మొదవ నిన్ను మడియించిన వా
నిని దక్క నే వరింపను, విను మిది నాప్రతిన దీని విడ నిఁక ననియెన్. 39

చ. అనుడు దదుక్తిక్రూరతకు నద్దనుజుండు గడున్ ఘనంబుగాఁ
గినిసియుఁ బోవ నిచ్చె నొకకీడును జేయక యవ్విలాసినిన్
మనమున నెప్డు దేతెఱఁగునం దన కబ్బునొ దానిసంగమం
బని యడియాస యాకినుక కత్యధికం బగుచుం బ్రవర్తిలన్. 40

తే. అది మొదలు గాఁగ నాకన్య యరయుచుండె
వాని మడియింప శక్తుఁ డెవ్వాఁడొ యనుచు
వాఁడు దనుఁ జంప బూనినవానిఁ జంపఁ
దనకు వర మెట్లు సాధింతు ననుచు నుండె. 41

తే. అంతట మృగేంద్రవాహనయాలయమున
కతఁడు దైవవశంబున నరిగి యందుఁ
బ్రస్తర స్తంభలిఖితాక్షరములు చూచి
చదువుకొనుచోఁ దదంతరసరణియందు 42

క. ఈ మెఱుఁగుగండకత్తెర, చే మిడిదల యిచ్చుసాహసికుఁడు శిరం బ
త్లో మగుడఁగ నదుకుకొనం, గా మని చంపుఁ దనుఁ జంపఁ గడఁగిన వానిన్ 43

క అనియెడియర్థముఁ గనుఁగొని, తనయభిమతసిద్ధి కది నిదానం బగుటన్
మనమునఁ గడు సంతోషము, దన రారఁ దదుక్తరీతి దప్పక నడిపెన్ 44

తే. నడిపి తత్ఫలసంసిద్ధినమ్మికఁ దన
కెందు నెదు రింక లే దని డెందమునను
గరము గర్వించి యపుడ యాఖలుఁడు పూనె
నమ్మహాశక్తిఁ దొడిగి నవనిఁ గూల్ప 45

క అభినవకౌముదియును స,ర్వభూమిమండలమునందు వానిఁ దునుమఁ జా
లుభుజాబలాఢ్యు నరయుచు, శుభ మగుతచ్ఛక్తిమహిమసుద్ది విని మదిన్. 46

క. తనకోర్కి కెద్దియే నొక, యనుకూలం బైనత్రోవ యచ్చో సమకూ
ఱునో యని యిక్కడికిని దాఁ, జనుదెంచుచు నాఖనిత్రశిలునిం గనియెన్. 47

క. కని వీఁ డిక్కడి కెచ్చో,ట నుండి ప్రత్యక్ష మయ్యె దగ్గఱ కెడఁగాఁ
జను తెరువు లేవొకో యని, మనమునఁ దలపోసె నంతమాత్రన వాఁడున్. 48

తే ఆచకోరాక్షిఁ జూచి యోయలరుఁబోడి
యేను బ్రార్థింపఁ గైకొక యిట్టివానిఁ
గాని వరియింప నంటివి గర్వవృత్తి
నల్లనాఁ డాకవనములో ననుచుఁ బలికె 49

చ. తన కపు డబ్బినట్టివరదర్పముచే నతఁ డట్లు పల్కి నీ
సొనరఁగ మీర లెవ్వరును నూఁకొనకుం డిటు చూచి చెప్పెదన్
నినుహరియించునట్టిమహనీయబలాఢ్యుని గాని యే వరిం
పనుచుఁ బల్కితిం గలదె పల్కిన కొగ్గనియోగ వధూటియున్ 50

తరల. అనిన నెగ్గన నింక నెద్దియొ యంబుజాక్షి యెఱుంగ నే
ననువుగా పలకాలికింబసునందు వ్రాసినవ్రాత గ
న్గొనుము మూర్థము గండకత్తెర కూలఁ దన్నియుఁ గ్రమ్మఱన్
మనినయట్టినరుం గనుంగొను మాట లెవ్వియు నేటికిన్. 51

వనమయూరము నా విని సుపర్వలలనామణి వెసం ద
ద్గ్రావలిఖితాక్షరకదంబకము సార

ణ్ణోవరునిమస్తకము గొంత యదున్ ర
క్తావనియుఁ జూచి కడు నాకులతఁ జెందెన్. 52

స్రగ్ధర ఈరీతిన్ ఖిన్నయై నాహృదయమువెత యూహించి వారింప దిక్కె
వ్వారున్ లే రింక నిర్దేవతకె యురుకృపావర్తనన్ నన్నుఁ బ్రోవన్
భారం బంచున్ వెసం దత్పదముల కెఱఁగెం బర్వునం బోయి గర్భా
గారంబుం జొచ్చి వాఁ డక్కడనె తనదు రాకం బ్రతీక్షించుచుండన్. 53

వ. ఇవ్విధంబునఁ బాదంబులం బడి లేవక తనతొల్లింటిప్రతిజ్ఞాప్రకారంబును ఖనిత్ర
శిలలుండు పలికినయుల్లసంపుఁబలుకును నతనిగర్వకారణంబును వినిపించి
యోమహాదేవీ యేసు వెనుక ముందఱ గానక కళవళపడి యున్నదాన నాకు
నెట్టనఁ బ్రతిజ్ఞాభంగంబు గాక యుండఁ ద్రోవ యొకటి సంఘటించి రక్షింపు
మని ప్రార్థించె మృగేంద్రవాహనయు నమ్మహారాక్షసునిచేతితనసద్యోమహో
పద్రవంబునకు నివారకం బగుచు నొదవినయాయువిదరాకకు సంతసిల్లుచు నిఁకఁ
జేసి యప్పటితత్ప్రార్థనంబునకు శీఘ్రప్రసన్న యగుచు నిట్లనియె. 54

ఉ. ఈదనుజుండు దన్ను వధియింపఁ గడంగినవానిఁ జంపుటో
పైదలి తప్ప దుక్త మగుపద్ధతి నిచ్చట నాత్మమస్తక
చ్ఛేద మొనర్చుకొన్న తనిఁ జెందుఫలంబును మాన్పవచ్చునే
నీదుప్రతిజ్ఞకుం బరిగణించి ఘటించెద నొండుపాయమున్. 55

సీ. అని కొంత చింతించి యద్దేవి యభినవ కౌముదిఁ జూచి యోకమలవదన
వీనిసాహసకర్మవృత్తికి ఫల మెన్నఁ దనుఁ జంపఁ బూను నాతనిని జంపు
టింతియ కాని తా నెట్లును వానిచే మడియకుండఁగ నియమంబు లేదు
కావున నధికవిక్రముఁ డగువాఁడు వీనిని జంపి చచ్చు నన్నియమశక్తి
తే. నీప్రతిజ్ఞయుఁ దలఁప వీనిని దునిమిన, తీవ్రశౌర్యు వరించు టంతియ కదమ్మ
యతనిమఱుమేన నైన నీప్రతిన దప్ప,కుండ వరియింపవచ్చు నీ కుచితవిధిని.
ఆ. ఇంక నట్టివరుని నెన్నిక మీఱంగ, నిశ్చయింపవలయు నీరజాక్షి
యని యొకింతచింత యొనరించి తదుపాయ, మాత్మఁ గాంచి మోద మలరఁ బలికె.

సీ. మణికంధరుం డన గుణనిధి యొక్కగంధర్వకుమారుఁ డో తలిరుఁబోఁడి
తన శోకకారణంబునఁ జేసి యొదవిన యవితథోద్యమము మహాసి యొకటి
యిదె నాదుసన్నిధి నిడి పోయినాఁ డని యాయింతి కాఖడ్గ మపుడు చూపి
నీ విది గొనిపోయి యావీరవరుచేతి కిచ్చి వేచంపింపు మిద్దురాత్ము
తే. వీఁడు నీరూపునకుఁ జిక్కి వెంటవెంట,వచ్చు నలయించుకొని పొమ్ము వానికడకు
నెంతవిసివియు నీమీఁద నించుకయును, దెగఁడితఁడు డెందమున నీవు బెగడవలదు.
వ. ఇమ్మహాఖడ్గంబు దొల్లి దత్తాత్రేయుండు స్వభావనామధేయుం డగుసిద్ధునకిచ్చె
నతండు మణిస్తంభుం డనుతనయల్లుని కిచ్చె నతండును నిక్కడ నొక్కప్రయో

జనంబుకొఱకు గంధర్వుం డైనమణికంధరున కిచ్చె దానంజేసి యిద్దివ్యాయుధం బమ్మణికంధరునకు సంప్రదాయాగతం బగుచుఁ గార్యకారి యగు నితరులకుం బనుపు సేయదు గావున నతనిచేతికి యీవలయు నతండు నిప్పుడు శ్రీశైలంబున నొక్కశాపంబు కారణంబుగా భృగుపాతంబున కాయత్తపడుచున్న వాఁడు నీవు వేగంబ చని తత్ఫలంబు దీనిచేతనే యగు నని యాభృగుపాతంబు మాన్చి యిద్దానవువధంబునకు నియోగింపు మాగంధర్వుండు రెండవమేనఁ గళాపూర్ణుం డనం గాసారనామధేయం బగుపట్టణంబునఁ బుట్టఁగలం డతని వరియించి ప్రతిజ్ఞఁ జెల్లించికొనుము పొమ్మని యనిపిన. 59

చ. పయఁట బిగించి వెన్నడుముపైఁ బిరిచుట్టుగఁ జుట్టి కుంతలో
చ్చయము దృఢంబుగా ముడిచి చయ్యన వచ్చటిమండలాగ్రముల్
శయమునఁ బూని వెల్వడియె శక్తినివాస మవక్రవిక్రమో
దయపరిభాసమాన యగుదర్పకవైభవలక్ష్మియో యనన్ 60

తే. ఇవ్విధంబున వెలువడి యేఁగుదెంచు
నట్టియీయింతిఁ గనుఁగొని యసుర వెఱచెఁ
దనుఁ దునుమఁ బూని వచ్చెనో యని తలంచి
దానఁ దన్నాశ మగునొ యన్దలఁపు వొడమ 61

చ. అతఁ డపు డాసుధాకరనిభాననఁ గన్గొని సంభ్రమింపుచున్
మతి గలగంగ నిట్లనియె నాపయి వచ్చిన నీకు నిష్టదై
వతములయాన సుమ్ము వరవర్ణిని యొందుఁ దలంక నేను దు
ర్మతి వయి నీవు నాకుఁ దెగి మ్రగ్గెదవో యని తల్లడిల్లెదన్ 62

సీ. అనుడు నయ్యింతి యోయసురేంద్ర నీవు నాపాలికి నోర్వ కిట్లాన లిడఁగ
నకట నీమీఁద రానంత యెఱుంగనిదాననే యేను నీతలఁపుబడిన
నడిచెద నని తన్నుఁ గడచి చనంగఁ దద్వాక్యరీతి నిజాభివాంఛితమున
కనుకూల మైనయ ట్లెట్లొ తోఁచుటయు నతఁ డక్కన్య వెనువెంట నంత నింత
తే. నరిగె నెందును నిలువక యబ్జముఖియు
మిగుల నెడఁబాయ కొక్కొక్కమిషముతోడ
నప్పటప్పటి కొక్కింత యాలసించి
కూడ నిచ్చుచు నెలయించుకొనుచుఁ జనియె 63

శా. ఆతండున్ మదిఁ దత్ప్రియాణపుతెఱం గాత్మానురాగక్రియా
రీతిన్ మానసమున్ హరింపఁ జనియెన్ శ్రీశైలపర్యంత ము
ద్భూతానంగవిజృంభణంబువలనన్ దూరత్వముం గాన కా
నాతిం జూచుచు మన్మథాతురుఁడు గానన్ నేర్చునే యేమిన్. 64

తే. అంతట వినివి యతఁ డాలతాంగిఁ బిల్చి
నాతలంపువెంబడి నీవు నడిచె దనుచుఁ
బలికి తిది యేమి చెప్పుము నీభంగు లిపుడు
వనిత నను భ్రమయించెదో యనుచుఁ బలికె. 65

చ. పలికిన నేను నీతలఁపుపద్ధతి గా కిపు డేమి మీఱితి వ
ర్తిలితిఁ దొడింబడిక్ నిను వధింపఁగ వచ్చెదనో యటంచు నా
కలుగుచు రాక మాను మని యానలు పెట్టఁగ నవ్వు డేను నీ
తలఁపుబడిం బ్రవర్తిలఁగ దానవ పల్కితి తప్ప నిప్పుడున్ 66

సీ. అనినఁ గ్రోధించి యేఁ బ్రాణభయంబున నీ కలిగెడువాఁడ నే వధింపఁ
జాలక నిన్ను నీసరణిఁ గరంబు దవ్వనుసరించుట నన్ను నసదు గాఁగఁ
దలఁచెదు గాఁబోలుఁ దెలుప కేరికి నెట్లు తెలియ యుక్తమ యిది తలఁచి చూడఁ
గావున నాలావుఁ గనుఁగొను మనుచు నా తరలాక్షి నప్పుడు దాఁకకుండ
ఆ. ఘోరశిలలవృష్టిఁ గురియించె నొడలు వీఁ, గించి యతఁడు నికటగిరులు గాఢ
గురుతరద్రుమములు గడి గ్రుచ్చునట్లుగ, నిఖిలజంతుతతులు నేలఁగలయ. 67

తే. ఇత్తెఱంగునఁ దనశక్తి యెఱుకపఱచి
యిఁక వరింపక చనియదే యీవు చనిన
చోటు లన్నియు నాబలస్ఫూర్తిచేతఁ
బిడుగు పాటినడొంక యై పెం పడంగు 68

ఆ. దాన నఖిలభయనిదానంబ వగుదు నీ, యన్వయమున లేనియట్టితిట్టు
గుడువ నీకుఁ దగునె కోమలి యది యెంచి యైన నను వరింపు మనియుఁ బలికె.

క. అన విని యిఁక నిట్టిటు దడ,సినఁ గార్యము దప్పు ననుచు శ్రీగిరికి వడిన్
జనియె సతి యింత నంతన్ దనుజుఁడు వెన్కొనియె శిలలతతులు గురియుచున్.

వ. అంత నాయింతియు నత్యంతరయంబునం జనియె నప్పు డప్పర్వతంబునందు శివరాత్రిమహోత్సవమునకుఁ జేరినసకలదిగ్దేశజనసముదయంబునకు వాని రాక యెఱింగించి కన్యగతులు చూచుకొం డని పల్కి మణికంధరుం డున్నచోటుఁ బరికించి వేవేగ నేఁగి యతనిచేతికిం దనచేతియమోఘోద్యమఖడ్గంబు నొసంగి యవ్విధంబున నాశిల్యాసురునిఁ జంపించి యతనిచేతఁ బొలిసినమణికంధరుని రెండవజన్మంబుఁ గనిపెట్టుకొని యుండె నతం డంతఁ గళాపూర్ణుం డై జనియింపనుచితగతిం జేరి తనపూర్వవృత్తంబు వివరించి దినంబునకుం జనక యావజ్జీవంబు నవ్విభుం డునిచినచోటన యునికికి నొడంబడి గాంధర్వవివాహవిధిని వరియించె నంతట మదాశయుండు స్వభావసిద్ధునివచనప్రకారంబున సకలశత్రుజయగర్వితుం డగుచు నొండు నడ్డంబు లేక చరియించువాఁడు గతివశంబునఁ గాసారపురంబుపై నేతెంచి యిమ్మహారాజునకుఁ బరాజితుం డై తనభార్యయుఁ దానును దాస

త్వంబునఁ బనులు సేయుచుండె నక్కాలంబునందు వారికి నేతదీయమణిసందర్శన మహిమవలన నే నుదయించితి నంతట నాతల్లిదండ్రులు నేలికచిత్తంబున కెడ సిరి తత్ప్రకారంబున సరస్వతీకనకగర్భులసల్లాపకథయందు వినంబడినది యదియ యట్లుండనీ వార లీ క్రముకకంఠోత్తరపురంబు వెలువడి పోయి ప్రయాణశోభం బునఁ గృశత్వంబు నొంది తేఱక యున్న నన్నుం జూచి నన్నుం గొనుచుఁ దిరిగి వచ్చి నేఁ డింతకు మున్ను గా నొదవినయేతన్మాణిక్యవిలోకనమహత్త్వంబున నే నారోగ్యంబు నొంది మిక్కిలి యొలమిం బొదల హృదయంబుల ముదంబు నద్భు తంబు నొందుచు నివ్విధంబున నవ్విభుసన్నిధి నిడి మదీయదౌర్బల్యనివర్తనప్రకా రంబు విన్నవించి సన్నుతించిరి తత్పురోహితులును మణిమహిమవశీకృతు లగు చు నిమ్మేదినీశ్వరుఁ గ్రమ్మఱ నాశ్రయించి యిదె యున్నవా రని చెప్పిన నలఘు వ్రతుం డబ్బాలికకుఁ గేలు మొగిచి యోదివ్యమహిమశోభిని యాపురోహితు లెవ్వరు వారి తెఱం గెఱుంగవలయు నని యడిగిన. 71

క వారితెఱం గే మెఱిఁగెదు, సారగుణా వారు నీదుసత్పుత్త్రులు నీ
తోరపుభాగ్యము నిన్నును, జేరిచె నని పలికె శిశువు చెలువగ వెసఁగన్ 72

క ఆపలుకున కత్యాశ్చర్యాపూర్ణమనస్కుఁ డగుచు నలఘువ్రతుఁ డా
పాపం గనుఁగొని వారలు, నాపుత్త్రకు లగుట యెట్లు నవ్వక చెపుమా. 73

వ. అనిన సభాపతిం జూచి యి ట్లనియె 74

ఆ అంటికుంచి యాదునట్టప్రాయ మొకింత, నడఁచునంతలోన నాదుసతులఁ
బుణ్యశీలయుతలఁ బోకార్చుకొన్నట్టి, నాకుఁ బుత్త్రు లనుట నగవుగాదె 75

చ. తలఁపక వారిపోకయును దక్కినయట్టిది గాదు వార్ధిలో
పలఁ బడి యందుఁ బడ్డదియె పాటుగఁ దీర మునింగి పోయి రే
నలఘుతదన్వయాకృతిగుణాదులమక్కువ నన్యసంగమే
చ్ఛ లుడిగినాఁడఁ బుత్త్రులను సంశయ మైనను గల్గనేర్చునే. 76

ఆ. నాకుఁ జూడ ధరణినాయక యది యసం,గతమ యీవిచిత్రకథలఁ దల్లి
దీని కొనర నేగతిని బట్టతలలు మోఁ,కాళ్లు ముళ్లు పెట్టఁ గలదొ కాని 77

వ. అనుటయు నట్ల దప్ప దనుచు నవ్వి యవ్వసుమతీధవుండు నమ్మధురలాలస నాలో కించి యోబాలికాతిలకంబ యీసందియంబు దీర నీబ్రాహ్మణునిజన్మాదివర్తనంబు నితనికిఁ బ్రథమాగమాదులు పుత్త్రులైనప్రకారంబును వారు మదాశయునకుఁ బురోహితు లైనతెఱంగును నెఱింగింపు మనిన నట్ల చేసెద నని యబ్బాల యి ట్లని చెప్పె 78

సీ జననాథ పాండ్యదేశమునందు నురగాఖ్యపట్టణంబున నొకబ్రాహ్మణుండు
సోమశర్మాఖ్యుఁడు శ్రుతిపారగుఁడు తపోయోగాధికుండు శ్రీయుతుఁడు గలఁడు

తత్త్వజ్ఞుఁడయ్యు నాతఁడు గుప్తమాహాత్మ్యుఁ డగుచు గృహస్థాశ్రమార్హవిధులు
జగదనుగ్రహణార్థముగ నడుపుచు నందు నతిముఖ్య మని సంతతాన్నదాన
తే విధిని విప్రులఁ దనుపుచు వెలసె నతని
యాత్మజుఁడు యజ్ఞశర్మాఖ్యుఁ డతని కంట
దయ్యె వేదాదివిద్యలయం దొకటియుఁ
బరమయత్నంబుతో నెన్ని పాట్లుపడిన. 79

క. ఆదుగఖము మఱపించుట, కై దివ్యాంగనలఁ బోలునతివలఁ గులశీ
లాదిగుణాఢ్యల నలువుర, నాదరమునఁ బెండ్లిఁ జేసె నతనికి గురుఁడున్. 80

క. ఆకోడండ్రకు సొమ్ములు, కోకలు ననులేపనములు కొదయించుకయున్
లేక ప్రవర్తిల నడపె న,నాకులతం గొమరు డెంద మలరారుటకై. 81

క. కడపటి దెసయం దాతఁడు, కొడుకుఁ బిలిచి యిట్లు లనియెఁ గోడండ్రు విన
నడుపుము నీవె ట్టి నను, విడువక మనయన్న దానవిధినియమంబున్ 82

క. దానును జతురాగమసం,తానం బుదయించు నీకుఁ దప్పదు మద్వా
చానియమం బిది యనుటయుఁ, గా ని మ్మని యియ్యకొనియెఁ గడఁక నతండున్.

ఉ. ఆయన తండ్రియాజ్ఞఁ దనయాదలఁ దాల్చి యొకప్పుడున్ మదిం
బాయక పెంచునట్టిపితృభక్తిరసం గలమాన్నమున్ హవిగ
పాయసపూపసూపబహుపక్వఫలాదుల నంత కంత కిం
పై యమరంగఁ బెట్టె వసుధామరకోటి కనేకవర్షముల్. 84

చ పయిఁ బయిఁ బండుకొల్చు విరిపైఁడియు గట్టిదినుసుసొరాయి ర
ప్పయు మఱి బంటుబొనిసలు బైరముపెయ్యలు చేలు చెట్లు లో
నయినసమస్తసంపదలు నన్నవితీర్ణికి వెచ్చపెట్టఁగాఁ
బ్రియలు ధరించుసొమ్ములకుఁ బెట్టినపెట్టె జలింప కంతటన్. 85

వ. ఇట్లు గడంగి పరమపతివ్రతలం దవపతుల నలువుర నుపలక్షించి 86

ఉ ఏకలకంఠిసొమ్ము హరియింతును మ న్నని చింతిలెన్ సమ
స్తోకమనోనురాగత సతుల్ దను నంతట నాదుసొమ్మె మున్
గైకొను నాదుసొమ్ము మును గైకొను మంచుఁ గడంగి వేఁడఁగా
నేకలకంఠిసొమ్ము హరియింతును మ న్నని యట్లు చింతిలెన్ 87

వ. అప్పుడు. 88

ఉ. మంగళసూత్ర మొక్కటియె మాని సమస్తవిభూషణంబులున్
రంగదభంగురప్రణయరమ్యత నొండొరు మీఱ నూడ్చుచుం
బొంగుచుఁ దెచ్చి ముందటను బో విడుకాంతలరూపు తొంటికం
టెం గరగించెఁ గాంతుఁ బ్రకటీకృతభక్తియె సొమ్ము సాధ్వికిన్. 89

తే. వెచ్చ మన్న దానమ్మంట వేఁడువాఁ డ
దీశ్వరుండఁట తాము పతివ్రతలఁట
యొండొరుల మీఱి యెట్లు సొమ్మొసఁగు టరుదె
యది యలంకృతికంటె రమ్యంబు గాదె. 90

ఉ సొమ్ములు వేఁడి పుచ్చుకొనుచోట్ల సపత్నులమత్సరంబు లో
కమ్మున నెచ్చటం గలదు గాని నిజాభరణంబు లెల్లఁ దా
రిమ్మెయి నాథువెచ్చమున కిచ్చుట కొండొరు మీఱుపుణ్యపుం
గొమ్మలు వీరె యంచు జనకోటి నుతించెను వారి నత్తఱిన్. 91

వ. ఇవ్విధంబునం దమతమసొమ్ములే మున్ను పుచ్చుకొనుటకుం ద్రికరణైక్యంబు గానుపింపం బ్రార్థించునిజసతులయందు నెవ్వరి నతిక్రమింపం జాలక యాతం డందఱిఁ బ్రియంబునం జేకొని తదాభరణంబు లన్నియు నొకమాఱె పుచ్చుకొని వెచ్చపెట్టం దొడంగెఁ దత్కాలంబున. 92

క. మతిలోఁ జన్ను రాగమసం,తతి నీకుదయించు ననినతండ్రిపలుకు సు
స్థితముగఁ దదాశకతమున, సతతము నతఁ డుండుఁ జదువుసంధ్యలదండన్. 93

క దానికి ఫల మపు డేమియుఁ, గానక యుండియు గురూక్తిక్రమ మెద్దియు యె
వ్వానికిఁ దెలియ దటంచును, దా నెప్పటియట్ల సన్నదానము నడపున్ 94

క ఆయజ్ఞశర్ముఁడే సు, మ్మీయలఘువ్రతుఁడు మేదినీశ్వర యీవే
రాయన్నదానసువ్రత, మేయెడ విడువ కునికి యపు డితనికిఁ గలిగెన్. 95

ఉ. ఏ మని చెప్పవచ్చు నపు డింతులసొమ్ములు చెల్లిపోవఁ ద
త్ప్రేమము నెక్కుడం జదువఁ బెట్టినొ గట్టిగ నిశ్చయించె నా
భామలఁ బట్టి యిచ్చి తనపట్టినయట్టికడింది నేమముం
దా మదిఁ గొన్నినాళ్లు విహితంబుగ నిల్పుకొనన్ మనంబులోన్. 96

వ. ఇట్లు నిశ్చయించి వారి కది యెఱింగింపక కపటమార్గంబున నమ్ముకొనునుపాయంబు చింతించి యొక్కనాఁడు కొమ్మలతో నిట్లనియె. 67

ఆ. తామ్రపర్ణి రేవుదండ నోడలు డిగి, యున్నవియఁట యేను నువిదలార
యొకనిపొత్తుగూడి యోడ బేరము వోయె,దను సదాన్నదానధనముకొఱకు 98

చ. అనవుడు నిన్నుఁ బాసి క్షణ మైన గృహంబున నుండ నోప మే
మును నినుఁ గూడి వచ్చెదము మోదముతో మముఁ దోడుకొంచుఁ బొ
మ్మన నిది లెస్స కార్య మని యందఱి కొక్కబెహారిచే రహ
స్యనియతి మూల్య మందుకొని యచ్చటికిం గొనిపోయె వారలన్. 99

క. విను మధిప యిట్లు గొనిపో,యి నయంబున నొక్కనావ యెక్కించెఁ దుదం
దన కెక్కడ నెడ లేకుం,డను మునుపటిపదవుగట్టుడఁ గలం బరిగెన్ 100

క. పదియైదుబార లెడగా, నది యాఁగతిఁ గడలి పోవ నపు డే మని ధ

ప్పుడు నరవర శోకమహా,భిదుర మితనిర్ధైర్యగిరిని బిట్టు పగిల్చెన్. 101

వ. ఇట్లు విశకలితధైర్యం డై. 102

మ. అతిదుష్టం బగునాథ నేచ్ఛ తుద నాహా యింతకుం దెచ్చెనే
సతులారా షమము నంచు రూపగుణవంశస్ఫూర్జితల్ మీర లి
ట్లతికష్టస్థితి నొంద బేహారులపాలై పోవ నాచెట్ట ప
ట్టితిరే యంచు మహారవం బడర నేడ్చెన్ శోకవేగంబునన్. 103

క. ఆయేడ్పు విని సతుల్ తము,నాయకు వంచించి యిట్లు నావపతియుఁ గొం
పోయెడునో యని ఘనశో,కాయత్తత నలువురును మహాసంభ్రమతన్. 104

క. జడనిధిలోఁ బడ నుఱికిరి, పడ నెవ్వారలును నొడిచి పట్టంగానే
యొడఁ గానక హాహారవ, మడరమహాశోకసంభ్రమాకలితులుగన్ 1 5

ఉ. పట్టఁగ లేమి కొందొరులఁ బల్మఱుఁ జాల దిసంతు గొట్టుచున్
దిట్టుచు నీటిలో వలలు తీవ్రరయంబున వైచియున్ గడున్
దిట్టల నీఁతకాండ్ర జడధిన్ బడఁద్రోలియుఁ దజ్జనుల్ గరం
బట్టియెడన్ రయంబు మెఱయన్ వెదకించిరి వారిఁ బల్మఱున్. 106

వ. ఇవ్విధంబునం దడవుగా వెదకి ముదితలఁ గాన రైరి వారిం గొన్నట్టిసెట్టి యంతట నవ్విప్రుని బలాత్కారంబున నాక్రమించి నీయేడ్పుకతన నింత పుట్టె నని తన్మూల్యధనంబు గ్రమ్మఱం గొని విడిచిపెట్ట నట్టిపాట్లం బడిన యితండు తనకు సుతు లనియెడునామాట నమ్మ కెట్లాడిన నుచితంబ. 107

క. అత్తలిరుబోండ్లయవ్వలి,వృత్తము వినుపింతు మింక విను మోభూపా
లోత్తమ వారత్తెఱఁగునఁ, దత్తఱపడి నీట నుఱుకుతత్సమయమునన్. 108

క. బలుమీ నొక్కటి నోరన్, సలిలం బెగఁద్రోలుచుండఁ జని రాచెలువల్
నలువురుఁ దద్వదనములో,పలి కాసలిలంబు వెంటఁ బార్థివతిలకా. 109

ఉ. అంతన దవ్వుగాఁ బఱచి యంబుచరంబు సరోషపూర్ణవ
క్రాంతరతోయ మూర్ధ్వముఖ మై ప్రవహింపఁగ మూర్ధరంధ్రని
ష్క్రాంతము చేసి తజ్జలము రాజిలె వారుణకేతులీల నా
యింతులు వ్రాల్చి రందు లిఖయించినబంగరుతీఁగలో యనన్. 110

సీ. ఆపీతజలవలాహకముతో గగనంబు దిరుగఁ బ్రాఁకుమెఱుంగుతీఁగ లనఁగ
సురనదిఁ జల్లఁ జూచుసముద్రుచేతి కాశ్మీరజంబాలంపుచార లనఁగ
బలుమీలచమురు జొబ్బిలఁ బొగతోఁబర్వుతో యేంధనపుమంటతునుక లనఁగ
నదులకుఁ గూర్మ యన్నసీఁడి మేల్ దెలుపు వారిధినిల్పు తెఱగంటి రేక లనఁగ

ఆ. విపుల మీనమస్తవివరనిర్గమితోర్ధ్వ, గామితతమహోదకప్రవాహ
సంగతిని బయోదసరణికి నెగయునా, సతులు గానిపించి రతులలీల. 111

తే. మిగుల దవ్వుగ నెగసియు మగువ లంత
నుత్తరంబుగఁ జను చున్న యొకవిమాన
వరముమీఁదటఁ బడి రందు గరిమ జూడ
మాడుచును బోవుయువయుగ్మ మరుదుపడఁగ 112

వ. ఇవ్విధంబున నద్దివ్యవిమానంబు మీఁదం బడి యొక్కింత తడవునకు మూర్ఛఁ దేఱి కనువిచ్చినయచ్చెలువలతడివలువలు చూచి యలఘుకారుణ్యంబున నద్దివ్యమిథునంబు దివ్యాంబరంబు లొసంగి యూరడించి మీ రెవ్వ రెచ్చటనుండి యిచ్చటం బడితి రని యడుగుటయు నప్పడంతులు వడవడ వడంకులు గుడుచు కులుకుటెలుంగులతోఁ బలుకం దొడంగిన 113

క. తాంబూలరాగకించి, చ్చుంబితతద్దంతకాంతిసొబ గెంతయు ర
మ్యం బగుచు నందు దివ్యని,తంబినిచిత్తమున కద్భుతం బొనరించెన్ 114

తే ముస్ను తద్రూపలావణ్యములకుఁ దనదు
నాయకునిచిత్త మెట్లగునో యటంచు
దలఁకు దివ్యవధూటి నాతలిరుఁబోండ్ల
పలువరుస యొప్పుపలుకులు గలఁచె మిగుల 115

తే. ఇట్లు శంకిత యగుచు నాయిగురుఁబోఁడి, కాంతు నీక్షించి వారలకత యటుండ
నిచ్చి నీపందె మాడుకొమ్మేలయాల,సింప నీయాట యోడవచ్చినది యనియె.

ఉత్సాహ.—
అని యొకింత వారిఁ జూచి యమ్మలార యిప్పు డే
ననినమాట మీకుఁ గోప మైన నయ్యెఁ గాని యీ
యన ననుం బరాకుపఱచి యాటగెలుపు తనదిగా
వెనుక వాదు లాడ నేను వినఁగఁ జాల నని తగన్ 117

వ. విభునిం జూచి. 118

ఉ. ఆడితె నీదు పందె మని హస్తనఖప్రసరచ్ఛవిచ్ఛటా
మ్రేడితపాండురద్యుతిసమృద్ధి గరం బమరంగఁ బాచికల్
వేడుకతోడఁ బుచ్చుకొని వ్రేళ్లను నిట్టు నటుఁ బొరల్చి వి
భ్రాడకిలంకకంకణవిరావము మీఱఁ గదల్చి వైచుచున్. 119

సీ. నిలుమహో బొంకకు నెత్తకమ్మా యంచుఁ బత్తులు లెక్కడునొయ్యఁ బలుకుమనుచుఁ
జిక్కె నీసారె నాచే నంచుఁ జక్కె నౌ దీనిపాలిటిగూడు దిన్న ననుచు
నదె దుగ తివకుమీ సుదతి నీవంచు నౌ నిదె సారె దాఁకె నీ యిచ్చ యంచు
నినుమాంటు దంచిన నెసటిపోఁత లటంచు నౌ నట్ల యుడికెడు గాని యంచు
తే. నిట్టిదంటమాటలు నేర్చి తెచట ననుచు, దంట నే నాట నీసంగతమున నంచుఁ
దమపరస్పరసరసవాక్యములు దనర, నెలఁత తనవిభుఁడును దాను నెత్తమాడె.

చ. క్షపఁ గవ వాసి యుండుటను జక్కవజోళ్లమనోనురాగ మే
ల పొగడ నక్షపాతిశయలబ్ధసుసంగమశారికల్ క్షణం
బపుడ వియోగ మొంది యహహా వెసఁ బావఁ దొడంగెఁ దుల్యరం
గపుఁబసయుఁ బరిస్ఫుటము గాదె తదీయము యెల్ల వారికిన్. 121

ఉ. సారెకుఁ బోటు దాఁకినను జాడ్యము నొందక జోడు విచ్చి పో
సారెఁ గడంకతోఁ బొడిచి చాటుచుఁ దీవ్రరణస్ఫురన్మహా
శారిఫలప్రఘట్టనలఁ జాలఁగ మచ్చర మెక్క నయ్యెడన్
వారలు జోడులుం బలె నొనర్చిరి జూదపుఁబోరు మీఱుచున్ 122

తే. అంతఁ బతి గెల్చి తత్పణ మైనయట్టి
యాస్యమద్యసదోౄదాన మధరసంజ్ఞ
నడుగఁ దల యొయ్య నూఁపుచు నన్యసతుల
యునికిఁ గనుసన్న జూపుచు నుత్పలాక్షి. 123

ఉ. ఆమధురంపుసొంపు కడు నాత్మఁ గెరల్ప నతండు చూడ్కి నే
వేమఱుఁ దా నదల్చియును వేఁడియు మ్రొక్కియు బుజ్జగించియున్
భామిని నప్పుడే తనదుపన్నిదముం బురికొల్పి వారు మా
ర్మోమిడి చూడ నున్కిఁ దన మో మొకకొంత మలంచి తెల్పుచున్. 124

చ. చెలువయు మున్న యాయితము సేసి సమీపమునందు నిడ్డయు
జ్జ్వలమణిపాత్రికామధురసంబు నిజాస్యమునందు నుంచి తాఁ
జెలువునినోరి కిచ్చెఁ బెఱచెల్వలు చూచెదరో యటంచుఁ జం
చలితకటాక్షవీక్షణము సారెకు వారలపై నిగుడ్చుచున్. 125

ఉ. అంతటఁ బోక పేర్చుప్రణయవ్యసనం బెసగొల్పఁ గ్రోలి రా
కాంతుఁడుఁ గాంతయున్ మఱియుఁ గల్పకుజాసవముం బరస్పరా
క్రాంతమిథఃకపోలఫలకప్రతిబింబవిలోకనామృతా
త్యంతవితీర్ణనూతనరసానుభవంబున నేకపాత్రికన్. 126

ఉ. చెక్కునఁ జెక్కు హత్తి విలసిల్లఁగఁ దత్ప్రతిబింబవీక్షలం
జొక్కుచుఁ బెక్కువాసనలసొంపున నింపు జనింప జొబ్బునన్
గ్రుక్కెఁడుగ్రుక్కెఁడే మధువుఁ గ్రోలుచు మోవులు నంజుకొంచు వా
రెక్కుడు గాఁగఁ దన్పిరి నిజేంద్రియపంచకదైవతంబులన్. 127

ఉ సిబ్బితిపేరు పోఁ దుడిచి సీధుమదం బపు డన్నుకొల్పుచుం
బ్రబ్బఁగ మాట లక్షరవిభాగము చాలక యేమొ యేమొ త
బ్బిబ్బులు గాఁగ వెల్వడియ ఖేదిల మానము సోలుచూపులున్
నిబ్బర మైనకెంజిగియు నేత్రములం దుదయించె వారికిన్. 128

ఉ. అంతటఁ బానపాత్రమున నాత్మముఖంబు నధీశుమోము నీ
మంతిని చూచి యోరి పరమానిని పానసహాయ మయ్యెనే
యింతటిలోన నీడ యది యెవ్వతె యంచును జిహ్వ యాడ క
త్యంతము దొట్రిలం బలికెఁ దన్మధు వానక మానె నల్కతోన్ 129

వ. అప్పు డతండు 130

ఉ. చేడియ లెస్స చూడు పెఱచేడియ యెయ్యది యిందులోన నీ
నీడయ కాక యన్న నవనీసురభార్యలఁ జూపి యాకె నా
నీడలె వీరు న ట్లయిన నీవు ననుం బలె నౌర వీరలన్
వేడుకఁ జూతువో వలదు వీరికి నిచ్చట నంచు భీతిలెన్ 131

వ. ఇవ్విధంబున నవ్విధుమామణి మధుమదంబున మది చెదర యుక్తాయుక్తవివేకంబు లేక యాకొమ్మలవలనం దలంకుపుట్టి యిలకు డింప నుద్యోగించి కించిదవనతవదనంబుతో నధోభాగంబు పరికించునపుడు నిజవిమానయానానుసారంబున గోదావరీసరిత్సమీపపరిదృశ్యమానధర్మపురినామనగరవాస్తవ్యవారముఖ్యాకేళిసౌధంబు గగనంబుతో నొరయుచు సమీపంబున దీపింపఁ దదీయచంద్రశాలాప్రాంగణంబు చేర నాత్మీయదివ్యవిమానంబు నియోగించి యాగరితల నలువురం గ్రమంబునఁ దాన కైదండ యిచ్చి యచ్చట దించి తనచేత కనుమతింపక యిట్టట్టు నట్టుకొట్టుచున్న వల్లభుం జూచి యుల్లంబున దక్కినచింత వదలి పోదండు పోదండు వీరలచేరిక జారభావంబునం గోరువాఁడు నాచేత నవశ్యంబును నొచ్చు ననుచు వాహనారోహణం బొనర్చిన నతండు నాకు నిట్టితలం పేమియు లే దిమ్ముగుదల కాహా రాదు లె ట్లని విచారించెదంగాని యనుటయు నాయువిదయతనికినాసౌధో త్తమంబులోఁ బలు తెఱంగులయఱలుకరంబునంజూపుచు

చ. అదె ఘృతతండులప్రకర మల్ల వె చీరలు భూషణాదిసం
పద లవె రాజు రాక కులుపా యొనఁగూర్చినయట్లు మీ తెదుర్
ముదితల కేమియచ్చికము మూఢత నిం దొగు లెవ్వి ముట్టినన్
బ్రదుకనివారు వా రనుచు భామిని యేఁగె నిజేచ్ఛఁ గాంతుతోన్ 133

తే. ఆత్మవిభుచిత్తచలనశంకాంకురంబు, వలనఁ గాదంబరీమదాకులతవలన
వెడలుతద్వాక్యములచొప్పు విప్రసతుల, ప్రాణశీలాదిరక్ష కై పరిణమించె 134

క. ఆమగువ యట్లు పలుకుచు, నా మేడన్ వారి నిలిపి యరుగు తెఱఁగుఁ ద
త్స్వామిని యగుగణికామణి,దా మఱుఁగున నుండి చూచి తలఁకెడుమదితోన్.

క. ఎవ్వారో దివ్యస్త్రీ, లివ్వరసౌధంబు నాశ్రయించి రిచటికిన్
దవ్వై వ్వలి మిచటివస్తువు, లెవ్వియు నాశింపు టొప్ప దిఁక మాకనుచున్ 136

మ. తలపోఁతల్ పొడమంగ గూఢసరణిం దత్సౌధమున్ డిగ్గి యా
తలిరుంబోఁడి తదాభిముఖ్య మమరం దా మ్రొక్కి యిమ్మేడ నిం

పాలయఁగ నిల్పినయమ్మలార యిపు డిం దున్నట్టినాసర్వవ
స్తులు మీ కిచ్చితి ధార వోసి యిదె యంచుం జల్లెఁ దోయాక్షతల్. 137

క. చల్లి మదీయ మ్మైన, ద్రిల్లెడునీచుట్టుపట్టుగృహావనముఖ్యం
బెల్లను మీ సొమ్మిఁక మముఁ, జల్లఁగఁ జలిగాలఁ దన్ని సాకుం డనియెన్ 138

క. అని యాయాచోటులఁ దన, జనులం బిలుచుకొని వెడలిచని యాసుద్దుల్
వినిపించెఁ బట్టణములో, మనుజుల కందఱకు వెఱఁగు మనమునఁ దనరన్. 139

ఆ. ఆమెఱుంగుఁబోండ్లు నపు డవ్విధం బెల్లఁ, జూచి యిది కరంబు చోద్య మనుచు
దీనజనులపాల దేవుఁ డెందును గలఁ, డనుచు సారెఁ జెప్పుకొనుచు నరిగి 140

క. వారలు తమతలవాకిటి, బోరుఁదలుపు లెట్టిసమయములఁ దెఱవక తా
రారసి పదిలము సేయుచు, నారూఢస్థితి వహింతు రాసౌధములోన్. 141

క. శకునాదులచే నిజనా, యకపునరభిసంగమాశ లపు డుదయింపఁగ
వికలత నొందనిధైర్యా, ధికతఁ బ్రవర్తిలి రభీష్టదేహాభరణలై. 142

ఉ. పురజను లప్పటప్పటికిఁ బుణ్యచరిత్రల వారలఁ బ్రభా
స్వరమణిసౌధమార్గముల వచ్చుచుఁ బోవుచు నుండఁ జూచుచుం
గరములు మోడ్చి మ్రొక్కుదురు గాని తదీయసురూపలక్ష్మి కె
వ్వరుఁ [1]బెఱపోక పోరు మనువార్తవిధం బెద నిల్పి పాయమిన్. 143

శా. గంధర్వాంగనలో మరుత్సతులొ యక్షస్త్రీలొ యిమ్మేడలో
నింధానద్యుతితో మెలంగుదు రకే యెవ్వాఁడు పాపస్పృహా
గంధిస్వాంతతఁ జూచినన్ మనఁ డకే కన్గొం డటంచుం బ్రజా
బంధుల్ వేళలు గాచి చూతు రతితాత్పర్యంబునన్ వారలన్. 144

సీ. నభమున మణివిమానమునఁ గ్రుమ్మరువారలీమేడఁ బెక్కునా ళ్ళిట్లు నిలిచి
యిలలోనిజనములబలె వండుకొని వార్చుకొని గణికాదత్త మనుభవింప
నేమిటికివ్రత మొకొక్కొయిదియెన్ని నాళ్లకొక్కొయావేశ్య యెట్టిధన్యాత్మయొక్కొ
యేము సమర్పింప నిచ్చకైకొని కరుణింతురో యని పౌరు లంతఁ దెచ్చి

తే. పెట్టసాగిరి తద్ద్వారపృథివి యలికి, ముద్గతండులఘృతపయోముఖ్యవితతు
లప్పటప్పటికిని వారు నవి పరిగ్రహించి రాజను లతిదూర మేఁగి మ్రొక్క 145

ఆ. అంతఁ గొన్నినాళ్ల కాపతివ్రతలకు, నలువురకును శోభనత్వ మొదవ
గర్భలక్షణములు గాన్పించెఁ బరిపూర్ణగర్భతయుఁ దనర్చెఁ గ్రమముతోడ

ఉ. గర్భములందు నుండియుఁ బ్రకాశత నప్పుడు నేర్పెలర్పఁగా
నర్భకు లొక్కవేళఁ జతురాగమసూక్తుల నొక్కవేళ శా
స్త్రార్భటి నొక్కవేళ నితిహాసమయోక్తుల నొక్కవేళ నా
విర్భవదర్థశాస్త్రముల వేడ్కఁ జెలంగుదు రద్భుతంబుగన్ 147

వ. అంత. 148

1 బెఱదీక.

క. జ్యేష్ఠానుపూర్వి నార్య, శ్రేష్ఠులు పుట్టిరి శుభోల్లసితలగ్నమునన్
నిష్ఠాగుణసౌభాగ్యగ,రిష్ఠల కానలువురకు ధరిత్రీనాథా. 149

క. వారలకు యదృచ్ఛాసం,చారంబున నొదవి యొక్కసంయమి విహితా
చారము నడుపుచు శుభసం,స్కారము లొనరించె జాతకర్మాదికముల్. 150

వ. నామకరణసమయంబున నతం డాశిశువులయనుభావంబు దనదువిజ్ఞానదృష్టిం బరికించి వీరలు మూర్తిమంతంబు లైనవేదంబు లని నిశ్చయించియు జన్మాగమ ప్రకారంబు ననుసరించియు వరుస నన్నలువురకుం బ్రథమాగమ ద్వితీయాగమ తృతీయాగమ తుర్యాగము లనువేళ్లు గల్పించె దన్మాతలు పూర్వకాలంబునం దమమామ పలికినచతురాగమసంతానశబ్దంబునకు నర్థంబు వీర యని తమలోం దారు సరిపుచ్చుకొని సంతసిలుచు నప్పటిసంయమీంద్రునియొఱుకకు వెఱఁగు పడుచు నక్కుమారులకు నుచితకాలంబున వచ్చియు నుపనయనసిద్ధి యొదవిం చుటకు నాతపస్విని వేఁడుకొని యట్లు సేయించి రాబ్రహ్మచారులు స్వయంప్రకా శితసకలవిద్యు లయ్యు శాస్త్రసిద్ధికొఱకు నతనియొద్దన యఖిలవిద్యలు నత్యల్ప కాలంబులోపలన యధ్యయనంబు చేసి రంతఁదన్మాత లెంతకాలంబున నిట్లున్నను దమపెనిమిటిసమాగమంబు దుర్లభంబ యని విచారించి యచ్చోటు విడిచి యొచ్చటి కేనియుం బోవఁ దలంచి యది తమకుమారులఁ బిలిచి తెలిపించిన వార లిట్లనిరి 151

క. పెద్దతల లేక మీ రీ, నిద్దపురూపముల నెచట నిల్పిన మనకుం
బెద్దఱికము చాలదు పెఱ, సుద్దులు గల్పింతు రందు సుజనులు గరే 152

క. కావున నిచటన మీ రీ, దైవతవనితలను గుట్టు దప్పక యుం[illegible]
ద్రోయుఁడు దివసము లే మొక, భూవరుఁ గని వై[illegible]వం[illegible] ంచెదుదాఁకన్.

తే. అపుడు గాని మాతండ్రి యున్నట్టిచోటు
నరసి సంధించుకొనుటకు వెరవుపడదు
తప్ప దిది యని వారలు తమనివాస [illegible]త
మెరు లెఱుఁగ కుండ వెలువడి [illegible] పురంబులోనం గొంతసంచారంబు చేసి 154

వ. అట్లరిగి యాబ్రహ్మచారులు [illegible]యుండు గావున నతని వాకిటికిం జని యతండు యప్పు డది యే లెదురాజు[illegible] దర్శనంబు పురోహితునియనుమతి లేక సకలవిద్యావిశేషజ్ఞుం[illegible]యు నతండు దాను విద్యాధికుండు కాకుండుటం బ్రాహ్మణుల కెవ్వరి[illegible] బున నితరు లగువిద్యాధికులను రాజగృహంబునం జేసి నిజగౌరవ[illegible] దౌవారికాదిసకలపరిజనచక్రంబును వలకట్టుకొని ప్రవేశ[illegible]కు యాగేచ్ఛ గలిగి తనతోడ విచారించినఁ దదా
[illegible]

ర్త్రివిజ్యాసమర్థుల నెచ్చటం గాన మని పరిహరించుటయు నచ్చటిజనంబులవలన విని మఱియును. 155

సీ. ఎవ్వరి నేసుద్ది ద్రవ్వించి యచ్చట నేశాస్త్రఘనుకల్మి యెఱిఁగికొనునొ
మనుజేశుఁ డనుచు నేపనికిని వెల్పలి వాక్ప్రగల్భత లేనివారిఁ గాని
చొరనీరు రాజమందిరమును దౌవారికులు మఱి యట్టివారలను మిమ్ము
నరసి నేమము గీమ మరసిన రాజుతో నీయిల నేలంగ నెపుడు శుభము

తే. యనెడుమాటగా నాడుకొం డ్రనియు వార్త
లేమి యడిగిన మేము మాయిండ్లలోన
యుండుదు మెఱుంగ మనుఁ డనియును దదర్థ
మాన లిడి కాని చొరఁగనీ రనుచు వినిరి. 156

క. విని తదుచితమును బ్రభువున్నకును దమమహిమంబు దెలుపుకొన ననుకూలం
బును గా నొకవాక్పద్ధతి, నొనరిచికొని నీచబాలయోగ్యాకృతితోన్. 157

ఉ. భూవరముఖ్యసన్నిధికిఁ బోయెదుమామిడిపండ్లపుట్టికల్
మోవఁగఁ గూలిఁ బుచ్చుకొని మూఢత గుల్కెడు గ్రామ్యచేష్టితం
బావహిలంగ నేఁగి ప్రతిహారజనంబుల కిష్ట మైనవా
చావిధి కొప్పి చొచ్చి ప్రభుసన్నిధిఁ బెట్టిరి పండ్లపుట్టికల్. 158

క. [illegible]ట్టి వెనువెనుక కటు చని, య ట్టిటు భయచపలచేష్టు లై యరుగుచుఁ గ[illegible]
ప[illegible] [illegible]యా బాలురఁ గృప, యుట్టిపడఁగఁ జూచి నృపతి యొయ్యన నగుచున్.

క. సంతోష[illegible]మె కద యెయ్యెడఁ, జింత యొకప్పుడు నొకింత చేకుఱదు గదా
కొంత మఱి [illegible]కక కలిగిన, యంతయు నిక్కముగఁ జెప్పఁ డనుటయు వారల్.

క. *మాయమ్మా [illegible] నీ[illegible]వే, రాయల వై కావ దేవరాజే జేజే
మాయాతుమ [illegible]నిన [illegible]ది, పాయక సంతోషమున్న పల మిలసామీ. 161

క. అన నమ్మాటలచందము, తన[illegible]ప్పటివాక్యములకుఁ దగునుత్తర మై
యనయముఁ గ్రతుబుధసేవాఘు[illegible]పదేశంబు నగుచుఁ గాన్పించుటయున్. 162

---

* ఇండలిపదము లీప్రకారమున విభ[illegible]జించిన సాంస్కృతికము లగును.

మా, ఆయమ్, మాన, సునీవే, రాః, అలవా, ఏక[illegible], అవత్, ఏవ, రాజే, అజేజే, మా, ఆయాతు, మలాని, న, యది, పాయక, సంతః, అసముత్, న, పల[illegible]. మిల, సా, అమీ.

టీక. సునీవే=శోభనమైన మూలధనము గలరాజా! ని. 'స్త్రీకట[illegible]వస్త్రబంధేఽపి నీవీపరిపణేఽపిచ' అ.ఆయమ్=వచ్చుబడిని,మామాన=గౌరవింపకుము.(వచ్చుబడిని గౌరవిం[illegible] మూలధ[illegible] ము విశేషముగా వెచ్చింపకు మని యాశయము.) రాః=ధనము. ని. 'అర్థరై విభవాఅపి' [illegible] [illegible]లేనిదియు,

చ. విరివిగ నంతరంగమున విస్మయ మావహిలంగ వారియా
పరయుచు భస్మసంవృతమహాగ్నికణంబులువోలె గుంథవి
స్ఫురణత నున్కిఁ గాంచి పరిపూర్ణవినీతి సుమోదభక్తిత
త్వరత దలిర్ప లేచి నరపాలుఁడు సాగిలి మ్రొక్కె వారికిన్ 163

క. అని చెప్పఁ గలాపూర్ణుఁడు, విని యాతం డింతశబ్దవిదుఁడే యిటు తో
త్తనెఱుంగ మని మదాశయుఁ, గనుఁగొనియెఁ సబహుమానగౌరవదృష్టిన్.

వ. కనుఁగొని మదాశయుండు కూర్చుండు మని ముమ్మాటుదాఁక నుదల పెట్టి యంతట బలిమిన కూర్చుండ నియమించి మధురలాలసం గటాక్షించి యట మీఁదఁ జెప్పు మనుటయు నది యిట్లని చెప్పె నట్లు మదాశయుండు మ్రొక్కి యానలువుర నాసనపాద్యాదివిధులం బూజించి నిజాస్థానజనులం జూచి యిప్పటి వీరలవాక్యంబులందు నేమివిశేషంబు గలుగఁ దెలిసి యంతఁ బూజించె నని మీమనంబుల నున్నది యేమొ యవ్వాక్యంబులమహిమ వినుండు 165

సీ. ఆయంబు సరకుసేయకుము శోభనమూలధనుఁడ ధనం బచ్ఛిదంబు ముఖ్య
మైనయట్టిది తన్ను నదియ తేని కజు యజించువానికి లక్ష్మి చేరుఁ బాత

---

ఏకా=ముఖ్యమైనదియు, అవత్ + ఏవ-అవదేవ=(తన్నురక్షించువానిని) కాపాడునదియు (అగును). అజేజే= (అజంయజతీతి జేట్ శస్త్రె) విష్ణుని బూజించెడు, 'అజశ్శంభౌ విష్ణుధాత్రోః కామేఘాగ రఘోస్సుతే' నానా. రాజే=రాజునొఱకు, మా=లక్ష్మి, ఆయాతు=వచ్చును. ని.'ఇందిరా లోకమాతా మా' అ. మలాని=పాపములు, న=చేరవు, (విష్ణుదేశించి క్రతువులు చేయువారికి సకలసంపదలు గల్గు ననియుఁ బాపములు తొలఁగు ననియు నాశయము.) పాయక=ఓరక్షకుఁడా' సంతః = విద్వాంసులు, యని=(వచ్చిరి) యేని, అసముత్=సంతోషము లేనివాఁడవై, నపల=తొలఁగిపోకుము, విపల=(సంతోష ముతో వారిని) కూడికొనుము (విద్వాంసులు వచ్చినయెడ వారికి విముఖుఁడవు గాక దర్శనమిమ్మని యాశయము. ఏలయన) అమీ=ఈవిద్వాంసులు, సా=ఆలక్ష్మియే. (విద్వాంసులరాక సంపత్కరమని భావము.)

ఇందలిపదములే యిట్లు విభజించిన స్వచ్ఛతెలుఁగు అగును.

మాయమ్మాన, చు, నీవు, ఏ, రాయలవు, ఏ, కావన్, దేవరా, జే, జే, జే, మాయాతుమలు, ఆనినయది, పాయక, సంతోసము ఉన్నపలము, ఇలసామీ.

టీక. దేవరా=ఓరాజా, జే జే జే=జయ జయ జయయని యాశీర్వచనము, (ఎల్లవారికంటె నుత్కర్షము గల్గియుండు మని యర్థము.)ఇలసామీ=ఓమదాశయుఁడా, నీవే, రాయలవై=రాజవై, (బహువచనము గౌరవార్థము) కావన్=రక్షింపఁగాన్, సంతోసము=ఆనందము, పాయక=విడువక, మాయాతుమలు = మామనసులను, (ద్వితీయార్థమునం బ్రథమ,) ఆనినయది = ఆశ్రయించినది, ఉన్నపలము=తక్కినప్రయోజనముసహితము, ఆనినయది=(నీవు పాలనము సేయఁగా మాకు సంతోష మును దక్కినయెల్ల ప్రయోజనములును సమకూడె నని భావము.)

మాయమ్మాన=మాతల్లియాన, చు=చుమా, చూచు ధాతువు ప్రార్థనార్థకరూపాంతరము. మీఁదఁ జెప్పినయర్థము నిజ మని నమ్మించుట కీవాక్యము లోకరీతి ననుసరించి చెప్పఁబడెను.

కములు చేరవు రక్షకా కోవిదులు కల్గి రాయసమోదుండ వై యరుగకు
సమ్మిశ్రభావంబు సలుపుచు మాలత్మీ కోవిదు లనియెదు దేవభాష

ఆ. వరుసఁ బదవిభాగవిరచనతో నర్థ, మరయఁ దోఁచుచున్న యది గరంబు
తెలియఁ జూడుఁ డేతదీయాంధ్రవచనసం,దర్భమునను శబ్దతంత్రవిదులు. 166

వ. అని పలికి మదాశయుండు ప్రథమాగమున కభిముఖుఁడై వినయవినమితుండును ముకుళితకరుండును నగుచు మీ రెవ్వరిట్టి ప్రచ్ఛన్నవేషంబున నేల వచ్చితిరి మీవిధం బంతయు నాకుఁ దెలియ నానతీవలయు నని ప్రార్థించిన నతండు తమ తండ్రి యన్నదాననియమంబు మొదలుకొని పూర్వవృత్తాంతంబు తమతల్లుల వలన విన్నదియుం దారు గన్నదియుం దద్దర్శనపర్యంతంబు సకలంబుఁ జెప్పిన నతండు నిజపురోహితదోషాయత్తతం జేసి పూజార్హు లని విచారింప నేరనితన దుర్వివేకంబునకు సిగ్గుపడుచు ని ట్లనియె. 167

క. ఇది దెలిసియే కావలయుఁ, మదాశయుం డనుచుఁ బేరు నాకు నిడుట యే
నిదిగో కననేరన కో,విదులఁ బురోహితునికపటవృత్తికి లోనై. 168

చ. అని యపు డమ్మహామహులప్రార్థనబల్మిని దక్కినట్టిదం
డనము నరేంద్రుఁ డాతని కొనర్పక యాత్మపురోహితత్వవ
ర్తనమును మాన్పి తత్కపటతంత్రములోపలివార లై చరిం
చినజనులఁ లఘుప్రబలశిక్ష వినీతులఁ జేసె నెంతయున్. 169

ఆ. ప్రార్థనం బొనర్చి ప్రథమాగమాదుల, ధర్మవిధిఁ బురోహితత్వమునకు
నిలుపుకొనియె వారు నిజమాత్యయుక్తులై, తగినగతి గృహీతదారు లగుచు.

వ. ప్రభుసన్మానంబున నత్యంతవైభవంబునం బ్రవర్తిల్లుచు నతని కభిమతంబులైన క్రతువులు సేయించుచుఁ దమజనకునియునికి యురగపట్టణంబు మొదలుకొని పాండ్యకేరళ ప్రముఖదేశంబులం బరికింపందగినవారింబనిచి యందు నలబ్ధవృత్తాంతు లగుచు చింతాక్రాంతు లగుచుఁ దల్లుల నుచితవిధిం గొన్నికొన్ని యాశలు చూపి యూరార్చుచుండ రలఘువ్రతుండును నట్లు భార్యావృథా విక్రయలజ్జితుం డగుచుఁ దజ్జనపదంబుల సుహృజ్జనులకుఁ దలచూప నోడి దూర దేశాంతరంబుల యాయావరవృత్తినర్థార్జనం బొనర్చుచుఁ దత్పరిమితాన్నదానంబు నడుపుచు నది నెఱయఁ సాగకున్న నన్నవర్జనంబు చేసి తాను గందమూల ఫలాదుల దేహయాత్ర సలుపుచు నంతరాంతరప్రవర్తితస్వల్పాన్నదా నాచరణంబులం దనియక బహుధనార్జనంబునకు నుపాయంబు వెదకుచు నంతట మృగేంద్రవాహనామహాశక్తిమహిమ విని తదారాధనంబునకు నొకని వలన మంత్రోపదేశంబు సాధించి యద్దేవిసన్నిధికిం జని యచ్చట్టు భవత్కథా శ్రవణఫలంబున సకలసంపదాయురభివృద్ధిపుత్రపౌత్రాదిలాభంబువిని యందుఁ

దనకుఁ బుత్త్రపౌత్త్రాదు లనుమాట యటుండినఁ దక్కినఫలంబు గల్గుట సిద్ధంబు గదా యనియెడుతలంపున జపంబుచేత భవత్కథాశ్రవణంబు సాధించెఁ దుద నది యత్యంతసంభావనీయం బైనపుత్త్రాదిలాభంబును గలిగింపక మాన దయ్యెం జూచితే యోమణిస్తంభతనయ యిట్టిది సుమీ దేవరకథామహిమ యని పలికి మధురలాలస యూరకుండెఁ గళాపూర్ణుండును నలఘువ్రతుం జూచి నీసందియం బెల్లను దీఱెఁగదా యని పలికి ప్రథమాగమాదుల నిరీక్షించి మీతండ్రికిఁ దగినయుపచారంబులు నడపక యిప్పుడు ననుమానించినం బాతకంబు రాదే యని పలికెఁ బ్రథమాగమాదులును భయభక్తివినయసమ్మోదసంభ్రమంబులతోడ నలువురును లేచి వచ్చి యలఘువ్రతునిపాదంబులకుం బ్రణామంబులు గావించి యానందబాష్పపులకవిలసితశరీరుం డైనయాజనకుని యాలింగనమూర్ధాఘ్రాణాదివివిధోపలాలనంబుల నానందించి యతనిచేరువం గొలిచి యుండి రప్పు డమ్మహాత్ములతోంటియాంధ్రగీర్వాణభాషాశ్లేషవైచిత్రి చిత్తంబునం బాఱఁ గళాపూర్ణుండు వారలం జూచి యిట్టివిచిత్రకవిత మీమతులకు నిపుడు దోఁచునో యని కౌతుకసంబంధగంధమందరహాసితంబుతోడఁ బలికిన నందుఁ బ్రథమాగముండు. 171

క. *తావినువారికి సరవిగ, భావనతో నాను నతివిభావిసు తేజా
దేవరగౌరవమహిమన, మావలసినకవిత మరిగి మాకు నధీశా. 172

చ. అన భళిరా మహాకవిశిఖాభరణంబ మదుక్తభాషణం
బున కిపు డిచ్చునుత్తరము పూని విచిత్రపుఁబద్య మయ్యె మే
లని విభుఁ డాడె నట్లది యటంచుఁ గవీంద్రుఁడు నవ్వె నవ్వె నా
యన పఠియింపుమా తిరుగ నన్నఁ దదుక్తికి మెచ్చె విప్రుఁడున్. 173

* ఈపద్యము చివరనుండి చదివిన సంస్కృతము మొదటినుండి చదివినఁ దెనుఁగు నగును.

చివరనుండి పదవిభాగము.

శాధి, ఇన, కుమ్, ఆగిరి, మత, వికనసి, లవమాన, మహిమవరగౌరవదే, జాతే, సువిభో, ఇతి, నా, అంతకి, నవభాః, గవి, రసకిరి, వా, అనువితా.

టీక. ఇన=ఓప్రభువా! ని. 'ఇనస్సూర్యే ప్రభౌ' అ. కుమ్=భూమిని, ని. 'గోత్రా కుః పృథివీ పృథ్వీ', అ. ఆగిరి=పర్వతము లున్నంతకాలము, శాధి=శాసింపుము (చిరకాలము భూమిని బాలింపుమని భావము.) మత=ఓసమ్మతుఁడా! వికనసి=మిగులశోభిల్లెదు, లవమాన=రామునికుమారుఁ డైనలవునకు వలెఁ జిత్తోన్నత్యము గలరాజా! ని. 'మానః స్త్రీణాంకోపభేదే గర్వే చిత్తోన్నతావపి' నానా. మహిమవరగౌరవదే=గొప్పతనముచే, ఉత్కృష్టగౌరవమునిచ్చెదు, సువిభో=మంచిరాజు, ఇతి=ఇట్లు, జాతే=

క. ఆరీతిం దమలోనం, దారే సరిపుచ్చుకొనఁగఁ దత్పద్యచమ
త్కారం బపుడు సభాజన, మారసి యేమియును గాన కద్భుత మందెన్. 174

వ. అంత నవనీకాంతుండు సభాసదులం జూచి యిప్పుడాపద్యంబు తిరుగం బఠియింపు మనుట మఱియును బఠియింపు మనుట గాదు వినుం డని యి ట్లనియె. 175

సీ. ఏలు మోనాయక యిల గిరు లెంతకా లమ్మంతకాల మో సమ్మతుండ
మివుల శోభిల్లెడు లవకుమారసమాన మానుఁడ మహిమ ననూన మైన
గౌరవం బొసఁగు చక్కని ప్రభు విట్లు గల్గఁగ నోయి పురుషుఁ డీగౌరవమున
నభినవ తేజస్కుఁ డై వాణిరసములు గులికెడునట్టిది గలుగఁగాను

తే. వినుతి సేయనివాఁడె యంచును మహార్థ
మున్నయది సంస్కృతంబునఁ జెన్ను మీఱ
వరుసఁ దుదనుండి మొదలికిఁ దిరుగఁ జదువ
నా తెనుఁగుపద్యమున బుధు లరసికొనుఁడు 176

ఆ. అనుడు వారు నట్ల యవరోహమునదానిఁ, జదువుకొనుచుఁ దెలిసి సంతసిలుచు
నెఱయ మెచ్చిరి కవినృపులయాశువిచిత్ర, మృదుకవిత్వకృతియుఁ దదవగతియు.

వ. కళాపూర్ణుం డంత ననేకమణివిభూషణవిచిత్రాంబరప్రధానం బైనపారితోషిక దానంబునం బ్రథమాగము నలంకరించె నప్పు డతనియమాత్యుండు సత్వదాత్మ నామధేయుండు మధురలాలసకుం బ్రణామంబుఁ జేసి యి ట్లనియె 178

ఉ. ఓరుచిరాత్మ యోపరమయోగిని యే నటుపూర్వ మైననా
పేరుఁ గులాదులున్ మఱచి బిమ్మిట నొక్కెడ నుండఁ దెచ్చి కా
సారపురంబు వా రిడిరి సమ్మతి నాకును సత్వదాత్ముఁ డన్
పే రవి దెల్పవమ్మ మఱి పెద్దలఁ గానమ యొందుఁ దద్జ్ఞులన్. 179

కలుగఁగాన్, ననుఽఓయి, నాఽమనుజుఁడు, అతఽఆరాజు చేయు గౌరవము వలన, నవభాఽనూతన మైన తేజముగలవాఁడై, రసకిఽశృంగారాదిరసముల వెదచెల్లెడు, గవిఽవాణి (విద్య యని యర్థము.) కలుగఁగా, అనువితావాఽస్తోత్రముచేయనివాఁడా? (చేయువాఁడే యని యర్థము.)

ఉదారబుద్ధి గలవాఁడును గౌరవించువాఁడును నగు రాజు పాలింప విద్వాంసు లందఱు స్తుతి యింతురని భావము.

మొదటినుండి పదవిభాగము సులభము.

టీక. అతివిభావిసు తేజాఽమిక్కిలిగా వ్యాపించెడునుంచి ప్రతాపముఁ గల, అధీశాఽఓరాజా! దేవర గౌరవమహిమన ఽ మీ గౌరవాతిశయము చేత నే, మావలసినకవిత ఽ మాకుఁగావలసినకవిత్వము, తాన్ఽఅది, వినువారికిన్ ఽ శ్రోతలకున్. నరవిగన్ఽఅనుకూల్యము గలుగునట్లు, భావనతోన్ఽతలఁపు తోన్, మాకున్, మరిగిఽవశపడినదియై (మరగి యని యుండవలెను) ఆనున్ఽఆశ్రయించును.

క. అని యడుగుచుండ బాలిక, కను నులుముచుఁ జెవవి విఱిచి కటకట వాపో
యెను మొగ్గవాలుచందం,బున నడు మెగనెత్తికొనుచుఁ బొత్తులమీఁదన్. 180

క. అప్పు డది గని యింతన యీ, విపరీతప్రుఁ జేఁత లేల వివరింపఁగ దే
యిప్పు డే నడిగినయది చో,ద్యప్రుఁ దల్లీ యనుచు మఱియు నాతఁడు మ్రొక్కెన్

చ. కలుదులప్రూప లై మునులు గానని యట్టికతల్ వచింపఁగా
నెఱిఁగిన నీకు నాఁకలియు నేడ్పులు నా యనువారు మాయలం
బఱిచిన నేమొ పో మిఁక స్వభావపుదివ్యవిభూతితోడ నే
వఱలుచు మమ్ముఁ బ్రోవు మనువారును నై రప్పు డా సభాసదుల్ 182

ఆ. ఇంక నేమి గ్రైన నెఱుఁగంగవలయు సం,దేహపదము నీవు దెలిపె దనుచు
నమ్మి యున్నవార మమ్మ యీవెడమాయ, లంద నేల యనిరి కొంద ఱంత 183

క. అమ్మాడ్కి మఱియు నెవ్వా, రెమ్మెయిఁ దనువేఁడుకొన్న నెఱుకకలిమి లే
శమ్మును గాన్పింపక స,త్యమ్ముగ నాఁకటన యేడ్చె నాశిశువు గడున్. 184

శా. ఆవాక్ప్రౌఢియు నాసుబోధమునుఁ దిరంబై యునిక్కి యట్లబ్బుదై
వావేశం బప్పు డెద్దియో తదతిమాహాత్మ్యంబు రప్పించెఁ గా
కావేళం దెలియంగ లేమ తగ సంప్రార్థించి తద్దివ్యబో
ధావిర్భావనిధానముం గటకటా యం చుండె నుర్వీశుఁడున్ 185

వ. తదనంతరంబ యమ్మణిస్తంభనందనుండు రూపానుభూతిని మదాశయుం బిలిచి మీబాలికకథ లన్నియు వింటి రేకదా మీభాగ్యవైభవంబునకు నెందు నీడు లే దిది మొదలు నాకు మీర లత్తమామ లైతిరి సందియంబు లేదు మీర లింకం దక్కినకొలువు మాని యీశిశువు నింటికిం గొనిపోయి పోషింపుం డనుటయు నతనికి సత్వదాత్మం డిట్లనియె 186

ఆ. పార్థివేంద్ర వారిపడుచు మెడకు మణి,హార మెప్పుడు వెట్టి తపుడ నీకు
వార లత్తమామ లై రని యున్నాఁడఁ, దదనుగుణము లయ్యెఁ దత్కథలును

క. ఈనిసువు సులక్షణము ల,నూనంబుగఁ జూడ నిది నృపోత్తమ నానా
భూనాథవధూమౌళిమ,ణీనిర్మితనూపురార్చనీయాంఘ్రి సుమీ 188

చ. అని యతఁ డాడుమాటలకు నాత్మఁ గరం బలరన్ దరస్మితా
ననుఁ డగుచున్ మహీశుఁడు ఘనప్రమదంబున వారి నంతఁ దా
ననిపెఁ జనుండు మీరలు గృహంబున కాత్మజఁ గొంచు నంచు గాం
చనమణిభూషణప్రముఖసంపద క్రొత్తగ వెంట నంపుచున్. 189

క. ఆమధురలాలసాకథ, లేమియు శుద్ధాంతమునకు నేఁగక యుండన్
భూమిపతి యడఁచె నభినవ,కౌముది విన నేల యనుచు ఘనయత్నముతోన్.

తే. అంత నలఘువ్రతుని యభీష్టాన్నదాన, కరణపర్యాప్తబహుధనగ్రామదాన

ములమిగులఁ దన్ని యనిపె సపుత్త్రకముగఁ, దత్పురంధ్రీనివాససద్మమునకతఁడు.

క. శ్రీతిపతి చేసినగౌరవ, మతిమోద మొసర్ప నింటి కాచందమునన్
సుతఁ గొనిపోయె మదాశయ,సతియుఁ బ్రయత్నంబుతోడ సతతప్రేమన్. 192

క. పలుమఱుఁ దలయంటి తగన్, నలుఁ గిడి దోయిళ్లజలమునన్ బోర్కాడిం
చి లలిం జన్నిచ్చుచు ను,య్యాల నూఁపుచుఁ బెనుపఁ దొడఁగె నావరశిశువున్.

వ బ్రహ్మవచనసామర్థ్యలబ్ధం బైనసహజపాతివ్రత్యంబునం జేసి యాసమయంబున.

చ. పొలుపఱఁ దన్ను వే నిదురఁ బుచ్చుటకై తమతల్లి పైఁడియు
య్యాల నిడి యూఁపుచోఁ గువలయాధిపుపాటలు పాడినం గరం
బలరుచుఁ గేరికేరి నగు నన్యులపాటలు పాడినం గరం
బలయుచు నేడ్చు లోకు లవురా పతిభక్తి యటంచు నవ్వఁగన్. 195

సీ లీలఁ బొత్తులమీఁద లేచి కూర్చుండుచోఁ దద్దయు నొకక్రొత్తముద్దుఁజెలువు
క్షితిమీఁద లేఁతకెంగే లిడి తడవుచో మొన లిడి యొండొకముద్దుఁజెలువు
నల్లనల్లన తప్పటడుగులు వెట్టుచో నిద్దంపుబసపరముద్దుఁజెలువు
కొదలుమాటలు తేనెగులుకుచుఁ బలుకుచో మోహనంబగువింతముద్దుఁజెలువు

తే. కలిగి యాబాల నవచంద్రకళయనంగఁ, దిపుటనామనిఁ దనరులేదీఁగ యనఁగ
నంతకంతకుఁ బ్రోదిచే నతిశయిలుచుఁ, బరఁగెఁ జూపఱకును గనుపండు వగుచు.

ఆ ఎల్లబంధువులకు నల్లారుచెల్లమై, యరిది గారవంబు నతిశయిలఁగఁ
దల్లిప్రేమకరము దనరారె ముంగిటి, ముత్యమగుచుఁ గ్రొత్తక్రొత్తసిరుల. 197

ఉత్సాహ. చేతివ్రాలు చూచి యిది యశేషరాజ్యవిభవభో
గాతిశయము గలిగి యలరు ననియు మృదులచరణకం
జాతరేఖ లరసి రాజసతులనతుల కర్త యీ
నాతి యనియు నపుడు లక్షణజ్ఞు లాడుకొని రిలన్. 198

చ. గలగలమ్రోయునం దెలును గజ్జెలు మువ్వలు పైఁడియుంగరం
బులుఁ బులిగోరు సంకులును బొద్దులు గాజులు రావిరేకయుం
జెలు వలరంగ నెంతయును జెన్నెసలారుచుఁ గొన్నివాసరం
బులు ముద మందఁ జేసెఁ గడు ముద్దులనేఁతలఁ దల్లిదండ్రులన్. 199

ఉ. విందులు విందు లంచుఁ దను వేడుక నెత్తుకొనంగఁ బిల్వ నిం
పొందఁగ నేఁగి పైఁబడుచు నుబ్బునఁ గేరుచుఁ జెంగలించుచున్
సందిలి పట్టియాడుమన నాట్యము లాడుచు ముద్దులన్ మహా
నంద మొనర్చె బాలిక దినంబును జుట్టపుఁబూవుఁబోండ్లకున్ 200

క. పుట్టకయ తొల్లి యొక్కడ, నిట్టివి నేర్చె తని చూప తెల్లను జెక్కుల్
ముట్టుచు లాలింపఁగ నా, చిట్టికలికి చిందులాడు క్షితిపతి దడవన్. 201

మ. దినముల్ కొన్ని చనంగ నంతఁ గడు నర్థిం బొమ్మపెండ్లిండ్లు గు
జ్జెనగూళ్లుచ్చనగండ్లు పింపిళులు కుచ్చిల్ గిరనంగింజ లో
మనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాట లోనైనఖే
లనముల్ మీఱఁగ బోంట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్. 202

సీ. ఆపిన్నపాప దా నంతయై యింతయై యోలి నొయ్యన బాల్యకేళిఁ దనరె
మగవారియెదుటఁ బల్కుట నుండుటకుఁ గొంకెఁదఱచుగా రాదయ్యెఁదండ్రికడకు
నంగకంబులబాగు లరసి యోమ దొడంగె సడలనీ దయ్యె నెప్పుడును పైఁటఁ
గ్రేళ్లఁజూపులకలికితనంబుఁ బస నేర్చెఁ బలుకుచో బొమలార్చుభంగు లెఱిఁగె

తే. ముదురుఁబ్రాయంపుఁబడతులమదనకథలు
పొడముచో సిగ్గుపడి పాఱిపోవఁ జొచ్చె
శైశవముఁ బాఱ నొత్తుచు జవ్వనంబు
క్రమముతో నంతకంతకుఁ గానిపింప. 203

తే. స్తనజఘనభారములచేత జవ్వనంబు
మించి యిరుదిక్కులను నాక్రమించి బలియ
నడుమఁ జిక్కిన బాల్యమో నాఁ గృశత్వ
మంతకంతకు నొందె నాయతివనడుము. 204

క. తోరపుఁగచభారము కుచ,భారము కటిభారముఁ విభాసిలుచుండఁ
మారునిత్రిభువనరాజ్యపు,భారములు వహించినట్లు బాలిక యొప్పెన్ 205

సీ. గురుతరస్తనకేళిగిరులును గంభీరతరనాభికూపమతల్లికయును
జారురోమాళిశృంగారధారాసరణియు నంగుళీకిసలయచయంబు
సుకుమారబాహువల్లికలును రమ్యోరుకదళికాస్తంభప్రకాండములును
సలలితాధరబింబఫలవిలాసముఁ బుష్పవిసరపాండిమహాసవిభ్రమంబు

తే. కలిగి పలుకులు శుకపికకలకలముగఁ, గుంతలంబులు మధుకరకులము గాఁగ
శంబరారాతికేళీవనంబుఁబోలె, సుదతి యపు డొప్పె నొకవింతసోయగమున.

తే. ఆలతాంగియు నాలోన నభ్యసించె, వివిధసంగీతసాహిత్యవిద్య లెల్లఁ
గావ్యరచన యొనర్చె బ్రాగ్జన్మవాస,నాతిశయముచే ననతిప్రయత్నమునన. 207

వ. కళాపూర్ణుండు నమ్మధురలాలసను మున్ను తల్లిదండ్రులయింటన పెరుఁగనిమ్మని
యనుచుట యాదిగా నభినవకౌముదీవిహారవిశేషంబులవలనను రాజ్యకార్య
వ్యాసంగంబులవలనను మఱచి మఱి యెన్నఁడుఁ దడవఁ డయ్యె మదాశ
యుండు నతనిచిత్తంబు తెఱంగెఱుంగక యూరకుండె నంత నామధురలాలస
యు నవ్విధంబున జవ్వనంబు ప్రాపించి యకుంఠితమదనవికార యగుచు నాకళా
పూర్ణుపాణిగ్రహణం బభిలషించుచున్నంత 208

చ. మునుకొని కూర్మినెచ్చెలులముచ్చటవేళలఁ దద్గుణౌఘముల్
వినివిని విన్నయర్థమొకవేళను మానసనిత్యభావనం
గనికని కన్నయంతయును గావ్యవినిర్మితిచేతఁ దార్చుచుం
గొనికొని మిక్కిలిం బెనిచెఁ గోమలప్రేమను నామహీశుపైన్. 209

క. అంతటఁ బ్రత్యక్షంబుగఁ, గాంతుం గనుఁగొనఁగ బిగువుఁగౌఁగిటఁ జేర్పం
గంతువిహారంబుల నత్యంతము మోదింపఁ గోరె నంగన మదిలోన్ 210

క అనలుం గొనలుం బాఱుచు, మనమున నాకోర్కితీఁగె మగువకు మిగులన్
ఘనముగఁ దత్కుసుమద్యుతి, పనుపడ వెలిఁ బర్వె ననఁగఁ బాండిమ దోఁచెన్.

వ అందు 212

ఉ ఒక్కెతెఁ బిల్వఁ బోయి మఱియొక్కెతెఁ బేర్కొని పిల్చు మేన సొ
మ్మొక్కటఁ దాల్పఁ బూని మఱి యొక్కటి వీడ్వడఁ దాల్చు నర్థిమై
నొక్కెడ కేఁగఁ జూచి మఱియొక్కెడ కేఁగుఁ బయోరుహాక్షి దా
మిక్కిలిఁ జేర్చుభూవిభునిమీఁదిపరాకునఁ జేసి నిచ్చలున్ 213

సీ ఏమి కన్నులఁ గన్న హృదయేశురూపంబు దోఁపక యది మున్ను దోఁప కుండె
నేమి వీనులవిన్న హృదయేశుమధురోక్తి దోఁపక యది మున్ను దోఁప కుండె
నేమి మైసోఁకిన హృదయేశుసంస్పర్శ దోఁపక యది మున్ను దోఁప కుండె
నేమి దాఁ జవిగొన్న హృదయేశుకెమ్మోవి దోఁపక యది మున్ను దోఁప కుండెఁ

తే. గాంత కంతట సంతతకంతుకేళి, వివిధసంకల్పవాసన పవలు రేలు
తనగుపులకలు కలవరింతలును మాట, విడుపాటులు చెలులకు వెఱఁ గొనర్ప

ఆ తరుణి తాఁ బగళ్లు తామరసాక్షియన్, పేరువోలె నుచితనియతిఁ బరఁగ
నిర్వహించె రేలు నీలోత్పలాక్షియన్, పేరు నృపునిమీఁదిప్రేమ నంత. 215

క. సితకరునిశుక్లపక్ష, ప్రతిపత్కళ చూచి చూడ భామిని నెమ్మే
నితనుత్వముఁ బాండిమసంగతియును గడు నెక్కుడగుచుఁ గానంబడియెన్.

ఉ వీణియ ముట్టుటల్ మిగుల వింతలు పెంపుడుచిల్కబోదతో
రాణ దలిర్పఁ బల్కుటఁ గరం బపురూప మపూర్వ మెంతయుం
బ్రాణసఖీరహస్యములభ్రాంతియుఁ గ్రీడలు కానివావి యా
యేణవిలోలలోచనకు హెచ్చినమన్మథచేష్ట నయ్యెడన్. 217

క నిచ్చలు నీగతిఁ బైపై, హెచ్చి వియోగానలమున నెంతయుఁ దాపం
బచ్చుపడఁ బ్రవర్తిల్లఁగ, నెచ్చెలు లచ్చెలువఁ జూచి నెమ్మది గలఁగన్. 218

క. పెక్కుదినంబులనుండియు, నిక్కన్నియవర్తనంబు లెల్ల నరయ వే
ఱొక్కగతిఁ దోఁచుచున్నవి, మిక్కిలి నూహింపుఁ డానిమిత్తము మీరల్.

క కొమ్మ గడుఁ జిక్కుచున్నది, నెమ్మొగమునఁ బాండిమంబు నిబ్బర మయ్యెన్
నెమ్మదిలోనివిచారము, ముమ్మర మివి మన్మథకృతములు గావలయున్ 202

మ. మన మొక్కొక్కతెఱఁగన్ సమస్తగుణసంపన్నుం గళాపూర్ణు శో
భనరూపుం వినుతింప కుంటి మది యిప్పాటన్ సఖున్ నొంచె దు
ర్జనచూడామణి కాముఁ డిట్టిదొమరుం బ్రాయంపుఁబూఁబోండ్ల నొ
క్కనిమిత్తం బిసుమంతఁ గల్గినఁ గడుం గాఱించు దుర్వారతన్. 221

క. కావున నిపు డీభామిని, భావజుబారిఁ బడి మిగుల బడలుట నిజ మీ
భావంబును మఱపింపం, గావలయును వనవిహారకలనలచేతన్ 222

తే అని విచారించి యాచంచలాక్షిమదికి
వేడ్కఁ బుట్టించి తోడ్కొంచు వెలఁదు లేఁగి
రమితమకరందనిష్యందరమితముఖరి
తాళిసంతాన మైనయుద్యానమునకు 223

వ. అప్పు డయ్యుపవనంబునకుఁ దూఱ రాక కాఱుకొనుచుం జూపఱయిచ్చు మెచ్చు నచ్చెరువు హెచ్చుం బచ్చపట్టుబల్లాడదట్టీలలీలఁ జాల నెఱపుచు నొఱపుమిగులు మొగలిగములగుమురులనడుమఁ బొడవులుగ దీపించుతోఁపుగుడారంబుల చెలువు నలరించుచివురు టెలమావితండంబులును దండతండంబులై మెండుకొన నొదవుమదనునం బెనురొదలు పొదలమెదలుకొదమతుమ్మెదలపదువు లినుపసరిపెణులపెనుపునఁ బనుపఱచుచుఁ గనుపట్టి దట్టం బగుచిగురుజొంపపుఁగెంపుసొంపుసిందూరంపుఁగెందూళిచందంబు నందపఱుప నుపరిభాగజాగరూకపల్లవప్రసూనదళపటలశబలిమవిలసనంబు లలితకుసుమదమతల్లికలయుల్లాసంబు వెల్లిగొలుప వెలుతురు లేనిపూఁదేనెసోనవాన ధారాప్రకారంబునం దోరం బగుచుఁ దనరారుమారుతప్రచారంబుల నప్పటప్పటికి నుప్పతిల్లుపుప్పొడులకేళిధూళిపాళికలపోలిక నేలికొనంగ నేనికబూఁదియలు పూని కానిపించుచున్న పొన్నలును నవిరళదళకిసలయవిలసితలతావితానంబులు మరకతకురువిందనిచయఖచితంబు లగుసగతులపగిదిఁ జూపట్ట సమకట్టుజల్లులమొల్లమి నుల్లసిల్లుచు నిరుగడలఁ బ్రేలునిడుసోగపూవుగెలలు పొలుపొంద నగ్రభాగపల్లవంబు లింద్రగోపంబుటుల్లారులయోజ రాజిల్లఁ దేజీలపోలిక భాసిల్లు వాసంతికాకుడుంగంబులును గడు దళంబుగఁ బొదిగియొదుగం గలభంగులఁ జెంగలించుచు నమరుతమలపాకుఁదీఁగెయల్లికలమీఁద మించివెల్లితలచుట్టుఁగట్టడలు నెట్టుకొలుపుతోలుంబట్టలపాదుగుళ్లపైఁ గ్రొమ్మడుగు నెఱిబిఱుసుచుంగులనిక్కుటెక్కును మిక్కిలిం గడలుకొలుపుచున్న యరవిరిచిగురుమొగిలియాకులతోడ వీరభటులజోకలు జోకపఱచుచు లేఁబోఁకమ్రాఁకులును వివిధజనకోలాహలంబులకరణిఁ బరిడవిల్లుశుకపికశారికానికరకలకలంబులును గలిగి విరహిసముదయంబుపైఁ గదలిన కుసుమకోదండుదండువిడునుంబోలె నాలోకనీయం బగుచుండ నందు నిందువదనలు మందగమనస్వభావంబు నతకరించుకుతుకరయంబునకుఁ బ్రతికూ

లంబు లగుచుం బిగువుఁబాలిండ్లవ్రేఁగునకుం బిఱుఁదులగరిమయుఁ దరము గాక
కర మలయం జేయుచుండ నొండొరులం గడచుచు నుద్దవిడి నడచుచుఁ గూడ
మికిం గేలిచేయుచుఁ గ్రొవ్విరులు మించి కోయుచుఁ గమ్మగొజ్జంగులకుం జేరుచుఁ
గన్నెగేదంగులకుం బోరుచుఁ బొన్నలకు మూఁగుచు బొండుమల్లెలకు నేఁగుచు
సంపెంగలకు డాయుచు జాతికుడుంగంబుల రోయుచు మల్లెలకు నిగుడుచు మరు
వంబునకు మగుడుచుఁ గురువేరు గొల్లలాడుచు గంధంబులకు మల్లాడుచుఁ బొగ
డలకు జరుగుచుఁ బోఁకపాళికలకుఁ దిరుగుచుఁ దిలకంబులకుం జనుచు దిరిసెన
పున్నలు గైకొనుచు నవమల్లికలఁ గ్రీడించుచు నారంగంబులఁ గ్రేడించుచుఁ
గలిగొట్లకుఁ దత్తరిల్లుచుఁ గంకేళిమంజరులకు రంజిల్లుచుఁ గ్రొమ్మావిసీడ లాశ్ర
యించుచుఁ గురువిందకందిరుల విశ్రమించుచు నీరంబులఁ దూఱుచు నెందేనియుం
బాఱుచుఁ బూఁదేనియలఁ దోఁగుచుఁ బొదరిండ్ల డాఁగుచుఁ గనిన నవ్వుచుఁ గమ్మ
విరులు రువ్వుచు దీఁగెయుయ్యేలల నాడుచుఁ దియ్యవిలుకానిం బాడుచుఁ బరా
గంబులు రాల్చుచుం బయ్యెదలు విదల్చుచు నందనిపూఁగొమ్మలకు నిక్కుచు
నలఁతిమ్రాను లెక్కుచుఁ గెంజిగుళ్లకుం బదరుచుఁ గెరలు తేంట్లకు బెదరుచుఁ
గోకిలస్వరంబు లాలించుచు గోరువంక లాలోకించుచుఁ జిలుకలకుం బలుకు లంది
చ్చుచుఁ జిన్నిరాయంచలనడలు మెచ్చుచుఁ బూబంతుల వేట్లాడుచుఁ బొసఁగ
నుద్దులు గూడుచు గెలిచి పోనీక పట్టుచుఁ గేకిసలు గొట్టుచు నొకరొకరిఁ జీఱుచు
నుబ్బునం గేరుచు నిబ్బరంపుఁదమిని దమకుఁ దమకంబు గమకంబు హెచ్చింప
నింపు మీఱువిహారంబులచేత నడరుబడలికలం బొడము వెడవెడఁ జిఱుచెమట
తడియొడళ్లం గడుఁ బ్రబలి గుబులుకొను మృగమదఘనసారగంధసారకాశ్మీర
విలేపనపరిమళంబులు పరిమిళితదిగంతంబు లగుచు నంతటం జోడు ముట్టసహజ
కృశత్వంబునకుం దోడు క్రీడలయలంత నెంతయు ఘనం బైన బడుగుఁదనంబునం
దడఁబడుచు వడవడ వడంకులు గుడుసునడుములం దడబాటువలన సడలఁ
బాఱునిలువుతావులం జిక్కం జెక్కుకొనుతఱిఁ బొక్కిళ్లం బ్రవేశించి సము
దంచితకురువిందకందళసందర్భసంగతాంగుళీయక ప్రచురరుచినిచయకవచితకర
తలరంగంబు లడుగుల నిర్గమింప నినుమడించెనో యనఁగ నతిమాత్రసంచారసం
క్షుభితంబు లగుచుఁ జరణతలంబు లత్యంతరక్తిమ యుట్టిపడుచుండ నిట్టట్టు
పైఁటచెఱఁగున విసరుకొన నెసఁగు కరకంకణమణిఝణత్కారంబులకు నులుకు
కరణిఁ దఱచు టూర్పుల పెంపున నుత్కంపమానంబు లగుచుఁ జన్నొందుజక్క
వకవల కెలంకులఁ జొక్కపుఁజెక్కులకదలికలు ముదలకింపుచు నిగుడునిగనిగల
తరగలయందంబు సందిదండలతళుకులకుఁ జెలికారంబు నెఱప నలయిక సోల
యికల నొకవింతయొయ్యారంబు చూపుచూపులపసకుం జూపోపక యేపఱిన
లీలం జాల వసివాళ్లువాడిన క్రీడావతంసితకర్ణనీలోత్పలదళంబులు నిజప్రతిబింబ

కపటపరిదృశ్యమానసోదరాలింగనలోలుపంబులువోలెఁ జెక్కిళ్ల మిక్కిలి నంటు కొనుచుండ నొసల నసలుకొనుకమ్మకస్తూరియుమ్మలిం బడి కదలమెదలలేని నీలాలకజాలంబుల నిజబాలకశంకం జేసి వెడలఁ దివియ సందడించుచుందంబున నందంద క్రిందుకొనియెడునిశ్వాసవాసనాసమాకృష్టచంచరీకసంచయంబులకు నుదరి యదలించుమృదులంపుఁగలికిపలుకులు దమనిసువులకొసరు టలుంగుల చవి కొసరక ముసురుకొనుపసని రాచిలుకగములం బొలంగం దోలుకేలు కెం జిగురాకులకు మూఁక లై కవియుకోకిలంబులచేత నాకులంబు లగుచు మైదీఁగె బాగుల వసంతాగమశ్రీవిభూషితవనదేవతావిలాసవిశేషంబు నభినయింప నాత్మ సాదృశ్యసంభావనాగర్వంబు వెల్లునం బ్రుల్లిమల్లడపుకిల్లరితేఁటితండంబుల కండ క్రొవ్వు స్థైరింప వానిజీవికి లాక్రమించి తదనుసరణంబున దయ వొడమి కొంత మగుడ విడుచువడువు గనంబడఁగ నెడనెడం గులుకునడబడిబడిం దొరఁ గువిరిగముల నమరెడియరవీడుకొప్పులయొప్పిదంబు చెప్ప నలవి గాక యతిశ యిల్లఁ జెదరినసింగారంబులును జిగురుంగొనలచేరులును నంటినపరాగంబులును నకరులతోడిపాపటలును వాడు దేఱెడినెమ్మోములును వడఁకెడుగులుకుటలుం గులునుం గలిగి యపూర్వవిభ్రమంబున సొంపుమీఱుచుం దదనంతరంబ 224

క్రౌంచపదవృత్తము.—
చంచలవీచీసంచయలీలాసలలితతరళితజలరుహపాళీ
సంచితహస్తోదంచితభంగీజనితమదనమదసరణిగుణవ్యా
ఖ్యాంచితగోష్ఠీసంచరణప్రత్యయసముచితహళహళికలతో రా
యంచలు మ్రోయం గొంచలు సూయన్ వ్యవహితపరరవ మయినకొలంకున్

ఉ. చేరఁగఁ బోయి రంగనలు చెల్వపుమోములసోయగంబు త
ద్వారిజలక్ష్మిఁ గేరఁగ నవారితవారితరంగరంగలీ
లారతహంససారసకులస్థలదారవసారవంచనా
పారగనూపురాదిబహుభవ్యవిభూషణఘోష మొప్పఁగన్. 226

ఉ. అంతట నంతరంగముల నంబువిహారకుతూహలంబు ల
త్యంతము మీఱ మెట్లు డిగి రామగువల్ మునికొంగు లూరుగా
ధ్వాంతరసీమఁ బట్టుచు జలాశయలక్ష్మిపయిన్ నఖచ్ఛటా
కాంతులచేఁ బదాబ్జములు కప్పుధూళివసంత మాడఁగన్. 227

సీ. అలఁతిగాడ్పులచేతఁ దొలఁగుపయ్యెదకడ లిరువంకలను జిక్కనిఱికికొనుచుఁ
దరగల నిట్టట్టు దరలుమూఁగొంగులు తిరుగ జంఘలను సంధించుకొనుచు
మునుపుగాఁ జొచ్చినవనితలు చల్లెడియుదకంబునకుఁ జేతు లొడ్డుకొనుచు
నెడనెడ మట్టించి పదుమీఱలబెళుకుల కులికివా టొదవంగ నొసరిలుచుఁ

తే. దొగలమఱుఁగుననుండి బిట్టెగయువిహగ
కులమురవళిక బెదరుచూపులు దలిర్పఁ
దమ్మికొలను ప్రవేశించుతలిరుఁబోండ్ల
విలసనము లెంత నెంతయు వింత లయ్యె 228

ఉ. ఆరమణీమణుల్ సరసి నట్లు ప్రవేశ మొనర్చువేళఁ ద
త్కారణవీచికాచలితకంజములన్ మధులోలభృంగముల్
వారక సారెకున్ నెగసి వ్రాలుచు నొప్పెఁ దదంబుదేవతల్
నేరుపుతోడ నాడుహరినీలపుటచ్చనగండ్లకై వడిన్ 229

లయగ్రాహి. నెమ్మొగములం గరతలమ్ములఁ గుచమ్ములఁ గచమ్ములను జూడ్కి నయ
నమ్ములఁ బరాభూతమ్ములును బోలె విరితమ్ములను రక్తజలజమ్ములును గోక
మిథునమ్ములును శైవాలమ్ములును భృంగనిచయమ్ములును మీననికరమ్ములుఁ
గలంగెఁ జలజమ్ములుభజింపం, గొమ్మలపు డెంతయును సమ్మదకుతూహలభరమ్ముల
నొనర్చిరి కరమ్ము జలకేలిన్ 230

లయగ్రాహి. ఓల యనుచున్ వలదు గేలి యనుచుం బఱవఁ జాల వనుచుం గడుఁ
బిసాళి వనుచుం బ్రద్దాళిఁ గొని కొట్టుచును దోలి వడిఁ బట్టుచును మేలముల
దిట్టుచు గయాళితన మింకం, జాలు ననుచున్ బళిర గోల యనుచుంబగట
నేలయనుచున్ ముగుదబాల వనుచుం గ,య్యాల కెస వెట్టుచును వాళిఁ జల
పట్టుచు సుమాళములఁ గిట్టుచును బాలికలు వేడ్కన్ 231

కవిరాజవిరాజితము.—

గుభులుగుభుల్లనుఘోషణఁ దోయశకుంతతతుల్ గలగుండువడన్
క్షుభితఘనస్తనకుంభపరిచ్యుతకుంకుమచందనకుంతలసూ
నభరవిలాసమునన్ బహువర్ణము నవ్యసుగంధగుణంబు గొలం
కభినుతిభాజనమై భజియింపఁగ నంబువిహారిణులై పొసఁగన్. 232

మాలిని తడిసి తనువులన్ భేదంబు గాన్పింప కుండం
గడు నడఁగినచేలల్ గల్మి స్రుక్కళ్లపట్టె
ర్పడఁ దెలుప ఘనాంభోభారతం గుంతలంబుల్
మడమలపయి వ్రేలన్ మత్తమాతంగయానల్. 233

వ. కాసారంబు వెలువడి నవీనవస్త్రాభరణగంధమాల్యంబుల నలంకృత లైరి మధు
రలాలసయుం గాంతునిమీఁదిపరాకునఁ జెలికత్తియలబలిమిని వనక్రీడాదు
లెట్టకేలకు నిట్టట్టు సలుపుచుండె. 234

ఉ. వర్ణనపాత్రచిత్రగుణవైభవశోభితుఁ డత్తఱిం గళా
పూర్ణుఁడు డేగవేఁటతమిఁబూన్పున వచ్చి ముదంబునం దద

భ్యర్ణమహీం జరించు చోకపతీకిఁ బాఱినడేగఁ బిల్చుచుం
దూర్ణత నేఁగె నానిజవధూటియు బోటులు నున్న చోటికిన్ 235

వ అప్పుడు 236

ఉ. నిద్దపుఁజెక్కుటద్దముల నింపులుగాఁ బులకల్ జనింప న
మ్ముద్దియ బోటిమూఁపుపయి మోమరదోఁపఁగ నిల్పి యత్తఱిం
దద్దయుఁ బ్రేమఁ జూచె నిజనాథు నతండును దానిఁ జూచె నా
యిద్దఱిచూపులున్ నడుమ నించుక దార్కొని లజ్జఁ గ్రమ్మఁగన్ 237

చ. వనజదళాక్షిచూచినను వల్లభుచూపు లతండు చూచినన్
వనజదళాక్షిచూపులు ఘనత్రపచే వెనువెన్కకున్ వెసం
జనుచు నొకొళ్లొకళ్లకయి సారెకు వచ్చుచుఁ బొల్పుమీఱెఁ గ
న్గొన రతిపంచబాణులవినోదపుటుయ్యెలచేరులో యనన్ 238

చ. వినుకలిచేత మున్ మిగుల వింతలు గాఁగ విరాళిఁ గొన్న య
వ్వనజదళాక్షి యట్లు దనవల్లభురూపముఁ గన్నులారఁగా
గనుఁగొని యేమి చెప్పఁ గడుఁ గంతుశరాహతిఁ దాప మొందుచున్
మనమునఁ గుందె నప్పు డటు నాథునిఁ గౌఁగిటఁ జేర్ప లేమికిన్ 239

తే. అతఁడు మధురలాలసయందు నాత్మ దగిలి
మగిడి రా కలయింపఁగ మరలి మరలి
యొక్కొకనెపంబుతో దాని యొప్పిదంబుఁ
గనుఁగొనుచు నెట్టకేలకుఁ జనియెఁ దిరిగి. 240

వ అంత నక్కాంతయు నంతరంగంబునం గాంతుఁ జింతించుచు 241

ఉ. ఆమృదుపాదపద్మములు హస్తతలంబున నొత్తఁ గోరు నా
శ్రీమహనీయవక్షమునఁ జేర్పఁగఁ గోరుఁ గుచద్వయంబు నా
కోమలగండపాళికలఁ గూర్పఁగఁ గోరును గండపాలికల్
కామునిబారి కగ్గమయి కామిని తాలిమి చంచలింపఁగన్ 242

ఉ అప్పుడు తత్పయోజముఖి యాకృతిచందము బోటు లందఱుం
దప్పక చూచి యక్కట వృథావనఖేలల హాళి నించుకే
నిప్పుడుచుం దలంపము మృగేక్షణలార గణించి చూడుఁడా
యొప్పుడు నేవినోదములు నీచెలి కింపులు గా వొకింతయున్ 243

ఉ. ఈనళినాక్షిచింత హరియింత మొకింత పరాకు చేసియుం
బూనికతోడ వచ్చి మనపోకడ లే మని చెప్ప నాటలే
కాని నృపాత్మజం దలఁపఁ గానము దీనివిచార మేమియున్
మానుట లేద మిక్కిలి ఘనం బగుచున్నది గాని యెన్నఁగన్ 244

వ. అదియునుం గాక. 245

స్రగ్ధర. శైత్యానంపాతంవివాశ రాశ్రయణమధురవేషంబుతోఁ జూడ్కి వేడ్కం
బూనంగా నింతకుఁ మ్ముఁ పురుషమణి కళాపూర్ణుఁ డేతెంచెఁ బేర్మిం
దా నిచ్చోటం జరించెం దరుణి యతని నత్యంతమ్ముఁ వింతప్రేమఁ
మే నుబ్బం జూచిన ట్లుండె నది మొదలు సుండీ కడుం దాప మొందెన్ 246

ఉ. కావున నీవసంతమధుగర్వితకోకిలకీరశారికా
రావముఁ దేటిపిండురవ్రరావము మెల్లనిచల్ల గాడ్పు పూఁ
దావులసొంపుఁ గెంజిగురుతండము లేఁబొదరిండ్లయొప్పులుఁ
భావజుఁడమై మిగుల బాలికశాలిమిఁ గొల్లలాడెడిన్ 247

ఉ ఇట్టిది గానలేము మన మిందఱముం దరళాక్షికిఁ మదిం
బుట్టినపంచబాణువెఱపుల్ మఱపింపఁగఁ బూని వానికిం
బట్టపురాజధాని యనఁ బట్టగుతోఁటకుఁ దెచ్చు టొప్పునే
ఘుట్టకుటీప్రభాత మనఁగా నిది వో పరికించి చూడఁగన్. 248

క అనునంతట నయ్యంగన, యనయముఁ బ్రబల మగునట్టియంగజతాపం
బున నుస్సు రస్సు రనుచుం, గనుఱెప్పలు దేల వైచి కడు సొలయుటయున్.

మణిగణనికరము.—

పడఁతులు చిడిముడి పడియెడు మదితో, నడుగులు తడఁబడ నడ రెడునడుపుం
గడఁకల నడుములు గడగడవడఁకం, బడిబడిఁ బొడమఁగ బడలికఁ జెమటల్.

సీ విరిదమ్మితావులు వెదచల్లుకొలనిచెంగటఁ గమ్మపన్నీటికాలువలును
గడు నివతాళింమకప్రంపుటరఁటుల యిరవులఁ బూవుఁజప్పరముఁ బన్ని
పట్టి వ్రేళ్లను దడి గట్టి శ్రీగంధంపు టసలున మెత్తి తదంతరమునఁ
గర్పూరవేదికఁ గావించి చల్లని చెంగల్వరేకుల సెజ్జ దీర్చి

తే చిలుకు తేనియతోడి కొజ్జెంగపూవుఁ
దలగడ యమర్చి యందు నా చెలువ నునిచి
జగతిఁ గలసర్వశైత్యోపచారవిధులు
సలిపి రందును గడఁ గాన కలసి రంత. 251

ఉ అప్పువుఁబోండ్లు వెండియుఁ బ్రయత్నముతోఁ బలుమారు వీనులం
గప్పుర మూఁది పూవిసనకఱ్ఱలు కొజ్జెఁగనీట మాటికిం
దొప్పఁగఁ దోఁచి వీచుచుఁ జనుంగవపై నరకాళ్లఁ బాణులఁ
లప్పలు గాఁగఁ జందన మలందుచుఁ గొందల మంది రందఱున్. 252

వ. అంత. 253

క. విరులుఁ జిగుళ్లును జొరువుగ, సిరిగందపుటస లొకింత చిలచిల మని వే
గిరము పఱువట్లు గొనఁ గడుఁ, బొరలెడితరలాక్షితాపముం గని కలఁకన్. 254

తే. చతుర యగునట్టిబోటి యాసతిని జేరి, చలువచెంగావిపయ్యెద చక్కఁ గప్పి

నేత్రయుగళంబుమీఁదఁ బన్నీటిచేతఁ, దుడిచి చెదరినకురులు దిద్దుచును బలికె.

క. ఎక్కడ మే నంటినఁ గే, ల్వొక్కెడునం తగుచుఁ గళలు వొదలెడుభారం
బెక్కువు శైత్యక్రియలో, యక్కఁ యిఁకం బోదుకోర్కె యడఁచిన నెపుడున్.

తే. ఇంతి సిగ్గు గదా యని యింతదాఁక, దలఁపు డాఁచి లోలో గుమూరిలఁగ వచ్చు
నదియుఁ గాకేను లాఁతినే యకట నీకు, రమణి నాపట్టునను దాఁపురంబు వలదు.

క. ప్రాణములకుఁ బ్రాణం బగు, ప్రాణసఖికిఁ జెప్పరానిపనులుం గలవే
యేణాక్షి కలిగె నేనిం, బ్రాణసఖియు నుసులు నొక్కపాటియ కావే. 258

మ. అనినన్ మిక్కిలి సాహసంబున నభీష్టార్థంబు చెప్పన్ మనం
బున నుంకించుచు లజ్జచే నుడుగుచుం బూఁబోఁడి యొక్కింతసే
పు నితాంతాకుల యయ్యె సంతటను దాఁ బోనీక యాబోటియుం
దనపై నానలు పెట్టి పెట్టి యడిగెన్ యత్నంబు సంధిల్లఁగన్. 259

క. ఇమ్మెయి నిర్బంధించుచు, నమ్ముద్దియ యడుగ నృపవరాత్మజ యనుమా
న మ్మొక్కభంగి నుడువుచు, నెమ్మది నూల్కొల్పి పలికె నిజసఖితోడన్. 260

ఉ. ఓహరిణాక్షి నీకు నిఁక నుల్లము దాఁపఁగ నేటికిన్ జగ
న్మోహనమూర్తితోడ నిట మున్నొకనాఁటినిశన్ విలాసప
న్నాహము మీఱ మన్విభుఁడు నాకలలోపల వచ్చి తేర్చెఁ గా
మాహవకేళి నద్భుతసుఖైకమయం బది యేమి చెప్పుదున్. 261

క. అనుచుఁ దదుత్సవలీలలు, మనసునఁ బాఱుటయు వివశమతిగ్రమై మోద్భం
గనుఁగవతో నొక్కించుక, వనిత నిలిచి ఘర్మపులకవతిరై యంతన్. 262

వ. ఆకూర్మినెచ్చెలిం గటాక్షించి. 263

క. చెప్పెడి దేమె లతాంగీ, యప్పురుషోత్తముఁడు నన్ను నట్లు రసాబ్ధిం
దెప్పలఁ దేలిచి నినుఁ విడ, నెప్పుడు నని యూరడించి యొందె నరిగెన్ 264

ఆ. అదియుఁ గాక యాధరాధీశుఁ డింతకు, మున్ను మనసమీపమునకు దనదు
డేగఁ బిలిచికొనుచు ఠీవితో రాఁడె యా, యొప్పుమిగులఁ దాల్మి నుదురఁదోలె.

క. అది మొదలు వదల కొదవెడు, మదనదశావశత వివశమతి నైతి నిఁకన్
ముదితా చలువలు గిలువలు, మదికి నసహ్యంబు లతనిమన్నన దక్కన్. 266

క. కటకట మీ రవివేకత, నటు నిటు శైత్యోపచార మని యేటికి ని
చ్చటఁ దడసెద రిఁక వెన్నెల, మిటమిటఁ గాయంగ మేను మిగుల నెఱియదే.

ఆ. కొఱవి చేతఁ బట్టుకొని చంద్రుఁ డనె వచ్చె, గ్రీష్మసమయభానురీతి మెఱయఁ
దనకు నేల యమృతధామాఖ్య గోముఖ, వ్యాఘ్ర మనఁగ నిట్టివాఁడె సుమ్ము.

క. చిలుకచదు వనుట చదివిన, ములుచను దృష్టాంత మట్ట మూఢపుదుర్జా
తులచిలుక తేలిచిన దయ, గలదే మది బెదర వదరుఁ గాక నిజేచ్ఛన్ 269

క. కోకిలములఁ దెలిసినఁ బలు, గాకులపోడిఁ బోదలునట్టికష్టపుఁబులుఁగుల్
నాకు నసహ్యము లని యోహో కూఁతలు మానఁ గలవె యవి ప్రార్థనలన్. 270

ఉ. కావునఁ జంద్రు గింద్రుఁ జిలుకం గిలుకం బికముం గికంబు నన్
గావు మటంచు వేఁడకుఁడు నా బ్రతు కీరిపుజాతికిం బ్రియం
బే వివరింప మీకుఁ బలెఁ బెంచినవారికిఁ ముద్దుగాక పె
న్పావురుఁబిల్లికిం గలుగు నా మొగమాట యొకింత చిల్కపైన్. 271

తే. వేయు నేటికి శీఘ్రంబ విభునిపొందు, సంఘటింపఁగఁ గలవేని జలజవదన
యాస నొక్కింత ప్రాణంబు లాఁపవచ్చు, నన్యథాచింత లెల్ల నిరర్థకములు. 272

చ. అన విని పల్కె నీవిభుసమాగమ మెంతయు శీఘ్రవృత్తి నో
వనజదళాయతేక్షణ యవశ్యము గల్గుట కేను బూఁట నా
కు నవల మాఱుమాట యవికుంఠితలీలఁ దనర్చు నాదరై
కనిరతుదీనవత్సలత గావున నెమ్మది నమ్ము మెంతయున్ 273

క. అని పలికెను చెలిపలుకులు, దన కమృతమువోలె హృదయతాపము నడఁపన్
వనజాక్షి నేద దేఱుచుఁ, జనియెన్ నిజభవనమునకు సఖులుం దానున్ 274

ఉ. లోలకవిలోచనాహృదయలుంఠనశూరతనూవిలాస నం
ద్యాలపురీనివాస సతతాత్మవికాస నృసింహమేదినీ
పాలుప్రపౌత్త్ర నారవిభుపౌత్త్ర నృసింహునిపుత్త్ర సర్వధ
ర్మాలయనిత్యవైభవమహత్తమ కృష్ణనృపాలసత్తమా 275

క. సంగీతాదికళారస, రంగస్నానస మహాతురంగమమదమా
తంగారోహణచతురిమ, సంగతవనితామనోజ సమధికతేజా 276

తరల —
కురు కరూశ విదేహ కోసల కుంత లాంగ కళింగ బ
ర్బర పుళిందక మత్స్య మాళవ పాండ్య కేరళ చోళ ఘూ
ర్జర శకాదిసమస్తదేశధరాతలేశసభానిరం
తరవిభాసురకీర్తినర్తన ధర్మనిర్మలవర్తనా 277

గద్యము ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య
తనూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతంబైన కళాపూర్ణోదయంబను
మహాకావ్యంబునందు షష్ఠాశ్వాసము.

—◆—

శ్రీరస్తు

# కళాపూర్ణోదయము.

## సప్తమాశ్వాసము.



రమణీయసద్గుణక
థారంజితలోకహృదయ తతనిత్యదయా
సూరిజనారాధనసము
దారస్ఫూర్తినయ కొండమాంబాతనయా. 1

వ. అవధరింపుము. 2

ఉ. కర్ణరసాయనోల్లసితకమ్రయశోమహనీయుఁ డాకళా
పూర్ణుఁడు నట్లు కేళివనభూమిఁ గనుంగొను టాది గాఁగ నా
పూర్ణసుధాంశుబింబముఖిపొల్పు మనంబున నిల్పి తద్గుణో
దీర్ణలతాంతసాయకవిదీర్ణమనోధృతియై యజస్రమున్ 3

క. తలపోయుచుఁ దనతలఁ పా, యెలనాగం బాయ కునికి నితరవిచారం
బులు విడిచి తాపముఁ గడు, నలఁగుచు నేకాంతగృహమునఁ వర్తిలుచున్.

ఆ. తనకు నర్మసచివుఁడును దిథివారతారాదిశంసకుండు నైనయట్టి
యొక్కవృద్ధవిప్రు నొకనాఁడు పిలిపించి, కొంతతడవు నర్మగోష్ఠి నడపి 5

తే. అనుఁగుఁజెలికాఁడ యొకటి ని న్నడిగి తెలియ
వలయు నని యుండుదును నీవు వచ్చియున్న
యప్పు డది యేమి యడిగెద ననుచు విడుతు
నడుగకుండినఁ బో దింక ననుచుఁ బలికె. 6

చ. మననగరంబుతూర్పుకడ మంజులరత్నవినూత్నకాంతితో
ననయము నొప్పునట్టివి మదాశయునుప్పరిగల్ గదా తదీ
యనవసువర్ణసాలముల కవ్వల నున్నది నిత్యసాంద్రనూ
తనకుసుమప్రవాళలలితం బగు కేళివనం బెఱుంగుదే. 7

క. ఇటుము న్నొకనాఁడే న, చ్చటి కరిగితి వేఁటడేగ చనినఁ బిలుచుచుం
గుటిలాలక నొకతెను ముం,దటఁ గాంచితి నందుఁ జెలులుఁ దాను జరింపన్. 8

ఉ. ఆలలితాంగిరూపరస యారసి చూడఁగ నెన్నియాత్మలుం
జాలవు దానిసర్వగుణసంపద లెన్నఁగ నెన్నిజిహ్వలుం
జాలవు తద్విలోకనరసస్థితిఁ జొక్కఁగ నెన్నికన్నులుం
జాలవు వేయు నేల యది చక్కఁదనంబులరాశి భూసురా 9

క. ఎక్కడియుపమాకల్పన, లెక్కడియత్యుక్తిరచన లెక్కడిమతినే
ర్పెక్కడివర్ణన లెక్కడి, వెక్కడివాఙ్మతుల కంద వింతి బెడంగుల్ 10

సీ. భువనంబులం దెల్ల మివుల నెక్కుడుగ నీ యిల యేమిపుణ్యంబు సలిపెనొక్కొ
యిలలోనఁ గరము మిక్కిలిగ జంబూద్వీప మేమిభాగ్యంబు వహించెనొక్కొ
తనరఁ జంబూద్వీపమునను భారతవర్ష మేసుకృతంబు ముద్ర చేసెనొక్కొ
ప్రఖ్యాతిఁగాఁగ భారతవర్షమున నంగదేశ మేతపము సాధించెనొక్కొ

తే. అంగదేశంబునందు నేయధికనియతిఁ
గ్రముకకంరోత్తగపురంబుఁ గాంచెనొక్కొ
తద్వధూపాదవిన్యాసధన్య మైన
యట్టియాపూవుఁదోఁటచే నతిశయిలఁగ 11

చ. అపగతధైర్యుఁ జేసె నను నత్తఱి నాశుకవాణి వేణి చొ
క్కపుఁబస కాముబల్కిరుసుకత్తియుఁబోలె నరాళపార్శ్వ మై
యుపరికృతప్రసూనరచనోజ్జ్వలతావిభవంబుచేత దం
తపుఁబిడి కైవడిన్ మొదలు తద్దయు నింపు జనింపఁ జేయఁగన్ 12

ఉ. ఆకమనీయవేణిభర మాకురు లాబొమతీరు సోయగం
బాకనుదమ్ము లామృదులహాసకపోలము లాముఖాంబుజం
బాకుచకుంభజృంభణసమగ్రత యాకృశమధ్య మాసల
జ్జాకుతుకావలోకముపసల్ మదిఁ బాయవు నాకు నెప్పుడున్ 13

ఆ ఇంక నీకు డాఁప నేల యాకాంత గ, న్గొనుట యాది గాఁగ గినిసి కినిసి
పంచబాణుఁ డిపుడు ప్రాణంబులకుఁ దెగి,నన్ను మిగుల నొంచుచున్నవాఁడు

ఉ ఆనలినాక్షి కన్నెగతి నెప్పుడు దోఁచె మదీయదృష్టికిన్
బాని తెఱంగు నీ వెఱిఁగినన్ వినిపింపు మెఱుంగ కున్న నీ
చే నయిన ట్లొకం దెలిసి చెప్పు మనన్ మరుబారిఁ బడ్డవాఁ
డీనరనాథుఁ డన్యరస మే నొనరించెద నన్ తలంపుతోన్. 15

వ. నవ్వుచు నావిప్రుం డిట్లనియె. 16

తే. ఇప్పు డాయమ్మ కన్నె గానిమ్ము గాక,మానని మ్మింత నిన్నేఁచుమాట వింటిఁ
జల్ల నయ్యె నాయాత్మ యాతల్లి యేల,వలయుఁ బదివేలు రాజ్యము ల్వసుమతీశ.

వ. ఇంత సంతసిల్లుచు నేల దీవించెద వంటేని. 18

సీ. ఓమన్యథా యంచునోరయువిద్వాంసులగోష్ఠి కెన్నఁడు గడు గుఱుతు లేదు
పౌరాణికులు చేరి పచరించుశుష్కవాచాలత విడువని వేళ మెపుడు
చెవులు చిందఱవోవఁ జెలఁగుకవీంద్రుల పోరంటి మే శని వారపుజడి
మఱి ప్రధానులకష్టమంతనా లెటు నన రానివి ప్రేగులలోనితీఁట
తే. యంత నంతగ్రపురంబున కరిగి తేని, నీదుకొలువు బుధప్రకాశోదయంబు
మమ్ము నున్నారె యనుమాటమాత్రకైన, నెడగలదె నీకుమాకొలువిపుడుగాక.

వ అదియునుం గాక. 20

సీ. స్థలశుద్ధిగా వసుంధరఁ ద్రవ్వి పూడ్చిరే కట్టించుచును బచ్చకప్పురమునఁ
గమ్మకన్నిటియగడ్తలు దీర్చిరే వెలిఁ బెక్కువరుసల విస్తరిలఁగ
బిసకాండములలోని పసి యార్చి నిలిపిరే మంచిగంధమ్మున మదురుగోడ
నవచంద్రకాంతమండపములోఁ బన్నిరే తలిరాకుదళ్ల చెంగలువచవికె
తే యొన్నఁ డైనను వొల్లి నీకిపుడువోలె, నీమదిన్ నిల్వసాగనే యామృగాక్షి
వెతఁబలుపఁ బట్టి దినమును వింతవింత, యైనయాపనుల్ చూడ మాకబ్బెఁ గాక.

క. అన నతఁ డన్నియు నయ్యోకన్, నిను నెఱుఁగమె యఱపులకును నేర్పరి వని నా
కును జెపు మే నడిగినయా, వనితకులస్థాననామవర్తన లనుడున్. 22

చ. నరవర తత్కలాదులు వినం దమకించెదు నాకుఁ దెల్పుమా
విరహపుశీతలక్రియలవెచ్చము సర్వము నాయముం గొనం
ద్వరపడులాగొ యట్లయినఁ దద్ధన మెత్తుద మూళ్ల మీఁదటన్
విరహపుఁబన్ను వేరిడి గణింపరు క్రొవ్వున నెవ్వనిం బ్రజల్ 23
తే ఇదియు నూరక యంటఁ గా కేల నీకు, మాకతల్ విన బంటు కిల్లాకువోలెఁ
దొత్తుకొడుకులువోలెఁ దోడ్తోదిగంత,భూమిపతులంపుచున్నారు కామితములు.

సీ. ఇవె చందనపుమ్రాఁకు లెన్నికఁ గొనరయా కేరళదేశభూదారుఁ డనిపెఁ
గట్టాణిముత్యాలపెట్టె లయ్యా యివి పాండ్యదేశపురాజు పనిచినాఁడు
పన్నీరుచెంబులబండ్లయా యివి కామరూపదేశాధీశ్వరుండు పనిచెఁ
జంద్రకాంతంపురాచలువలయ్యా యివి యతులముల్ కాశ్మీరుఁ డంపినాఁడు
తే. కప్పురపుగోనె లివె తురుష్కపునిసేవ, యనుజనులక్రందు వాకిట నద్భుతంబు
నీకు విరహార్తి యగు టన్యనృపుల కెల్ల, నఖిలరాజ్యలక్ష్మీవిరహార్తి యయ్యె. 25

చ. తెలియరు గాక యన్యజగతీతలనాథులు నీకు నింతశీ
తలవిధివెచ్చముల్ నడుపుద్రవ్యములోన సగంబు చాలు నీ
తలఁపునఁ బాయ కిట్లలఁచుతన్వికి నీవ్ వరియించులంచ మీఁ
గలిగిన నేల తోఁచు నది కారణ మీగతి నుండ వారికిన్. 26

క. అన నిట్టిపలువయఱపుల,కును గోటికిఁ బడగ యెత్తి గుఱి యగు పెద్దన్
నిను నమ్మరాదు గాక, ట్లొనరిచితే నిట్టిలంచ మొసఁగనె నీకున్. 27
వ. అని పలుకుజగతీవిభు మొగంబు దప్పక చూచి 28
తే. వట్టితానాలు దర్భలు పుట్టెఁ దుప్పు
గడ్డపాఱయు మ్రింగినగతిని బిఱ్ఱ
బిగిసి కూర్చుండుటలు లేక పెద్దతనము
గలదె యవి లేమి నను నీవు పలువ యంటి 29
ఉత్సాహ. అనుచు నలుక దెచ్చుకొనుచు నతఁడొకింతమేర వే
చనియె గంగిగోవువంటిసాదు బాఁపనిన్ నినుం
జనునె పలువ యనఁగ నింక సారెకనము పోక ర
మ్మనియె నృపతి యతఁడు దిరిగి యధిపుతోడ నిట్లనున్. 30
సీ. నీ విపు డనినట్లు మావచనము నమ్మఁగా రాదు నిజము మీ వార మగుట
రాజకుంజర 'యథా రాజా తథా ప్రజా' యనుపల్కు వృథ సేయ నర్హమగునె
యుత్తమామలు మీర లైతిరింతట నుండియని యల్లనాఁడు రూపానుభూతి
తద్విభుఁ బిలిచి యాస్థానంబునందు నీ వాడినమాట యేమయ్యెఁ జెపుమ
తే. యామఱపుదోస మిట్లని యాత్మఁ బొదివి
వీఁచుచున్నది యెట్లన్న వినుము దెలియ
దానఁ బరితప్త మయ్యె రూపానుభూతి
తనయ తదవాప్తి నీయాత్మ తాప మొందె. 31
చ. అనుటయు నెట్టెటూ తెలుపవయ్య మహాత్మక యేల సేసె ది
ట్లనయము నింపుసొం పెసఁగ నమ్మెయి నాపువుఁదోఁట నేను గ
న్గొనినది యామదాశయతనూభవయే యది యింతవేగిరం
బుననె మనోజ్ఞయౌవనముఁ బూనెనె యద్భుత మెన్న నాపుడున్. 32
ఆ. ఏమి దెలుపు మనియె దింకను సందేహ,మా నృపాల నీదుమనసు నింత
కొల్లలాడ సకలగుణరాశి మాయమ్మ, గాక వేఱొకర్తు గలదె జగతి. 33
సీ. వివిధనిత్యాచారవిధిఁ గొంతతడవు షాడ్గుణ్యాదినయచింతఁ గొంతతడవు
గరడిసాదనలవేడ్కలఁ గొంతతడ విభఘోటకారూఢిని గొంతతడవు
దేవవిప్రార్చనస్థితిఁ గొంతతడవు వేదాంతవిద్వద్గోష్ఠిఁ గొంతతడవు
స్నానభోజనవర్తనలఁ గొంతతడ వింపు గొలుపునాట్యనిరీక్షఁ గొంతతడవు
తే. మంత్రిసామంతముఖ్యసమస్తజనులు
గొలువఁ గొలు వుండుమహీశులఁ గొంతతడవు
చనఁగఁ గాలంబు నీవిన్క కనఘు తోఁప
దేమొ తగినజవ్వనమ యాయింతి కిపుడు. 34

ఉ ఆరయొలప్రాయమునఁ భవదుదంచితకీర్తియు గోల్లు రాచఁగాఁ
గాయజుఁ డాకెపై నలిగి కత్తులు నూఱుచు నుండునంతటన్
నీయవలోకనం బొదవ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్న వాఁ
డాయెలనాగబోంట్లు తెలియన్ వినిపింతురు నాకు నెంతయున్ 35

ఉ పాపపురాచజాతిగుణభంగు లెఱుంగుదు వేమి చెప్ప న
య్యో వెనుగోరముల్ త్రిభువనోత్తమరత్నము ముద్దుఁగూఁతుఁ బ్రా
ణాపద లంతఁ జెందుతఱి నైనః దలంపరు నీకుఁ దెల్ప నీ
వై పరికింప వంచు దురహంకృతి నాయమఁ గన్న దంపతుల్ 36

క. ఆకన్నియవెత చూడఁగ, లేక సఖీజనులె యుమ్మలించుచు నెప్పుడున్
నాకు వినిపింతు రొకతఱి, నీ కేఁ జెప్పుదునొ యనుచు నృపకులతిలకా 37

సీ ఏనును సముచితం బైనకాలము ప్రతీక్షించుచుండుదు నీదుచిత్తవృత్తిఁ
దెలియక యాసుద్ది తలపెట్ట వెఱతు రూపానుభూతికిని మదాశయునకు
మున్ను నీ వనుగ్రహించినమాట తెలఁపు నేసినఁ జాలు బొంక వీ వనుచుఁ దలఁతు
బ్రాహ్మణజాతిచాపలమును మఱియుఁ గొంకుదు నీవిరాళిభంగులు గణింతు

తే. నివి యితరమూలములలో యంచు నెంతు నిపుడు
పిలిచి యడుగఁ దదాఖ్యలే తెలుప నైతి
మనమదాశయుపుత్రియే యనుచు సులభ
తావగుణమున వదలువో యనుచు నీకు 38

ఆ తను కసాధ్య మైనఁ దమితోడఁ గాంక్షింతు, రారనాళమును ధరాధినాథ
తమకు సులభ మైన నమృతంబుఁ గైకొన, రెందుఁ బెరటిచెట్టు మందు గాదు.

క. ఇవి యితరులచొప్పులు గాని విశేషజ్ఞతఁ దనర్చు నీయందును గ
ల్గవ నిక్కువ మైనను నా, యవివేకము తెఱఁగు లిట్టి వవనీనాథా 40

తే అంత నాయింతి జాత్యాదు లడుగు టుడిగి
దానిఁ గూర్చిన నే లంచ మీఁనె నీకు
ననుచు నీవాడ మది కోర్కి యధిక మగుట
యరసి తెలిపితి నిపుడు తచ్చరిత మెల్ల 41

తే ఇంక సంబంధసాదృశ్య మెంచి చూడఁ, గొదవగలయది గాదు దిక్కులఁ బ్రసిద్ధ
మైనయది కార్తవీర్యార్జునాన్వయంబు, దిగ్విజయశాలి యందు నీతెఱవతండ్రి.

క తనమహిమ నాశ్రయతఱితి, యొసరుచుఁ జనఁ జూచి సుగ్రవాలుకులీనశయం
చు నుదాహరింతు రెఱుఁగుఁడె, యనుజుఁడు సుమ్మాతఁ డిమ్మదాశయుపతికిన్ 43

చ కడు నుతి కెక్కునట్టియధికంపుఁగులీనతచే నతండు న

ల్గడల జనాధిపుల్ దనకుఁ గన్యల నిచ్చెద మంచు నెందరే
బడిబడిఁ జెప్పి పంప నది పాటిగఁ బట్టక వారియాసుచే
నడపొడలేక పోయెనఁట యల్పము లయ్యెఁ గులాభిమానముల్. 44

క. జనివేళయందు సురభా,గ్యనిమిత్తము లగుచుఁ బెక్కుగ్రహము లునికి నా
తని కిడినారఁట సుగ్రహుఁ, డనుపే రాశాస్త్ర మేమి యయ్యెనో యెఱుఁగన్.

వ. అది యెట్టట్టు కాని మిప్పు డింతయు మధురలాలస యుభయకులశుద్ధి చెప్పెడు
ప్రకారం బింతియ యని పలికి యి ట్లనియె 46

క. అవనితామణి నిప్పుడు, జీవితముగా నిలిపి ప్రోవఁ జిత్తము గలదే
నోవసుధాధిప పూనుము, వేవేగం దద్వివాహవిధిమంగళమున్ 47

క. అని పంచాంగముపుస్తకమును విడిచి కడుం బ్రయత్నమునఁ దిథివారా
దినిరీక్ష చేసి వ్రేళ్లే, న్ని నిరూపించెఁ గ్రహాదినిఖిలబలంబున్. 48

వ. ఇట్లు నిరూపించి సంతసిల్లుచు దేవరసిద్ధసంకల్పత యేమి చెప్పుదు నెల్లియ మీ
యిరువురపేర నత్యుత్తమం బైనదివాలగ్నం బున్నయది వివాహోత్సవంబునకుం
దగిన సకల సామగ్రియు సార్వభౌమునకు నెప్పుడైనను గలిగి యునికి చెప్ప
వలద యిప్పురం బేప్రొద్దును విహితమంగళాలంకారంబ యని పలికి మఱియు
నతం డి ట్లనియె. 49

మహాస్రగ్ధర.—
ఫలముల్ హారిద్రపంకప్రమిళితమణిశోభల్ వహింపన్ గృహశ్రీ
గళసౌభాగ్యాభినీతిక్షమితపురముపైఁ గంఠముల్ మించి యొప్పం
బొలుచున్ నిత్యోత్సవద్వాస్స్ఫురితము లగు లేఁబోఁకమ్రాఁకుల్ కరం బిం
పొలయంగా దానఁ గాదే యొనరఁ గ్రముకకంఠోత్తరం బండ్రు దీనిన్. 50

శా. ఐనన్ దేవరపెండ్లికిం దగ వినూత్నాలంక్రియాసంపదం
బూనంగా వలదే పురం బిపుడు సొంపుల్ మీఱఁ జాటింపు స
న్మానం బొప్పఁగ మామయింటికిని గన్యారత్నయాచ్ఞార్థమ
న్యూనప్రజ్ఞులఁ బెద్దలం బనుపు మోయుర్వీశ ధర్మస్థితిన్ 51

చ. అనుటయు సంతసిల్లుచు ధరాధిపుఁ డవ్విధ మెల్ల సత్త్వదా
త్మని బిలిపించి తెల్పి తదమోఘనయానుగతిన్ నిజాగ్రభా
ర్య ననుమతింపఁ జేయఁ బ్రథమాగమముఖ్యులఁ బంపు నల్వురన్
జనపతిపూన్కి వారు దగు జాడను జెప్పిరి తద్వధూటికిన్. 52

వ. చెప్పి దీని కుత్తరం బెయ్యది చెప్పుమనుడు నప్పరమపతివ్రత వారితో నిట్లనియె

ఆ. చల్లఁదనముతోడ నెల్లబంధువులకుఁ, దత్తదుచితమధురతరగుణములఁ
జిత్తరంజనంబు చేయుట నభినవ, కౌముది యనుపేరు గలిగె నాకు. 54

తే. చంద్రకిరణభవాప్సరోజాతిఁ బుట్టి
యట్టివే రొంది వెలయునే నకట యిపుడు
తగ సతుల కెల్ల సామాన్యధర్మ మైన
పతిమనోనుకూలతకును బాయఁ దెరువె. 55

క. కావున నన్నేమడిగెద, రావసుధాధిపున కేది యభిమత మగియే
నావాంఛితంబు నిక్కువ, మీవృత్తాంతంబుఁ దెలుపుఁ డేర్పడ నచటన్. 56

వ. అని పలికి వీడ్కొలుపుటయు వారలు చని యావిధంబు భూవిభునకు విన్నవించి తదీయనిదేశంబున మదాశయునిగృహంబున కేఁగి యాకళాపూర్ణమహారాజునకుం గలిగినవివాహోద్యోగంబుఁ దెలిపి సుముహూర్తంబున సాక్షితాంబూలాదిసముచితశుభవర్తనంబులు నడపి రంత మంత్రిజనులు తద్వివాహోత్సవంబునకు నాయత్తపడఁ బురంబులోనం జాటించిన. 57

సీ. ఎక్కడఁ జూచిన నిండ్లపై బసిఁడికుండలు క్రొత్తమెఱుఁగిడి నిలుపువార
లేవంకఁ జూచిన హిమవారితో గంధసారంబు కలయంపిఁ జల్లువార
లెచ్చోటఁ జూచిన నెలమిగోడలఁ దట్టుపునుఁగుజవ్వాదియుఁ బూయువార
లేదిక్కుఁ జూచిన నింపుగా మణివేదికలు గమ్మకస్తురి నలుకువారు
తే. ప్రేమఁ గప్రంపుమ్రుగ్గులు పెట్టువారు
కలువడంబులు మేల్కట్లు గట్టువారు
పచ్చఁదోరణములు పొందుపఱుచువారు
నై రహోరాత్రసంభ్రమం బలర జనులు. 58

ఉ. పెండ్లి నృపాలునింట నని పేరఁటముల్ ప్రియ మొప్పఁ జెప్ప నిం
డ్లిండ్లకు శోభనాక్షతలు హేమపుఁబాత్రలఁ గొంచుఁ బెద్దపూఁ
బోండ్లు చరించి రాకులును బోఁకలుఁ గుంకుమపాళ్లు నూనెయుం
బండ్లును గొంచు వాద్యపుశుభధ్వనితోఁ దగువారు వెంటరాన్. 59

సీ. కర్పూరమృగమదగంధసారాదులు విరివిగాఁ బసిఁడికొప్పెరలఁ గలిపి
మల్లికాకుందచంపకజాతివకుళాదిపుష్పముల్ హారాళముగను గూర్చి
మంచివాసనల వాసించిన నెలవత్తి బాగాలు రాసులు పడఁగఁ బోసి
బంగారుచఱపలపస మించుతమలపాకులమావటాలు కొండలుగ వైచి
తే. తత్తదధికారపురుషు లత్యంతమోద
గరిమ నేవీథిఁ జూచినఁ గ్రందుకొనుచుఁ
బురములో గంధమాల్యతాంబూలముల న
శేషజనములఁ దనియంగఁ జేసి రపుడు 60

తే. అయిదువతనంబు సుతసమృద్ధియును గలుగు
సతులు శుభవేళ మంగళస్నానవిధులు

నడుపఁ దొడఁగిరి బహువాద్యనాద మెల్ల
దెసల నెఱపంగ మధురలాలసకు నంత. 61

ఉ. క్రొత్తగ నల్కెఁ గస్తురిని గోమలి యొక్కతె యొక్కవేదికన్
ముత్తెపుముగ్గు వెట్టె నొకముద్దియ తద్దయు వేడ్క మీఁదఁగాఁ
బుత్తడిపెండ్లిపీఁట యొకబోటి రయంబునఁ బెట్టె దానిపై
నుత్తరపుంజెఱఁగులుగ నొక్కతె గప్పె విశుద్ధవస్త్రమున్ 62

తే. పెద్దముత్తైదు వొక్కర్తు పెండ్లికూఁతుఁ
గాంత లిరువురు దూర్పుమొగంబు గాఁగఁ
బెండ్లిపీటపైఁ గూర్చుండఁ బెట్టి నేర్పు
నెరయ సంపెంగనూనె యంటిరి ముదమున. 63

క. ప్రేమమున సంభ్రమించుచుఁ, గామిను లంతటను బసుపు గలపినశుభగం
ధామలకముఁ బెట్టిరి మఱి, హైమఘటాంబువుల జలక మార్చిరి సతికిన్. 64

సీ. దడిమంపుఁజేలలఁ దడి యొత్తి పసుపుకొంగుల తెల్లపట్టుదువ్వలువ గట్టి
తలవెండ్రుకలఁ బావడల నద్ది యద్ది శీఘ్రమె తడియార్చి పుష్పములు ముడిచి
మలయజ మంగకంబులఁ బూసి ఘనవాసనాశేషముగ నది నలిచివైచి
పాలిండ్లఁ గుంకుమపత్రవల్లులు వ్రాసి కమ్మకస్తురితిలకంబు దీర్చి
తే. ముగుద తొంగలిఱెప్పల మొదల మిగుల, సన్నమై కనుపట్టఁ గజ్జల మమర్చి
లాక్షఁ బాదాంబుజంబు లలంకరించి, యామదాశయతనయకు నతివ లంత. 65

సీ. తలుకుఁబిల్లాండ్లు బిబ్బిలికాయలునుమట్టియలు వీరముద్దెలు నందియలును
మొలనూళ్లు నొడ్డాణములు నేవళంబుఁబుంజాలదండయు బన్నసరము మొగపుఁ
దీఁగయు వాణిముత్తెపుఁబేర్లు సందిదండలు సూడిగములు గౌడసరములును
గడియాలుఁబెక్కుఁజోకలయుంగరములు ముంగరయుఁగోలాటంపుఁగమ్మజోడు
తే. చెవులపూవులు బవిరలు చేరుచుక్క
కొప్పువలయును సవరించి రొప్పు మీఱ
భూషణములకుఁ దా నొక భూషణ మయి
పడఁతి యప్పు డొప్పెఁ గన్నులపండు వగుచు. 66

సీ. ఇట్లు కైసేసి యాయింతులు తజ్జనయిత్రిని బిల్చి నీపుత్త్రిసొబగు
లెస్సగాఁ జూడు మో లేమ మాచూపు పోకలాగు నీచూపు పోకలాగు నీవు
రూపానుభూతి నారూఢి కెక్కినదాన వెవ్వరు నీపాటి యెఱుఁగలేరు
రూపవిశేషంబు రూపింప ననుచు నా కొమ్మ నవ్వుచు నటు గొంత యొడఁగ
తే. నేఁగి తనకూఁతుసింగార మెల్లఁ బెక్కు
మాఱు లెగదిగఁ గ్రేఁగంటఁ బాఱఁ జూచి

యింతకంటెను గయిసేయ నెవ్వ రింక
నేర్తు రనుచును వారలనేర్పు మెచ్చె. 67

సీ. మెచ్చి యాచెలువంబు మిక్కిలి చూడ్కికి వెక్కసంబై తోఁప వెలఁగుపాటు
గరము లోలోనన కప్పిపుచ్చుచు దృష్టి దాఁకునో యనుచునుదల్లడిల్లి
పువ్వుదండలనెపంబునఁ గొంత యిదిమాటు పఱచెద నని ముద్దుపట్టియలుతఁ
దగునొక్కచెంగల్వదండ మున్నమరించి యదిగుబ్బచనుఁగవయందు మిగుల
తే. వింతగాఁగ నొకానొకవిలసనంబుఁ, జూప నయ్యింతిఁ గడుఁదాను జూడ వెఱచి
కడమపూదండ లెల్ల నొక్కటిగఁ బట్టి, బాల కపుడు సువాళించి పాఱవైచె

వ. అట్టిసమయంబునం గళాపూర్ణుండును వివాహంబునకుం గట్టాయతం బై ప్రథమాగమాదిభూదేవసముదయాశీర్వాదనాదంబులు వివిధపుణ్యాంగనాసంఘాతమంగళగీతగానస్వనంబులును, వందివైతాళికసూతమాగధస్తుతికోలాహలంబులును, సందర్శనసమయాపేక్షసామంతసేవాప్రబోధనాయాతవేత్రహస్తజనస్తోమవిస్తారితాలోకశబ్దంబులును, సర్వసర్వంసహాజనజనితజయజయశబ్దంబులును, శంఖకాహళభేరీపటహఝల్లరీపణవమర్దళతమ్మటప్రముఖనిఖిలవాద్య నిర్ఘోషంబులును మిక్కుటం బగుచు నొక్కమొగి నలుదిక్కులుఁ బిక్కటిల్ల మిక్కిలి యెక్కుడగువైభవంబున నగరు వెడలి శుభశోభనాభరణభరణాభిరామరూపంబున దీపించునౌపవాహ్యంబు నారోహణంబు చేసి భాసమానాసమాననానాదేశభూమీశభూషాసంఘర్షరేణుపటలంబును, గరటిఘటాకరతటోత్కటస్యందమానదానధారాప్రసారంబులును, సంకలితంబు లగుచుఁ గుంకుమపంకాలంకారవానీరనిర్వర్తితావిశేషసంవిధానంబునకుఁ బౌనరుక్త్యప్రసంగంబు నొసంగఁ గుసుమకిసలయవిసరవిరచితనీరంధ్రవందనమాలికాబృందంబు పందిరిచందంబు నందపఱచుచు [1]నందిరుప్రక్కలనరుణకిరణమండలిచండిమ బెండువడియుండుటం జేసి వీసరపోనిచలువ చెలువంద మకరందబిందుకందళసందోహంబులపొందునఁ జంద్రికాసౌందర్యధుర్యం బగుచు విస్తరిల్లుసమస్తపరివారతారహారప్రభావిభవంబునకు సముచితంబుగఁ బరిపూర్ణచంద్రమండలాయమానం బగుధవళాతపత్రంబు ధాత్రీజనంబులకు నేత్రోత్సవంబు గావింప నింపులగుచు మిగుల దిగంతరాళంబునఁ బ్రబలి గుబులుకొనుగంధసారగంధోపాయనంబులు పచరించి వెలయుచు మలయపవనుండును దండతండం బై మెండుకొని దశదిశలును గుసుమైకమయంబుల యనిపించుచు నుల్లసిల్లుమల్లికాకుందచంపకవకుళకురువకతిలకపున్నాగవనమాలికాశోకముఖ్యవిఖ్యాతవివిధసురభిప్రసూనమాలికలు కానుక లగుచుఁ బొసఁగ వసంతుండును మునుమున్నగాఁ గొలిచి చిత్తంబు వడసియునికిఁ దనకు నవలంబముగఁ గొలు వభిలషించుతలఁపుతోడఁ దోడుచూపెడుకొఱకుఁ జెఱకువిలుతుఁ డిరుగడలఁ బొఁజూదీర్చినశుకపికమధుకరప్రకరంబులగతి నతిశయిల్లు

1 నందికనిలుప.

చున్న యుభయోపాంతసంతతవితర్దికానిచయఖచితమరకత కురువిందరాజావర్త
హరినీలజాలంబులు నిజాలోకనాచరితంబులఁ జరితార్థంబు లగుచుండ నగణిత
వితానయవనికాది వివిధవిరచనోల్లసితపల్లవప్రసవతల్లజమ్లానిపరిహారార్థంబుగఁ
దగువిధంబున దీప్రభాగంబుల నిబంధించినమంచుఁదిత్తులతుంపర లతిసూక్ష్మంపు
వలిపెపయ్యెదలయొయ్యారంబున బాగుమీఱుచునికిభోగత్వరాయాససముచిత
వేషవిస్ఫురితపురలక్ష్మీవక్షోజసాక్షాత్కారసంతానంబునుంబోలెఁ బ్రతిగృహద్వా
రవేదికావిశేషవిన్యస్తపూర్ణకలశవిలసనానుభవం బెడతెగక పొలుపుమిగుల న
గురుధూపధూమస్తోమసంరంభదంభజృంభితాంభోవాహ సంభ్రమంబునకు సాఫ
ల్యంబు నాపాదించుప్రాసాదభాసురసువాసినీవారధారాయితలాజవర్షంబులసం
గడిసంగడిఁ గోలమెఱుంగుల తెఱంగున రంగుమీఱుబంగారుజలపోఁత బెత్తంబుల
నటన ఘటిల్లఁ గటికివారు సారెకు బరాబరి సేయుచు నేఁగుదేరఁ జారుతరచతురిమ
తురంగలీలావృత్తవర్తితశ్రవణభూషణవినిర్ముక్తముక్తావర్గనిర్గచ్ఛచ్ఛవిగుళుచ్ఛంబు
లచేత నినుమడి నుమ్మడి యగుచు రంజిల్లువింజామరలు మంజుహాసామృతసరో
వరాయమానగండస్థలసదేశంబులఁ గాశనీకాశంబులై ప్రకాశింప నాకాశమణి
ఘృణిమతల్లికలయుల్లాసంబు నొల్లక యటు వెనుక చేసి నాసాగ్రంబునందము కభి
ముఖంబున మగిడి నిలిచినపుండరీకంబునకుం బుష్పంధయబాంధవంబును మక
రందంబు మిసిమియుం బరాగంబు పసయు నసదృశంబుగా నొసంగుచు విశేషాధిక
తం బ్రకటించు ముకుటమహానీలహీరచామీకరమరీచివీచికలవైచిత్రి లోచనప
ర్వంబు నాచరింప సమీచీనసతతజయసుధాసేకంబున నాకులుఁ జిగుళ్లుఁ బూవులు
మవ్వంబు లగుచు నామూలచూడంబుగా నుప్పతిల్ల నొప్పుచున్న వియో యనం
గనత్ప్రతిమరంగదంగుళీయకకంకణాంగదఖచితగారుత్మతపద్మరాగమౌక్తికప్రభల
శబలిమబలిమి ప్రబలబలబాహుస్తంభములస్తంభజృంభణంబు నెఱప నపూర్వ
నిర్మలత్వయాచ్ఞాపేక్షనుంబోలె నక్షత్రమాలికలచేత బహిరుపాసితంబు లగుచు
హృద్యంబు ప్రకటీకరించిన ఖనీభూతకరుణారసరేఖభావంబున స్వభావనామసి
ద్ధవిశ్రాణితశోణమాణిక్యశలాకావిలోకనమోహనంబగుచు బాహాంతరంబునం
గరంబుఁ గనుపట్టుచుండ నొండొంటిఁ గదిసి నానావర్ణవిలసదవిరళప్రవాళజాలక
సూనసంపదలతోడిమతీఁగలు దడివడుపున బెడంగునడపెడువిచిత్రాంబరాభరణ
విభూషితమృదుశరీరంబులును దదగ్రభాగంబున శోభార్థంబుఁ దెరలినయరవింద
పంక్తియో యనంగ నియోగంబునం బొగడొందునగుమొగంబులును దదుపరి
క్రీడమానకలహంసవిభ్రమప్రాచుర్యసూచనాచాతురీప్రబలంబు లగుకబరీభరం
బులు గలిగి యొప్పారువారనారీజనశ్రేణీకటాక్షవీక్షణంబు లక్షుద్రసౌరభాతి
శయసమాకృష్యమాణరోలంబజాలంబులుంబోలె వదనాంబుజంబునఁ బరిభ్ర
మింప నదభ్రవిభ్రమభ్రాజివాజినర్తనవర్తనోచ్ఛలితతచ్చరణకటకనాదంబులకు

సహానువాదంబుగ నిజపాదమంజీరమాణిక్యలక్ష్మీకరపల్లవంబులు వినయవినమిత పరిసరచరకురుకరూశకోసలమగధమచ్ఛిల్లకమత్స్యవత్సాది రాజకుమారులచెక్కిళ్లనల్లనల్లన తాళంబు లొత్త నత్యంతంబు నింపొందుచు ముందటిభూభాగంబు నావరించుసముంచితరత్నమాపురపారిహార్యనిర్యాతనూతనప్రభాపటలపరంపరల చేత నడుగులకు మడుగు లొత్తుట దోఁప గభీరగమనంబుల నడచుగుడజీరకహరిద్రాదిశుభద్రవ్యపరిపూర్ణభాజనరాజమానహస్తప్రశస్తపురంధ్రీలోకంబు లోకపావనత్వంబున విలోకనీయం బగుచు నొప్పు లోకాతిశాయివిభవాభిరాముండును రామణీయకవిశేషవిజితకాముండును గామనీయకాఖర్వసర్వగుణసంపదుద్దాముండు నగుచు నుచితగాంభీర్యంబున మదాశయునిగృహంబున కరిగెనతండు నఖండవైభవంబున దవుదవ్వులన యెదుర్కోలు చేసె నప్పు డొకించుక వడి యత్యంతసంభ్రమంబున. 69

క. చెలరేఁగి రెండువాయంబుల పేరంటాండ్రు చిత్తముల నెంతయు వె
డ్కలు మీఱఁ జల్లులాడిరి, తలఁకక యభినవశుభాక్షతవ్రాతములన్. 70

వ ఆసమయంబున 71

సీ కడువేగమునఁ బెండ్లికొడుకునెమ్మొగమున కరిగె నడ్డముపట్టఁ గురువిభుండు
హాయము కేళ్లురుకునో యని రెండుగడలందు వాగెఁ బట్టిరి మత్స్యవత్సపతులు
జతన యెచ్చరికయం చతిరయంబునఁ జేరి కైదండ యిచ్చెను జేదిభర్త
యశ్వాలోచనముల కాత్మవస్త్రము కొంగు మాటుగా నొనరించె మగధరాజు
తే. తమి నెదుర్కోలు సేయుమాతల్లి చెలుల
యక్షతలవాన సరకు సేయక చొరంగ
శత్రుశరవృష్టి గాదు రా సామియన్న
నవ్వెఁ గుఱ్ఱని నవ్వె నర్మసఖుఁడు. 72

ఉ. శ్రీలు దలిర్ప భూరమణశేఖరుఁ డిట్లు మదాశయుం డెదు
ర్కోలొనరించి తెచ్చి మణికోమలపీఠిక నుంచి కూర్మి యి
ల్లాలు పసిండిగిండిగొని యాదటఁ దోయము వోయఁగాఁ బద
క్షాళన మాచరించి వరుసన్ సలిపెన్ మధుపర్కముఖ్యముల్. 73

మ క్రమ మొప్పారఁగఁ బెండ్లిపెద్ద లిరువంకన్ వర్తిలంగాఁ బ్రగ
ల్భమనీషం బ్రథమాగముండు తమితో లగ్నాష్టకంబుల్ పఠిం
చి మనోజ్ఞం బగులగ్నవేళ శుభముల్ చేర్పించె శాస్త్రస్థితిన్
విమలశ్రీల మదాశయాత్మజకు మాణిస్తంభికిం బ్రేమతోన్. 74

క. మంగళసూత్రము గట్టెఁ గురంగాక్షికి నంతరంగరాజేంద్రుఁడు పు
ణ్యాంగనలు పెండ్లిపాటలు, మంగలికోళ్లమృదుగీతిమధురిమ నెనయన్. 75

సీ ఇరువంకఁ జెలులెత్తు లిడుచు నుబ్బింపంగఁ జిఱునవ్వులోఁ గొంతసిగ్గు వదలి

ఘనతరం బగుగుబ్బచనుదోయిమీఁది కెంతయు మిటారింప హస్తంబులెత్తి
కడుదీఁగెసాగుచు బడుగునెన్నడుము మిక్కిలిఁ గృశంబుగఁ దత్తఱిలుచు నిక్కి
ముత్తైదువలు దగ నెత్తుబంగరుపళ్లెములప్రాలు దోయిళ్ల ముంచి ముంచి
తే. ప్రియునిచే వేగిరము నొకింతయును మించ
నీక సాటికి నేటికి నిందువదన
పొలుపు మీఱంగఁ దలఁబ్రాలు పోయుకడఁక
చూపరులచూడ్కి కొకవింతసొబగొనర్చె. 76

ఉ. పావకుఁ డగ్రభాగమునఁ బ్రస్ఫుటకీలలఁ బర్వ లాజహో
మావసరోద్యతాంజలిఁ దదంగన శోభిలె నందుకోఁగ హ
స్తావళి యెత్తి యాడెడుగణాధిపుముద్దులు చూచువేడ్క నిం
పావహిలంగ మీఁదఁ జలితాంజలిఁ బట్టుభవానికైవడిన్. 77

చ. అలరుచు నాలతాంగి ప్రథమాగముపంపున లాజహోమ ము
జ్జ్వలశిఖయందు సల్పుచును జాలఁగ నొప్పె సమీరలోలకో
మలనవమాలికాతిలకమంజులపల్లవతల్లజోల్లస
ల్లలితరసాలకోపరిగళత్కుసుమావళి నొప్పుచాడ్పునన్. 78

మ. చెలికత్తెల్ ధ్రువదర్శనంబుకొఱకుం జేపుట్టి పల్కాఱు నె
త్తు లిడంగా మొగ మెత్తె నొయ్యనఁ దదస్తోకత్రపాభారముం
నెల దోడ్తోడన పైకిఁ బుచ్చుకొనుచున్కింబోలె వ్రీడావతీ
తిలకం బాసతి నమ్రభావముఁ గ్రమోత్తీర్ణంబుఁ గావించుచున్. 79

చ మిపులఁగ సూక్ష్మమై మినుకు మిన్కు మటంచుఁ బ్రకాశ మొందెడుం
ధ్రువుఁ గనుఁగొంటె యల్లదె యరుంధతిఁ జూచితె యంచుఁ దత్సమీ
పవిశదతారలం గుఱుతుఁ బల్కఱుఁ జెప్పుచు బోంట్లు తెల్పి తె
ల్పి వనితచేతఁ గంటి ననిపించిరి తత్పతి విన్చు రంజిలన్. 80

సీ. కలవంటకములు బూరెలుఁ దేనెతొలలు చాపట్లు మండెంగ లొబ్బట్లు వడలు
కుడుములు సుకియలుఁ గడియంపుటట్లు వెన్నప్పాలు పడియంబులప్పడాలుఁ
బొంగరంబులు సొజ్జె బూరెతాగులు సేవ లుక్కెర లరిసెలుఁ జక్కిలములు
కర్జూరగోస్తనీకదళికాసహకారఫలములు కొబ్బరి పనసతొలలు
తే. తేనియలు జున్ను మీఁగడ లానవాలు
పానకములు రసావళ్లు పచ్చడులు ప
హాజ్య మొలుపుఁబప్పులు కూర లనుపమాన్న
మపుడు ప్రజ నెల్లఁ దనియించె నహరహంబు 81

వ అది యట్లుండె నంత. 82

సీ పైఁయు వియ్యా లంది వీడఁకోళ్లు గుడిచి సారముల్ ముడిచిన సాఁసాని

యొజ్జన మొనరింప నుచితక్రమంబునఁ బుణ్యాంగనల్ గడఁ బ్రోలు చొచ్చి
పాలుపుమీఱఁగ నాకబలికృత్యములు సల్పి యావధూవరుల నెయ్యంబుతోడఁ
బూర్ణకుంభాంతరస్వర్ణరౌప్యంబు లొండొరులకంటె మునుపు నరయ వృత్తిఁ
తే బుచ్చికొనుటయు నెచ్చెలు లెచ్చరింపఁ
గరము లిడి యిరువురును నొక్కటియె దొరకఁ
బెనఁగులాడుచుఁ జిఱునవ్వు లొనరఁ బులక
లడరఁ గనిరి మిథఃస్పర్శనానుభవము 83

తే. ఎల్లభంగులఁ జిత్రమై యొనఁగునట్టి, సతి కళాపూర్ణరాజసంగతిఁ దనర్చ
జగతి కెల్లమహాపర్వ మగుచుఁ బరఁగె, నప్పు డావేళ మనుఁ డేచు టరిదిగాదె.

క. అనుపమహర్షశ్రీలం, బెనుపొందెడు పెండ్లికూఁతుఁ బెండ్లికొడుకుఁ గ
న్గొనుజను లప్పుడు దమలో, ననయముఁ బ్రమదాద్భుతంబు లావహిలంగన్ 85

తే. కడుఁ గళాపూర్ణుఁ డనుకీర్తి గన్నయాతఁ
డీపతివిశేష మెఱుఁగుట యొన్న వలదె
యీమధురవస్తువును గొన నెఱిఁగెఁ గాన
మధురలాలస యనుపేరు మగువ కొనరు 86

ఆ. అని నుతించి రిట్లు ఘనసమృద్ధిని వివాహంబు సంపతిల మదాశయుండు
పెండ్లికొడుకువెంటఁ బ్రియపుత్త్రి ననిపె ననంతవస్తుతతుల నరణ మిచ్చి 87

వ. అవ్విధంబున ననుపునప్పుడు సముచితలౌకికవైదికాచారంబు లన్నియును విహి
తంబులు గావించి రూపానుభూతి తనకూఁతుఁ బిలిచి యిట్లని బుద్ధి చెప్పె 88

క. సుముఖాసత్తిమణిస్తంభమహాయోగీంద్రు లత్తమామలు నీ కో
రమణీమణి నీకోడండ్రము నెఱుఁగరు వారు యోగరసనిశ్చలతన్. 89

ఆ. అత్తమామ లన్న నాచార్యుఁ డన్న సద్ధర్మ మన్న నిష్టదైవ మన్న
నీకుఁ బతియె సుమ్ము నెయ్యంపుఁగూఁతుర, యిది మహోపదేశ మెఱిఁగికొనుము.

క. దివ్యాంగన యొఱపరి గడు, భవ్యచరిత నీదుసవతి పతికంటెను సం
సేవ్య సుమీ యాయమయెడ, నవ్యాజభయభక్తివినయవై యుండఁదగున్

క. సౌందర్యవిలాసాదుల, యందునె తగులువడి యితర మరయనిమగవా
రుం దఱచుగఁ గల రయిన ననిందితచరితములె సుమ్ము నీపతి కింపుల్. 92

ఉ. కొందఱు రూపసంపదనె కొందఱు సాధుచరిత్రశక్తినే
యొందుఁ బ్రసిద్ధులై పతుల కిం పొనరింతు రనూనమైనచ
క్కందనముం సువర్తనము గల్గినపెన్మిటి కేమిచెప్ప నా
చందనగంధి జాడులు ప్రసాదము గాదె చకోరలోచనా. 93

ఉ. కావున రూపయౌవనవికస్వరగర్వభయంబుచేతఁ గా
నీ విభుఁ డిచ్చుమన్ననల నెయ్యపుటాల నటంచు నమ్మి కా

నీ వినయాదు లేమఱక నీహృదయేశుఁ దదీయబంధుమి
త్త్రావళులన్ సపత్నిని యథార్హవిధిన్ ముద మందఁ జేయుమీ. 94

మ. అని దగ్గుత్తికఁ బెట్టుకొన్న ఘనపక్ష్మాంతర్నిరుద్ధాశ్రులై
యనుపం జాలక చాల కంపె సుతఁ గన్యారత్నముం దల్లి వీ
డ్కోనఁగాఁ జాలక చాల కంత మది నెట్లో యొక్కచందాన వీ
డ్కొనియెన్ వే మఱపింపలేవు ప్రతిభక్తుల్ మాతృవిశ్లేషమున్. 95

వ. ఇవ్విధంబున మధురలాలసాపాణిగ్రహణకల్యాణవైభవంబు నవధరించి కళాపూ
ర్ణుండు గృహప్రవేశమహోత్సవానంతరంబున దేశాంతరాయాతరాజలోకంబు
నస్తోకసత్కారవిశేషంబులం బరితోషంబు నొందించి తత్తద్దేశంబుల కనిపె
నంతఁ దద్వధూతిలకంబు వికసితవదన లగుసకియలనుపగలవలన 96

క తననవసంగమదిన మది, యని విని యుబ్బుచుఁ బ్రహృష్టయై మాటికి వ
చ్చినచోటికి వచ్చుచుఁ బోయినచోటికిఁ బోవు చుండె నేమో కలఁకన్. 97

సీ మధురలాలస నేఁడు మగనిపాన్పనుచును నిజకోప మీక్షించి నిలుచువారు
కోప మేలె ఫలించెఁ గోర్కి నీ కని తన యదరువింతలకు నూఱులుగువారు
మాయమ్మ యివి కల్లమాట లింతియె నీవు నైకోకు మని శాంతి గఱపువార
లిప్పటనుండి మాకేల యప్పుడు చూచె దివ్వార్త నిజ మని నవ్వువారు

తే. నిజ మయిన నేమి యనఁగదే నీవు వెఱవ
దరుముకొని వచ్చుచున్నారు తరుణి వీరు
సారె కనువారు నై బోంట్లు సరసగోష్ఠి
సలుపఁగా నాఁటిపవ లెల్లఁ జెలువ గడపె. 98

క. అంతటఁ దల దువ్వి గడున్, వింతలు సింగారములు ప్రవీణతఁ జెలు లా
కాంతకుఁ జేసిరి లజ్జాక్రాంతత నొల్లమి నటింపఁగాఁ దమబలిమిన్. 99

సీ ఇట్లు సింగారించి యెదుట నద్దము వెట్టి చూచుకొమ్మన లజ్జఁ జూడఁ గొంకఁ
జెలు లెడఁగాఁ జన్న నిలువుటద్దము చూచి కొనగోర నటు దిద్దుఁగురులు విరులు
నంత వారే తేర నెంతసూక్ష్మగ్రాహి యిది యంచు ముకురపరీక్ష నెఱపు
నాయలంకారరమ్యత చెదరకమున్న యధిపుఁడు తనుఁ జూడ నాత్మఁ గోరు

తే. సిగ్గుకతమున సఖియలచేర్పు వాని
చనువుఁ బరికించుతోడవ్వులయునికి మట్టు
మచ్చుమరలేకయుండ నేమఱక యోము
మిగుల మేగరగరికె నామెఱుఁగుఁబోఁడి. 100

చ. అసదృశభూషాణాన్వితవిలాసవిచిత్రత నొప్పె నాసము
ల్లసితసువర్ణవర్ణగృహలక్ష్ములచెక్కిళులో యనంగ నిం

పెపఁగెడునిల్వుటద్దముల నేణముదాదివిచిత్రలోచనా
రసమయుపత్రవల్లరులప్రక్రియతోఁ దనసీడ యేర్పడన్. 101
శా. ఆసౌభాగ్యవతీవతంస మొకయేకాంతప్రదేశంబునం
బూసెజ్జన్ విహితోపదేశ యగుచుం బొల్పొందెఁ బత్త్రావళీ
న్యాసప్రచ్యుతభీత్యధోఘటితహస్తాంచత్కపోలంబుగా
న్వాసిం గాముకునిల్వుటద్దమునకున్ సౌందర్యముల్ డిందఁగన్ 102
ఆ. ఇవ్విధమున నామృగేక్షణ యేకాంత, వర్తనమున నుండి వరసమాగ
మావిలంబసిద్ధి కభిలాష మెంతయు, మహిమ పొలయఁ దనదుమానసమున.
చ. విభుఁ డిఁక వచ్చు నిప్పుడొకొ విఘ్నము లే మయినం ఘటిల్లునో
యభినవకౌముదీయుతము లైనవి యాకెకు నాదుసంగమం
బభిమత మాట గూడద యొకప్పుడు నట్టిది గానినాఁడు దు
ర్లభము గణించునే సురవిలాసినివల్లభుఁ డన్యకాంతలన్. 104
చ. తనకడ కేఁగినప్పుడు పదంబుల కేఁ బ్రణమిల్ల నవ్వరాం
గన కృప గల్గినట్లు కడుగారవ మొప్పఁగఁ గౌఁగిలించుచుం
దనరుము చాల నైదువతనంబున నంచు నొసంగె దీవనల్
తనకును వాంఛితంబ యిది తత్కృపభంగులు నమ్మవచ్చునే. 105
చ. అదియును గాక యాత్రిభువనైకసమాదరణీయరూపసం
పద గలవల్లభుం గలసి భవ్యసుఖంబులు గన్నయింతి దా
మదిని సహించునే నిమిషమాత్రముఁ బాయఁగఁ బాయకుండఁ ద
త్తదుచితనీతు లెప్పుడును దప్పక నన్నుచునుండుఁ గా కిలన్. 106
శా. లోకుల్ కాముఁడు కాముఁ డంచుఁ గొలఁదుల్ రూపింప కాయుత్తమ
శ్లోకుం బోలిచినం గతానుగతికో లోకో యటం చుండుటల్
గా కిట్లీతఁడు నొప్పునే యఖిలదృక్పర్వంబు గా కున్నె ర
మ్యాకారుండఁట శంభుదృష్టి కహహా యామంట రప్పించునే. 107
మ. తరుణీశాతకటాక్షవీక్షలకొనల్ దార్కొన్నచోట్లుం బలె
న్నురుశోభావిభవాకరంబు లగుచున్ రోమాంకురస్థానముల్
పరఁగన్ ముట్టినఁ గందునో యని కడుం బాల్గాలుచున్నట్టియా
ధరణీనాథు మెఱుంగుఁజెక్కిళులు నేత్రప్రేమపాత్రంబు లై. 108
శా. 'మారుం డద్భుతశంఖ మొక్కటిని సంపాదించి దోర్దధ్యక
స్తూరీచర్చనెపంబునం దనదు కేల్ దోఁపన్ సువర్ణత్వశో
ధారిస్ఫూర్ శశి కెత్తి చూప నతఁ డత్యంభోదుఁ డై చేరి యిం
పారం బట్టుట దోఁచుఁ దద్గళము కేశౌఘంబు మోముం గనన్. 109

ఈపద్యము నించుకమార్పులో నప్పకవి కకుత్థ్సవిజయములోని దని యుదాహరించెదను,

మ. శమగాంభీర్యధృతిక్షమార్జవదయాశౌర్యప్రమోదాదికో
త్తమనానాగుణరత్నకోశనిలయోద్యత్కాంచనద్వారబం
ధమహాస్తంభదనూనబాహుఁ డగునాథాత్రీశువక్షఃకవా
టముపై నెప్డొకొ గండపట్టిగతి నుండన్ నాదుకేల్ సేర్చుటల్. 110

క. ఏలిక యై తను రా జొక్కఁడేలఁగ మని యునికి మెచ్చ కేమో యల తా
రాళియుగ మఖిలరాజశిఖాలంకృతి యయ్యె మదధిపాంఘ్రినఖము లై. 111

తే. ఆలలితచరణము లొత్తుకేలు కేలు
కోర్కిఁ దద్వక్షమునఁ జేర్చుకుచము కుచము
దివుటఁ దత్ప్రహఃకథ వినుచెవులు చెవులు
పలుకు లేల తద్రతి గన్నబ్రదుకు బ్రదుకు. 112

చ. అని తలపోయుచున్ నిజవయస్యలు పిల్వఁగ వేళ యైన నం
దునికి యెఱుంగ కెం దరయుచుండెదరో తను నంచు లేచిపో
వ నలరుఁబోఁడి యించుక ప్రవర్తిలునంతన వేడ్కతో సఖీ
జను లరుదెంచి రచ్చటికి సంభ్రమ మొప్పఁగ నల్ల నవ్వుచున్

వ. అందు నొకప్రౌఢ యగుసతి నయంబుతోడ. 114

సీ. ఓచెలి యెక్కడ నున్నదానవె యంచు నల్లన డాసి వాలారుగొల్ల
నూరక ముంగురు లొకచోట దువ్వి పాపటచేరుచుక్కసంఘటన యరసి
శ్రవణభూషల లేనిరవవారుఁ దుడుచుచు నిది వేళయఁట హృదయేశుసేవ
కేతేరవలయును రా తడయక యంచు నొడివి యొక్కించుకతడవు నిలిచి

తే. ఇంతి యామాట కేమంటి వీ వెఱుఁగని
నీతిలేదు ప్రియుం డదె నీదురాక
కెదురుచూచుచు నున్నవాఁ డిచ్చ యెఱిఁగి
చనుట దగుఁ గేళిగృహమున కనుచుఁ బలికె. 115

చ. పలికిన మాఱు పల్కక త్రపాభరనమ్రముఖారవింద యై
జలజదళాక్షి యొప్పెఁ దనచన్గవ కన్గవడాలు పర్వఁగాఁ
గలయఁగ మంచిగందమునఁ గస్తురిఁ దత్సమయోత్సవాంగమం
గళకలశార్చనాఖ్యశుభకర్మను సల్పెడుపొల్పుదోఁపఁగన్. 116

ఉ. ఆగతి నున్కి చూచి సఖు లందఱు నేమిట వచ్చునేమి నీ
లా గిది యేమి యింతి కిదిలక్షణమే చనుదెమ్ము లెమ్మనన్
హ్రీగరిమంబు వాపుచు నొకించుక లేవఁగఁ బూను మాను నా
లోఁ గొద గొన్నసిగ్గునఁ జెలుల్ బలిమిం దను దివ్వఁ గోరుచున్. 117

వ. అంత నొక్కమిక్కిలి ప్రగల్భ యగుమగువ మిగులం జనవు వొరసి. 118

మ. పొదిరియై నాథులు దారుఁ గాఁపురము లింపుల్ మీఱఁగాఁ జేయుచుం
గడిపెం డేసికొనాళ్ళఁ గూఁతులఁ దగం గన్నట్టియిల్లాండ్రకున్
మది లజ్జాదులు లేవె నీకు బలె సన్మానంబుతోఁ జక్క వ
చ్చెదొ యేమే గలదో యటంచుఁ దిగిచెం జేపట్టి యాయంగనన్. 119

వ. అయ్యవసరంబునం గళాపూర్ణుండు తదాగమనంబున కెదురుచూచుచుండి వారి గజిబిజి కొంతచేరువను వినంబడినం బ్రేయసీవిలోకనోత్కంఠ యాఁపలేక లేచి వచ్చి కౌతుకం బడర గవాక్షమార్గంబునం దద్రూపలావణ్యవిలాసంబు నిరీక్షించుచు నచ్చెరువంది యాపాదమస్తకంబుం గ్రమంబునం బరికించుచుఁ దన మనంబున. 120

ఉ. క్రిందను మీఁదనుం బడి యకించిదసూయఁ బెనంగులాడు న
ర్ధేందుఁడు నుల్లసద్బలసమృద్ధతమిస్రమువోలెఁ జాలఁ జె
న్నొందెడుఫాలముం గబరియున్ మఱి పాపటముత్తియంపుఁ జే
రుం దులకించుకస్తురియు రూఢిగ బాహులలీల నొప్పఁగన్. 121

ఉ. ఎత్తినకోలగా మదనుఁ డేసిన వే చని వచ్చునర్ధచం
ద్రోత్తరబాణమో యనఁగ నొప్పెడుపాపటతో లలాట మా
యుత్తముఁ డంత దానిఁ బడకుండఁగ విల్ నిడుపెల్ల గౌతుకా
యత్తతఁ దన్ముఖంబునకు నానెనొకో యన నొప్పెడుం బొమల్. 122

లయవిభాతి. తనపడగకై భువనమున వెదకఁగాఁ జనిన వినుతములు రెండు దొరకి నను మరుఁ డందుం, బెనుగడఁక చూడ మొగమనెడుహసితామృతపుఘనసరసిఁ బాఱవిడిచినసమత నొండొం,టిని దఱుములాడునయననిభశుభమీనములకును బతనకృత్యవధి పనుప రతమధ్యం,బున నిడినచంపకపుఁగనదిషుధియో యనఁగ వనితవరనాసపస నలరెడు నిరూఢిన్. 123

క. సమదాక్షిమీనసంచా,రమునఁ దొలంకుచును ముఖసరస్సున లావ
ణ్యము వెల్లిపాఱఁ గ్రేవల, నమరించినపిల్లకొలఁకు లంగనవీనుల్. 124

తే. ఒనర మకరధ్వజుండు చేర్చినతదంక, విలసనముతోడఁ జిన్నిలేఁదళుకుటరిగె
బిల్లలో యన మకరిసముల్లసత్క,పోలఫలకంబు లమరెను బాలికకును. 125

మ. శిరసందం బరయం బరాత్ములకు నీశీతాంశుబింబాస్యవా
తెరబింబప్రతిబింబభావము సమర్థించున్ నిరూఢంబుగా
వరబింబానుభవంబునుం బలె నఘావాప్తిన్ విశుద్ధామృతం
పురసం బానుచునే శుకాదులు బలేన్ మోదింతుఁ జిత్రంబుగన్. 126

తే. సంజఁ గెంపారుసన్నంపుజలదరేఖ
యందు నొక్కింత మినుమినుమనుచుఁ దోఁచు

చిన్నతారలగతిని రాజిల్లుచున్న
చెలువపలుమోవిమఱుఁగునఁ బలుకుఁబడిని. 127

చ. ప్రతినవచారుకేసరపరాగశలాటుమిళిందబృందచి
త్రితకుహాళీయుగంబుగతిఁ గ్రేవలఁ గర్ణకలాపరత్నని
ర్గతరుచిమంజరుల్ దనరఁగాఁ గ్రముకద్రుమకంఠలక్ష్మికిం
బ్రతిభటవృత్తిఁ జూపెడును భామినికంఠముసొంపు పెంపుతోన్. 128

సీ. లీలమైఁ గదియ నిల్పినపైఁడితమ్మిమొగ్గలనాళయుగ మన నలరుకౌను
నవి వ్రేఁగుచేతఁ దిర్యఙ్ముఖంబునఁ గొంత నతిఁ జెందె ననఁగఁ జన్నవబెడంగు
పొలుపొందుతన్నాళములసంధిరేఖ యేర్పడుచోటుబలెరోమరాజిపొలుపు
నొండొంటిఁ బాసి పోకుండ దానికి నంట్లు వైచినచందాన వళులసొంపు
తే. నొప్పుచున్నవి యేమని చెప్ప నౌర, చాల నన్నివి కలఁచుట సముచితంబ
కామునకు బొట్టకోలలు గావె నాళ,ములఁ బ్రకాశించుతామరమొగ్గ లరయ.

చ. అనుపమముల్ రతిస్మరులయాటను నర్మము లంచుఁ గప్పి పె
ట్టినపువుబంతు లీసతికిఁ డిందిచనుంగవ తేంట్లు క్రేవలం
దును జొరకుండఁ జేరిచినతోరపుసంపఁగిపూవుదండ లీ
వినుతభుజంబు లాతుదల వేడ్కకు నిడ్డచిగుళ్లు హస్తముల్. 130

తే. అతివయవలగ్నయష్టిఁ బెంపారునాభి
మురువు కాంచనస్రగ్బిలమో యనంగ
నుల్లమును నెల్ల హరియించుచున్న దౌర
యతనుశిఖియందు ప్రేల్వ హవ్యమునుబోలె. 131

ఉ. మానవతీవతంసము సమగ్రనితంబవిజృంభణంబు జం
బూనదిసైకతస్థలముపొల్పు వహించుచుఁ జాల నొప్పెడుం
బై నునుమంచువోలె వెలిపట్టుమడుంగు బెడంగు చూప నా
పై నవసారసాళిఁకరిపాటి నుదంచితకాంచి మించఁగన్. 132

తే. అతివతొడలును జఘనంబు లరసి చూడఁ
గొమరు మీఱెడుజమిలితొండములశిరసు
తోడివలరాచవారియద్భుతపుహస్తి
యగ్రభాగంబు చూపఱ కొత్తఁ దోఁప. 133

మ. ప్రమదారత్నముజంఘ లిం పెసఁగెడుం బ్రాధ్మాయమానంబు లై
నమనోజాతసువర్ణకాహళికలో నా వానిఁ బూరించువా
రివె యుంగుల్ గురుగుబ్బలో యన శుభశ్రీనొప్పెడుఁ గుల్ఫదే
శము లాపైఁ బిడికిళ్ల నాఁ గనకభూషాపంక్తి నింపారెడున్. 134

ఉ. జలజదళాయతాక్షి మృదుచారుతరప్రపదద్వయీవివి
ర్మలరుచి గల్లుగల్లుమనురత్నపుటందెలమ్రోఁత జృంభణం
బుల నవకంపుఁగచ్ఛపముపొల్పు నదల్చుచు గెల్వు దెల్పెడుం
గలుగునె యింక దీనికి జగంబులలో నుపమాప్రసంగముల్. 135

చ. అకలుషతార లేతదబలాంఘ్రిని బట్టినతమ్ములై నఖా
త్మకతను గొల్చి పాయ విధి ధర్మము యీజలజంబు లాదిఁ దా
రకములరాజు రాజు గ్రహరాజు కరం బిడ నొప్పు పెంపుతో
సకలజయస్మరోదయము సల్పుటఁ దెల్లమ నాఁగ నిత్తఱిన్ 136

తే. అతనుదశదిశావిజయకీర్త్యంకురముల
మీఁద మునుపుగ వెలువడి మెఱయువిత్తు
లతివపదనఖములు వానియంతికమునఁ
జలువ కిడినలతావిశేషంబు మేను. 137

క. అని వర్ణించుచు మిగులన్, మనము తదాలింగనంబునకుఁ దమకింపన్
జనపతి గోరె నవిఘ్నత, నవయముఁ గొనసాగి రాఁ దదాగమనంబున్. 138

ఉ. ఆయెలనాగ యంతటఁ దదాలయసన్నిధిఁ జేర్పులజ్జపెం
రాయిడిచేత బోంట్లను గరం బలయించెను సాగి పోక భూ
నాయకుఁ డేమి యప్రియ మొనర్చితి నీకును దోసకారి సి
గ్గా యుడికించె దింత ననుఁ గాంతను రా విడ కంచు దూఱఁగన్. 139

క. అంతటఁ దద్గృహదేహళి, చెంతకు నయ్యింతి చేర శీఘ్రుతఁ జని భూ
కాంతుఁడు దనపానుపుపై, సంతసమునఁ బొదలుచుండె శయనించి తగన్. 140

వ. అంత 141

ఆ. ఓసి వెట్టిపడుచ యూరక రమ్ము పె
నంగ కెదుట నదె కనుంగొనియెడు
ననుచు నొయ్యఁ బలుకుచును జూపెఁ బ్రియు నొక్క
ముగుద కేల నోరు మూసికొనుచు 142

క. అడుగులు దడఁబడఁ బులకలు, పొడమఁగ సఖి వెనుక కొదుగఁ బోవుచు నరసె
న్నెడ మలఁచి పడఁతి యప్పుడు, కడగంటివిలోకనమునఁ గాంతునియునికిన్. 143

సీ. రేఖలై మీఁదట రెప్పలయొప్పుఁబన్నాగంబు కడపళ్ళ బాగు నెఱప
నరిదిపట్టుపడాలయంచులగతిఁ గ్రింది పక్ష్మమాలికలు చూపట్టుచుండ
వెలయింపఁ బన్నాగములకుఁ బైనిడినయబ్బురపుఁదండెలుపోలె బొమలుదనర
నొఱగులదెసఁ దోఁచుచున్నట్టిశిరసుల బలెఁ గనీనికలు గొల్కులు దలిర్ప

తే. శుభ్రభాగముల్ బిగియుముసుంగు దన్ని
యొసఁగుపెఱమేను లన నొప్పు నెదురఁ బడుర

తిస్మరులయందలము లనఁ దృష్టిఁ బొలిచె
వెఱపుతో నింతి క్రేగంట విభుని నరయ. 144

తే అంత మరలంగ మరలంగ నతివచెలులు
బలిమిఁ బొదువంగఁ బట్టి లోపలికిఁ దెచ్చి
రప్పు డొకబోటి నృపునిపాదాంతికమున
రెండుసందిళ్లఁ బట్టి కూర్చుండఁ బెట్టె. 145

ఆ. పెట్టి యోలతాంగి ప్రియునంఘ్రిలొత్తు మ్రట్టిట్టు వెనఁగి లేని యెఱుఁగుదుగద
యనినృపాలుఁజూచి యటుపాదమిడఁగ ద,య్యాపరాకుమాని యనియె నగుచు.

క. అని తచ్చరణంబు విలా,సినియూరువులందుఁ జేర్పఁ జేసి బలిమి నా
వనజముఖిచేతఁ బట్టిం,చెను సంవాహన మొనర్పఁ జేసెఁ గ్రమమునన్. 147

సీ. అదె యెవ్వరే పిలిచెదరు నదేమొకో యరసి వచ్చెద నంచు నరిగె నొకతె
చిలుకయాఁకలిని దర్శింపరైతి రె యదె కూయుచున్నది యంచుఁ బోయె నొకతె
మనజాలవల్లిక మఱచి వచ్చితిఁ గొంచుఁ జనుదెంతు నది యంచు జాఱె నొకతె
యదివోయి యెంతసే పయ్యెఁజూచితె తోడుకొనివత్తునేనంచుఁ జనియె నొకతె

తే. అందఱును బోయెద రె నేను నరుగుదెంతు
ననుచు నొయ్యనఁ బల్కుచుఁ బెనఁగి లేవ
మధురలాలస నప్పుడు మనుజవిభుఁడు
పదమునం దూరుభాగంబు లదిమిపట్టె 145

ఉ. లేవఁ బెనంగ వేఁడియును లేమ విభూషలు మ్రోయఁ దోడనే
యీవిధి మ్రోఁత లైన శరదిందుముఖీ వినువారు నిన్ను ప్రీ
డావతి యండ్రె యంచుఁ దను డాయఁగ హస్తము వట్టికొంచు గో
త్రావిభుఁ డొయ్యఁ బల్కెఁ జెవి దండఁ బెనంగఁ దలంక నెంతయున్. 149

చ కదలఁగ రా దొకించుకయు ఘల్లున మ్రోయఁగ నంచు నందియల్
మొదలుగఁ గొంతసొమ్మపుడు ముద్దియ యొయ్యన కీలెడల్చి మే
లొదవఁగ నూడ్చి వల్లభుఁడు నోసతి యాయితపాటు లెస్స యం
చు దయితతోఁ గపోలములు సోకఁగ మంతన మాడె నవ్వుచున్. 150

వ. అప్పుడు. 151

ఉ. ఏపలుకుం జెవిం బడఁగ నీక పెనంగుచు మోము దవ్వుగా
బాపుచుఁ ద్రోపు లాడుసతి పాణితలంబుల మేళవంబు ను
ర్వీపతి కింద్రభోగమటు వేడ్కనొసర్ప ముఖాబ్జముం గడుం
బాపఁగ నాలకించుటయె బ్రహ్మసుఖోదయ మయ్యె నయ్యెడన్. 152

సీ. ప్రథితమిథోరాగకథలమంతనముల హృదయంబులోపలి బెదరు దీర్చి
సవ్యాజకృతకుచస్పర్శాదిలీలల నంగాంగమేళన మలవరించి

జిలిబిలినెయ్యంపుఁజిట్టకంబులచేత నెలనవ్వు చెక్కుల మొలవఁ జేసి
లజ్జాపదంబు లల్లన మాటిమాటికిఁ జెనకుచు నొక్కింత సిగ్గుపఱచి
ఆ. యపుడుకుసుమసాయకాగమాధ్యయనాధి, కారసిద్ధిఁ గొంత గలుగఁజేసె
నావసుంధరాధిపావతంసుండు రూ,పానుభూతితనయ కాదరమున 153

తే. వరునిచిట్టంబునేఁతలఁ గరము ప్రేమ
మెఱపుపోలెఁ దళుక్కన మెఱచుఁ గాని
నెలఁత సిగ్గనుమొగులులో నిలువలేద
యదియు మిక్కిలి నిం పయ్యె నతనిమదికి 154

ఉ. భీతియు లజ్జయుం దనరఁ బెంపఱి డాఁగుమనోజుఁ దేర్చి థా
త్రీతలనాథుఁ డంగనమదిం దలచూపఁగ నట్లు నేయ వాఁ
డాతనికిం గ్రియాపచివుఁ డై సతినీవి వదల్పెఁ బాదుకో
నాతని నిల్పె తేఁడు ప్రియయాత్మఁ గరంచుచుఁ జుంబనాదులన్. 155

వ. ఇవ్విధంబున. 156

ఉ. మిక్కిలి మిక్కుటం బగుతమిన్ రతికిన్ సతి నూలుకొల్పుచుం
జెక్కిలి నొక్కి చుంబనము చేసి కవుఁగిట నోలలార్చి తాఁ
జొక్కుచుఁ జొక్కఁ జేయుచుఁ బ్రసూనశరాసనఖేలనక్రియల్
పెక్కుతెఱంగులన్ సలిపెఁ బ్రేయసియింపుకొలంది నంతటన్ 157

క. దినదినమున కతివమదిన్, ఘనగరిమన్ మరుఁడు దఱుమఁగా రతులతఱిన్
దినదినమునకుఁ గృశించెను, గనుకనియెను ద్రపయు నిరవకాశతఁబోలెన్. 158

వ. అప్పుడు. 159

మ. చనుగ ట్టంటఁగనీక మోవికి ముఖస్పర్శంబు గానీక తా
ఘన యంచుల్ గ్రహియింపనీక జఘనక్రాంతిం బ్రవర్తిల్లనీ
క నితాంతంబు పెనంగుటల్ క్రమమునం గంజాక్షి వేసారిన
ట్లోనరన్ మానుచు వేడ్కఁ దేల్చె నృపముఖ్యుం గొన్ని రే లంతటన్. 160

సీ. పరిరంభరోధంబుపైఁ బరాకునఁబోలె నధరపానంబున కనుమతించి
నెమ్మోవి నిడ్డఁ జింతిలుపరాకునఁబోలె గోరొత్తులకుఁ జనుగుబ్బ లొసఁగి
నుచకళికలు చూచుకొనుపరాకునఁబోలె గటివస్త్రహృతి కవకాశ మిచ్చి
నీవి క్రమ్మఱఁగఁ బూనెడుపరాకున బోలె జఘన మంటుటకును సమ్మతించి
తే. చెలువ తనలజ్జ చెలిమియుఁ జెడక నడవఁ
దద్విరోధి యైనట్టిచిత్తజునిపనియు
హరువు సేయుచుఁ గొన్నినాళ్లాత్మవిభుని
హృదయవృత్తికి నొకవింత యిం పొనర్చె. 161

చ. కపటపునిద్ర వోవుతఱిఁ గౌఁగిట నానుచు మోవి మోవిఁ జే
ర్పుచును గొన్ని రాత్రులు వరుం దనియించె లతాంగి యంతఁ ద
త్కపటముఁ గాంచియుం గననికైవడి నట్ల యొనర్చెఁ గొన్ని రే
లపు డతఁ డాఁపలేక నగ నల్లన తానును నవ్వె వేడ్కతోన్. 162

ఉ. అల్లన యంతఁ బ్రేమవిభవాతిశయంబున లజ్జ నోర్చుచున్
వల్లభుచేతు లాచుతఱి నవ్వులు గుల్కులు బూనె నంత నే
నొల్లకయున్న మాన విపు డోర్చుము నీ విది యంచు నవ్వుచుం
బల్లవపాణి యొత్తె మునిపంట నిజేశ్వరుమోవి నయ్యెడన్. 163

ఉ. చెప్పినయట్లు సేయ నిఁకఁ జెల్వ కరంబు పెనంగితేని నేఁ
జెప్పెదసుమ్ము నీ విపుడు సేసినవాతెఱగంటి బోటితోఁ
దప్పక యంచు వల్లభుఁడు దన్ వెఱపింపఁ దలంకినట్ల తా
నప్పతికోర్కె దీర్చె సతి యర్థిమెయిం బురుషాయితక్రియన్. 164

సీ. పాలిండ్లుప్రియపడి పతిఁ జూడ లజ్జఁ దద్వక్షస్స్థలంబుపై వ్రాలి వ్రాలి
మగుడఁ ద న్వేఁడుచు నెగనెత్తి పట్టఁ గాముకునకు లిరుగేల మూసి మూసి
యిఁకఁ జూడఁగప్పితి నిదె యంచుఁ జనుముక్కు లతఁడు పాణులనంట నలిగి యలిగి
కటిభార మెగయ నెత్తుటకుఁ దోడ్పడియెద నని చాఁపఁ బతిచేతు లాచి యాచి
తే. తనదుగోప్యాంగముల దాఁచికొనఁగ రామి
యరసి కెలనికి డిగిపోవ మరలి మరలి
కొమ్మ పుంభావరతి కాడిఁ గొంటకాని
కోలఁది యెఱుఁగద మది దొరకొన్న వెనుక. 165

సీ. తరళితతాటంకధాళధళ్యంబులు మెఱఁపుఁదీగలరీతి మెఱయుచుండఁ
బరిగళన్మల్లికాప్రసవవిలాసంబు తరుణబలాకలసరణిఁ బరఁగ
నతిరభసచ్ఛిన్నహారమౌక్తికములు వడగండ్లచందంబు గడలుకొలుప
నూర్పుగాడ్పులతోడ నొలిమైఁ బర్వఘర్మకణోదయంబు వర్షంబు గాఁగ
తే. గాంతకబరీభరం బను కారుమొగులు
వితతముగ నంతకంతకు విఱియఁ బొఱెఁ
దన్నుఁ గని సుమాళింపుచు ధవునిహృదయ
నవమయూరము చెలరేఁగి నాట్యమాడె. 166

చ. దరముకుళద్విలోచనము దార్యదుదంచితకాంచినాదమున్
విరమదురోజవల్గనము విస్ఖలదూరుకముం గళానిరి
త్వరమణితంబునై సతిరతంబు తదాత్వరతస్పృహాపునః
పురుషితపూరితం బగుచుఁ బొందెఁ గడుం బరిపూర్తి నంతటన్. 167

వ. ఇవ్విధంబునం గ్రమప్రవర్ధమానకందర్పదర్పశిల్పంబుల నొప్పునప్పుడంతితోడి క్రీ
డల నాపుడమితేఁడు వేడుకం బ్రవర్తిల్లుచున్నంత. 168

ఉ. పాటిలెఁ గ్రృష్మధర్మ్మమొకపాటిగ నంతవసంతకృంతనో
చ్చాటితహేతిసంపదల సత్ప్రసవప్రదరప్రతాపసం
ఘాటనవాతతాశనోల్కుకనికాయనుతిప్రతిపాదనోదయ
త్పాటవపాటలాపటలపాటలితోపవనావనీక మై. 169

సీ. కమలసౌగంధికగంధవాసితసర్వదిక్కులంబు లగు కేలిదీర్ఘికలును
బన్నీటితూపరఁ బరఁగించు ధారాగృహంబుల ఖేలనాడంబరముల
వెలఁది వెన్నెలలఁ జిప్పిలుచంద్రకాంతంబు మేడలమీఁదిసంక్రీడనములఁ
జెంగల్వరేకుల సెజ్జల నొప్పఁ గర్పూరవేదికలవిహారములను
తే. వలిపెచెంగావులను ముత్యములతొడవుల, మల్లెపూలదండలమలయజాంగ
రాగములసంతతము ననురాగ మమరఁ, గడపి రాదంపతులు గ్రీష్మకాల మెల్ల.

ఉ అందము గాఁగ నంతట ఘనాఘనకాలము చాల నొప్పె ని
ర్నిందితగంధబంధనవనీపవనీకమనీభవన్ని జేం
దిందిరబృందముక్తనళినీమలినీభవనాగతారసా
స్పందజుగుప్సదర్శనయశాయితయాయిమరాళజాల మై. 171

వ. అక్కాలంబున. 172

క మెఱపులకును నుఱుములకును, వెఱచుట నెపముగ లతాంగి విభుకౌఁగిటిలో
నెలిఁ బోదివి విడువఁ డతఁడుగ, వెఱ పుడుపుట నెపముగాఁగ విడకుం డెసతిన్.

క. ఇవ్విధమున నొండొరుపై, మవ్వంబుగఁ బ్రబలుప్రేమ మహిమంబులతో
జవ్వనపుఁబోఁడుములు కడు, నవ్విభుఁడుగ సతియుఁ గడప నంతటిలోనన్. 174

క తనవిభుఁడనిశము నవ్విధ,మున నాసతిఁ బాయ కునికిఁ బోలెగ మహిఁ దా
ఘనఫలశాలీశుశరా,సనబాణక్రాంతిఁ జెందె శరదృతు వమరన్. 175

క. ఆరమణీరమణుల కా, శారదవేళలు గరంబు సరసతఁ బెనిచెగ
శారదగంధానయనవి,శారదపవనములు ఘుర్మసలిలము నడపన్. 176

స్రగ్ధర. హేమంతం బంత నంతర్హితకమలబలోదీతవిస్ఫీతశీత
ధామాత్మస్వామిధామక్రమణకృశపిపూర్షప్రవిశ్రాణితాతి
క్షేమప్రేమప్రకామశ్రితరతముదితస్త్రీముఖవ్యూహసౌహ
ర్దామందానందదిందూదయకలనబలెగ యామినుల్ మెచ్చ వచ్చెన్ 177

క. అగలునఁ జవ్వాదినిఁ దే, మగఁ బూసినయట్టివజ్రమణిసౌధములగ
బిగికౌఁగిటఁ జేర్చె విభుం, డిగు రాకుంబోఁడి నట్టి హేమంతమునన్. 178

వ. అంత. 179

శా. అన్యోన్యోన్నతిఁ బొల్చె మాఘము లవంగాసంగభృంగౌఘ మై
యన్యత్కాకరతుషారభృత్యవరశైత్యచ్ఛిన్నకందర్పదో
ర్జన్యాసంగమసంప్రవర్ధితపరీరంభక్రియాసంభృతా
న్యోన్యాంగప్రసభప్రవేశయువయుగ్మాంతఃకృతిశ్లాఘ మై. 180

తే. మడఁతపసిమిడిగింటెముల్ మంజడిబిగి
దోమతెరమంచములు హసంతులు జవాది
యగరుసిరులు చిన్నెలు గాఁగ నతఁడు గడపెఁ
జలినెలలు తద్వధూకుచశరణుఁ డగుచు. 181

వ. తదనంతరంబ. 182

మాలిని. వికసితఘనసూనోద్వేలజాలప్రవాళ
ప్రకటకపటరూఢప్రౌఢకీర్తిప్రతాప
ప్రకటజయసమంచత్పంచబాణస్తవోద్గా
యకశుకపికకాంతంబై వసంతంబు వచ్చెన్. 183

ఉ. బాలికతో వనీరతుల భాసిలు తేనికిఁ గుంకుమాంకరే
ఖాలలితస్తనగ్రహణకాంక్షను వాతెఱవాంఛచేఁత ద
ద్వేళ గడుం బచేళిమభిదేళిమదాడిమకేళిమత్తకీ
రాళియు బాలపల్లవరసాకలనాకులకోకిలంబులన్. 184

తే. ఇవ్విధంబున నతఁ డెల్ల ఋతువులందు
నంతకంతకు మఱిప్రేమ యగ్గలింపఁ
దత్తదుపభోగ్యవస్తుసంతతులచేత
మిగుల నింపుగ రమియించెఁ మగువఁ గూడి. 185

చ. అరుదుగఁ దెచ్చుకోలుపొలయల్క నొకప్పుడు మార్గంబుగాఁ
బొరలిన నింతసాహసము పోలునె మీ కని నవ్వునవ్వధూ
వరులఁ బ్రవాళశయ్య యిరువంకలఁ దత్తనుతాపయోగని
స్సరదకలంకఫేనలవజాలవిషంబున డాలు సంధిలన్. 186

క. ఆమనుజాధిపుఁ డభినవ, కౌముదికిని వరుసఁ దప్పక సమానమనః
ప్రేమలు మీఱఁగ దక్షిణ, తామహనీయుఁ డయి నడపె దర్పకలీలల్. 187

చ. అభినవకౌముదీరమణి యంతటిలో నొకనాఁడు రాగసా
రభము నలిర్పఁగాఁ దనుఁ దిరంబుగ వీణియఁ బూని పాడుచుం
శుభగతిఁ గొల్వఁ దత్పటిమ సొంపు వినం బిలిపించె భూమివ
ల్లభుఁ డొకయింతిచే మధురలాలస నచ్చటి కాదరంబునన్. 188

తే. ఇట్లు పిలిపించి తద్గాన మించుకంత
యాకె వినునంత నధిపుఁ డోయబల నినుఁ బ్ర

వీణ యన వీందు నేను దద్వీణ నీవు
పుచ్చుకొని పాడు మంచు నాపాలఁతిఁ బలికె. 189

క. పలికిన నినుఁ గా దన భీ,తిలి యిటునటు నట్టుకొట్టు తెఱవ తెఱఁగు భూ
తలవిభుఁడు చూచి యిది యే,మలికుంతల తెలుపు మనుచు నడిగెఁ బోరిఁబోరిన్.

తే. అడుగుటయు నీవిపంచిసమంచితశ్రు,తిప్రకాండములకు జగతీతలేంద్ర
మామకస్వరపటిమ సమాన మగునొ,కాదొ యనియెడుశంక యొక్కటి జనించె.

క. నా విని యందుల కేమి స్వ,భావగతిం బాడు మనిన భామిని గాన
ప్రావీణ్యముఁ జూపెను గడు, నావీణియశ్రుతులు గితులు నధరితములుగాన్

క. విభుఁ డపు డాకంఠస్వర, విభవమునకు నేరుపునకు వెఱఁ గొందెఁ గడుం
ద్రిభువనదుర్లభ మిది యని, యభినవకౌముదియు మిగుల నద్భుత మొందెన్.

వ. పదంపడి యొక్కింత విచారించి మేదినీనాయకుండు మధురలాలసం జూచి 194

క. నీ వాయించువిపంచికఁ, దేవలయూ దానికొలఁదిఁ దెలియుద మనినన్
భూవలయాధీశ్వరునకు, నావనరుహదళనిభాయతాక్షి వినీతిన్. 195

ఉ. ఏరికి నెట్లు దోఁచిన సహించుట గాని నిజంబు చెప్ప కే
నేర మఱుంగు పెట్టి ధరణీవర యింకను నీవు మత్స్వరో
దీరణ యొత్తికోలునకు నీడుగఁ బల్కెడువీణ లేద యెం
దారసి చూచినం గొలుప దాత్మకు దానను బాట మిక్కిలిన్. 196

తే. నగర నవ్వీణయునికి భూనాథ యేను
వినుచుఁ జూడంగవలయు నంచును దలంతు
దీనికొలఁది యేపాటియో దేవరకును
దెలియఁ బరికించితిరె తేటతెల్లముగను. 197

వ. అనుటయు నమ్మహీపాలుం డబ్బాలికతో నిట్లనియె నేటివర్తమానంబు వీణియ
లందు నిదియె యుత్తమం బగుట చిత్తంబున నిడి యేను మొదల నుండియు
దీనిపరిచయంబునం దగిలియుండుటం జేసి యిప్పటిదాఁక నెప్పుడు నధికంబునకు
బుద్ధి పాఱదు గాని యిప్పుడు భవదీయగానంబు వినంగ మంద్రమధ్యమతార
స్వరవిలాసవిశేషంబుల కిదియ కడకట్టు మనియు నివ్వీణియపలుకులు సమగ్రం
బులు గా వనియును నామనంబునకు సరిదాఁకి యున్నయది యని యభినవ
కౌముదిం జూచి దీనికంఠస్వరంబునకుఁ దగినవీణియ యెక్కడ నేనియుం గలదొకో
యనిన విని యాభామిని యోభూవర దేవరకు గానప్రసంగంబున మున్నేను
విన్నపంబు చేసితి మదీయం బైనయీనల్లకి యెల్లవీణియలకు నెక్కుడని తొల్లి
తుంబురుండు మెచ్చి ధరియించియుండుఁ దనకుం బ్రియశిష్యురాలం గావున
నతండు నాకు నొసంగె నింక నింతకంటె నుత్తమంబు లెక్కడం గలిగెడు నని
పలికి యొక్కింత చింతించి యి ట్లనియె. 198

క. ఆతుంబురుఁ డీసందున, గీతకళన్ నారదునకుఁ గీడ్పడియె ననన్
భూతలనాయక వింటిని, చేతోగతిఁ దెలియు మేవిశేషము గలదో. 199

వ అనుటయు నమ్మాటవలనఁ గళాపూర్ణుండు మున్ను మధురలాలసకథలలోనఁ
దనకు వినఁబడిననారదునితుంబురునిజయోద్యోగంబు దలంచుకొని తత్ప్రసం
గంబున నిజపూర్వజన్మవృత్తాంతంబు సంస్మృతం బైన నందు మృగేంద్రవాహ
నామందిరగుప్తం బైనతనవిపంచియునికి చింతించి మదాశయపుత్త్రి కంఠస్వరం
బునకు నదియె తగినది యని హృదయంబున వితర్కించుచు దానిం బరికించి
తెప్పించుట కుద్యోగించి యాచంచలాక్షిం జూచి యింక నొక్క వీణియ యొక్క
చోట నున్న యది నీదుపాటకు ననురూపంబు గాఁబోలునని పలికెఁ దత్పలుకు
లకు మున్న యభినవకౌముదిం దదీయసఖులు ప్రక్కంబడి యొక్కెడం దోలం
గఁ దోడ్కొని పోయి యేకతంబున ని ట్లనిరి 200

క అకటకట ముగుద వన్నం,తకుఁ గలవు సపత్నిపాటతగులంతఁ గడుం
బ్రకటింప పతికిఁ దోడ్తై, వికసిల్లుచుఁ జెప్పె దేటి వీణెలసుద్దుల్. 201

తే ఆకెగానంబు నీవీణె నతకరించు
టాదియందునె యెఱిఁగి చు మ్మతఁడు నేఁడు
పిలిచి తెప్పించి ని న్నింతచులుకఁ జేయు
కొఱకె తప్పదు మామాట యెఱిఁగికొనుము. 202

ఉ. నేఁడు దలంప నీవరుఁడు నీభవనంబునఁ బాట వించు ను
న్నాఁడఁట యాకెమీఁదట పునం బిడఁడే నిడుఁ గాక యంతటం
బోఁడిమిఁ బిల్వఁ బంచెఁ దలపోయఁగ నిం కొకవింత యాకెపి
ల్లాఁడికరంబు వ్రేలఁ బదిలంబుగఁ దాల్చినవాఁడుచూడవే. 203

చ. ఎఱుఁగవు గాక యొక్కపు డొకించుక మాల్యగ మిద్దిఁ గుఱ్ఱకిం
గొఱఁతయె యెంత చెప్పినను గోమలి నేరవ యల్కఁ దెచ్చుకో
నెఱియ నధీనవౌ నెఱిఁగి నేఁ డిదిగో కయికొమ్మి మిక్కిలిన్
నెఱినె యతండు నీవు విన నేర్చెడి మాపలు కెప్పుడేనియున్. 204

క పఱతి యెటు లయినఁ బ్రాణముఁ, బిడికిటఁ బట్టుకొని నేఁడు ప్రియుతో నీ వె
ప్పుడువలెఁ బలుకక యించుక, తడ వుండుము మానుఁగాను దాలిమితోడన్

తే. మధురలాలసపాటపై మదిని దనకు
నింతవేడుక గలిగిన నేకతమున
సతతమును వింటి గాక యి ట్లతఁడు నిన్ను
నోటఁ బఱచుట దగునె నీ కోర్వఁ దగునె 206

క. కావున నీయోటమి నీ, కేవెరపునఁ బాయునది యధీశుఁడు తానే
కావించు క్షణము పలుకక, నీ వుండిన నేమెఱుఁగమె నెయ్యము కొలఁదుల్.

వ. అని బోధించినఁ దనమనంబున నాయించుఁబోఁడి 208

క. నానెయ్యపుఁదమిమహిమము, చే నప్పుడు విభుని తెఱఁగు చింతింపఁగ లేఁ
గాని సఖీజనకథితం, బైనది యింతయు నిజంబ యారసి చూడన్. 209

క కావున నేఁ జనవులకుం, బోవుట యిఁక ననుచితంబు బుద్ధిఁ దలంపం
గా వినువారలు నగరే, తా వలపున విభునికోడవఁ దలఁపనికాంతన్. 210

వ. అని విచారించుచు వారి కప్పటికిం దగినయుత్తరం బిచ్చి నిశ్చలం బైనధైర్యం
బున నెప్పటియట్ల ప్రవర్తిల్లుచుండె నంత నాఁటిరేయి భూనాయకుండు
తదీయగృహంబున కరుగునప్పుడు. 211

క నాయకుని రాకఁ గనుఁగొని, యాయచ్చరపూవుఁబోఁడి యత్యంతపరి
స్ఫాయద్భక్తి వినీతి వి,ధేయత ఘనసంభ్రమమునఁ దేటపడంగన్. 212

శా అత్యంతంబు నలంకరింపనిమనోజ్ఞాంగంబుతో తేనికిం
బ్రత్యుత్థానము చేసి మానికి బలెం బాద్యాదిసంపూజనా
కృత్యంబుల్ ఘటియించెఁ గాని పరసోక్తిస్మేరవీక్షాదిలా
లిత్యం బేమియుఁ జూప దయ్యె రతికేళీరాగరమ్యంబుగన్. 213

క. తలిమముపై నెరసులు గిరసులు లేకుండంగఁ దుడిచి సుకిదడిమపుదు
వ్వలువ పయిఁ బఱచి తలగడ, నిలిపె విభునిశయనమునకు నెలఁతుక యంతన్.

వ. తదనంతరంబ యందు నాత్మేశుండు పవ్వళించియుండ నాచంచలాక్షి చేరువఁ దా
నొక్కపసిండిగద్దియం గూర్చుండి యాకుమడిచి యొసఁగుచుండెఁ దత్ప్రకారంబు
గనుంగొని యాభూరమణుండు తనమనంబున. 215

సీ. శృంగారగంధి యై చిఱునవ్వు తెలిడాలు చెక్కుటద్దములపై బిక్కటిల్లఁ
బుష్పబాణోద్ధతిఁ బుంఖానుపుంఖమై తొలఁకుచుండుఁ గటాక్షవిలసనములు
నాకూతగర్భంబు లగుచుఁ జేనియ లుట్టఁ గలికిపల్కులు ప్రవర్తిలుచు నుండు
గుబ్బచన్నుల కెలంకుల నారు వోసిన య ట్లుప్పతిలుఁ బులకాంకురములు

తే. వచ్చి యే నిట్లు నిలిచిన నెచ్చెలువకు
నిప్పు డవిమాని యేమొకో యిట్లు శుష్క
వినయభక్తిపాతివ్రత్యవిహితవిధుల
నన్ను వంచించుచున్నది నళినవదన 216

వ. అని సంశయించి నేఁటిపాట లీపాటలగంధికిం గౌటిల్యకారణంబుగాఁ బోలుఁ బరీ
క్షించి చూచెదం గాక యని యాకిసులవదన కిట్లనియె 217

ఆ. నీ విదేమి చెప్పు నేఁ డొకలాగునఁ, గానిపించుచున్నదాన వబల
యెపుడు నే నెఱుంగ నిట్టివి నీయందు, ననుడు మాఱుపలుక కబల యున్న.

ద్వ్యక్షరికంద నానెమ్మనమును మానీ, మాననిమానమున మనను మన్నన నన్నో
మానిని నీమనమున నను,మానము మానమును మాని మనుమును నెమ్మిన్.

వ. అనుడు నచ్చెలువ సొలయుచు ని ట్లనియె 220
ఉ పాటల గెల్చినట్టిప్రతిపల్కులు పల్కులుగాక యిట్లు నేఁ
డోటమి నున్నమాపలుకు లోనృప యేటికి నీకు వట్టియీ
మాటల కేమి వోదు మది మక్కువ వే ఱొకచోట నుండఁగా
బోటుఁదనాలు చన్నె మిముబోంట్లకుఁ దక్కినవారికిన్ వలెన్. 221
ఉ. మాపని యేమి యున్నయది మానక యొక్కపు డీతెఱంగునన్
మీపాదగాన్పు గల్గుటయు మిక్కిలి నబ్బుర మింతనుండి మీ
కీపరిపాటిసేవ గచియించుటకే తగినట్టిదాన నో
భూపవరేణ్య యేను బెఱపోఁడుము లెంతటిదవ్వ మాకికన్. 222
చ అనయము నట్టిమన్ననలు నాబహుమానము నా ప్రియంబు నా
చనువును గల్గి యున్నపుడ చచ్చుట యుక్తము మాకు నట్టిశో
భనగతికిన్ విరోధి యగుపాపపుటాయువు దిట్టకొంటగా
కనియెడి దేమి యున్నది నరాధిప నిన్ను గుణైకభూషణున్. 223
క. సంగీతకళలఁ జెలఁగుకు,రంగాక్షి బెడంగులం గరంగుట దప్పో
భంగించి యితరకాంతఁ బ్రో,ఱంగుట తప్పో తడంబఱచి పురుషులకున్. 224
క. నా విని యేయపరాధము, నావలనం గలుగఁ దెలిపి నారీమణి యీ
భావమున నెన్నియేనియు, భావంబులు ముట్ట దూఱి పలికెదు గినుకన్. 225
చ. పయికొని నన్ను నిట్లు మరుబారికి లోనుగఁ జేయఁ బూని యే
నియతియొ నట్టిసందియము నీ కొనరింపఁగఁబోలుఁ గాని య
ట్టియహిత మేను నీకును ఘటింపను మీచరణంబు మీఁదియా
న యనుచు లేచి వచ్చి పతి నాతిపదాబ్జము వట్టఁ బట్టినన్ 226
ఉ ముట్టకు చాలుఁజాలుఁ గడుమోహపుదేవులకాళ్లు పట్టుకో
నెట్టును జెల్లుఁ గాక ధరణీశ్వర యేటికి వట్టిదోసముల్
గట్టదు నాకు నంచు నెడగాఁ జరణంబు దరల్చికొంచుఁ దా
బట్టఁ దదీయహస్తములు భామిని యాఁపుచు రెండుచేతులన్. 227
ఆ. అతఁడు నోసరోరుహాక్షి నీకంటె మో,హంపుదేవు లెవ్వ రంచు సతినిఁ
గ్రుచ్చి కౌఁగిలించుకొని యెత్తి యక్కునఁ, గదియఁ జేర్చుకొనియె గారవమున.
ఉ. అత్తలిరాకుఁబోఁడి యపు డశ్రుల నశ్రుకణంబు లొల్కఁ డ
గ్గుత్తికతోడ నీదయకుఁ గూర్మికి లాలనకుం గొఱంతె రా
జోత్తమ కల్గునే కలుగ దొక్కపుడున్ మఱి యేమొ నేఁడు నా
చిత్తములోన మాన దొకసిగ్గును విన్నఁదనంబుఁ దాఁపమున్. 129
వ అనుటయు నమ్మహీకాంతుం డోకాంత నీచింతతెఱంగె నెఱుంగుదు నేఁటి
దాఁక నెందు నద్వితీయం బనఁ బొగడ్తం గాంచిన నీవిపంచి యితరనారీగానంబు

చేత నవమానితస్వాంతంబగుట యెట్లని వగచుచున్నదానవు దానికంటె నత్యు త్తమంబైనవిచిత్రవల్లకి యొక్కటి యేను మత్పూర్వజన్మంబున ధరియించినది యొక్కచోట నున్నది యని విన్నవాఁడ నది యెటులనైనను సాధించి తెచ్చి తద్వాదనాభ్యాసంబుతోడ నైన నిన్నంతటివారికిని మీఱ శక్యంబుగాని గాన విద్యనుద్యోతించునట్లు చేసెద నమ్ము మనియె నవ్వనితయు నతండు పూర్వజన్మంబున మణికంధరుం డను గంధర్వకుమారుం డగుటఁ దాను నెఱింగినది గావున నతనికి నట్టివీణె గలుగుట సంభవించునది యని మనంబునను సరిపుచ్చుకొని సంతసిల్లెఁ గళాపూర్ణుండు నివ్విధంబున డెందంబు కందువాపి సాంద్రానందంబున నభినమత క్రీడల రమించె మఱునాఁడచ్చెలువ నెచ్చెలులముచ్చటలవలనఁ గర్ణాకర్ణిక నవ్వార్త మధురలాలసచెలికత్తెలు విని యన్నెలఁత కెఱింగించిన నయ్యంగన తనమనంబున. 230

క. గానాదికళలకొదవలు, దాన తగం దీర్చి పతి ముదం బొనరింపం
గా నునికి కెనయె పతి దమ, గానాదుల మెచ్చఁ జేయు కాంతల బ్రదుకుల్ 231

ఆ. నాకుఁ దేఁ దలంచులోకోత్తరపువీణెఁ, దనకు నొసఁగఁ జేసికొనియె నార
వరునిప్రేమ నడువఁ దెరవాటు గొట్టెని, ట్లుండ వలదె జగతి నువిద యైన 232

చ. అని తలపోయుచుం జలరుహానన దాన నొకింత వింతరీ
తిని గనుపట్టఁ గన్గొని రతిక్రియవేళఁ దదీయచింత మా
న్చె నతఁడు కాళ్లమీఁదఁ బడి శీఘ్రమ తత్పదభూష లష్టది
గ్జనపతిదారమౌళిమణిసంతతిఁ జేయఁ గృతప్రతిజ్ఞుఁ డై. 233

గీ. ఈగతిం దనకాంతల కిరువురకును, దా నొడంబడినట్టియర్థములు రెండు
తలఁపులోపల నుండఁ దత్సాధనార్థ, మొక్కవేళ నృపాలుఁ డిట్లూహఁ జేసె

సీ. అభినవకౌముది కావీణె యున్నచో టెఱిగించి పొమ్మన్న నిపుడ పోయి
తెచ్చుకొనోపుఁ దా దివ్యకామిని గాన నైన నా కనుచితం బట్ల పనుప
దాన మత్సామర్థ్యహీనత దోఁచుఁ గావున నట్టుగాఁ దేను జనులఁ దగిన
వారిఁ బంచినవిఘ్న కారు లెవ్వరు గలరో మాన్పుకొన సమర్థులుగ వలయు
తే. నింక నటుగాక తద్దేశ మేలుదొరకుఁ
జెప్పి పంపిన నతఁడ యాశించునేమొ
యిన్నియును మాని యేనె దండెత్తి చనిన
నదియుఁ దన్మార్గరిపులసంపదలు చేరు. 235

వ. ఇంక మధురలాలస కొడంబడినయందియలు సాధింప దిగ్విజయంబునందుఁ గాని శక్యంబుగా దని తోఁచుచున్నయది యని విచారించి యూహాపోహార్థంబున సకల నిజకార్యభారధౌరేయు సత్త్వదాత్మనామధేయుం బిలుపించి. 236

క. లోనికి నపు డెవ్వారిని, రానీకుండంగ ద్వారరక్షుల నిడి ధా
త్రీనాథుండే మంత్రవి,థానోచితభవనమున నతండును దానున్. 237

తే. ఏగి తనతలఁపుఁ బ్రకార మెల్లఁ జెప్ప
నధిప సరిదాఁకెఁ గద నేటియత్న మెల్ల
నాఁడు మధురలాలసలక్షణములు చూచి
యే వినినమాట కని ప్రీతి నెసఁగె నతఁడు. 238

తే. అనుడు నతఁ డట్ల యవు నని యపుడు నగుచు
నింక దీనికిఁ గర్తవ్య మెద్ది మనకుఁ
బదియుఁ బదియునుగా నీతిపదవి నరసి
తెలియఁ దగు నని యిట్లని పలికె మఱియు. 239

ఆ అనఘ శ్రుతిచతుష్ట యైకాదిగమ్యమై, నిపుణమంత్రిసంప్రణీత మగుచుఁ
గడు నపూర్వఫలము గావించుమంత్రంబు, యజ్ఞశీలునకు ధరాధిపతికి. 240

క నాకుం జూడఁగ నీతిక,ళాకలనము లల్పశౌర్యలతెఱంగులు గా
కేకార్యమునకు వచ్చుజ,యైకపదము శౌర్యబలమ యనియుం దోఁచున్. 241

తే. ఎచట నెపు డెద్ది చేఁబూని యెట్టివానిఁ
బ్రబలశౌర్యుండు దాఁకి పరాక్రమించు
నదియె పోరికిఁ దగుదేశ మదియె సమయ
మదియె కైదువు శక్తుండు నతఁడె గెలువ. 242

ఉ ఆల మొనర్పఁ బూనురిపునగ్రమునం గనుఁగొన్న నొక్కయా
భీలపుఁదేజ మప్పు డటు బిట్టుదయించును శౌర్యశాలికిఁ
జ్వాలలు మున్ను గూర్చుకొనివచ్చి దహించునె కాననంబు దా
త్కాలికహేతిసంపదలఁ గాక హుతాశనుఁ డెంచి చూడఁగన్. 243

ఉ ఏనుఁగు శైలతుల్యత వహించియు మందగతిత్వదోషముం
బూనుట వధ్యభావమును బొందెఁ దనుస్థితి గొంచె మయ్యుఁ బం
చానన మెంతయుఁ సరభసాతిశయోత్పతనప్రభావముం
బూనుట ఘాతుకత్వమును బొందె జయంబులు శౌర్యసాధ్యముల్. 244

క. సకలకళానిపుణులు సే,వకులై కొలువఁగఁ బ్రతాపవంతుఁడు గొలిపిం
చుకొనుం గావునఁ బోలవు, సకలకళలు నొకప్రతాపసంపదతోడన్. 245

చ. ఇనుఁ డొకచో నొకింత యుదయించినమాత్రన విచ్చిపోవ్వ హె
చ్చినపెనుచీఁకటుల్ నిరవశేషముగా నవి యట్లు విచ్చిపో
వనయము శీతధామునికళౌఘమృజావిధి నైన వీనిచే,
తన కనరాదె యేరికిఁ బ్రతాపకళాగుణతారతమ్యముల్. 246

చ. ఒకఁ డొకకేల నొంచె నధికోన్నతిఁ జేర్చినమేరుశైలనా
యకుఁ బెఱవేల్పు లందఱుఁ జిరాశ్రయణంబున వంపలే రొకిం
చుకయును బుద్ధిలో నరసి చూడ జగంబుల నుగ్రుఁ డగ్రబ్రసి
ద్ధికి బుధు లన్ప్రసిద్ధికిని దెల్లము గా నివి సూ ఫలస్థితుల్. 217

మ. ఇది యత్యంతము దుష్కరంబు సుకరం బీకార్య మన్నేదచిం
త దగుం గొంచెపుఁగార్యకర్తయెడ నత్యంతప్రతాపాఢ్యునం
దది యెంతే విఫలంబు దారువులకుష్కాకుష్కతాభేద ము
ద్యదతిస్ఫూర్జితదావపావకునెడన్ వ్యర్థంబు గాదే కడున్. 248

క. కావున శూరుం డుత్సాహావేశం బైనయపుడె యహితులమీఁదన్
వేవేగ దండు గదలం, గావలయుం గదల నిపుడు కాలోచితమున్. 249

చ. అన విని సత్వదాత్ముఁడు ధరాధిపుతో వినయంబు మీఱ ని
ట్లను మనుజేంద్ర నీవు గనునట్ల నయస్థితి నేను గాన నే
ర్తునె యయినన్ మనంబునకుఁ దోఁచినలాగున విన్నవింతు నీ
యనుమతిఁజేసి నిర్భయత నాప్తుల కిచ్చక మూడ వచ్చునే. 250

ఆ. ధరణినాథ కడుఁ బ్రతాపోజ్జ్వలం బైన, నీదుభావమునకు నాదుమృదున
యోక్తి యొకటఁగొంతయొప్పైనఁ గైకొమ్ము,జ్వలితఖడ్గమునకుజలముపోలె.

ఆ. నృపతి నీతిపథము నీఁదువాఁడు తెప్పను గదాకులుండు పథ్యవిధిని
విడిచియును నొక్కొక్కయెడ జయించుట గల, దైన నిందఁజెందు నజయమైన.

క నీతిపథంబున నడుచుమ,హితలనాయకున కొక్కయె గ్గొదవినఁ దా
రాతని నిట్టట్టనరు వి,ధాతం దిట్టుదురు గాని ధరణిన్ లోకుల్ 253

తే. ఎందు నీతివిహీనుని జెందునట్టి
సిరిని దిట్టుదు రెట్లు దాఁ జేరె నతని
ననుచు భూజను లందఱు నినుముఁ గూడి
యున్నయగ్నికిఁ బెట్టు రాకుండు నెట్లు. 254

ఉ. ఏయెడ నెంతయున్ వినుతి కెక్కినయట్టిబలంబునం దనూ
చ్ఛ్రాయము పేర్మి చేతఁ దముఁ జాలఁగ మించినసామజంబులన్
ధీయుత యడ్డకట్టుకొని తెచ్చి నరుల్ దమ కెక్కురింతలం
జేయుట నీతివైభవవిశేషము గాదె తలంచి చూడఁగన్. 255

ఉ. ఇమ్మెయి నాచరింపఁదగు నీపని యీపని యి ట్లొనర్ప సా
ధ్య మ్మగు నన్నయుక్తియొకదా భువి నీతి యనంగఁ దద్వివే
కమ్ము మహాబలాఢ్యునకుఁ గానఁగరాదు పురత్రయీజయా
ర్థమ్ము నగంబు చాపముగఁ దాల్చినరుద్రుఁడె సాక్షి దీనికిన్. 256

ఆ. వింటఁ దొడిగి యేయ వెసఁ జను నెంతద,వ్వంతదవ్వు చనునె యంపకోల

దేవుఁ డైన రిత్తచే వైవ నటు గాన, బలిమికంటె నీతిబలిమి లెస్స 257

ఆ. విను నృపాల సంధివిగ్రహంబులు యాన,మాసనంబు ద్వైధ మాశ్రయమనఁ
దనర షడ్గుణములు దగు వేళ సలుప మే, లొసఁగు ససముయప్రయుక్తిఁ గీడు

ఆ. ధరణి సామభేదదానదండము లన
నాల్గుపాయము లని నామములును
లక్షణములు చెప్ప దక్షు లిందఱు ప్రయో
గాప్రయోగవిధులు గలుగు టరుదు 259

ఆ. గోరఁ బోవుపనికి గొడ్డలియును దాన, సలుపుపనికిఁ గోరు బలె నృపాల
గురులఘువ్యవస్థ యరయ నీచతురుపా,యప్రయోగకరణ మనుచితంబు. 260

సీ. సరిగాఁగఁ బదవు లొండొరులకు నడవఁగా సమవిపక్షునియందు సామవిధియు
మూలబలంబు పెంపున దుర్జయుం డయి పేర్చుశాత్రవునందు భేదవిధియు
నెందును సంధిని హితులబలంగంబు చే నొప్పరిపునందు దానవిధియు
సాధునిశ్చితపరాజయుఁ డై విహీనబలుం డైనయరియందు దండవిధియుఁ

తే. జలుపవలయు ధరాతలేశ్వరవరేణ్య
బుద్ధియందు క్షయస్థానవృద్ధు లనుత్రి
వర్గము నెఱింగి పంచాంగవర్తనములఁ
దెలిసి శక్తిత్రయంబున వెలయవలయు. 261

సీ. మంత్రగోపనము నేమఱుటయు దీర్ఘచింతయు నిరర్థకపుఁజింతయుఁ బ్రసాద
విరహితత్వము బుధావిజ్ఞానము శుభాప్రయోగంబు విషయానురాగభరము
ననృతంబు నాలస్యమును నాస్తికత్వంబు నర్థంబులందు ననర్థమతియు
దీర్ఘసూత్రత్వంబు దీర్ఘరోషంబు నిర్ణీతకార్యము లాచరింపమియును

ఆ. భూమిపతికి దోషములు నివి పదునాల్గు, వీనిఁ దెలిసి నెఱయ విడువవలయుఁ
గామరోషజంబు లై మీఱినట్టిస,ప్తవ్యసనములందుఁ దగుల వలదు. 262

క. కొలిచినవారలజీతం,బులు వేళలు దప్పకుండఁ బూర్ణముగా నీ
వలయును వారలప్రేమము, బలము నృపాలునకు నెల్లపట్లను మిగులన్. 263

క. ఏయేకట్టడ లెవ్వరి, కాయాకట్టడలు దప్ప కధిపతి ప్రజలన్
నాయమునఁ బ్రోవవలయుఁ గృ,పాయుతుఁ డై తస్కరాదిబాధ లుడుపుచున్.

క. దండార్హుల దండింపమి, దండానర్హు లగువారి దండించుట యీ
రెండు నకీర్తిదములు భూ,మండలనాయకుల నిరయమగ్నులఁ జేయున్. 265

క. ఇవి యన్నియు నిపుడు ప్రసం,గవశంబునఁ జెప్పఁబడియెఁ గాని సకలనీ
తివిదుఁడ వీ వలఘువిధ, ప్రవర్తనము నీక కలదు పార్థివముఖ్యా. 2'6

ఆ. సకలదిగ్జయంబు సలిపినయట్టిమ,దాశయుని జయించినపుడె సిద్ధ
మెల్లదిశల నీదుకిల్లాకు సాగుట, యైన నృపులశాంతి యస్థిరంబు. 267

వ. కావున నీవును జని యీనడుమ నంకురితదర్పు లగుచు నెదుర్పడం గడంగు గడుసుదొర లెక్క డెక్కడంగలరో వారి నుక్కడంచి దిక్కుల నప్రతిహతంబులుగా భవత్ప్రతాపంబు నెఱపుట దగినకార్యంబు దేవర యానతిచ్చినట్ల తదుచితసమ యం బిదియ యెట్లంటేని నీవు మధురలాలసకు సకలదిగ్దేశాధీశశుద్ధాంతకామినీ మౌళిమాణిక్యనిర్మితనూపురసమర్పణంబు శీఘ్రంబు సేయుటకుఁ బ్రతిన పట్టుట చెప్పుచున్నవాఁడవు తాదృశమంజీరధారణకారణం బైనయానారీమణియదృ ష్టంబు శీఘ్రభావిఫలం బగుచు నిన్నునట్టిప్రతిన వట్టించెఁ దప్పదు దాననచేసి జయంబు నవశ్యలభ్యంబ యభినవకౌముదిప్రయోజనంబును దదానుషంగిక ఫలంబగుచు సిద్ధించుట చెప్పవలద కావున నీతిచాతురీపూర్వకంబు దండయాత్ర సలుపు మని యిట్లనియె. 268

చ. బలములు గొంత శాత్రవునిబల్మి నడంగినపిమ్మటన్ ధనం
బులపస దండువెచ్చములఁ బొల్పఱి పోయినయట్టిపిమ్మటన్
గెలిచిన గెల్పు గెల్పె యగు నీసతిభాగ్యము సార్థమే యగున్
బలధనహాని యింత కడుఁ బాటిల కుండును నీతిమైఁ జనన్. 269

శా. ఓరాజేంద్ర ప్రదక్షిణక్రమముగా యుక్తంబు దిగ్జైత్రయా
త్రారంభం బటు గాన గెల్వు మును ప్రాచ్యావాచ్యపాశ్చాత్యులన్
నీ రాష్ట్రంబున కెగ్గొనర్చుటకుఁ బార్ష్ణిగ్రాహుఁ డివ్వేళకున్
సారోదగ్రుఁడు మాగధుం డిపుడు తత్సంధాన మర్హం బగున్. 270

వ. అని విన్నవించి. 271

శా. సారప్రస్ఫురితాంగపంచకలసత్సంధ్యాదిషాడ్గుణ్యవి
స్తారోద్యత్సచివైకమత్యకృతమంత్రప్రక్రియానిర్ణిరో
ధారారూఢితశక్తియుగ్మభృతరాజ్యశ్రీపరిభ్రాజితా
చారుస్ఫూర్తికళావిరాజితసమస్తక్షోణిభృత్పూజితా. 272

క. బంధురభేరీభూరిధణంధణరవచలితవలయనగధాతురజో
బంధుత్వప్రత్యుద్గమ, సంధుక్షితదోఃప్రతాప శౌర్యకలాపా. 273

మాలినీ. గురుతరజయధాటీ ఘోటకస్తోమచంచ
త్ఖురపుటదళితక్ష్మాధూళిధూమ్యాపలాయ
త్పరనృపమశకౌఘా ధర్మవిధ్వంసితాఘా
నరవినుతచరిత్రా నారభూపాలపౌత్రా. 274

గద్యము. ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళీయమరనార్యత నూభవసౌజన్యజేయసూరయనామధేయప్రణీతం బైనకళాపూర్ణోదయం బను మహాకావ్యంబునందు సప్తమాశ్వాసము.

శ్రీ ర స్తు.

# కళాపూర్ణోదయము

## అష్టమాశ్వాసము.

---



లాకీర్తిసతీసమ
లాలనఖేలనగుణాచలద్ధాత్రీణా
శీలితపుణ్యజయత్కర
వాలా నంద్యాలకృష్ణవసుధాపాలా 1

ఆ. అవధరింపు మమ్మహామాత్యవరునీతి,సరణి విని కరంబు సంతసిల్లి
యిద్ధతేజుఁ డానరేంద్రుఁ డప్పటికిని, మగధరాజుసంధి దగున యనుచు. 2

ఉ. ఆనరపాలుపాలికి షడంతరరాతిజయంబుకల్మియున్
మానగుణంబు నాప్తతయు మాటలనేరుపు ధైర్యముం బరా
స్థానజనానురంజనసుదక్షతయున్ వినయోద్ధతిస్థలా
నూనవివేకముం గలనయోన్నతు నంపెను రాయబారిగాన్. 3

సీ. ఆరాయబారియు నగ్రసంప్రేషితజనులచే మగధేశ్వరునిపురోహి
తప్రధానాదులఁ దగుసామదానవివర్తనంబున నిజవశులఁ జేసి
యతిగౌరవప్రవేశితుఁ డై సభాస్థలిఁ దద్విభుఁ బ్రశ్నోచితంబుగాఁగ
దేశకాలాదివార్తాశంసనముఁ బ్రజేశ్వరుమహిమత్వమున్ జరుగ నడపి
తే దాన నెదిరికి మానంబు దఱుగకుండఁ, గడును దద్గుణస్తుతిఁ జేసి కలయనాడి
మఱియుఁ గలనీతిపటిమ నాత్మప్రభునకు, నతనికిని రాను సంధాన మమరఁ జేసె.

చ. అనుపమనీతిశౌర్యనిధి యంగమహీరమణుండు నర్హావ
ర్తనమునఁ జాల యంత్రధనధాన్యబలప్రముఖంబులందు నెం
దును గొదలేక యుండ గడిదుర్గములుం దనరాజధానియున్
ఘనపరిరక్షణక్రియఁ దనర్పఁగఁ జేసె దృఢప్రయత్నుఁ డై. 5

క. తనబలనాథుల కందఱకును జెప్పించెను గరంబు కోర్కెఁ బ్రయాణం
బును వారలు నుత్సాహము, దనరఁగఁ జాటించి రపుడు తమపాళెములన్. 6

ఉ. అంబుజమిత్రుఁ డంత నపరాంబుధిఁ జేరఁగఁ బోయె నాత్మబిం
బం బపు డంతకంతకుఁ గ్రమప్రభవన్నికటత్వతారత
మ్యంబున సంక్రమించుతదుదంచితవిద్రుమరాగవీచిశై
త్యంబులఁబోలె రక్తిమము తద్దయుఁ బూనఁగ వేఁడి మానఁగన్ 7

ఉ. కాలకృషీవలుండు గడఁకం బరిణత్యరుణాతపచ్ఛటా
శాలిచయంబు గోసి పెలుచం బన మోయుచు నున్నవాఁడు గాఁ
బోలును గుప్పగా నన నభోమణిమండల మంతకంతకుం
జాల విశాల మై చరమశైలము చేర్పున నొప్పెఁ జూడ్కికిన్. 8

ఉ. కాలకలాదుఁ డింతయును గాంచనరేణువు ప్రత్యగాశనాఁ
గ్రాలెడు కోవిఁ గూర్చి కరఁగంగఁ బ్రవర్ధన మొందుజాళువా
మేలిమిపూదె నాఁ బొలుపు మీరెడి నిను డది గాఁక యూర్పఁ గీ
లాలనిమజ్జితం బయినలాగునఁ గ్రుంకెను బశ్చిమాంబుధిన్. 9

చ వడిఁ దనుఁ బాఱఁగాఁ దఱుము వాసరకర్షకుచేతిభానుఃడ్క
బెడిదపుగుండు మార్చి కడుఁ బేర్చుచు రోదసిపేరిపంటచే
నుడుగక చొచ్చురే యనువనోద్ధతహస్తిమొగంబునందు నొ
ప్పెడుఘనబిందుబృంద మనఁ బెంపెసఁగెం గడసంజ చూడ్కికిన్. 10

ఉ. కేశవుఁ డవ్విరాట్తనువు కృష్ణసమాఖ్య వహింపఁ జేసెనో
యీశుఁడు మూర్తు లెన్మిదియు నేనికతోలునఁ గప్పెనో సమ
స్తాశలు గూడి వృత్రదనుజాధిపభూమికఁ దాల్చెనో యనం
జెశలతం దమఃపటలి పేర్చి సమస్తముఁ గప్పె నంతటన్ 11

తే. నింగి యనియెడిప్రత్తిచేనికిని రక్త
బలియిడి రనంగ నెఱసంజ తొలుత నమరఁ
దఱుచుగాఁ దాన విఁటిసిన మెఱుఁగుఁబ్రత్తి
విళ్లు నాఁ జుక్క లెంతయు నుల్లసిల్లె. 12

చ. అరయఁగ నూర్ధ్వలోకము ప్రశస్తకమయం బయి సంశయంబుగా
నరుదుగ నెంతయుం బ్రకటమై యదిగో గగనంపుఁబ్రాఁతచ
ప్పరము సుహీరవ్రజంబున విభాసిలుచున్నది యంచుఃజూపఱుల్
గరము కుతూహలంబు మెయిఁ గన్గొనఁగాఁ దనరారెఁ దారకల్. 13

తే. అంత సమరాధినాథుగృహాంగణమునఁ
జాల గంధంపుఁగలయంపిఁ జల్లి రనఁగఁ

దూర్పు దెలు పయ్యె నంత నందును దదీయ
గజము నిలిపిరొ యన సుధాకరుఁడు దోఁచె. 14

తే. కాల మనుకువిందుఁడు చంద్రికాపటంబు
నేయఁ బన్నినమగ్గముకో యనంగ
నవమయూఖాళి గొనసాఁగి మిగుల నొప్పె
విధుఁ డమరె వానిగృహాభిత్తివివర మనఁగ 15

ఆ. వెల్లమడుఁగుఁగోక విచ్చినరీతిఁ బ్రాలారఁబోసినట్టియందముగను
బిండిఁ జల్లినట్లు పండువెన్నెలలు గ్రాయంగఁ దోడఁ గెఁ జెలువ మమర నంత.16

మ. కలయన్ లోకములందుఁ బర్వినతమఃకాలుష్యముం జంద్రికా
ఖ్యలసత్స్వత్త్వగుణప్రకర్షమునఁ బ్రక్షాళించుచుం దద్దయుం
బొలుపొందెన్ ద్విజరాజమండలము పెంపుల్ మీఱ నొక్కొక్కచో
జలదం బుండెను మీఁదమీఁద భవదోషప్రక్రియం బర్వఁగన్. 17

ఉ. ఇట్టిటు యామినీరమణుఁ డేఁచఁగ నెప్పటిలీలఁ జాలఁ జా
పట్టమిఁ జూచి శ్రీనెలవు పద్మినిఁ గైకొన కప్పు డక్కటా
గట్టిగఁ దత్ప్రియాళితతి కైరవిణిన్ వెసఁ జేరె రాజు చే
పట్టినవారు దేవు లనుపల్కు యథార్థము చర్చ సేయఁగన్. 18

సీ. కొనుఁడి వేవిరు లన్నఁ గొననేలనినుఁజూడ మరుఁడురువ్వెడువిరుల్వీరివియనుచు
నీవట్టిమాటల కా వచ్చు టన్న న శ్లేము రా మిది వెల యింద మనుచు
నిపుడు మీయిష్టంబు లిం దెవ్వి యనిన నా కవ్వి డాఁచినగుచ్ఛకములెయనుచు
నివి చెల్ల కవి యమ్మెడివి చాలుఁదలుఁడన్న నెఱుఁగుదు మిపుడంట మేమునను చు
తే. బైటివాని నొల్లక తడిపావడలను, బొదివి పెట్టినయవి దివఁ బోవునట్టి
యువజనులదంటమాటల కొప్పి నగుచుఁ, బుష్పలావిక లమ్మిరి పువ్వు లపుడు.

వ. అట్టిసమయంబునఁ బట్టణంబునం గలదండనాయకు లందఱుం దమయేలికజయ ప్రయాణంబునకుం దగినసన్నాహంబున నాయత్తపడుచుండిరి కళాపూర్ణుండు నభినవకౌముదిమందిరంబున కరిగి యయ్యోగురుఁబోఁడితోడ నోకకమలవదన నీకు నొడఁబడినవీణియసాధించుటకు దిగ్విజయం బొనర్చునంత వలసె నేఁటి వేకువఁ దత్ప్రయాణం బని యెఱింగించి మధురలాలసపాలికిం జని యాకంజవదనతో ని ట్లనియె. 20

క. నీనూపురంబుమణులకు, నై నిఖిలదిగంతవిజయయాత్ర యొనర్పం
గా నెల్లి మంచిదివసం, బో నెలఁతుక యనుచుఁ జెప్పి యొగి నలిగింపన్. 21

చ. తమతమయుంగనల్ కరము తత్పరతన్ బిగియించుకౌఁగిళుల్
గమనపువేడ్క నించుకయుఁ గైకొన కెప్పుడు తెల్లవాఱునన్

దమకము మానసంబులను దాల్చుచు మాటికి నెల్లవారు సం
భ్రమమునఁ దూర్పు చూడఁ గడు భాసిలె నాఁటిత్రియామ మిక్కిలిన్. 22

సీ. సమకాంతిఁ జదలఁ దోఁచనినీలిగవిసెన సిడిమ్రాఁకుతుద నడ్డపడఁగ విధుఁడు
వలసినప్పుడు దాని వ్రాల్చుటకై కట్టినట్టిపగ్గములు దీర్ఘాంశులతలు
రతిరాజు సిరి హెచ్చ రజనికాళికి నిడి యాడుకోకిలభటుఁ డంకశోభ
యతనిమీఁద వసంత మాడుకప్రపుధూళి చంద్రిక విరులు నక్షత్రసమితి

తే. యారజనికాళి యొండేని నరుగఁ దలఁచు
టెఱిఁగి వ్రాల్పించుచున్నవాఁ డేమొ యిప్పు
డతఁడు తల నిఱుకొమ్మునా నంతకంతఁ
గోరి చంద్రుఁడు పడమట వ్రాలఁ జొచ్చె 23

తే. కోడి తపతప ఱెక్కలు గొట్టుకొనుచుఁ
గూయుక్రమ మొప్ప మీఱె వేకువ యనియెడు
కనమ గట్టి వధూమానధనము దోఁచు
నసమశరుఁడు తప్పటఁ గొట్టి యార్చె ననఁగ. 24

ఉ. పారదబద్ధసద్ఘుటిక పాకపరీక్ష గొనంగఁ జంద్రికా
క్షీరమునంచుఁ గాఁ సమయసిద్ధుఁడు పెట్టె ననంగఁ జాల నొ
ప్పారెను వేగుచుక్క యది యంటినచోటు సువర్ణ మయ్యెనో
నా రమణీయ మైనయరుణద్యుతి తద్దయుఁ దూర్పు శోభిలెన్. 25

చ. హిమకరుఁ డప్పు డొప్పెఁ బ్రణయించి తుషావృతి నిడ్డ గార్హప
త్యముక్రియ దక్షిణాగ్నిగతిఁ దాల్చె నగస్త్యుఁ డనూరుదీప్తి సొం
పమరె సముల్లసద్ద్యుతియుతాహవనీయము నా నొకొక్కచో
సుముకలబూది చిందినది యో యనఁ జిల్లరచుక్క లుండఁగన్. 26

వ. అంత. 27

సీ. సమయవ్యతిక్రమశంకాససంరంభజాగ్రదుద్ధితసర్వజనచయంబు
రథ్యకేతనముఖ్యరణకార్యఘటనాదిసంభ్రమాకులసూతసంచయంబు
ఘంటాకుథాప్రముఖద్విపసన్నాహభూరితరత్వరాధోరణంబు
పల్యయనఖలీనబంధాదిసైంధవకల్పనాలోలాశ్వికవ్రజంబు

తే. తక్రదధ్యుపదంశాదివిక్రయకర, భామినీహూతివాచాటభటకదంబ
సమవలంబితభోజనచాపలంబు, నగుచు నవ్వేళఁ దనరె నన్నగర మంత. 28

సీ. పొందుగా నందలంబులు పల్లకీలు దక్షత నాయితము సేయుశైబికులును
దగువాహనముల నంతగపురకాంతల నిడి దిడ్డు వైపించుహెగ్గడులును
ద్రోవఁ బౌఁజులఁ బెట్టి దొలుతగాఁ దమతమ మొనలగల్పఱచుచమూపతులును
నుష్ట్రవామీశకటోక్షాదివాహిత భర్మపేటికు లగుభోరికులును

ఆ. గరము సంభ్రమింప ఘనతర మైనత,త్కాలకలంబు లపుడు పోలుపు మీఱెఁ
గైరవప్రియోదయారంభఘూర్ణమానార్ణవారవంబు ననుకరించి. 29
సీ. ప్రస్థానసముచితబ్రహ్మమంత్రముల భూగీర్వాణపంక్తు లాశీర్వదింప
జయజయ దేవ యన్శబ్దజృంభణముతో బిరుదావళులు వందివరులు చదువ
వేత్రహస్తులు పేళ్లు వివరించి చూప సామంతభూనాథు లంతంత మ్రొక్కఁ
బట్టపేనుఁగుఁబైఁడిపల్లకితేజీని దగ నాయితము సేసి దండఁబెట్ట
తే. జైత్రభేరీధణంధణశబ్దమహిమ, గరము ఘూర్ణిల్లె దిక్కులు గ్రక్కదలఁగ
లలితగుణయుక్త మగుశుభలగ్నవేళఁ, దనదుభవనంబు వెడలె భూతలవిభుండు
క. ఇత్తెఱఁగున వెడలి యతం, డుత్తమకరి నెక్కి దిగ్జయోత్సాహవిలా
సోత్తంభనకాహళికా, తుత్తుంభధ్వనులు వారిధులఁ గలఁగింపన్ 31
చ. గురుతరకేతుధూతఘనకూటము లైనమహారథంబులుం
జలదవనీధరేంద్రములచాడ్పున నొప్పెడుసింధురంబులున్
మరుదవమాననాచతురిమస్ఫుటవేగము లైనవాజులున్
వరభటసంచయంబు గొలువన్ వెడలెం బుర మూతఁ డంతటన్. 32
వ. అప్పుడు. 33
సీ. మిళితభూగగనాంతములసందు విచ్చినఁ గాన్పించుబ్రహ్మాండకాంతి యనఁగ
దిశ లెన్న చిది పూర్వదిశ యని బ్రహ్మ నిల్పినయట్టిమొదలిటిలెక్క యనఁగ
నుదయాచలాధీశునుత్తమాంగంబున భాసిల్లుహొంబట్టుపాగ యనఁగ
గగనాఖ్యపనసవృక్షప్రకాండోదరి భ్రాజితం బగుపక్వఫల మనంగఁ
తే. దారకాభర్త చంద్రికాతీరభోజ
నాంతమునఁ బూర్వసంధ్య యన్కాంత వెలిచి
లీలఁ జేర్చినపసిఁడిపళ్లెర మనంగఁ
ధరణి విశ్వంబు గాన్పించె వరుసతోడ 34
వ. ఇవ్విధంబున సూర్యోదయంబున సకలజనమనోరంజకం బగుచునొప్పుచున్నంత.
చ. ధళధళనాయుధద్యుతివితానము గ్రమ్మఁగ జాల నొప్పుచున్
వెలువడుసేనలుం బురమువీథులు సన్మణిసౌధకోటితోఁ
బోలు పెసఁగెన్ దినేశరుచి పూగదగద్గిరితాంబుసారిణీ
విలసితపుష్పితోపవనవీథులువోలె సురాళిచూడ్కికిన్. 36
క. అంతటఁ బ్రాకారద్వా,రాంతము సమ్మర్ద మెసఁగ నత్యంతాయు
ష్మంతులము గదా యనుచును, సంతసమునఁ గడచిపోవుజను లాడికొనన్. 37
వ. ఇవ్విధంబునం గ్రముకకంఠోత్తరపురద్వారంబు నిర్గమించి తద్బలంబులు నడుచు
నప్పుడు. 38
తే. ఎంతదవ్వులవస్తువు నెదుటఁ గాన, నైరి ప్రథమనిమేషంబునందుఁ దక్క

దానిఁ నంతన కడచురథవ్రజంబు, వేగమునఁ జేసి రథికులు వెఱఁగుపడుచు. 39

క. తురగప్రచారమును గుం,జరమదముఁ బరస్పరాతిశయచాపగుణ
స్ఫురణము నొదవ నపంకము, నరజస్కము నగుచు మార్గమప్పుడింపొసఁగెన్.

సీ. జల్లులతోడి పెన్బల్లెంబు లెగవైచి పట్టుచుఁ జేరముల్ పాఱువారు
మెఱుఁగులు చూడ్కులమిఱుమిట్లు గొలుపంగఁ జేకతారుల బయల్ చిమ్మువారు
బెడిదంపుటరిగెలు బిఱబిఱఁద్రిప్పుచు వడిఁ బిల్లుమొఱములు వైచువారు
తెగనిండఁ దిగిచి నల్దెసలకుఁ బొల్టకోలలు చూపి పల్లటీల్ దాఁటువారు

తే. నొండొరుల కభిముఖులైన నుబ్బువారుఁ
గడలు చాపుచు వేడుకకయ్యమునను
జెలఁగి తమదొరలకు నింపు సలుపువారు
నగుచు వీరభటుల్ మించి రతిశయమున. 41

తే. మునుపుగా నేఁగి యసిమగొల్లెనలు వన్ని
త్రోవ నెక్కడెక్కడ నేమి గావలసిన
యట్టిభక్ష్యభోజ్యాదులయమ్మకమునఁ
దనియఁ జేసిరి వణిజులు తద్బలముల 42

చ. వలసినచోటనెల్ల నభివాంఛితవస్తుచయంబు గల్గుటన్
లలనలు దారు సాంద్రవరణంబుల నొప్పెడుపల్లకీలఁ బోఁ
గలుగుట నర్థవంతులకుఁ గట్టిన నాన్నృపుదండయాత్ర యిం
పలరఁగఁ జేసెఁ బట్టణమునట్ల యనర్గళభోగహేతువై. 43

చ. అలఘుబలప్రతాపయుతుఁడై యతఁ డష్మెయి వచ్చుదండువా
ర్తలు వినుచుం దదగ్రదిశ రాజులుఁ గొందఱు ముక్తమార్గులై
వలసలు పోవువారుఁ దగువస్తువు లప్పనఁ బంపువారుఁ గే
వలవినయంబుతోఁ గొలుచువారును నైరి యథోచితస్థితిన్ 44

వ. అంత 45

సీ. సకలసౌభాగ్యలక్షణధన్య యైనట్టి మధురలాలసకు నత్యధికపుణ్య
విభవకు జగదేకవీరపత్నికి నందె లఖలదిగ్ధరాధిపతుల
పట్టపుదేవులు భరియించుమౌళిరత్నములఁ జేయింపఁ దన్నాథుప్రతిన
యేతదర్థంబు దండెత్తి తా నిదె యమ్మహారాజు వచ్చె నీయర్థములను

తే. ప్రాణముల నిల్పుకొనుఁ డింక రాజులార
యెదురుగాఁ దగ దిష్టంబు లిచ్చి యనిపి
యనుచుఁ దనపత్రికలు సత్వరాత్ముఁ డనిపె
నరపతుల కెల్లఁ గొందఱు నడచి రట్ల. 46

క. ఇత్తెఱఁగునఁ దగఁ గానుక, పుత్తెంచిననృపుల నెల్లఁ బ్రోచుచు నాధా

జోత్తముఁడు వని పరాక్రమవృత్తిని మత్తిలిర గౌడవిభుపై విడిసెన్. 47

చ. విడిసిన నల్లి గౌడపృథివీతలనాథుఁడు క్రోధదీప్తుఁడై
బెడిదపుఁబిలఁ బేర్చుఘనభీషణసేనలతోఁ బురంబుఁ దా
వెడలి పరాక్రమించెఁ దనవిక్రమసంపద కోహటించి న
ల్గడల నరాతిసైనికనికాయము బిట్టు గలంగి పాఱఁగన్. 48

వ. అట్టి సమయంబునఁ గళాపూర్ణుండు. 49

క. తనదుగుడారముదాఁకను, గనుకని తలఁగఁబడి వచ్చుఘననిజసేనం
గనుఁగొని యోడకుఁ డోడకుఁ,డనుచుఁ గౌడవిభుఁ డనికి నతిమెనె యనుచున్.

క. కానుకలు గొనుచు నిటఁ బోడ,గానఁగ వచ్చునె యటంచుఁ గడుఁ దెగఁ దనపై
నే నిందాకం గటకట, యీనెఱి దనకున్న నడఁతు నిప్పుడ యనుచున్. 51

వ. పరిసరవర్తులం గనుంగొని. 52

శా. తేజం బల్లనకట్టి కూడఁగ వెసం దెం డంచు మత్సేనలన్
రా జొక్కండె కలంచి పోఁగలఁడె తాఁ బ్రాణంబుతో నంచు మ
త్తేజఃప్రౌఢి గణింపఁ డె ట్లనుచు నేదీయఃకృపాణం బతి
భ్రాజిష్ణుద్యుతిగా నొరం దిగుచుచుం బ్రస్ఫీతసంరంభుఁ డై. 53

వ. పటభవనంబు వెలువడి పగఱ కభిముఖంబుగాఁ జనుచుండ. 54

ఉ. సాహిణి యంతఁ గూడ రభసంబునఁ దెచ్చె సమిద్ధయుద్ధస
న్నాహముఁ జిత్రసత్త్వజవసత్త్వకృతార్యమఘోటకప్రభా
పోహము రోషభీషణవిపోషితహేషితభీషితాహిత
వ్యూహము భూరిభూషణసముజ్జ్వలదేహము నొక్కవాహమున్. 55

ఉ. తెచ్చిన నెక్కి నవ్వసుమతీధవుఁ డాతనిపూన్కి చూచి యు
ద్యచ్చతురంగవాహినులు దారు తదీయబలాధినాయకుల్
హెచ్చినశౌర్యసాహససమృద్ధుల నొండొరు మీఱి తేనికిన్
మె చ్చొనరించుచున్ వడి నమిత్రబలంబులఁ దాఁకి రంతటన్. 56

ఉ. అత్తఱిఁ దద్బలం బరిబలౌఘములన్ నుఱుమాడి వైచె ను
వ్వెత్తుగఁ జుట్టు ముట్టుకొని యీఁటెల డొంకెనలం గటార్ల బ
ల్గత్తుల నత్తలంబులను గైదువు పక్కెర జోడు కాలు గే
ల్గుత్తుక డొక్క ప్రక్క చెవి గొమ్మని యేర్పడ కుండునట్లుగన్. 57

ఉ. ఈడితశక్తి నంగజగతీశ్వరుసైనికు లట్లు చెండుబెం
డాడఁగ నాత్మసైనికచయంబు కకావికలై కలంగి య
వ్రీడతఁ బాఱఁ జొచ్చుటయు వీఁకను గౌడధరాతలేశ్వరుం
డోడకుఁ డోడకుం డని పటూక్తులచే నిజసేన నిల్పుచున్. 58

చ. కడు వడి మీఱఁ దాఁ దొలుతఁగా రథమున్ బఱపించి ఘోరపుం
బిడుగులవోనితూఁపు లరిబృందముపైఁ బరఁగించె నాతనిం
గడచి తదీయసేనలును గ్రమ్మె నరాతులమీఁద సాహసం
బడరఁగ జేఁప చేర్దిగిచినట్లు సమస్తము నొక్కమొత్తమై. 59

క. ఆకతినపుఁగోల్తలకున్, గాక కలంగఁబడి నాల్గుగడలకు విచ్చెన్
జీకాకుపడుచు నంగమహీకాంతునిసేన లెల్ల నెంతయు భీతిన్. 60

ఉ. ఆకరణిన్ గలంగి చనునట్టిబలంబును హాసభాసురా
లోకములం గనుంగొనుచు లోకజనస్తుతుఁ డంగభర్త యు
గ్రాకృతితో విపక్షనిచయంబుపయిం గదలించె నశ్వమున్
భీకరలీల వాలు జళిపించుచుఁ గెంపు వహించుచూడ్కితోన్. 61

చ. హయము నదల్చి ధే యనుచు నాజికిఁ దోలుట యొండు దోఁచె న
వ్యయరయశక్తి నంత మఱి వచ్చినత్రోవయుఁ బోయినట్టిత్రో
వయు నొకటం గనంబడద వాడలువాడలుగా నతం డసి
క్రియలను జక్కఁజేసినహరిద్విరదాదులచేతఁ దక్కఁగన్ 62

ఉ. ఇక్కరణిం గడంగి యతఁ డెంతయు మిక్కిలి నక్కజంబుగా
నుక్కునఁ జక్కసేయఁ గడు నోటమి మోహిత శేషసైన్యముల్
గ్రక్కున విచ్చి వీఁపువెనుకన్ మఱుమానిసి లేక యమ్మఁగాఁ
జిక్కినమేఁకవోలె వగఁ జెంది నిజాధిపుఁ డొంటిఁ జిక్కఁగన్. 63

శా. ఆచందంబున నొంటిఁ జిక్కిననిజస్వాధీశు వీక్షించి యా
త్రాభంగుం డనుదండనాయకుఁడు మాద్యద్ఘోటకారోహశి
క్షాచాతుర్యధురంధరుం డగుచు ఖడ్గాఖడ్గిసంగ్రామవి
ద్యాచార్యుం డని ప్రస్తుతుల్ గనినవాఁ డత్యంతశౌర్యంబునన్. 64

క. తురగారోహణమును భీకరతరఖడ్గంబు నొప్పఁగాఁ దిరిగి నిజే
శ్వరునకు నడ్డం బై నిర్భరరభసముతోడ నంగపతి కెదిరించెన్. 65

సీ. ప్రేటున కను వైనరీతిమైఁ దమవాగె చన్న వెంబడిగ నశ్వములు మెలఁగ
నొండొంటిఁగొట్టుచోఁ ఖండాలుఖంగుఖంగునఁ దాఁకి పెనుమిణుఁగుఱులు గ్రక్క
నొకచోటు సూపి వేఱొకచోటు వడి వ్రేయు ప్రావు లెచ్చరికలఁ బొల్లవోవ
నెక్కువతక్కువ లెందు నించుకయుఁ గల్గక నేర్పుఁ బోక [illegible]లన తసర్ప
తే. వరుణరణకౌతుకాకులస్వర్గయువతి, జనకటాక్షనిరీక్షానుసరణవశత
నిర్ధకాక్షేయకద్యుతు లినుమడింపఁ, బోరి రప్పుడు వార లద్భుతము గాఁగ. 66

క. ఆయెడ యాత్రాభంగుని, యాయుద్ధముఁ జూచి మొత్తమై గౌడమహీ
నాయకుదండకు విజయా, శాయత్తతఁ దిరుగఁ జేరె నతనిబలంబుల్. 67

సీ. అమ్మహాయుద్ధంబు నట్లు ఘోరతఁ బ్రవర్తిలఁ గళాపూర్ణుండు తీవ్రగతిని
గడుచిత్రహస్తలాఘవముఁ జూపుచును దత్ప్రౌఢిలోపల నాత్మరక్షయందు
నించుకేమఱుట దోఁపించి వ్రేటున కాస యిచ్చిన వేయ వాఁ డెత్తినట్టి
బలుకేలు నారౌతుఁ బల్లంబు నశ్వంబు నెనిమిదితునుక లై యిలఁ బడంగ
తే. వ్రేసె నేటవాలుగ నొక్కవ్రేటునన గభీరరయమున నసిధారఁ బెడమరల్చి
కలన వేటూఱుతునియలుగాఁగ వ్రేయు, బిరుదురౌతులవార్తలు బెండుపడఁగ.
వ. అప్పు డాకాశంబున నుండి విలోకించునాకలోకనివాసు లాకళాపూర్ణునిభుజ
శక్తిశౌర్యసాహసహస్తలాఘవంబులకు నద్భుతంబు నొందుచుఁ దమలోన 69
ఉ. వ్రేటున కెత్తినట్టిప్రతివీరునికత్తికి నొడ్డుకొంట యొ
చ్చోటను గల్గినట్టిది యశోధనుఁ డీఘనుఁ డివ్విచిత్రదోః
పాటవ మెంత నమ్మెనొకొ వైరి నిజాయుధ మెత్తి వేసెఁ దా
వ్రే టిరునాల్గుతున్కలుగ వ్రేయుచలంబు ఫలంబు నొందఁగన్. 70
వ. అని కొనియాడి రట్టిసమయంబున 71
క. సంగరకేళి నతం డీభంగిని విహరింప గౌడపతిసేనయుఁ దా
నుం గలఁగి పాఱె రేఁగులుఁ, దంగేళ్లుగఁ ద్రొక్కికొనుచుఁ దద్దయు భీతిన్.72
వ. ఇవ్విధంబునఁ బలాయనంబు నొంది యతండు నిజపట్టణంబు సొచ్చెఁ గళా
పూర్ణుండును బ్రచండతరసింహనాదబంధురజయదుందుభిధణంధణఘోషభీషణం
బగుసేనయుం దానును నతని వెనుకొని చని యతిరయంబునం బురంబు చొర
నురవణించినఁ దద్రక్షకులు తమకపడుచు గవనులు మూయించి దంచనంబులుఁ
బిరంగులు జబురుజంగులుఁ దుపాకులు మొదలైనసాధనంబుల నుమ్మరమ్ముతోఁ
గ్రమ్ముకొని కొమ్మకొమ్మకుఁ బెక్కండ్రుగా నుక్కుమిగిలి లెక్కకు నెక్కుడగు
చు విక్రమాటోపంబునఁ గోట బలసికొనుటయుఁ గటనటద్భ్రుకుటీవికటిత
ముఖుం డగుచు సత్వరాత్ముం డనుకళాపూర్ణునిప్రెగ్గడ దమమొగ్గరంబు నగ్గలిక
మెఱయ లగ్గలకు డగ్గఱించినఁ దదుగ్రతకుం గాక చీకాకుపడుప్రజలగజిబిజి లా
లించుచు గౌడపతి వివిధోపాయనపురస్సరంబుగాఁ బురంబు వెడలి యాకళాపూ
ర్ణమహారాజుం గని కొలిచి యతనిదయ వడసె నివ్విధంబున దుర్వారదోర్వీర్య
భవగర్వంబున నాయుర్వీవల్లభుండు నవ్వల నడచి గడుసుఁదనంబునం దనకు
మెం డొడ్డినయొడ్డనిపై బలంబుల విడియించె నప్పుడు 73
క. చతురంగబలోన్నతిసంభృతగర్వత నెదురుపాఁజఁ బెట్టె నతం డు
ద్ధతవీరరసావిస్ఫూర్జిత మగురణ మప్పు డుభయసేనల కయ్యెన్. 74
వ. అంత. 75
ఉ. దుమ్మునఁ గొంతసేపు నది దుర్ధమరక్తముచే నడంగ ద
ర్పమ్మునఁ గొంతసేపు నది పంబినపేరలఁతం గలంగఁ గ్రో

ధమ్మునఁ గొంతసేపు నది తద్విషయారిహతిం దొలంగ గ
ర్వమ్మునఁ గొంతసేపు వరువాసి గణింపఁగఁ బోరె నమ్మొనల్. 76

ఉ. అట్టియెడన్ సముగ్రబలుఁ డంగవిభుండు చరన్మహాద్రి నాఁ
బట్టగుచుం గడున్ మెఱయుపట్టపుఏనుఁగు నెక్కి మిక్కిలిన్
బెట్టిదపుంగడంకఁ గరిబృందముతో బలనాయకుల్ దనుం
జుట్టును గొల్చి రాఁ దనరుచున్ నడిచెం బ్రతిపక్షసేనపై. 77

ఉ. అప్పు డెదిర్చి యుత్కలధరాధిపునాజ్ఞను దగ్గజేంద్రముల్
చెప్ప నశక్య మైనమదజృంభణలీల దలిర్పఁ బోరె నే
ర్పొప్పఁగ శాత్రవద్విరదయూథముతోడను జూడ మెట్టిచో
నెప్పుడు నిట్టిబెట్టిదపుఏనుఁగుపో రని మెచ్చఁ జూపఱుల్. 78

సీ. ఎడనెడ వడిఁ గూడి సుడిరీతిఁ దిరుగుచుఁ దలపడి దర్పంబు దెలుపునవియు
వెనువెన్క కొక్కింతచని యొక్కటొక్కటి దంతముల్ ఖేదిల్లఁ దాఁకునవియు
నెడవాయనీక బల్విడి నంటఁ గదుముచు నట్టిట్టు వడిఁ ద్రోపులాడునవియు
మావంతు లన్యోన్యమథితు లై కూలినఁ బూఁపు దప్పకయల్కఁ బోరునవియు

తే నగుచు నవ్వు డగ్గజేంద్రంబు లతిశయిల్లె
దంతఘట్టననిష్ఠురధ్వానములను
జటులఘుంటాఘణంఘణశబ్దములను
గతినఘీంకారములను దిక్తటము లదర. 79

క. ఆవేళ నంగవిభుదం,తావళమును వడిని దిరిగి తాఁకినఁ బ్రతిదం
తావళము లెల్ల వెలికిల, మావంతులు గ్రిందు గాఁగ మహిపైఁ ద్రెళ్లెన్. 80

వ. అపుడు నిజగజేంద్రంబు నత్తెఱఁగునఁ బఱపి నుఱిపించు క్రముకకంఠోత్తరపు రాధీశుని యాటోపవిజృంభణంబునఁ గలంగఁ బడునిజసైన్యంబు వారింపుచు ఘోరాకారం బైనవారణంబు నారోహణంబు చేసి యుత్కలాధీశ్వరుం డక్కడింది వీరుని మార్కొని యక్కజం బైనవిక్రమంబు నెఱపె నట్టిసమయంబున. 81

మ. సమవృత్తిన్ జవసత్త్వముల్ నెఱపుచున్ సవ్యాపసవ్యక్రమా
భ్రమణం బొప్పఁ దటాలునం దలపడుం బల్మారు శుండాప్రకాం
డము లొండొంటిఁ బెనంగి ఘీంకృతిమహానాదంబు రోదోంతరా
ళము సంఛాదితంబుగాఁ జేయు నమ్మదకరుల్ సంరంభఘోరంబు లై 82

వ. ఇత్తెఱంగున నత్యంతఘోరంబుగా నవ్వారణంబు లవార యసారంబు లై పోరుచుండ సంతతిఁ గళింగపూర్వుండు 83

క. ఎడనెడఁ దడఁబడుచో వడిఁ, గుడియెడమలఁ దిరుగునేనుఁగులు పిఱుఁదులు నే
ర్పడునట్టిక్షణములోనన, పెడమరలి విపక్షువెనుక బిట్టుఱికె వెసన్. 84

క. ఉఱుకుచు నెకఠినముష్టిన్, నెఱి చెడ నడివీఁపు వ్రాఁడిచి నిజభుజముల నే
ద్త్రైఱ మెఱయ వానిసంధులు, బిఱుసున వెనుకకుఁ గుదించి పెఱకే ల్పట్టెన్. 85

క. వెండియు నట్టిటు గదలక, యుండ నతం డతులబలసమోద్ధతిమహనీ
యుం డగుచు వానిఁ దద్వేదండము నడికట్టుత్రాళ్లఁ దగ బంధించెన్. 86

ఉ. ఎంతయు విక్రమం బలర నిట్లరివీరునిఁ గట్టివైచి తా
నంతట వాని వానిమదహస్తిని జెంగున దాఁటి మిక్కిలిన్
వింతగ నంతరాళమున నెవ్వడిఁ గ్రమ్మఱి వ్రాలె నప్పు డా
దంతి నెదిర్చి పాఱుతనదంతిపయిన్ రణసమ్ముఖంబుగన్. 87

తే. అంత నొకపంత్రకోలచే నహితుకరిని
విఱిగి పాఱఁగ. బొడిచి పోవిడక మగిడి
త్రిప్పుకొని తెచ్చి తత్కుంభదేశపార్శ్వ
ములు చుఱుకు ముట్ట నేయుచు జలను లుబుక. 88

ఉ. ప్రాణముతోడ నుత్కళనృపాలకు నెమ్మెయిఁ బట్టి తెచ్చి సం
ప్రీణునిఁ జేసి తా విడిచె నెన్నఁడు నిట్లు సమానయుద్ధపా
రీణులతోడ నింక నెదిరింపకుమీ యని బుద్ధి సెప్పి క
ల్యాణగుణాఢ్యుఁ డంగవసుధాధిపుఁ డీప్సితరత్నహారి యై. 89

వ. ఇవ్విధంబున నిరర్గళవిజయస్ఫురణంబున భాసిల్లునాసుముఖాసత్తినందనుండు తనకు నంతటఁ గళింగద్రవిళచోళపాండ్యాదిభూపతులు తమయంతనే వశవర్తులగుచు నానావిధోపాయనంబులతోడ నెదుర్కొనుచు ననుప దక్షిణసముద్రతీరంబునకుం జని కేరళమహీపాలునిమీఁద విడిసిన నతండును. 90

క. శూరత పాటించి చమూ,వారంబులుఁ దాను నతని వడి మార్కొనియెన్
భేరీభూరిధ్వానము,హారభటిజితాబ్ధిఘుమఘుమారవుఁ డగుచున్. 91

ఉ. అత్తఱి రెండుసేనలు రయంబునఁ దారసిలెం గడంకమై
నుత్తరదక్షిణార్ణవము లొండొకటన్ వడిఁ దాఁకెనో యనం
దత్తరళత్వదీప్తతఁ దనర్చునవేంధసవహ్నియో యనన్
నెత్తురు వాల్చె నంతమును నింగికిఁ బర్వఁగ ధూళిధూమముల్. 92

వ. అందు నపుడు 93

లయవిభాతి:—

తనదుసకలాయుధములును బరునిచేతఁ దునిసినను బోరివోనిమగతనము
గడుప్రాపై, తవర నది వేడ్క నహితునకు నెదురేఁగి నిజతనువుశరముల్
వెఱికికొనుచు బలుమూర్ఛన్, మునుఁగుచుఁ దదీయ మాగుతేనువు ప్రథమంబు
గుఱుతునఁ బొడుచువీరవరుఁ గని తదుపభోగం,బునకుఁ దమకించుసురవనితలకుఁ
బల్వురకు ఘనపదమునొందు నొకపెనుజగడ మయ్యెన్. 94

లయవిభాతి. నరయుశరవృష్టి కెదు రరుగుటకు విష్ణు మని యరసి తనబెట్టిదపు టరిగెఘురశౌర్య, స్థిరత నటు వైచి నెఱబిరుదురుగఁ డొక్కరుఁడు సరభస గతిస్ఫురణఁ బరుఁ దురుమబోఁగా, సురమురనిమగ్నముగఁ బరఁగినపరాయు ధముచరమశిఖిపింఛ మవసరనియమలంఘి, త్వరితపరిరంభవిధిగరిమవరపినసుసుర తరుణినవభిన్నకచభర మనఁగ నొప్పెన్. 95

లయవిభాతి వడియుకరిహస్తమును బిడికిటనె క్రిందిటికి నడిచి యది మెట్టుకొని వడిఁ జివచివర్గ రెం, డడుగు లెదురెక్కి యొకబెడిదపుభటుండు తనయొడమ చెయి కుంభతటి నిడి తదుపరిస్థుం, బొడుచుచును బోటువడి కడుఁ దలఁకె నాత్మఁగర మిడినది కుచస్థలిని గడుఁ గదిసి వేల్పుం, బడఁతి గనుపట్టఁగను జడిసి యిపుడే నెచటుఁ బొడిచితినొ దీనిఁ దొడిఁబడ ననుచు లజ్జన్. 96

సీ. మావంతుగర్వంపుమాటఁ గోపించి తక్కదహస్తి కొక్కరొ యెదురు నిలిచి
సమకట్టుజల్లుల నమర నిజోత్తమాశ్వమును ధే యన నది చమరమృగముఁ
గినిసి కరంబుపైకిని దాఁటు కొనియొడుగతిఁ జౌకళింప నాక్షణమునందు
నతఁడు వైచినఘనాయతశూలమహితుమూర్ధము గాఁడిదంతివక్షమున వెడలె

తే. నాతఁ డెదు రొడ్డినట్టిశూలాయుధమున
హరియురము గాఁడి యారౌతు శిరముపైకి
వెడలె నాశస్త్రకీలితద్వీపతురంగ
వీరతనువులదొంతర వెఱఁ గొనర్చె. 97

వ ఇత్తెఱంగున నత్యంతశౌర్యసాహసంబుల దేహంబులు సరకుగొనక యిరువాగు ను ఘోరంబుగాఁ బోరుచుండఁ గేరళభూరమణుండు కళాపూర్ణుకడకు రాయబా రిం బనిచి యీవృథాబలక్షయంబువలన నయ్యెడుఫలం బెద్ది మన మిద్దఱము నుద్దించుకొని కటారుల నెక్కటికయ్యంబు గావింపుచు శౌర్యంబులకొలంది నెఱపుద మని చెప్పించిన నాతం డట్ల కానిమ్మని యియ్యకొనియె నంత నుభయ బలంబులపోరు వారించి 98

ఉ. భూరిధృతిఁ బసిండిజలపోతకటార్లుఁ గొఱళ్లుఁ బూని య
వ్వీరవరుల్ మిథోవితతవీరరసోగ్రకటాక్షభావగం
భీరతఁ బల్లటీల్ గొనుచుఁ బేరెము వాఱుచు నింత నంతనుం
జేరుచు నంది చాఁపులను జిమ్ముకటార్లటు పాఱఁ దట్టుచున్. 99

చ. ప్రిదులనిశౌర్యసంపదలఁ బెట్టినదండలు ద్రివ్వకే కడుం
గదుముచు హుంకరించుచును గ్రైదువుఁ బాపుచు నట్ల యిట్ల రొం
చదె యిదె యంచుఁ దప్పుకొను మంచుఁ దగుఁ బళి యంచు నిందుఁ గఁ
బెదరుట లేక ధైదు పది సేయక పోరిరి పేరువాఱుచున్. 100

చ బిరుదుకటారికాండ్రు పరభీకరసత్త్వులు వార లిద్దఱుం
బరుసఁదనంబు నేర్పు నెఱబంటుతనంబు నొకర్లొకర్లకున్
సరియగు చున్కి కోర్చు కొన సంధిలురోషకటాక్షవీక్షణ
స్ఫురణ కటార్లపై నడరెఁ జూపఱ లోహితశంక నొందఁగన్. 101

క. ఒకని నొకిందుకయును పోఁ,కక యుండెఁ గటారుమొనలు కడు బెట్టువడిన్
నొకబికలుగఁ బోట్లాడుచు, వికసిల్లెడునాకడిందివీరులయందున్. 102

క అంతఁ గళాపూర్ణుఁడు గడు, వింతగ నతిచిత్రహస్తవేగతఁ బరభూ
కాంతుఁ దడఁబఱచి పోడిచె నొ,కింత చొరఁ గటారి మొనననేకస్థలముల్. 103

వ. అప్పుడు తత్ప్రతివీరుండు. 104

క. ఆనేర్పునకును జంపం, గానొల్లమికిని మనంబు గడు వెఱఁగుపడున్
దా నతనిపాదయుగళికి, నానతుఁ డయ్యెను గటారి యటు వైచి వెసన్. 105

వ ఇట్లానతుండై కరకమలంబులు మొగిడ్చి యోమహానుభావా నీవు రాజమా
త్రుండవే దివ్యపురుషుండవు గాక యే నాంధ్రదేశంబున నుండి వచ్చినయొక్క
యత్యంత చాతురీధురంధరుండైనకటారిసాదనకానివలన ననేక కాలం బభ్యసించి
పేరుగలబిరుదుమాస్టీలఁ బెక్కండ్ర జయించి యెక్కడను మొక్కపోనిమాను
షంబున ననూనగర్వుండ నగు చునికిం జేసి నిన్ను నిట్టిపోరునకుం బిలిచితి నన్ని
ట్లు పరిభవించుట యత్యద్భుతంబు గాదె యని కొనియాడి యమ్మధురలాలసా
రమణు సపరివారంబుగా నిజపురంబునకుఁ బ్రార్థించి తోడుకొనిపోయి మహోప
చారంబులం బూజించి యతని కభిమతంబులైనతనదుశుద్ధాంతకాంతలశిరో
రత్నంబులు సమర్పించి ప్రణయపూర్వకంబుగా ననిపె నపు డంగాధిపతి యతని
వలన మృగేంద్రవాహనానిలయం బున్నచోటు విని యచ్చటి కరిగి యమ్మ
హాదేవిని సేవించి తద్భవనవలభు లరసి తనపూర్వజన్మంబువీణెయఁ గని పుచ్చు
కొని యత్యంతసంతుష్టుం డగుచు నంత నుత్తరాభిముఖంబుగా యాత్ర
గావించె. 106

తే. అప్పు డాచుట్టుపట్లధరాధిపతులు
తనకు నిష్టంబులైనరత్నముల నిచ్చి
కొలిచి యనుప నాభూపతి ఘూర్జరేశు
పై నడచె వానిశౌర్యదర్పంబు వినుచు. 107

క. అతఁడును దద్వార్తలు విని, యతిభీషణమైనయట్టియాత్మధ్వజినీ
తతితోడ వచ్చి తాఁకెం, బ్రతివీరునిదిశలు ధూళిపటలము క్రింగన్ 108

ఉత్సాహ. అబ్బలంబు లొక్కటొకటి నట్లు గవియునార్పు లా
గుబ్బు గాఁగ నడరె వాద్యఘోషభీషణంబుగా

నిబ్బరంపుటార్భటిని జనించె నంత నెల్లచో
డబ్బుడుబ్బు ఖంగుఖంగు ఠంగుఠంగు మన్ధ్వనుల్. 109

వ. అప్పు డుప్పతిల్లుధూమంబుచొప్పు నుత్పాదించుచు రోదోంతరాళంబు నాచ్ఛా
దించుధరాపరాగంబువలనను ధింధింకృతంబైనయుభయబలంబులు దమతమ
యేలికలబిరుదు లుగ్గడించుటలకతన నాత్మపరసైనికవివేకంబు లోకానొకభంగిని
సంఘటిల్లఁ బోరుచో ఖంగుఖంగున నొండొంటిఁ దాఁకుచుఁ దడఁబడుబెడి
దంపుటడిదంబులవెడలుమిడుఁగుఱులవలనను సాటోపంబులైనయీఁటెపోటుల
చేత గాటంపుఁబెల్లునఁ జిల్లుచిల్లునవెళ్లునుల్కలజ్వాలామాలికల నాభీలంబు
లగుధారాళరక్తపూరోద్గమంబులవలననుభయసేనానాయకప్రతాపప్రాదుర్భావ
నిర్భరార్భటీశంక లంకురింప బిరుదకాహళశంఖభేరీపటహరటితపటిమంబును
బ్రతిభటార్భటీకటుత్వవిఘట్టనసమయసముదితరసత్వరవిసృత్వరసింహనాదంబు
లును మదచండిమోద్దండవేదండమండలాఖండఘీంకారఘోషంబులును భీషణ
హయహేషితంబులును ఖరఖర్వమార్వనిర్విరామటంకారనిస్స్వనంబులునువికస్వర
స్యందనబృందనేమిశబ్దంబులును నంబరంబు వగుల్ప నందుండ జడిసి పుడమికిఁ
డిగిననిబిడంపుజలదసముదయంబులపగిదిఁ బొదలుమదగజంబులమదధారావర్షం
బులకుఁ దగినయందంబున నింద్రగోపబృందసందేహకంధళనికరంబు లగుచు
మాంసశకలంబులు గానిపింప నంతకంతకు నెంతయు నధికంబు లగుక్రోధంబుల
తోడ యోధవీరులు చేరి ఘోరాసిధారలఁ జక్కడఁచినఁ గఱుక్కనం దెగి
బిట్టుమిట్టించి పడుధవళోష్ణీషభూషితమస్తకస్తోమంబులభంగులుసంగ్రామరంగాం
బరీషాభీలకాలరాత్రిభర్జ్యమానసముజ్జ్వలాజానుకారంబునఁ బరిఢవిల్ల నుర
స్స్థలంబులు నఱుకుకఱుకుటలుగులకతన వెనుకకొరగు నెఱమేటిబలుమగలప్రథమ
గుణాకృష్టనిష్ఠురధనుర్వలయనిష్ఠ్యూతంబు లగుశరవ్రాతంబులు వెడవెడ
నార్చుపగఱమొగములఁ బ్రవేశించి పెడతల వెడలుచు సముత్కటతాత్కాలిక
రోషాధిక్యకర్కశామందసందష్టపుంఖమూలంబులై చిక్కియుం జిక్కువడక
యక్కజపుజవభరంబున శరంబులతోడం బెకలించుకొని యెగయ విగళితచికు
రంబు లగుశిరంబులు గగనంపుఁజప్పరంబునకుఁ జల్లులు ఫుల్లారవిందంబులు
పూవుదండలునై యొకవిచిత్రపుసొంపు సంపాదింపుచు మృత్యుదేవతామహో
త్సాహసన్నాహంబు దలఁపింప నకంపితశౌర్యసాహససముద్భటు లగుభటు
లును దెసలం బొదివి కదననిపుణత నెఱప నిలువునన యసువులు విడిచి నిరంతర
నిర్ఘాతశాతశక్తితోమరప్రముఖశస్త్రచరమభాగాలంకరణచారు పింఛమాల్యాది
విలసితంబులై యధోభాగంబులఁ గెంబట్టుపఱపు లెఱుపు నెఱపుపలలపంకిలరు
ధిరప్రవాహంబులతోడ వీరపురుషసంభోగవిలంబాసహారంభాముఖ్యదివిజకామి
నులకు నలంకరించి యాయిత్తంబు చేసినచతుస్తంభకుంభనికేతనంబులో యనం

గానిపించు నేనుంగులమీఁద శిఖరంబులచాడ్పునఁ గనకమయకిరీటకవచధారణా
ధోరణశరీరంబులు రాజిల్ల విదారితానేకచక్రంబు లగుచు నొకకడ నొత్తిగిల్లినఁ
ద్రెళ్లినయరదంబులయితరచక్రంబులు కృష్ణముఖశిలీముఖకృత్తనేమిఘట్టనంబుల
బిఱుసున నిరుసులకొనల బిఱబిఱం దిరుగుచు నిపతితరథంబులు భూరితర
వీరరసావేశంబున వైరివీరవ్రాతపాతనార్థంబు చక్రాయుధంబులు ద్రిప్పెడినో
యనుతలంపుసంపాదింపఁ బెంపుమీఱుచు నొప్పుత్రిప్పుడువడువునం బరిఢవిల్లుచు
నుండఁ దొండంబు లెత్తి తిరుగండ్లకరణి నురువడిం దిరుగుచు నొండొంటిం
దాఁకుకరులపరిసరప్రదేశంబునం దొట్టుగట్టి పొల్లుతోడియాఢకికణరాసులుం
బోలెఁ గానుపించురుధిరపలలకరంబితాస్తోకకీకసలేశకూటంబులచేస్పున శూర్పం
బులనేర్పున నేర్పరింపుచు సంపతితసప్రాణసామజవిధూయమానకర్ణవ్యాపారం
బులు దీపింప సంగ్రామభూమి యుద్ధామరౌద్రభీభత్సభయానకహేతు వగుచు
నుద్ద్యోతించె నట్టిసమయంబున సుముఖాసత్తిపుత్త్రుండు. 110

చ సరిపడఁ బోవుచుండ నటు సైన్యము నేమియు మీఱనీనియా
యరిబలముం గనుంగొనుచు నల్గఁ గనుంగవ కెంపు పూన ని
ష్ఠురగుణటంక్రియానినదశుంభదిషుప్రకరప్రవర్షణో
ద్ధురుఁ డయి తద్బలంబుపయిఁ దోలె రథంబుఁ గడున్ రయంబునన్. 111

ఉ. ఘూర్జరభూమిపాలుఁడును క్రోధము మీఱఁగ నాన్నృపాలు న
తూర్జితబాణవృష్టి కడు నుగ్రతఁ గప్పుచుఁ దాఁకి తత్పరి
స్ఫూర్జితసాయకంబుల నిషూదితసూతుఁడు భగ్నకేతుఁడున్
నిర్జితబాహుశౌర్యుఁడు వినిర్గతధైర్యుఁడు నయ్యెఁ జెచ్చెరన్. 112

ఆ. ఇట్లు దలఁకి యతని కిచ్చె నాత్మీయశుద్ధాంతకామినీశిరోవతంస
మణు లతండు నతని మన్నించి యవ్వేళ, నరిగె విజయవార్త లతిశయిల్ల. 113

ఉ అంతటఁ గానుకల్ గొనుచు నాన్నృపతిం గురుకాదిదేశభూ
కాంతులు వచ్చి కొల్చిరి జగత్పరిరక్ష యొనర్ప రుక్మిణీ
కాంతుఁడు శౌరి చన్న వెనుకన్ మఱి దక్షుఁడ వీవ యెవ్వరీ
డింతయు నొప్ప సద్గుణసమృద్ధుల నీ కని సన్నుతించుచున్. 114

సీ అరాజతిలకుఁడున్ ద్వారకానగరంబు విపధి ముంచుట మున్న విన్నవాఁడు
గావున వారితత్కథ లాదరంబున నడుగుచు యదుసింహు నంబుజాక్షుఁ
దనపూర్వజన్మగాంధర్వవిద్యాగురుం గనుఁగొనునట్టిభాగ్యంబు దనకు
దొరకమి కాత్మయందును జాల వగచుచు నౌత్సుక్యమునఁ దత్పురాంతికమున
తే. కరిగి దండప్రణామంబు లాచరించి, వరుస మాళవబర్బరధరణిపతుల
పై నడిచి భీషణం బైనభండనమున, బహువిధాయుధపటిమచే భంగపఱచె.

శా. ఆవా ర్తల్ దవుదవ్వులన్ వినుచు హాహాణాదిక్షమానాయకుల్
వేవేగన్ వినయంబుతోడ నిజతన్వీమాళిరత్నాదినా
నావస్తువ్రజ మంపినం బనిపె సన్మానంబు చేయన్ హిమ
గ్రావాంతంబుగ నేఁగి తోఁ దిరిగె నారా జంతటం దూర్పుగాన్. 116

లయగ్రాహి. ఆతనిమహాజయవిభూతిపసమించుచనవిగీతరణకేళిపటిమాతిశయగర్వ, శ్వేతునకు నాకితఁడు వో తగినజోడు వసుధాతలమునం దనుచుఁ గౌతుకము తోఁ బ్రాగ్జ్యోతిషపురాధిపుఁ డభీతి నెదు రేఁగి ఘనహేతినికురుంబమణికేతన సముదగ్ర, స్యూతనగభస్తిపరిపీతకకుబంతరము లై తనకు దారుణచమూతతులు గొల్వన్. 117

ఉ. వైరిచమూసమూహము లవారణ నన్నియు నప్డు డాతనిన్
ఘోరతఁ జుట్టు ముట్టుకొని కో యన నార్చెను దోన యద్భుత
స్ఫారతరార్భటిం బిరుదుసంకులుఁ దారలు బూరగొమ్ములుం
భేరులుఁ దమ్మటంబులును భీషణవృత్తిని బిట్టు మ్రోయఁగన్. 118

చ బెడిదపుభంగిఁ దద్ధ్వనుల పెంపు నడంపుచు నంత నెంతయున్
వడిఁ దనరారె నంగజననాథుగుణక్వణనంబు దానిఁ దా
మడమలు ద్రొక్కుచున్ విశిఖమండలి వెన్కొనియెన్ గరంబు బ
ల్విడిని సమస్తదిఙ్నృపులవీనుల మేనుల నుక్కడక్కఁగన్. 119

వ. అట్టిసమయంబున. 120

ఆ. అతనివింట వెడలునమ్ముల వేగవై,చిత్రి యేమి సెప్పఁ జేవలసిన
మురువుబిరుసుఁ గ్రోవి ముట్టించిన తెఱంగు, చెఱువుకట్ట తెగినబిలుసు దోఁచె.

చ. దొనపయిఁ జాయ కెప్పుడును దూపు లెడల్పుచు నున్నరీతిఁ దాఁ
జనుమఱచేర్పునం దెపుడు జాఱక య మ్మరిఁబోసి యున్న చా
డ్పున శ్రవణాంతసీమ నెపుడున్ వలయాకృతచాప మైనశిం
జినిగతిఁ దోఁచెఁ దత్కరము చిత్రరయంబున బెక్కురూపు లై 121

వ. ఇత్తెఱంగున నప్పార్థివోత్తముం డత్యంతచిత్రం బైనధనుర్విద్యనేర్పు నిర్వహిం చిన నుదంచితంబు లైనబాణపరంపరల చేత నరాతిసైన్యంబులందుఁ జిందఱవం దఱ లగునరదంబులును జినిఁగినకేతువులును జీకాకుపడురథికులును జడిసినసా రథులును ద్రుంగినయేనుంగులును దునిసి పడినమావంతులును దుత్తుము రైన యంకుశంబులును దునుక లైనపరిస్తోమంబులును బొలిసినయశ్వంబులును బొర లెడిరౌతులును బొడ వడంగినపల్లంబులును బొడిపొడి యైనపక్కెరలును నుఱుము లైనపదాతులును నులిసినకంకటంబులును నుసి యైనకైదువులును నుగ్గునూచం బైనయరిగెలును దెగి పడినయాభరణంబులును దెరలి పాఱు ర క్తంబులును దెట్టువలు గొన్న మాంసంబులును దెట్టలు గట్టినయస్థిశకలంబు

లును జూపఱకు నద్భుతభయానకభీభత్సరసంబు లావహిల్లఁ జేసె నవ్విధంబున నమ్మణిస్తంభనందనునియమందవిక్రమంబున నుక్కు దక్కురిపుసేనాంగంబుల భంగిం గనుంగొని యతనిబలంబులు జయోత్సాహదుర్వారంబులై యురువ ణించె నయ్యెడం గలంగి పాఱునిజబలంబుల నిలువరించుచుఁ బ్రాగ్జ్యోతిషాధ్య క్షుండు రోషకషాయితాత్ముం డగుచు నక్షయం బైనతనవిక్రమోత్సేకంబునఁ బరానీకంబులు కాందిశీకంబులై చీకాకుపడ భీకరంబుగం దనరథంబు కళా పూర్ణునిదిక్కునం బఱపించిన నతని దలకడచి తత్ప్రియసఖుండు చండబాహుం డనువాఁడు వాఁడిమిగిలి యాయంగపతితోడఁ దలపడియె నపు డయ్యిద్దఱకుఁ దద్దయుం బ్రొద్దు మహాయుద్ధంబు ప్రవర్తిల్లె నంత. 123

తే. వార లతిచిత్రశరలాఘవంబు పేర్చి
పేర్చి యొండొరుపయి నేయఁ బింజపింజఁ
గఱచుకొని పాఱుతూఁపు లొక్కటియ వోలెఁ
గానిపించుచుఁ దలపించెఁ గడలపోరు. 124

క. అనియముఁ గరలాఘవ మిట్లొనరఁగ నేయుచుఁ బరప్రయుక్తము లెల్లం
దునుముచుఁ బోరఁ దదంతర,మునఁ గుప్పలు వడియె బాణములశకలంబుల్.

వ. అట్టిసమయంబున మధురలాలసావల్లభుఁ డెల్లవిధంబులం దుల్లసిల్లుచుఁ దనకు నెది రించి కడుఁ దడవుగాఁ బోరుచున్న యవ్వైరివీరుబవరంబునకు వెఱఁ గందుచు నతని గెల్చు టెట్లొకో యని తలంపు వొడమ ధనుర్ధరుం డైనస్వభావసిద్ధుం దలంచి మనంబునందు నమస్కరించి తదనుగ్రహాలబ్ధంబులైనయమోఘనిజధను ర్బాణంబుల నుద్దేశించి యేమీ మీకును లోకంబులోనిశరశరాసంబులు సరి యగుచు నింతసేపు పోరించుట సహింపవచ్చెనే మీమహత్త్వంబుఁ జూపుట కిదియే యవసరం బనుచు వాఱు మ్మనుచు నుత్సాహంబున హెచ్చి మిక్కిలి యొక్కుడైనహస్తలాఘవవిశేషంబున 126

సీ. ఆవిభుఁ డేసెఁ గ్రూరాస్త్ర మట్టిద యేసె దానివె న్వెనుకఁ గ్రొత్తగఁబరుండు
నది యోర్వ కమ్మనుజాధినాయకుఁ డాత్మ విశిఖపుంజము నేసె వేఱె యొకటి
వినుతుఁడు తనదుబాణము పింజ యేసె న ట్లెరువురుఁ బైఁబయి నేయ నేయ
సొరిది నిద్దఱవిండ్లు సోఁకుట కొక్కింత కడమగా శరరాజి నిడుపు సాగెఁ

తే. దనవరుసయేటు వెస నేసి ధనువుఁ దునిమి
యంగవిభుఁ డంత రిపునియే టడఁచెఁ దద్భు
జాంతరముఁ దూఱి పాఱె నాయంపచాలు
పుంఖముఖ మయ్యుఁ జేబల్మిఁ బొగడఁ దరమె. 127

క. దానం బ్రాగ్జ్యోతిషధా,త్రీనాథునిపక్షుఁడు ధరణిఁ ద్రెళ్లుటయును ద
త్సేనలు చెల్లాచెద రై, నానాదిక్కులకు భయమునఁ బెసఁ బఱచెన్. 128

వ. అప్పు డాచండబాహుపాటువలన నాటోపంబు దప్పి ప్రాగ్జ్యోతిషపతి యంగ పతికి శరణు చొచ్చి తనశుద్ధాంతకాంతాశిరోరత్నంబులు కానుక యిచ్చె నంతఁ దద్వార్తచేతన భీతిల్లి కోసలప్రముఖులును మాగధుండును దమయంతన వశవర్తు లగుచు నమ్మణిస్తంభసుతు నభిమతార్థంబులం దనిపి యనుగ్రహంబు వడసి రివ్విధంబునం గళాపూర్ణుండు సకలదిగ్దేశాధీశుల జయించి తత్తత్ప్రియాంగనామాళిమాణిక్యంబుల మధురలాలసాచరణమంజీరనిర్ఘాణంబుకొలకు సాధించి యెందును నెదురు లేక యమందవిజయానందంబునం దిరిగి వందిమాగధవారంబులు కైవారంబులు సేయ నిజపట్టణంబు చేర నరుగుదెంచె నప్పుడు. 129

సీ. ఇంక నించుకవడి కింద్లన విశ్రమింతము కూడ రారండు తడయ కనుచు
నలమిట్టు దాఁటిన ధళధళ గాన్పించు మనవీటికనఃహర్మ్యంబు లనుచుఁ
గంటిరే యల్లగంగాసరయూసంగ మప్రాంతవనరాజి మహిమ లనుచు
సకలదిగ్దేశముల్ చరియించితిమి గాని యిట్టితోఁటలు గాన మెందు ననుచుఁ

తే. గనుఁగొనుం డోలిఁ గాన్పింపఁగాఁ దొడంగె
గోపురము లవె యవె ప్రైఁడికోట లనుచుఁ
గ్రముకకంఠోత్తరపురంబు గ్రమ్మఱంగఁ
జూడఁ గంటిమి నేఁడు నీసొంపు లనుచు. 130

క. ప్రమదమున సంభ్రమించుచుఁ, దమతమవా రెదురుకొనఁగఁ దత్తద్వస్తు
క్రమవీక్షణముల నధ్వశ్రమ మంతయు మఱచి వేడ్కఁ జనుచుఁ మణియున్.

ఉ. తొల్లిటిప్రాఁతపట్టణము త్రోవలు నల్లవె రోమపాదుఁ డం
దల్లుని ఋశ్యశృంగుని గృహస్థత నింపుల ముంప సంపద
త్యుల్లసితంబు చేసి ప్రియ మొప్పఁగ నిల్పినయట్టిమేడ దా
నల్లదె కంటిరే నవనవాకృతి నిప్పుడు నొప్పెడుం గడున్. 132

తే. పూని కర్ణాత్మజుఁడు వృషసేనుఁ డాత్మ
హయము దాఁటించినట్టివాఁ గల్లయదిగొ
నాఁటి కది యబ్బురముగాని వీటిలోని
నేఁటి కిగ్గాడిగుఱ్ఱాలు దాఁటుచుండు 133

ఉ. హారిసమృద్ధితో నిచటి కామడ నున్నది తూర్పునందుఁ గా
సారపురంబు తద్విభుఁడు సన్నుతశీలుఁడు సత్వదాత్ముఁ డీ
తోరపుపీడు కౌతుకముతో నొనరించె నతండు నిందు భూ
భారధురీణు నీయధిపుఁ బట్టము గట్టను దా నమాత్యుఁ డై. 134

వ ఇవ్విధంబున మఱియుఁ దత్తత్ప్రదేశవస్తువిశేషదర్శనప్రసంగోచితభాషణంబుల నవిదితాయామంబు లగు తెరువులు జరగ నరుగుచున్న సకలజనులు నక్కడక్కడం గడలకుఁ దొలంగి కనుంగొనుచుండ నుద్దండభేరీపటహశంఖకాహళాది

నాదంబులు రోదోంతరంబునం బిక్కటిల్ల మిక్కిలి నెక్కుడైన యక్కజపువైభ
వంబున భూవిభుండు పురంబు ప్రవేశించె నయ్యవసరంబున. 135

ఉ. భేరులు లోనుగాఁ గలగభీరపువాద్యచయంబు మ్రోఁతలం
దోరపుఁబ్రౌఢి మించెను గుతూహలసంభ్రమజృంభమాణరా
మారభసాధిరోహణసమాకులసౌధసమంజుహాసమం
జీరఝళంఝళధ్వనివిశేషము లెంతప్రజాసమృద్ధియో 136

ఉ. ఆవిభుఁ జూచుకాంతలముఖావళి సోరణగండ్ల శోభిలం
గా విలసిల్లె సౌధము లఖండితదిగ్జయధామచిత్రిత
త్పావనచారుకీర్తికృతతర్జనభీతిసహస్రభావిభి
న్నావతరత్వహేమకమలామరసింధుజలౌఘమో యనన్. 137

తే. అతనిఁ జూడంగఁ బఱతేర నడరి జాఱె
యొకతెకొప్పు విరాజిల్లె నొకరిఁ బట్టఁ
బదరుమరునాజ్ఞఁ జని మెడఁ బట్టి ద్రొబ్బి
తెచ్చురోలంబభటు లనఁ దేజరిలుచు. 138

ఉ. క్షోణితలేంద్రుఁ జూడ నొకకొమ్మ వడిం బఱతెంచి యుల్లస
ద్వేణిభరంబుతో మొగపుదీఁగె వలగ్నమునం దమర్చి యొ
డ్డాణము తీఁగెగా నిడి మెడన్ వలగొన్నది చాలమిం గొనల్
పాణుల నుండఁ గౌను మఱి బాగుగఁ గానుకఁ బెట్టుకైవడిన్. 139

ఉ. గుబ్బెత యోర్తు వచ్చె నృపకుంజరుఁ జూడ రతార్త నీవి దా
గొబ్బునఁ గట్టుచుం బయఁటకొం గది మాన్పఁగఁ బోలెఁ గాళ్లపైఁ
బ్రబ్బికొనం గుచోద్ధతభరంబునకుం బయికాఁపువోలెఁ ద
బ్బిబ్బుగఁ జేతికిన్ దొరకి పెన్మిటివస్త్రమురోవృతంబుగన్. 140

లయవిభాతి. జలక మపు డాడి యొకచెలువ నునుఁగావిజిగివలువ వెసఁ గట్టుకొని
జిలుఁగురవమాదా, వళపుఁదడి యొత్తుకచములఁ బెనఁచి చుట్టుకొని కెలని కది
కొన్జడలమెలిపగిదిఁ దోఁపన్, గళితధృతి యోగినియు బలె నరుగుదెంచె నృప
తిలకుని గనుంగొనఁగ లలితకుచమధ్య, స్థలిఁ దరళమౌక్తికము కలిగి హృద
యంబువెలిఁ దొలఁకిపడుసత్త్వమన వెలుఁగు నటియింపన్. 141

ఉ. క్ష్మారమణుం గనుంగొనఁగ గాటపువేడుకఁ బాఱుదెంచె నొ
య్యారి యొకర్తు మున్ జలక మాడుచు వైచినకీలుగంటు దా
సారెకు జంఘలం బెనఁగ సవ్యకరంబునఁ బాయఁ బట్టి శృం
గారరసంపుగిండి గలకాముని యూఁడెపుఁగత్తెయో యనన్. 142

తే. ఇత్తెఱంగునఁ బౌరుల కెల్ల నేత్ర, పర్వ మొనరించురూపవైభవముతోడఁ
గ్రముకకంఠోత్తరమహాపురప్రవేశ, మాచరించి ఘనైశ్వర్య మతిశయిల్లఁగ 143

క. శుభతర మైనవిపంచిక, యభినవకౌముదికి నొసఁగి యాత్మసచివు న
వ్విభుఁడు నియమించె రూపా,నుభూతికిని నూపురములనుం జేయింపన్. 144

వ. దానం జేసి యమ్మానవతియు నానందంబు నొందుచు నెందునత్యపూర్వంబు లైన నానాభూషణవిశేషంబుల నలంకృత యగుసమయంబునఁ బ్రసంగవశంబునఁ జెలులవలన నాత్మబాల్యసమయసంప్రాప్తరత్నహారంబుసుద్ది విని ప్రాణవల్లభుని ప్రథమానుగ్రహవిశేషం బైనయాభూషణంబు ధరియించుటకు నభిలాషంబు వొడమ దానిం దెప్పించి నిజహృదయస్థలలంబి యగుటకుఁదగునట్లుగా నిరుగడల గొన్నిమణులు నిలిపి తనసూత్రంబునం గ్రుచ్చి ధరియించి తనవిలాసంబు పరిఢవిల్ల సురటి గొని వరునికడ కరిగి పరిచర్య సేయుచుండె నంత. 145

సీ. ఆయితంబుగఁ జేసినట్టియందియజోడు సత్వదాత్ముఁడు కరాబ్జమునఁ బూని
యచ్చటి కేతెంచి యధిపుఁ గన్బొమసంజ్ఞ నయ్యింతియగ్రంబునందుఁ బెట్టి
స్వామి నీ కొడఁబడ సకలదిగ్దేశభూనాథశుద్ధాంతకాంతాశిరోమ
ణిప్రజల్పితనూపురప్రకాండము లివె యంఘ్రులఁబూను మా యమ్మ యనుచు
తే. వసుధ సాగిలి మ్రొక్కిన వలదు వలదు,మ్రొక్కనాకును వందనార్హుఁడవు నీవు
మేనమామవెఱుంగవు గాని నేఁటి,దాఁక నిది యంచు నతని కాతరుణి మ్రొక్క.

క. మ్రొక్కిన నతఁ డరు దందుచు, మిక్కిలి వెనువెక్క కొదిగె మేను వడంకన్
నిక్కం బిది సంకోచము, దక్క మనియె సతియు లేచి తగువినయమునన్. 147

వ. అప్పుడు కళాపూర్ణుండు నవ్వుచు నతనిం జూచి యాచెలువ యన్నట్లు నిజంబుగా వలయు సంకోచం బేల తత్ప్రకారంబు తెలియ నడుగుట గాక యని యిట్లనియె.

తే. తనదుశైశవమున నీవు తను నడిగిన
నీకులాఖ్యాదు లింతికి నేఁడు దోఁచె
నేమొ మే లయ్యెఁ దెలియుద మిపు డడిగిన
ననుచు నాపువ్వుఁబోఁడి యాననముఁ జూచి 149

ఉ. నీదగుచిన్ననాఁటియలనిర్మలబోధవిశేష మిప్డు ల
బ్ధోదయ మయ్యెనో తిరుగ నుల్లములోన నితండ నీకు నో
పైదలి మేనమామ యగుపద్ధతి యె ట్లది నేఁడు చెప్పు ట
ట్లాదట నాఁ డితం డడుగ నప్పుడు చెప్పమి యెట్లు చెప్పుమా. 150

వ. ఆశైశవంబున నట్టివిజ్ఞానంబు గలుగుటకుఁ గారణంబు నాఁ డడిగి తెలిసి కొన లేమికిఁ బశ్చాత్తాపంబు నొందుచుండుదు నది యెఱింగింపవలయు. 151

క అన విని యాసతి యంతయు, వినిపించెద వినుఁ డటంచు విభునకు లీలం
దనచేతిసురటి విసరుచు, వినయమధురఫణితి నిట్లు వినిపించెఁ దగన్. 152

సీ. అధిప ము న్నితఁడు మహారాష్ట్రదేశ మేలెడుసుగ్రహాఖ్యుం డనుపుడమిఱేఁడు
మాతల్లి రూపానుభూతి యాతనియవ్వ యితనికులీనత కెల్లనృపులు

కడు వేడ్కపడి తమకన్నెల నిచ్చి సంబంధబంధువులుగాఁ బ్రణతనిష్ఠఁ
బత్రిక లంప నంపఁగ నందు నెవ్వరివాంఛ నీడేర్తు నెవ్వరిని విడుతు
తే. ననువిచారముతోడ నిట్టట్టు నుడువఁ
గడపె బహుకాల మది యవగణన గాఁగ
వగచి యొక్కొక్కనెపమున వారు మేరఁ
దప్పి యితనిపైఁ జేసిరి దండయాత్ర. 153

క. ఈతఁడు దా వెలుపలనై, యేతెఱఁగున నైన వారి నే పడఁచి పరా
భూతులఁ జేయుదు నని ప్రఖ్యాతజవహయాధిరూఢుఁడై పురి వెడలెన్. 154

ఆ. ఇట్లు కడకుఁ దొలఁగు టెఱిఁగి యారాజులు, తిరిగి యరిగి రాత్మదేశములకు
రాజు లేనియట్టిరాష్ట్రంబుపైఁ జని, జయము గొనుట యేమి శౌర్య మనుచు.

వ. ఇతండు నయ్యహితభూపతులు తిరిగి పోవు టెఱుంగఁడు గావున నతిదూరంబు
గాఁ జని యొకవిపినమధ్యంబున నిలిచి యాశత్రువుల నెవ్విధంబున జయింతు
నను చింత నొక్కింత తడవుండి చరితవ్యతానుసారంబున నిట్లని తలపోసె. 156

సీ. మిగులంగ ముట్టుపాటగుటఁ జేసి కలంక నెఱిఁగి యొఱంగింప నెఱుఁగ కిట్లు
శీఘ్రంబ యేఁగుదెంచితి నసహాయత నేమయ్యెనో పురం బేమి యైరొ
ప్రజ లేమియైరొ విపక్షభూపాలకు లిది యెఱుంగ నుపాయ మేదియొక్క
చొప్పు మార్చితిఁ జెక్కు చోట్లశాత్రవభీతి నావారుఁ గనలేరు నన్ను నరసి
తే. యేనె తిరిగిపోయెద నంటి నేని శత్రు
లెచట నెట్లడ్డగింతురో యిదియుఁ దగద
యున్నచోటనె యుండి తా నుల్లమునను
సకలమును గాంచువాఁ డెంత సుకృతియొక్కొ. 157

క. అట్టిమహత్త్వముఁ గాంచిన, యట్టిబ్రదుకు బ్రదుకుగాక యన్యమహత్త్వం
బెట్టిదియు నేల జనులకు, వట్టిప్రయాసంబు దానివలనఁ దలంపన్. 158

వ. అని యట్టిసర్వజ్ఞత్వంబు సాధించుటకు దృఢనిశ్చయంబున మహోత్సాహుండై
తురగాధిరోహణంబు సేసి వాసుదేవనిత్యసాన్నిధ్యప్రసిద్ధం బైనయమునాతీరం
బున కరిగి యందు బృందావనంబున 159

క. తా నెప్పుడు నతిభక్తిం, బూనికొలుచుబాలకృష్ణుఁ బురుషోత్తము ను
త్తానశయుఁ వటపత్రశయానుఁ మది నిలిపి సలిపె నధికతపంబున్. 160

సీ. కొమరొందుమఱ్ఱియాకునఁ బవ్వళించి చూపట్టెడు బాలరూపంబుతోడఁ
బాణియుగ్మంబునఁ బదిలంబుగాఁ బట్టి మొగమున నిడుపదాంబుజముతోడ
జరణాంగుళీపానజాతలాలాభిషిక్తం బైనచిన్నహారంబుతోడఁ
బూని చూడ్కులకు బ్రహ్మానందశైత్యంబు గులుకునెయ్యపుముద్దుఁ జెలువుతోడ

తే. నతనిమనమున నతిరతధ్యానమహిమఁ
దిరముగాఁ బాదుకొన్న యాదేవిరూపు
వెలిఁ బ్రకాశింపఁ జేయుచు విష్ణుదేవుఁ
డధిక కారుణ్యలీలఁ బ్రత్యక్ష మయ్యె. 161

క. ఆతెఱఁగునఁ బ్రత్యక్షుం, డై తను నిష్టమును వేఁడు మని హరి పలుకం
బ్రీతివశత నించుకతడ, వీతం డేమియును బలుక నెఱుఁగక యుండెన్. 162

క. పదపడి ప్రబద్ధుఁ డై తత్పదపద్మంబులకు భక్తిఁ బ్రణమిల్లి తగన్
నుదుట ముకుళితకరమ్ములు, గదియించి వినీతి దనరఁ గా నిట్లనియెన్. 163

క. అలఘుతరానందంబునఁ, బలుక నెఱుఁగకున్న వాఁడఁ బరమపురుష నీ
వలనన్ సర్వజ్ఞత్వము, గలుగుట నాకోర్కి దానిఁ గరుణింపు దయన్. 164

వ. అని విన్నవించుటయు నద్దేవదేవుండు తన మెడ నున్న రత్నహారంబుఁ దిగిచి దీని నాయకరత్నం బెవ్వరిహృదయస్థలంబున నెంతతడవు సోఁకి యుండు వారికి నంత తడవును సర్వజ్ఞత్వంబును సకలవాక్పటుత్వంబును గలిగి యుండు ననియును బ్రాహ్మణమనోవ్యథఁ గావించువారియొద్ద నిది యుండ దనియు నానతిచ్చి యిది యతనిచేతి కిచ్చి యంతర్ధానంబు నొందె నితండు నమ్మహనీయహారంబు వడసి వచ్చువాఁ డవ్వనంబులో నొక్కదేవాలయంబునందు. 165

సీ. మెఱుఁగెక్కి బిగువు లై మీఱిన నవియు న ట్లొంపొందుగుబ్బపాలిండ్లతోడఁ
గడుఁ గృశత్వంబునఁ బిడికిటిలోపల నడఁగెడుబడుగునెన్నడుముతోడఁ
జిఱునవ్వు దెలినిగ్గు చిలుకుచుఁ దనదారు తళుకు లేఁజెక్కుటద్దములతోడ
జగతి నెందును లేనిచక్కఁదనాన సొంపగుచిన్నిముద్దునెమ్మొగముతోడఁ
తే. గరము విలసిల్లుసకలాంగకములతోడ, రహిఁ దనర్చునలంకారమహిమతోడ
ద్వారశాఖలదండ నింపారుచున్న, ప్రతిమ నొక్కటి చూచె భూపాలచంద్ర.

క. చూచి మనంబున మెచ్చుచు, నాచేరువ నితఁ డటుండ నంతటిలో భ
వ్యాచారశీలుఁ డఘటికి, వాచంయముఁ డొకఁడు మార్గవశమునఁ జేరెన్ 167

తే. చేరి కాషాయవస్త్రంబు చెఱఁగు విసరు
కొనుచు హరిహరి యనుచు నింపున నొకింత
తడవు గూర్చుండఁ దత్సవిధప్రదేశ
మంటపంబున నధ్వశ్రమంబుకతన. 168

సీ. ఆయతీశ్వరుఁ డంత నతిరమ్య మైనయా మెప్పొంపుఁబూఁబోఁడి యొప్పుచూచి
బళిర శిల్పికులేంద్రబ్రహ్మను మీఱితే పగిదిఁ జేర్చితిర యీప్రతిమ ననుచుఁ
దనమదిఁ గడు మెచ్చి తలయూఁచుచును నిట్టిపడఁతులు గలరొకో పుడమిననుచు
నిట్టిది సన్న్యాసి వీక్షింపఁ దగ దని మూర్ఛోము వెట్టుచు మఱియు మఱియు

తే. నిచ్చుఁ గ్రమ్మఱఁ జూచుచు నేమి చెప్ప
నతనువికృతికి లోనయ్యె ననుచుఁ జెప్పి
కొంతసంకోచ మంద నాకొమ్మ తెలిఁగుఁ
గని తొలఁగి పోయె నొకనెపంబునను మంత్రి. 169

క. జనపతియు భార్యవదనముఁ, గనుఁగొని యేమయ్యెఁ గడమకథ కౌతుకముం
దనరించుచున్నయది నా,కును వినిపింపంగ వలయుఁ గోమలి యనియెన్. 170

చ అన నిఁక నేమి చెప్పుదు జనాధిప యాయతిముఖ్యుఁ డంత నె
మ్మనమునఁ బట్ట లేక ప్రతిమన్ బిగియారఁ గవుంగిలించె నిం
పొనరఁగ లేచి వచ్చి కడు నొక్కు మఱుంగున నప్డు సుగ్రహుం
డునికి యెఱుంగమిన్ నగియె నుండఁగ లే కితఁడుం గికాకికన్ 171

వ నగుటయు నతం డది వినియు విననిచందంబుఁ గల్పించుకొని తత్ప్రతిమా
లింగనం బొకయదృచ్ఛాచేష్టావిశేషంబుగాఁ గల్పించుటకుఁ దాత్కాలికయుక్తి
నద్దేవాలయంబున వెండియుం గలదౌవారికాదిప్రతిమల నట్ల యాలింగనంబు
చేయుచు నమస్కరించి తత్ప్రదక్షిణంబు సేయం దొడంగినసుగ్రహుండును నతని
కపటచేష్టలతెఱం గెఱింగి యి ఱంతచేసినఁ బూర్వంబునేత నే నెఱుంగుదును
గదా యది మఱువ ననుచు మఱియుఁ బరిహసించె దాన నయ్యతి యతివ్యథ
మానమానసుం డగుచుఁ గడు నలిగి యిది తుదిగా నీమొనలియెఱుక యెంత
గల దంతయు వినిహతం బయ్యెడు మని శాపం బిచ్చె సుగ్రహుం డతిభయా
కులుం డగుచు శాపమోక్షణంబు దయసేయు మని పాదంబులం బడి లేవకుండె
నయ్యతీశ్వరుండును. 172

క. నాయీరహస్యచేష్టిత, మేయెడ నేనియును నుబ్బ నేని గలుగు నీ
పోయినమది గ్రమ్మఱఁ ద,దాయత్తత వెలయు నప్రియము మది లేమిన్ 173

ఆ. అనుచు జనియె నతనియాశాపమహిమచే, నెఱయ సుగ్రహుండు మఱచిపోయె
నాక్షణంబ తుదగ నటు ప్రథమముగ వి,జ్ఞాత మగుప్రపంచజాత మెల్ల. 174

తే అట్లు విస్మృతసకలపూర్వాత్మచరితుఁ
డగుట నీతఁ డెఱుంగ లేఁ డయ్యెఁ దిరుగఁ
గ్రొ కొనంగఁ దదాదిమక్షణమునం దె
యొకశుచిస్థలి నిడినహారోత్తమమును 175

తే బ్రాహ్మణవ్యథ గావించుపాపమతికి
నిది నిలువ దంచు హరిపల్కు మొదల వినియు
నతనివెతఁ బెట్టి కోల్పోయె హార మితఁడు
దైవఘటన యెవ్వారికిఁ దప్పు టరుదు. 176

క. ధర నెవ్వారలు చేసిన, దురితంబులు నుచ్చరింప దోసమఁట మహా
పురుషుల కొంకొద యొకచోఁ, బొరసిన నది ప్రగటుపాపము వృథా జనునే.

ఉ. అంతట దైవసంఘటన నచ్చటు వాసి యతండు దివ్యదే
శాంతరముల్ చరింపుచు నిజాహ్వయవంశచరిత్రవిస్మృతిన్
భ్రాంతునిలీల మత్తుగతి బాలునికైవడి నెద్ది గన్న న
త్యంతము నద్భుతం బగుచు నాత్మకుఁ దోఁచుచు నుండ వర్తిలెన్. 178

క. ఆదిమసంకేతగ్రహణాదులు విస్మృతము లగుచు నాఖ్యాగుణజా
త్యాదివ్యవహారజ్ఞత, లేదయ్యెను నితని కపుడు లేశం బైనన్. 179

చ వెనుకఁ గ్రమక్రమంబున నవీనముగా నుదయంబు నొంది పెం
పొనరె నృపాల యీతనికి నుత్తమమధ్యమవృద్ధకర్మద
ర్శనమున ద్రవ్యకర్మగుణజాతివిశేషవివేచనంబు బా
లునకునుబోలె మానసములో నిఖిలవ్యవహారహేతు వై 180

క. తనకులనామాదులు దక్క నశేషము నిట్లు వెలసెఁ గాని యతఁడు భూ
జనవర యవి యెఱుఁగఁడెయెందును దద్జ్ఞులు నేఁటిదాఁక దొరకక యునికిన్.

వ. ఇవ్విధంబునఁ బరిభ్రమించుచు నొక్కనాఁడు గంగాసరయూసంగమప్రాంతవనంబు చేరి వర్తిలుచుండఁ దత్కాలంబునందుఁ గాసారపురం బరాజకం బైన నందుఁ గలమంత్రి ప్రముఖరాజపురుషులును జారులును రాజనిశ్చయార్థు లై యుత్తమగజంబు నలంకరించి దానికరంబున నొక్కపుష్పమాలిక యిచ్చి యిది యెవ్వనికంఠంబునం దగులవైచు నతండు మనకు రాజని దైవప్రార్థనాపూర్వకంబుగా నియమంబు చేసికొని దానివెంబడి నేతేర నది యేతెంచి తనతుండంబున నున్న పుష్పమాలిక యాసుగ్రహుని మెడవైవ నరాజకత్వదుఃఖదుర్బలులై యున్న యామంత్రిముఖ్యుల కందఱకు నటమున్న యితనిదర్శనమాత్రమున నొక్కసత్త్వవిశేషం బుదయించె నయ్యుభయనిమిత్తంబుల నత్యంతసంతుష్టు లగుచు నతనిఁ దద్గజారూఢునింగాఁ జేసి పురంబునకుం గొనిపోయి రాజ్యాధిపత్యంబునకుం బట్టంబు గట్టి తత్స్వరూపమాత్రంబ తమకు మున్ను సత్త్వదాయకంబగుట సంస్మరించి సత్వదాత్ముం డని ప్రశంసించిరి యితనినామజాత్యాదు లప్పటికప్రసిద్ధంబులగుట నదియె పెరుఁగుచు దిక్కులం బ్రఖ్యాతం బయ్యె నట్లు కాసారపురాధీశ్వరుం డై రాజ్యభోగంబు లనుభవించుచు నంతట భవజ్జననీజనకు లయినసుముఖాసత్తిమణిస్తంభులఁ దనపురంబున నిలుపుకొని సేవఁ జేయుచుఁ గ్రమంబున నీకు నమాత్యుం డయ్యెఁ దత్ప్రకారంబులు విస్తీర్ణంబుగా శైశవంబునంద యేను నీకు విన్నవించినదానఁ దలంచికొను మవ్విధంబున నమాత్యుం డైన వెనుక నంగదేశం బాశ్రయించి యందుఁ గ్రముకకంఠోత్తరనామధేయపురం బైన యీపురంబు నూతనంబుగ నిర్మించి నిన్నుఁ బట్టంబు గట్టినది నీకు విదితం బై

నది చెప్ప నేల యోవిశ్వవిశ్వంభరామండలేశ్వర యీసత్వదాత్మునికులనామాది ప్రకారంబులు పూర్వంబున నతఁ డడుగ నపు డేను జెప్పకుండుటను నిప్పుడు చెప్పుటకు మఱియు నాఁటిసకలజ్ఞానోదయంబునకు నిమిత్తం బడిగితి రది విన్న వించెద విన నవధరింపుఁ డని యిట్లనియె. 182

సీ. అట్లు సుగ్రహుఁడు మున్నా దేవతాలయంబునఁ బెట్టి క్రమ్మఱఁ బుచ్చుకొనఁగ
మఱచినయట్టియమ్మణిహారమును మధురాపురంశ్రియుఁ డొకబ్రాహ్మణుండు
దైవవశంబునఁ దా నచ్చటికి వచ్చి కని పుచ్చుకొని పోయి తనగృహమున
బహువర్షములు వేల్పుబలె భక్తిఁ బూజించి యంతట నిది త్రిలోకాధిపతికి
తే. యదుకులాభరణంబున కచ్యుతున కు
పాయనంబుగఁ గొనిపోవు టర్హ మనుచు
ద్వారవతి కేఁగి యతనిసందర్శనంబు
వడసి కానుకగాఁ బెట్టెఁ బార్థివేంద్ర. 183

చ. అనయముఁ బ్రీతితో హరియు నాతనికానుక యాదరించి కై
కొని తదభీష్టవస్తువులు గొబ్బునఁ దాఁ గృపఁ జేసి యప్పు డిం
పొనరుచు దండకాకృతిసముజ్జ్వలసంస్తవలీల కెంతయుక్
ఘనముగ మెచ్చి యిచ్చె మణికంధరనామునకుక్ ధరాధిపా 184

చ. అతఁడు మహాప్రసాదమని యప్పుడు దానిఁ దగక్ ధరించి బా
లతఁ గనుపట్టు విష్ణునికలాపము గావునఁ దద్భుజాంతర
స్థితి కిది చాల కొప్పి గళసీమన యెంతయు గుప్తమై తదీ
యతరళమీఱుచిద్గుణము నాతనికిక్ హృదయంబు సోఁకమిన్. 185

ఉ. ఆమణికంధరుండు తుదయం దలఘువ్రతుఁ జేర్చె దాని నా
భూమిసురుండు నీ కొసఁగె భూరికృపోన్నతి నిచ్చి తీవు నా
కోమహితాత్మ తత్తరళ మొప్పఁగ నాహృదయంబు సోఁక ను
ద్దామసుబోధ నైతి శిశుతాసమయంబున నట్లు మిక్కిలిన్ 186

ఉ. క్ష్మావరచంద్ర నీవు ప్రథమంపుజనిక్ మణికంధరుండ వై
యావిధిఁ గృష్ణుచేఁ బడసి యంతట నిజ్జననంబునందు భూ
దేవవరేణ్యుచేఁ బడసి దివ్యము నమ్మణిహారముం గృపై
కావృతబుద్ధి నిట్లొసఁగి యంతగఁ జేసితి నన్ను మన్ననన్. 187

క. ఇటు నటు నేఁ గదలఁగ నంతట హృదయస్థలముఁ బాసి తన్మణికడ కేఁ
గుట నుడిగెఁ దెలివి యట్లా, దట నీమంత్రిశుఁ డడుగుతఱి నవనీశా. 188

వ. కావున నప్పుడు సత్వదాత్మునినామజాత్యాదు లేను జెప్పకుండుట కిది కార ణంబు నాఁ డట్లు బోధోదయం బగుటయు నుడుగుటయు నేతన్మూలంబు లని యెవ్వరు నెఱుంగకుండుటను నిది సామాన్యహారంబ యనుతలంపున మా వారు

దాఁచి మఱచుటఁజేసి నాఁటనుండి నేఁటిదాఁక నిద్దివ్యహారం బెన్నఁడును ధరియించుటయు లేదు నేఁ డాభరణభరణసమయంబునఁ బ్రసంగవశంబునఁ దలంచుకొని చెలులు తత్ప్రాప్తిప్రకారం బెఱింగింప నిది సుముహూర్తలబ్ధంబై నప్రథమభూషణంబనియు భవద్దత్తంబనియు నత్యాదరంబునఁ దెప్పించి హృదయభాగస్పర్శనాయకరత్నంబుగా నిపుడు ధరియించియున్న దాన నిచ్చోటికి నిపుడు నూపురంబులు గొనుచు సత్వరాత్ముం డేఁగుదెంచిన నింతలోఁ గలికొలువునకు వచ్చుపాటిచనువుకలిమికి నితం డింతభాగ్యవంతుఁడో కో యని యొక్కించుక భావింప నతనిజాత్యాదు లిన్నియు నదీయహారనాయకమాణిక్యంబుమాహాత్మ్యంబున నిట్లు చెప్పఁ దోఁచె భూతభవిష్యద్వర్తమానభువనప్రపంచంబునందు నెద్దియైన దేవరకుఁ దెలియవలసినయది కరతలామలకసమానం బై కనంబడియెడు దీని ధరియించి చూడుఁ డని యనుపమస్తనకుంభలక్ష్మి తెఱచాటున నర్తకి తెఱంగునం గించిత్ప్రకాశాప్రకాశరూపం బగుచు నపూర్వంబు నెఱపు నమ్మహనీయరత్నమాలిక తనదుపయ్యెద వెలుఁ గలికిం దిగిచినం జూచి యా జగతీవల్లభుండు. 189

ఉత్సాహ. తివకు మట్ల యుండనిమ్ము తిరుగఁ బుచ్చుకొనుట యొ
ప్పవునె నీకు నిచ్చినట్టిహార మట్ల యుండఁగా
నువిద దీనిమహిమఁ దెలుపు టొప్పుఁ గాక యన బళీ
యవనినాథ జాణ విది యుపాయ మనుచు నవ్వుచున్. 190

తే. ఒఱగుమీఁదటఁ జేరి కూర్చున్నప్రియుని
యురము తరళంబు సోఁక మే నొయ్య వంచి
కనఁగ వలసినయది గనుం డనుచు నంతఁ
గుచభరాలసపోలె నక్కునను వ్రాలె. 191

క. వనజాక్షి యిపుడు గనవల,సినయది నాకిదియె యంచుఁ జెలువుఁడు తమకం
బునఁ గౌఁగిలించె నిరుగే,లను బిగియారంగ మధురలాలసఁ బ్రేమన్. 192

చ మదితమి నంతటన్ నిలక మానవనాథుఁడు చిత్తభూవశం
వదబహుచేష్టితుం డగుచు వర్తిల నేమిటికిం గడంగి యొ
య్యది దొరకొంట మే లనుచు నబ్జజుఁ డిద్ధరఁ జంచలాత్ములన్
సదృశుల లెస్స కూర్చె జతనంబున నంచు లతాంగి నవ్వఁగన్ 193

ఉ. అంతట నెట్టకేలకుఁ బ్రియాంగనప్రార్థన నవ్వసుంధరా
కాంతుఁడు నేట తెల్లమిగఁ గాంచెఁ దదుత్తథాప్రపంచ మ
త్యంతము సత్య మాట పహితం బగుతత్కుచమధ్యరత్నసం
క్రాంతమునిహ్నుత్ప్రదేశ మెసఁగన్ మది నించుక పారఁ జూచుచున్ 194

వ. అంతట సత్వదాత్ముండు శాపమోక్షంబున నాబాల్యానుభూతపదార్థజాలం బంత యుఁ దనంతన యాత్మసంస్మరణగోచరం బగుచు నటమున్న మధురలాలసచేతఁ దా వినినవి కలిగి సరిదాఁకుచుఁ బ్రమోదంబు నద్భుతంబును నాపాదించుచుండ నేగుదెంచి తగినయవసరంబు దెలిసి యాకళాపూర్ణమహారాజుంగాంచి తనకుఁ బునఃప్రాప్తం బైనయాఱుతెలుంగు విన్నవించె నేమో యిట్లు శాపవిముక్తుండ నైతి నని యనేకప్రకారంబుల నాపుణ్యదంపతుల సంస్తుతించి తొల్లింటి నాఁటి మహారాష్ట్రరాజ్యభోగంబుకంటె ననేకగుణంబుల నధికం బై యిప్పటి దేవరపాదపద్మసేవ పరిపూర్ణసౌఖ్యంబు నొసంగుచున్నది యది యెల్లకాలంబు నాకుఁ గలుగ ననుగ్రహింపవలయు నని సాష్టాంగప్రణామం బాచరించె నతండు మధురలాలసాబంధుత్వవిశేషజ్ఞానంబున నతని నెప్పటికంటె మిక్కిలి గారవించి గృహంబున కనిపి మఱియు నభిమతవస్తుబోధసాధనేచ్ఛల మధురలాలసాపరిరంభణసుఖంబు లనుభవించుచుండె నప్పుడు. 195

ఆ. ఉభయహృదయదేశ యుగపన్మణిస్పర్శ
మహిమ నొక్కరొకరి మక్కువపస
లొక్కమాఱె యొక్కరొకరి కేర్పడఁ దదా
శ్లేషసుఖము మిగులఁ జిత్ర మయ్యె. 196

క. శుభధర్మశీల యగువల్లభయత్నము చేత నపు డిలాపతి దనపై
నభినవకౌముదికిం గల, సుభక్తి గని తదుచితంబు చొప్పడ నడిపెన్. 197

చ. అలఘుతరానుభావ యగుహైహయకన్యకహారశక్తిచేఁ
దెలివియు వాక్పటుత్వమును దేజరిలన్ నిజపూర్వవాసనా
బలముల వల్లకీరణనపాటన మెంతయు మీఱ దిద్దె భూ
తలవిభుఁ డగ్రలం దనరి తద్దయు గానకళాప్రవీణగన్ 198

చ. సకలమహీజనావనవిచారము సంధిల నంత నోలిమై
నకలుషధర్మశోభిని మదాశయపుత్త్రిక యత్న మొప్ప భ
ర్తకుఁ దెలిపెన్ స్వరాష్ట్రపరరాష్ట్రగుణాగుణవర్తనల్ సనా
యకపరిరంభకాలముల నప్పటి కప్పటి కెచ్చరించుచున్. 299

సీ. తా విన్నకన్నయర్థము చెప్ప కడఁచితి వని తెల్పి శిక్షించు దనదుచెలుల
రిపులకు లోనిచ్చె నపరాధి యయ్యె నీఁడని యమాత్యులతప్పు లరసి యతఁడు
త్రుచ్చిలఁ దలఁచె వీఁ డిచ్చలో నని మూఁదలించి దండించు మలిమ్లుచులను
నాలితో రే యీతఁ డతిమాత్రమున నల్గెఁ దగ దని చెప్పించుఁ దగినరీతి
తే. మధురలాలస సపరిరంభణవిశేష
సమయహృద్దేశఘటితతచ్చారుహార

తరళమాహాత్మ్యమున సముత్తుజ్గుఁ డగుచు
భువన మహదండ నాకళాపూర్ణుఁ డపుడు. 200

వ. అంత నొక్కనాఁ డతండు మధురలాలసతోడ నేకాంతంబున నుండి సర్వజ్ఞత్వ
కారణదివ్యమాణిక్యప్రశంసాప్రసంగంబున విష్ణుదేవునిమాహాత్మ్యంబు తలంపు
నం బొడమఁ దదీయకీర్తనం బిహపరసాధనం బని సంభావించుచుఁ దత్ప్రసంగ
వశంబున 201

తే. ఆదిజన్మంబునందు ననంతశయన, పద్మనాభునిసన్నిధిభాగవతుల
వచనమున రమావిష్ణుసంవాదనకథ,తా నొనర్చుట మదిలోనఁ దలఁచుకొనియె.

క. ఈపగిదిఁ దలఁచుకొని సుక,లాపంబుగ దాని మధురలాలస మధురా
లాపములచేత వినుటకు, భూపాలునిమదిని వేడ్క పొడమె మిగులన్. 203

ఆ. ఇట్లు వేడ్క వొడమ నిందుబింబానన,యాననంబు చూచి యానృపాలుఁ
డాదరాతిశయము ననురాగమును గరం, బలరుచుండ నిట్టు లనుచుఁ బలికె.

ఉ. ఆదిమ మైనజన్మమున నంగన యేను రమాముకుందసం
వాదము కావ్యరూపమున వర్తిలఁ జేసితి నంచు వింటి బా
ల్యోదితతావకీనమధురోక్తులలో నది నీమణీగుణ
శ్రీ దనరార నారసి యశేషము నిప్పుడుఁ జెప్పఁగాఁ దగున్. 205

క నీపరిరంభణమహిమను, దీపిత మగు తెలివివేళఁ దిరముగ నది యే
నోపఁడఁతి కనుట లేదెదఁ, బైపై నీమీఁదితమిని భాసిలు చునికిన్. 206

వ. అని పలుకుప్రాణవల్లభునిపలుకులకు నగుచు నమ్మగువ యోజగతీవర దేవరయిది
కిపు డెయ్యది ప్రియం బదియె చేయుట నాకునుం బరమప్రేమాస్పదంబు గా
వున నప్పావనకథ యెల్ల వినుపించెద విన నవధరింపుమని పలికి తనకు సకలజ్ఞాన
నిదానం బగుచు హృదయప్రవేశంబున నలంకరించుచున్న దివ్యహారనాయకమా
ణిక్యంబునకు నంజలిచేసి తదీయప్రాప్తికారణంబు లైనయాకళాపూర్ణుని నలఘు
వ్రతు మణికంధరుఁ గృష్ణుని విప్రుని సుగ్రహు వటపత్రశాయిని హృదయం
బునఁ దలంచి యీగురుపరంపర నాకు ననుగ్రహకారిణి యగుఁ గావుత మను
చుం బ్రణమిల్లి యాలక్ష్మీనారాయణసంవాదకథ తొల్లిటిమణికంధరోక్తప్రకా
రంబున నిట్లని చెప్పం దొడంగె. 207

సీ. అమృతపూరాశ్చర్యతమవిరజానదీసీమావరుద్ధసంస్మృతికతంబు
పరిగణనాతిగబ్రహ్మాండబుద్బుదప్రకృతిపాథోధిపారాయితంబు
సూర్యచంద్రాగ్నితేజోనిరపేక్షణప్రాకృతస్వప్రభాభాస్వరంబు
స్వేచ్ఛాగృహీతసమిద్ధవిశుద్ధసత్త్వశరీరనిత్యముక్తవ్రజంబు

తే. నగుచుఁ బెంపొందునిఖిలవేదాంతసిద్ధ
పరమకళ్యాణగుణచణబ్రహ్మతత్త్వ

సతతసాత్త్వికక్రియావిభూషితనిజాను
భవసుఖతకోవిదము శౌరిపరమపదము. 208

తే. చిదచిదీశ్వరాత్మకము నశేషజగదు,పాశ్రయముతోయమహితవహపవనవియద
హం క్రియామహదవ్యక్తకావరణము, నగునజాండాలి కవల నజ్జగము మెఱయు.

క. గణుతింపఁ బ్రకృతిదోషము, లణుమాత్రము లేవు గాని యచటఁ బరఁగుస
త్త్వగుణత బ్రహ్మాదిజగ, ద్గుణమహిమ లనంతకోటిగుణత సమృద్ధిన్. 210

క. అరము నరణ్యము ననఁగా, శరధు లమృతచయము లచట శతకోర్మిసము
త్కరశీకరశీతలతల, మరుదురుపులకితతటద్రుమము లై యమరున్. 211

క ఆవిష్ణులోకమున కవ, మావాహిని విరజ యమరు మానితమోక్ష
శ్రీవరణరాగభాగవ, తాళీశుభలగ్నసమయయవనికపోలెన్. 212

శా ఆసింధూత్తము చేరువన్ సరసి యొం డైరమ్మదీయంబు నా
భాసిల్లున్ జలనీలి కాకబరికాపద్మాస్యపుష్పంధయా
ళీసంవీక్షణవీచికావళిమృణాళీ బాహుకోక స్తన
శ్రీసంవాదితమూర్తిము క్తిపద్మలక్ష్మీమండలీకర్త యై 213

తే. ఆసరోజాకరముపొంత నతిశయిల్లు, బిల్వభూరుహ మొకటి శోభితపలాశ
విసరకిసలయసముదయోల్లసనమహిమ, నవిరళస్థితశుకపుంజ మనఁగ దనరి. 214

ఆ ఇంపు మీఱ నచట నెంతయు నశ్వత్థ, శాఖి యొకటి సామసదన మనఁగ
మహిమతోసువర్ణమయము శాఖాత్రయీ,శోభితంబు నగుచు శ్రుతులు పొగడ.

చ. నెలకొని యమ్మహీరుహమునీడను బంచశతాప్సరస్సమ
ద్యలు సుమచూర్ణకజ్జలఘటాభరణంబు లనేకముల్ కరం
బుల ధరియించి వర్తిలుచు ముక్తత నచ్చటి కేఁగుదెంచువా
రల కెదురేఁగి చేయుదురు ప్రౌఢిమ సంధిలఁగా నలంక్రియల్. 216

సీ కలికికన్గొనలచూపుల పేరఁ బర్వుమవ్వపుఁనల్లఁగల్వలు వైచి వైచి
మందహాసము లనుచందనోదకములు పలుమాఱు మోములఁ జిలికి చిలికి
హారంబు లిడుచు బాహారుచిచ్ఛలమున భుజములందు హరిద్రఁ బూసి పూసి
శ్రుతిభూషణము లమర్చుచు హస్తకాంతికుంకుమములు చెక్కిళ్లఁ జమరి చమరి

ఆ. యలరఁ జేయునచ్చరలపిండును క్తిక,న్యలను బెండ్లియాడి బులియుచున్న
క్రొత్తపెండ్లికొడుకుఁ గొమరులసయ్యాట, లాడుతద్వధూవయస్య లనఁగ.217

వ ఇవ్విధంబునఁ బరమాద్భుతం బైనయాభువనోత్తమంబునందు. 218

తే. ఉభయకర్మతంత్రులకు నయోధనీయ
మగుట నామ్నాయము లయోధ యని నుతింప
వాఙ్మనసగోచరము గానివైభవమునఁ
బ్రబలు రాజీవలోచను రాజధాని. 219

సీ. ఘటమంచుఁబటమంచుఁగారుయుక్తులఁబెంచుదుష్టతార్కికులకుదూరమగుచు
శ్రుతియంచుస్మృతులంచుశుష్కకర్మములెంచు మీమాంసకులకప్రమేయమగుచు
ఝరియంచుఖరియంచుజనులవీనులనొంచు శబ్దైకరతులకసాధ్య మగుచు [చు
మృషయంచునిషయంచువిషయోక్తిఁగలహించునద్వైతపరులకసాధ్యమగుచుఁ
తే. కృష్ణ విష్ణో హృషీకేశ కేశవ యను
భక్తునకెప్పుడును దుర్లభంబు గాక
పరఁగుఁ బ్రకృతివికారదుస్పర్శతరము
గురుతరానందఝురము వైకుంఠపురము. 220

చ. తడఁబడుచుండు నందు నమృతంపుఁగొలంకులు రౌప్యభూములున్
వెడలుపుపచ్చరాచలువనేలలు పచ్చికచోట్లు గెంజిగిన్
జడిగొనుపద్మరాగమణిసౌధములుం దలిరాకుమ్రాఁకులుం
బడఁతులపిండుభిత్తిగతభాసురతత్ప్రతిబింబజాలముల్. 221

క. పరమసుమనోమనోజ్ఞక, కర మాత్మారామపరవికాసము దనరం
గరువపుఁజరితలగరితల, గరగరికలగరిమ నగరిగరిమకు నమరున్. 222

చ. విరులు రచింప నేల తమవింతగునవ్వులసొంపు గల్గఁ గ
స్తురికలయింపు లేల తమచొక్కపుఁజూపులయింపు గల్గఁ గ
ప్పురములమ్రుగ్గు లేల తమపుణ్యనఖద్యుతిపెంపు గల్గ నం
చరుదుగఁ జూపఱుల్ పొగడ నయ్యయిలీలఁ జరింతు రంగనల్ 223

సీ విరులపాండిమపేరఁ బరిశుద్ధసత్త్వంబు తలిరాకునెపమున నలఘుకృపయు
దళమిషంబున నాత్మఁ గలకృష్ణకాంతియుఁ బుప్పొళ్లు నాఁ గల్మిపొలఁతిడాలు
మధుకైతవమున సమ్మదబాష్పధారలు కలికాంచలంబునఁ బులకములును
సౌరభసంజ్ఞసుజ్ఞానవాసనయుఁ జే రెలమిపేరిటిసౌఖ్యవిలసనంబు
తే వెలిఁ బ్రకాశింప నిత్యముక్తులు నిజేచ్ఛఁ,గొమరు మీఱంగఁ దరులతాకుంజరూప
ధారు లగుచు వర్తింతురు తత్పురంబు, బహువిధోద్యానవాటికాభ్యంతరముల.

చ. అళిశుకకోకిలాదివపురాశ్రయలీలఁ దమున్ భజించుని
త్యుల సుమనగఫలాదిపరితుష్టులఁ జేయుచు వారు దాము ము
క్తులకు వినోదలీల సమకూర్తురు వృక్షలతాదులైనవా
రలు హరిదాసు లెప్పుడుఁ బరస్పరభక్తిపరాయణుల్ గదా. 225

సీ. కొన్ని సౌభాగ్యసంపన్నలక్ష్మీపదాంభోజలాక్షాలక్ష్మిపూజితములు
కొన్ని భూదేవివిఘూర్ణత్కటాక్షవీక్షాపక్ష్మలతగుళుచ్ఛవ్రజములు
కొన్ని నీళానఖాంకూరవిన్యాసచంద్రకితప్రవాళసంతానకములు
కొన్ని భాగవతలోకోన్నతక్రీడావిభూషితచ్ఛాయావిశేషితములు
తే నగుచుఁబరవాసుదేవవిహారకుతుక, విభవముల కాస్పదంబులై వెలయుచుండుఁ

దత్పురోద్యానములు నిరంతరపరాగ,పుష్పరసవృష్టిశీతలభూతలములు. 226

వ. అట్టిదివ్యవస్తువైభవంబులఁ గరంబు గనుపట్టునట్టి యాపట్టణమధ్యప్రదేశంబునందు. 227

సీ. రవిచంద్రకోటితిరస్కారధౌరేయ మహనీయదీప్తిసంపదలఁ బొదలి
వేదప్రసిద్ధమై వెలయునద్భుతరత్నమయసహస్రస్తంభమంటపమున
మహితవిభూతిమగ్గ్యవిచిత్రరూపమై ధర్మాదినూలుపాదములతోడఁ
జెలువందుమాణిక్యసింహాసనమున సహస్రదళాఖ్యపద్మంబునందు

తే. శేషతల్పాధిరూఢుఁడై సిరియు ధరయు, నీళయును భజియింపంగ లీల నందుఁ
గేవలభ్రూవిలాసానుభావభావి,తాఖిలాజాండవర్తనుం డచ్యుతుండు 228

తే. ఆసహస్రపత్త్రంబు పూర్వాదిగాఁగ, సకలదళముల విమలాదిసతులు నిలిచి
హరి భజింతురు చామరహస్తలగుచుఁ, గమలనిలయలీలావతారములరీతి.

చ. అతులితభక్తిఁ బూర్వదిశయందు ననుగ్రహ యన్వధూటి దాఁ
గుతుకము మీఱఁగాఁ బసిఁడికుంచియ వైచుచుఁ గొల్వసేయు సం
తతమును హస్తకంకణఝణత్కరణక్వణనంబు లవ్విభుగా
జతన పరాకు స్వామి యనుశబ్దములాగున నెచ్చరించుచున్. 230

సీ. శయనాసనాంశుకచ్ఛత్రాదికంబులు దాన యై ఫణికులోత్తముఁడు గొలువ
ధ్వజమువాహనము పీవనయు నాదిగఁ బెక్కురూపమై గరుడుఁడారూఢిఁగొలువ
వఱలువిద్యాధిదేవతయైనవేత్రంబు పూని సూత్రవతీవిభుండు గొలువ
నారక్షకత్వ మింపారఁ దత్పురిఁ గాచు కుముదాదినిత్యసంఘములు గొలువ

తే. భువనములదుష్టనిగ్రహంబునకుఁ దాన,పాలు వడియున్న యాయుధపంచకంబు
జయజయధ్వను లెసఁగంగఁ జారుపురుష,భావమునఁగొల్వ నావిశ్వభర్త మెఱయ.

మధురగతిరగడ—

కెందమ్ముల నడఁకింపుపదంబులు, నిందువైభవము నేలునఖంబులు
గర మరు దగువొక్కపుఁజిఱుఁదొడలును, గరికరవిభవముఁగాదనుతొడలును
బదియార్వన్నియబంగరువలువును, మెదలెడితళుకుల మేఖలచెలువును
భువనజనకుఁ గనుపొక్కిలివిరియును, దవిలి యురంబునఁ దనరెడుసిరియును
నరయ జీవమయ మగుకౌస్తుభమును, నెరయ వైజయంతీసౌరభమును
బ్రకృతిమయతఁ జొప్పడుశ్రీవత్సము, వికసిల్లఁగఁ బర్వెడుఘనవత్సము
నహంక్రియాత్మక మగుశంఖంబును, మహనీయమనోమయచక్రంబును
దనర నొకవిచిత్రపుసోయగమును, ననువుపఱచుహస్తాంబుజయుగమును
నురగతల్పమున నూఁదినకరమును, బరఁగినజానువుపై నొకకరమును
నవ్యమకరకుండలసువిలాసము, భవ్యకపోలప్రకటితహాసము
పవడమును గణింపనినెమ్మోవియు, నవచంపకనిభనాసికఠీవియుఁ
దెలిదమ్ముల నగుతీరునయనములు, పొలు పలరెడుకనుబొమలచెలువములు

కనుఁగొన నింపగుకస్తురినామము, ననుపమాన మగునలకస్తోమముఁ
గలకల నగుచక్కనివదనంబును, ధళధళ మనురత్నకిరీటంబును
ననుకృతజలధర మగువర్ణంబును, నినకోటుల నగియెడుతేజంబును
గలుగుదివ్యమంగళవిగ్రహమున, నలరుభక్తినిత్యానుగ్రహమునఁ
బరఁగురమావిభుఁ బరమపదేశ్వరు, నిరవద్యాత్మకు నిత్యు నిరీశ్వరు
నజు నచ్యుతు హరి నఘసంహరుని, త్రిజగన్నాథుని త్రిగుణవిదూరుని
నఖిలశేషిఁ గరుణైకపరాయణు, నిఖిలవేదవర్ణితు నారాయణుఁ
గొలిచి నిత్యముక్తులు ప్రమదంబున, నలరుదు రక్కడ నతివిభవంబున 232

వ. అందు. 233

సీ. తనవిలోచనసంజ్ఞ ధవునకు భువనసర్గముఖక్రియాచార్యకంబు నడుపఁ
దనవిలాసంబు కాంతునకు శృంగారసామ్రాజ్యనీతిధురీణమంత్రి గాఁగఁ
దననర్మలీల నాథునకు దశాకృతి, ప్రకృతికాసూత్రధారత వహింపఁ
దనముద్దుఁబల్కు భక్తవితానవాత్సల్యకర్ణికారవికాస కారణముగ
తే. నఖిలకళలందుఁ దోడునీడగుచు మెలఁగు, నధిపునకుఁ బాలమున్నీటియాఁడుబిడ్డ
యరిది మక్కువ టెక్కువ యవిరతంబు, నురుమడింపక యతఁడు దన్నుపచరింప.

ఉ ఆజగదేకమాత తగునట్టిప్రసంగవశంబునన్ సము
ద్వేజకభూరిసంసృతినవీనదవానలతప్యమాననా
నాజనకోటిఁ బ్రోచుకరుణారస మాత్మఁ గడుం దొలంక నీ
రేజదళాక్షుఁ జూచి మృదురీతిఁ దలిర్పఁగ నప్పు డిట్లనున్. 235

క. దేవా యిప్పు డొకయర్థము, దేవర నడుగంగ బుద్ధి దివిరెడు మిగులన్
నావిన్నపముఁ బ్రసాద,శ్రీ వెలయఁగ నొకటి యవధరింపఁగ వలయున్. 236

ఉ. ఈభువనంబు లెల్ల సృజియింప భరింప హరింపఁ గర్తవై
శోభిలువాఁడ వీవ మధుసూదన యంబుజసంభవుండుఁ జే
తోభవవైరియున్ గ్రమముతో భవదీయకృపాసమర్పిత
ప్రాభవులై కదా కనిరి పన్నడ సర్గలయాధికారముల్ 237

తే. జీవకోటుల నుభయకర్మావళీ ఫ,లానుభవముల దరిఁ జేర్ప నాత్మఁ దలఁచి
నీవు బ్రహ్మాండసృష్టిరక్షావిలయము, లిట్లు గావింతువని నుతియించు శ్రుతులు.

ఆ. అదియుఁగాక మొదలు తుద లేనిసుకృతదు,ష్క్రియలుభోగమునఁ దరింపరామి
యకట యాత్మబోధనార్థమై వేదశా,స్త్రములు గలుగఁ జేసి తమలకృపను 239

ఉ. అట్టిశ్రుతిస్మృతుల్ దెలుపునట్టియుపాయము నాదరింప కె
ట్టెట్టు చరించి ముక్తి కెడయైనజనంబులఁ బ్రోచుసత్కృపన్
నెట్టన రామకృష్ణముఖనిర్మలమూర్తులు దాల్చి తీవు ని
న్నెట్టు నుతింపనేర్తుఁ బరమేశు నకారణసత్కృపాపరున్. 240

ఉ. ఇంచుకయేని వేసరక యీగతిఁ జెక్కలిగొట్టి పాలు ద్రా
గించువిధంబునన్ బలిమిఁ గేశవ నీవు హితం బొనర్చుచో
నెంచఁ గృతార్థుఁ డొక్కఁ డొకఁ డింతియె కాని సమస్తజీవులం
గొంచక యంతకంతకును గ్రుంకెద రుగ్రభవార్ణవంబులోన్ 241

క. ఇది యంతయు నీమాయాభ్యుదయవిలాసంబు దెలియఁ బురుషోత్తమ నీ
మదిలో నెయ్యది దలఁచిన, నొదవక మానదని తోఁచుచున్నది నాకున్. 242

ఉ. కావున నెల్లజీవులకుఁ గారుణికోత్తమ నీయనుగ్రహ
శ్రీవిభవంబుచే నమృతసిద్ధిగఁ గోరెద సర్వశేషి వా
దేవరకున్ విభేదము మదిం గలదే యొకకొందఱన్ భవా
భావముఁ బొందఁ జేయ భవబంధులఁ గొందఱఁ జేయ నచ్యుతా 243

వ. అని యివ్విధంబున సకలరక్షణార్థంబుగాఁ బరమకరుణావేశకలితహృదయ యగుచుఁ బలుక తననెయ్యంపుఁదొయ్యలితియ్యంపుఁబలుకుల కయ్యంబుజాక్షుం డిచ్చ మెచ్చుచు నత్యాదరంబున నమ్మత్తకాశినిఁ బ్రసాదమేదురదరహసితలోచనంబుల వీక్షించి 244

క. జనకునకంటెను జననికిఁ, దనయులపై వత్సలత్వధర్మము మిగులన్
ఘన మండ్రు గాన నీకే, యనుపమకారుణ్య ముచిత మరవిందముఖి. 245

ఉ. అంబురుహాక్షి నీపలికినట్ల యసంకుచితప్రభావధా
ర్ష్ట్యంబున నేఁ బ్రవర్తిలుట సత్యమ యైనను వారివారిక
ర్మంబులు చూడక కందఱ సమంబుగ నెవ్విధిఁ బ్రోవవచ్చు నెం
దుం బరికించి చూడ గుణదోషవివేక మనార్యకృత్యమే 246

వ. ఆర్యానార్యకర్మంబు లేను బ్రియాంగంబులు గాఁ గొనుటకును దదుభయవ్యవస్థానిమిత్తంబై వేదరూపాజ్ఞలోకంబున నిలుపుటకును గారణంబు మత్స్వాతంత్ర్యంబ కావున వారివారికర్మంబులవెంబడినె యేను శుభం బొనరించుట స్వాభావికం బగుఁ దెలిసికొమ్మని యిట్లనియె 247

క. విను మట్లైనను శుభవ, ర్తన కించుకబుద్ధి జనుఁడు దలకొల్పినమా
త్రన యది యే నీడేర్చుచు, ఘనకారుణ్యమునఁ బ్రోతుఁ గంజదళాక్షీ. 248

చ. సుకృతములందునుం బరమశోభన మైనమదర్చనాదిసి
ద్ధికి ధరణీజనంబుల మదిం దలకొల్పినకాదె యేఁ గృపా
ధికత దశావతారసముదీర్ణవిహారము పూనుటల్ దురా
త్మకులకుఁ దన్మహామహిమదర్శనమున్ వృథ యేమి సేయుదున్. 249

వ. మఱియును 250

క. అమృతపదప్రాప్తి కుపాయములను మత్పూజనాదు లఖిలజనులకున్
సమకూర్పనె యుండుదు నిత్యము శ్రీరంగాదిదివ్యధామములందున్ 251

తరల. ఇదియుఁ జాలక యింకనుం గృప నెల్లజీవులఁ బ్రోవ నీ
మదిఁ గడుం దమకించితేనియు మానసంబున నాకు స
మ్మదము మిక్కిలి యొంచి చూడ సమస్తజీవదయాభితా
భ్యుదయ మెవ్వరి కింపు గాదు పయోజపత్రవిలోచనా 252

వ. కావున నీప్రార్థనంబునం జేసి యిప్పు డొనర్చు విశేషంబు విను మట్లు లోకానుగ్ర
హార్థంబుగా నేను నిత్యసన్నిధిస్థానంబులుగా నంగీకరించినశ్రీరంగకాంచీవేంకటా
చలాహోబళపురుషోత్తమాదిదివ్యస్థలంబుల కరిగి సేవింప నోపకున్నను దమయు
న్నచోటనే యుండి తత్తద్దివ్యదేశనివాసు నన్ను నిజేచ్ఛానుసారంబునఁ దలంచి
కేలు మొగుచువారికి సంసారంబు నుద్ధరింపఁ జేయుదునని యానతిచ్చిన సంత
సిల్లి యదియె చాలు నని యమ్మహాదేవునిదీనవాత్సల్యంబు ననేకప్రకారంబుల
సన్నుతించె నని చెప్పి మధురలాలస యాకళాపూర్ణమహారాజుఁ గనుంగొని యది
యిప్పుడు మీర లడిగినభవదీయపూర్వజన్మవిరచిత లక్ష్మీనారాయణసంవాద
కథాప్రకారంబు దేవర ప్రశ్ననిమిత్తంబున నిశ్శ్రేయససులభోపాయంబు దొరకె
నేఁడు సుదినంబయ్యె మదీయజన్మంబు సఫలం బయ్యె నని పలికి శ్రీరంగాదిదివ్య
దేశమాహాత్మ్యంబునకు వెఱఁ గందుచు నింత భక్తవత్సలుండవే యని పరమ
పురుషు నఖిలలోకైకనాథు నారాయణుఁ దలంచి ప్రణమిల్లెఁ గళాపూర్ణుండును
దదాదిగా నత్యాదరంబున విష్ణుసేవ గావించుచు ధర్మమార్గంబున రాజ్యపరి
పాలనంబు సేయుచు. 253

తే. సమ్మదము మీఱఁ దనయగ్రజాయయందు
మధురలాలసయందు సమర్థ్యనిభుల
సుతులఁ గాంచెఁ గ్రమంబున సుప్రసాదుఁ
డనఁగ సరసుఁ డనంగఁ బెంపారు ఘనుల. 254

క. వల పమరఁగ నవవర్షం,బులసతిఁ దనకేళి కొదవి భోగక్రియ నిం
పల రెడునట్లుగఁ జేసెం, దలఁపఁగ నిది చిత్ర మనఁగ ధర నితఁ డేలెన్. 255

తే. ఆయిలాతలవిభుమహనీయకీర్తి, పుండరీకంబుఁ బాయక యుండులక్ష్మి
వేడ్కఁ దాల్చినసంపంగివిరులబంతి, కరణిఁ గాన్పించు బ్రహ్మాండ మరసి చూడ.

ఉ. ఆయవనీశ్వరుణ్ విమతు లాజి నెదుర్కొనుపాటివారు లే
రేయెడఁ గల్గినన్ రణము లించుక తద్బలపఙ్క్తికోటికిన్
జేయఁగ లేరు చేసినను జృంభితతన్మదకుంభికుంభవ
శ్యాయితనిర్జరీకుచములం దవియున్న ఖఘాతమాత్రముల్. 257

శా. తద్ధాటీసమయంబులం జటులగంధర్వాసిపాదాహతి
ప్రోద్ధూతక్షితిధూళి నింకెడుమహాంభోధిన్ ద్వీపస్మండలీ
శుద్ధాంతప్రమదావిలోచనము లశ్రుప్రాప్తిచేఁ గ్రమ్మఱన్
వృద్ధిం బొందఁగఁ జేయు మానసఖతావిఖ్యాతి సార్థంబుగన్. 258

ఉ. రూపవిలాసవైభవనిరూఢిని కా దసమాస్త్రశాశలుం
డాపృథివీశుఁ డొండొకక్రియం బరికించిన మన్మథుండ యు
ద్దీపితకాంతుఁ డర్జునుఁడు ధీరవిహారముచేత శాత్రవ
క్ష్మాపతులన్ నిలింపపురకాంతల నొండొరుతోడఁ గూర్చుటన్. 259

ఉ. ధీరుఁడు శూరుఁ డక్షయవితీర్ణవిహారుఁడు బంధులోకమం
దారుఁడు నీతిమార్గసముదారుఁడు లోకపవిత్రకీర్తివి
స్తారుఁడు దోషదూరుఁడు నితాంతగభీరుఁడు నిత్యశోభనా
కారుఁడు ధర్మసారుఁ డవికారుఁడు తజ్జనపాలుఁ డెయ్యెడన్. 260

తే. అతనిగుణములెన్నఁగఁజతురాస్యుఁడైనఁజతురాస్యుండుధిషణుండునధిషణుండు
ధర నహీనుండు హీనుండు దక్షముఖులు, దక్షముఖులను మఱివేఱ తడవనేల.

ఉ. పూర్ణసమస్తసద్గుణవిభూషితుఁడై పొలుపొందునాకళా
పూర్ణకథల్ వినం జదువఁ బొల్పుగ సంతతివైభవాదివి
స్తీర్ణశుభంబు కల్మి కజు దీవన మున్నది గల్గెఁ గాన నా
నిర్ణయ మార్యులెల్ల మది నిల్పి వినుండు పఠింపుఁ డింపుతోన్. 262

ఉ. భవ్యత నెల్లదేశములఁ బ్రస్తుతి కెక్కుచు మీఱి యిమ్మహా
కావ్యము సుప్రసిద్ధ మగుఁ గావుత నిత్యము సర్వలోకసం
స్తవ్యనిజస్మృతిన్ వెలయుతాండవకృష్ణకృపన్ బవిత్రశా
స్త్రవ్యసనాతిధన్య మగు సజ్జనకోటియనుగ్రహంబునన్. 263

శా. శ్రీరోచిష్ణుకటాక్షవీక్షజయలక్ష్మీసంతతాశేషయో
గ్యారాజద్భుజ యారవీటిపురబుక్కక్షోణిపాలాన్వయ
క్షీరాంభోనిధికౌస్తుభాయితమహాస్థేమోదయప్రస్ఫుర
న్నారక్షావర పౌత్త్రగోత్రతిలకా నంద్యాలకృష్ణాధిపా. 264

క. శోభితవైభవరూపమనోభవ కొండాంబికాతనూభవ భూతి
శ్రీభవ పరిశమితారిప్రాభవ బుధవర్ణ్యమాన రామసమానా. 265

వనమయూరము. శైలవరధీరనిజసంగరచరిత్రా, కాలఘువిచారసకలాంగనుతగోత్రా
పాలనవిహార యవిభంగజయయాత్రా, శీల నగధీర నరసింగవిభుపుత్త్రా. 266

గద్యము ఇది నిఖిలసూరిలోకాంగీకారతరంగితకవిత్వవైభవపింగళియమరనార్య
తనూభవసౌజన్యజేయ సూరయనామధేయప్రణీతం బయినకళాపూర్ణోదయం
బనుమహాకావ్యంబునందుఁ బ్రబంధపరిపూర్తిశోభనం బైనయష్టమాశ్వాసము
సర్వంబును సమాప్తము.

శ్రీ కృ ష్ణా ర్ప ణ మ స్తు.

---

చెన్నపురి: 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము. 1930.